ఈసంచికయందలి విషయములు :—

1. అభినందనము — మాదిగొండ [illegible] శాస్త్రి[illegible]
2. అభిప్రాయము — మల్లంపల్లి [illegible]
3. ఆశీస్సు — మల్లంపల్లి [illegible]
4. ప్రశంసాపద్యములు — మాదిగొండ రామలింగ శాస్త్రిగారు
5. శివతత్త్వము — మాదిగొండ విశ్వనాథ శాస్త్రిగారు
6. శుభాశంసనము — [illegible] శంకర శాస్త్రిగారు
7. శివాద్వైతము - 3 — ,,
8. శివాద్వైతవైభవము — మురిగొండ [illegible] శాస్త్రిగారు
9. శివమణిదర్పణము — మల్లంపల్లి వీరేశ్వరశర్మగారు
10. అద్వైతభ్రమభంజని — సంపాదకీయము.
11. పారమ్యమంత్రావళి — [illegible] ,,

—…—

—: చందా వివరము :—

| | |
|---|---|
| మహారాజపోషకులు | రు 116 |
| రాజపోషకులు | 60 |
| ప్రధానపోషకులు | 30 |
| పోషకులు | 10 |
| చందాదారులు | 3 |

వలయువారు :—

శైవతత్త్వప్రకాశికా కార్యాలయము

29 / 219 బకింగ్‌హాంపేట పోస్టు

విజయవాడ - 2

ఓమ్

# శైవతత్త్వప్రకాశిక

ఆధ్యాత్మిక మాసపత్రిక



సంపుటము 2 | జయ ఫాల్గుణము | సంచిక 1

## అభినందనము

**పండిత ముదిగొండ కోటయ్యశాస్త్రి అయ్యవారు - ఈమని**

వేదవేదాంతశాస్త్రోక్త సంశయచ్ఛేదకారికా
జయతు శ్రీయుతం బుధోపాస్యా శైవతత్త్వప్రకాశికా

అమల ధర్మప్రతిష్ఠచే నలరు, ధర్మ
మునకు మూలంబు వేదంబు, మూల మగును
దానికి మహేశ్వరుండు, తద్ధ్యానయోగ
శాస్త్రవిజ్ఞానదీపనశక్తి యగుచు
సతతము వర్ధిల్లగాత మా శైవవాణి!

బాలవె యయ్యుఁ బెద్దలు సెబా సని మెచ్చి శిరంబు లూపఁగాఁ
జాలిన ముద్దుపల్కులను జాటి దిదృక్షుల కూర్మి కెక్కువై
పాలకపాఠకప్రకరభాగ్యసుఖాతిక మహాఖండమా
బోలెడు కార్యభారమును బూనికతో భరియించి తీర్పఁగా
వచ్చిన శ్రీశుభాభ్యుదయసిద్ధుల కిప్పటి స్వాగతం బిదే

స్వగతిగోడ మున్మొదట శోభిలు శైవమతంబు దాఁ ద్వరన్
మతముల సేరిటన్ వెలసె మాన్యత గన్న సమస్తభావలన్
చితతయశోవిశాలమయి వేమఱ బోరఁగ నగ్రసీమ నీ
వతిశయపూజనీయ వగు చాశ్రితకోటి ననుగ్రహింపుమా

పారమేశ్వరయోగశాస్త్రాంగకళకథా
గానంబు శ్రుతిసూత్రకలన నెరపి
యాచార్యసూత్రప్రామాణికంబగు నుత
వేదపుం దెఱఁగులు విశదపఱచి
సంస్కృతిబద్ధమౌ సాంప్రదాయికమైన
యాచారవైశిష్ట్య మమరఁ దెలిపి
సాంఘికాభ్యుదయసంస్కారహేతుకమైన
యాదర్శగరిమంబు నతులఁ జెప్పి

శుద్ధశాస్త్రీయసంపత్తి శ్రుత మొనర్చి
సత్యసారస్వతజ్ఞానశక్తిఁ జూపి
సర్వసభ్యసమాదరసరణి మించి
తొల్లిటి ప్రశస్తి కెంతేని తోడుపడుము

వివిధకళావిభూతి నిడి విజ్ఞులఁగా నొనరింప నొజ్జవై
ప్రవిమలశైవధర్మపథపద్ధతిఁ దెల్పి ప్రబోధమూర్తివై
తవిలి చతుర్విధార్థముల ధన్యులఁ జేసి భవత్సమాజము౯
అవిరళసచ్చరిత్రగణనార్హముగా సవరింపు మమ్మరో!

భారతాస్తికసంస్కృతిప్రాభవంబు
నకు మెఱుంగిడి మొదటి దనంగ నొప్పి
వెలసె శైవంబు మతముల కొలతలోనఁ
గరము విలసిల్లు మద్దాని కలిమిబలిమి.

మహాపాశుపతప్రాప్తసంప్రదాయైకసమ్మతా
జీయా దాచంద్రతారార్కం శైవతత్త్వప్రకాశికా

— ••• —

# అభిప్రాయము

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు – మద్రాసు

మీరు 'శైవతత్త్వప్రకాశిక' యను పేర మాసపత్రిక పెట్టి శైవసంఘమునకు చేయుచున్న సేవ ప్రశంసాపాత్ర మయినది. శైవతత్త్వమునకు సంబంధించిన విషయముల నెన్నిటినో సామాన్యపాఠకునికి దెలియునట్లు సులభశైలిలో చక్కగ వ్రాయుచున్నారు. మీపత్రికవలననే నేనెన్నియో విషయములు తెలిసికొనగలిగితిని. శైవు లందరు తప్పక ఆదరింపవలసిన పత్రిక యిది. శైవతత్త్వప్రకాశిక చిరకాలము వర్ధిల్లును గాక!

# ఆశీస్సు

మల్లంపల్లి వీరేశ్వరశర్మగారు – చిట్టిగూడూరు

శివతత్త్వమహాబోధసుధాసాగరవీచికా
జీయా దియం చిరం సాధ్వీ శైవతత్త్వప్రకాశికా
ఇయం విజయసంగూఢా జయవర్ష మహోజ్జ్వలా
ముక్త్యంగనావిలాసానాం మాధవశ్రీ రివోదితా
జగజ్జీవేశ్వరాణాం యా నిత్యతా తా మధిశ్రితా
జగతాం శ్రేయసే జీయాత్ శైవతత్త్వప్రకాశికా

# శైవతత్త్వప్రకాశికా ప్రశంసాపద్యములు

మ. దిగొండ రామలింగశాస్త్రిగారు – ఈమని

ధరణి ముప్పదియారు తత్త్వంబులకును
పై వెలింగెడి తత్త్వంబు పరశివుండె
యనెడి శాస్త్రంబు పల్కుల నహరహంబుఁ
గనఁగలము శైవతత్త్వప్రకాశికందు

శిష్యుడు బ్రాహ్మణుండు శివపూజ సేయుట
బ్రాహ్మణునకు ధర్మసమ్మతముఁ గాదొ
నిట్టి ధర్మములనె యింతయుఁ బాడఁగ జెప్పు
సంశయంబు లన్ని సమసిపోన

వార్తలను దెల్పు పత్రికల్ వంద లున్న
నిలను జూపును రాచబాటలనెగాని
ముక్తిత్రోవల బోధింప శక్తి గలదె
వలయు మతపత్రికల్ బ్రహ్మసమము చూడ

సర్వమునకుఁ గర్త సర్వేశ్వరుం డట్లు
సర్వకృత్యములను నిర్వహించి
సక్రమముగ నడుపు శైవపత్రిక నేఁడు
ఘనత కెక్కి కీర్తి గాంచుగాత!

ఉర్వి శైవధర్మముల శాస్త్రోక్తవిధిని
దెలుపు పత్రిక మన కండవలయుఁగాన
నిట్టివానిని బోషించి యిష్టకామ్య
సిద్ధు లగుదురుగాత! ప్రసిద్ధి వడసి

ఓమ్

# శివతత్త్వమ్

ముదిగొండ విశ్వనాథశాస్త్రి - తెనాలి

ఇదానీం మహం గీర్వాణభాషాయాం కించి ద్వక్తుం ప్రయతే. కాళిదాసోక్తిషు " ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహు ర్వామన " ఇవ అపహాస్యతాం గమిష్యా మీతి బిభేమి. తథా ప్యాత్మశక్తి ప్రేరితః యుష్మాక మాశీర్వాదబలేన చ సఫలప్రయత్నో భవేయ మితి మన్యే. సంస్కృతభాషా చాంధ్రాణాం విశేషతః సుబోధా భవతీతి యుష్మాభిః

జ్ఞాయతే సిదానేశవార మితః పూర్వమ్. అతో భగవదనుజ్ఞయా సాహసా
దూరే స్థిత్వా సన్నిధేః.

శివధర్మస్య ప్రాశస్త్యం పండితైః గ్రంథకారైర్భూ ప్రతిపాదితం
గ్రంథేషు. అనాద్యనంతస్య వస్తుని వివరణార్థం అనయోర్గ్రంథస్య యథార్థ
శక్తిర్వ్యాపకశక్తి ర్విశేషతః, అథవా తత్ప్రాథమ్యే స్వయం వాక్యైః ప్రతి
పాదన మకారిషత వేదాంతేషు. తస్మాత్ వ్యాఖ్యాశాస్త్రేషు మహర్షిభి శ్చ
కృతమ్. తత్ర విశేషతో వేదాంతేషు భగవాన్ శివ స్వీయం భావం
నిశశ్వాస. సచ్చిదానందరూపస్య నిర్మలస్య శివస్య ధ్యానయోగేన
మోక్షం లభంతే హ్యనాయాసేన సాధారణా అపి జనాః. ప్రథమయోః
స్వాత్మా మాయయా స్వతంత్రః ప్రకృత్యాత్మనా అజని. 'సోకామయత'
ఇత్యాదిశ్రుతిభి స్తస్య సంకల్పమాత్రేణ ప్రభవతి జగ దిత్యావక్షంతే
వేదాంతాః.

ఏన మేవ మహాదేవం సర్వజ్ఞం సామాన్యతః వదంతి. తేన
శాస్త్రస్య పరబ్రహ్మత్వం సిద్ధ్యతి. త్రిలోచనత్వం చాస్య అస్త్యే దేవేతి
సాధయంతి బుధాః. అయ మేవాత్మా అష్టభిః ప్రకృతిభి ర్యోజయతి
స్వం దేహమ్. అత శ్చాయం లోకాన్ సృజత ఇతి కథయంతి వేదాః.
తస్మా దస్యాష్ట మూర్తయః. సాక్షిమాత్ర స్యామూర్త స్యాపి భగవ
తోఽన్యత్ మూర్తం రూపం దృశ్యత ఏవ వేదేషు. తస్య కిం ప్రయోజన
మితి చే ద్బ్రవీమి.

స ఏవ మహాత్మా హ్యవతతార కదాచి స్నీలకంఠరూపేణ.
దేవాసుర ద్వంద్వరూపం చ హాలాహల మపిబత్. నిష్పత్తో భూత్వా
శశాస సృష్టిమ్. శిష్టా దేవాః స్వకర్మభి రక్షోభయ నేవ మీశ్వరమ్.
అమృతం చాస్నువన్. అత ఏవాసౌ శ్రీకంఠో లోకనియంతా శాసత
ఇతి ప్రసిద్ధః. పున రేష ఉదపాదయత్ కుమారం దేవసేనాన్యం స్వ
వీర్యబలేన. కామం చాజయత్. ఇంద్రియాణి నిజగ్రాహ. ఆదర్శ
శ్చాభూ ద్గృహస్థానామ్. నిష్కామకర్మపరాణాం పరాం కాష్ఠాం చ
ప్రాప్నోత్.

'ఇదం వా [illegible] [illegible] [illegible] [illegible] [illegible]' [illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible] ప్రకాశ[illegible]. [illegible]
[illegible] భవంతి దేవాః. పశ్యతే దేవానాం ప్రత్యక్షం
[illegible]. తేన చాస్య కృపాప్రేమ ద్యోత్యతే. ఇత్థం శాంతరసమయ
సంగ్రామసమయే చ శివ మేవ ప్రథమం సంపూజ్య, ధ్యాత్వా చ లోకాః సుఖం విజయం చ లేభిరే. భక్తానా మర్జునాదీనా మనుగ్రహార్థ మేవ అగ్రే చరతి స్మ యుద్ధేషు. ఏవం శివస్య నిగ్రహానుగ్రహసమర్థం మూర్తం రూపం ప్రకాశతే.

యది 'ఏక మేవాద్వితీయం బ్రహ్మ' ఇతి శ్రుతి రాద్రియతే తర్హి వయ మేక మేవ శివం సర్వజ్ఞం ధ్యాయామః. యద్యన్యే దేవా అపి సంతీతి బ్రూతే శ్రుతి స్తదాపి వయం హరిబ్రహ్మాదీనామపి నికట భాజా మసులభం శంభోః పదాంభోజభజన మేవ కరవామహై. సత్యం వా అమూర్తం వా స్వాత్మా, భవతు మిథ్యా వా సత్యం వా జగత్, జీవః బ్రహ్మ వా తద్భిన్నో వా భవతు, న వయం తరసా తర్కవచసా వృథా కంఠక్షోభం వహామః. కింతు తత్ప్రేమయా మోక్షం ప్రాప్స్యా వామ. సర్వదా సర్వకాలేషు స్మరామ చేశ్వరమ్. అమూర్తం వా మూర్తం వా, నిష్క్రియం వా సక్రియం వా ఉపాస్మహే చ సదా శివమ్. ధర్మబ్రహ్మైకత్వవాదినః అత్యాశ్రమాః నిష్పక్షాః న్యాయ పరాః విశ్వమానవసౌభ్రాత్రికాంక్షిణః విగతరాగద్వేషాః విశ్వేశ్వరం భజామహై.

— — —

## శివస్తుతులు — హరవిలాసము

జయ పార్వతీమనోహర జయ పరమానంద జయ నిశాకరమౌళీ
జయ భూమిసలిలపావకవియదనిలార్కేందుహోతృవిలసితమూర్తీ

# శివాద్వైతము

శ్రీకంఠవిద్యాభూషణ, సాహిత్యరత్న

నిర్మల శంకర శాస్త్రి

నిర్మల

శివాద్వైతములో శివపారమ్యమును నిరూపించుటకు వలయు ప్రమాణముల సరళార్థము శ్రీమన్నీలకంఠ శివాచార్యులవారిచే వ్రాయబడి మన ముముక్షువులకు బోధింపబడిన యంశము శైవమహాజనులందరికిని సువిదితమే.

ముక్తస్థలములో శిఖికర్యాపన్యాయము ననుసరించి శివజీవైక్యము స్థాపింపబడినదనియు, ముక్తదశలో పురుషుడు దేహధారియై శివభక్తుడై యుండుట వైఫల్యము కాదనియు, ఆసన భోజన క్రీడాది వ్యాపారములు శరీరప్రవృత్తులు కాస్పై శివచేష్టితములే యనియు ఇత్యాది అభిప్రాయనిశ్చయములను దూర మొనర్ప దగిన సమాధానములు కొంత వరకు ఉపయోగించునని భావించెదను.

ఉపాసనయందు శివజీవైక్యము నంగీకరించిన శ్రీమదాచార్యులు ఐక్యము భావనార్థమే యనియు, ముక్తపురుషుడు శివాత్పృథక్సిద్ధుడై శివభిన్నుడుగా నుండినచో శివానందము ననుభవింపజాలు ననియు, ఆసనభోజనాదులచే గలుగు ఆత్మసంతృప్తిని శివునికే సమర్పించవలెను గాని శివచేష్టితములే ఇవ్వియని యనినచో క్షుత్పిపాసాదిదోషసంబంధము పరమేశ్వరునికి సంభవించుననియు సముల్లేఖించియున్నవారు.

క్షుత్పిపాసాదు లంతరించి నిరంతర శివానందానుభవలోలురైన ముక్తులు ఒకానొకప్పుడు దివ్యశరీరధారులై, మరియొకప్పుడు ఆనంద మాత్రస్వరూపులై విహరించుచు చిదచిద్విశిష్టప్రపంచము నంతయు శివమయముగా నవలోకించుచు ఆ యా దివ్యలోకములలో ప్రత్యాత్మల ద్వారా దివ్యభోగముల ననుభవించుచు కదాచిత్ లీలామానుషరూపధారులై ఉపనిషత్సూత్ర – గీతాదియర్థముల నిర్వచనములతో నిఖిల

ఆస్తిక వైదికజనమునకు కర్మ - జ్ఞానసముచ్చితమును సన్న్యాసిని విరివిగా
ప్రచారము చేయుచుండును.

శైవములో పంచాచారములుగాని షట్స్థలసంపత్తిగాని [illegible] షష్టిశీలములుగాని అష్టావరణములుగాని వీనిలో ఎద్దియైనను శివాద్వైతమును ఎంతయు నిరూపించుటలేదని గట్టిగా చెప్పవచ్చును. "నారుద్రో రుద్ర మర్చయేత్" అను శ్రుతివాక్యము భస్మరుద్రాక్షాది శివచిహ్నముల ధరింపమి ఆత్మయందు శివభావన పరిపడనందునచే రుద్రు నర్చించుటకు రుద్రుడు కావలెనని తెలుపుచున్నయది. [illegible]డేయ నాటకములో శంకర వేషము దాల్చువాడు ముందుగా శంకర లక్షణములను బాగుగా చూచుకొని నే శంకరుడ నైతిననే దృఢనిశ్చయము కలవాడగుచో రంగస్థలమున సరిగా నటింపజాలును. ఉపాసకుడు ఉపాసనాసాఫల్యమును పొందునపుడు రాబోవు స్వానుభవమును అనుభవమును వైభవమును ఉపాసనాకాలములో నిత్యము నియమిత సమయములందు సంభావించవలసియుండును. కొందరి [illegible] ఐక్యము నంగీకరించినయెడల జీవునకు స్వరూపవినాశము, ఉపాసనా నైరర్థక్యంబును శాస్త్రార్థవైయర్థ్యంబును ఏర్పడును. "అజో నిత్యః శాశ్వతోఽయం పురాణః - న హన్యతే హన్యమానే శరీరే" ఇత్యాది ప్రమాణములన్నియు వ్యాకోపించును. కామక్రోధలోభాది దుష్టగుణ మలినమగు హృదయములో శివుని భావింప నవకాశము లేమి ముందుగ హృదయమును రాగద్వేషాదికలుషితము కాకుండా శోధించి సితసిత పుండరీక సదృశముగాను పరిశుద్ధిని పరిమళముతో సమముగాను భావింప వలసియుండును. కలుషితహృదయమును నిర్మలము చేయుటకే ఇష్ట ప్రాణలింగముల యుపాసన ఉపయోగపడుచుండుటచే భావలింగోపాస నకు వలయు ఐక్యభావన - శివసమత్వసంపాదనము కలుగుటచేతను స్వరూప ఐక్యము ఎప్పటికిని సంభవింపజాలదని విజ్ఞులు గ్రహించియున్నారు.

ఇత్యాది వివరణగల శివాద్వైతము విశిష్టపదముతో సమనుసంధింప బడినచో విశిష్ట శివాద్వైత మనంబడుచున్నయది. "విశిష్టశ్చ విశిష్టశ్చ

భాష్యములో సద్వైతమును తత్త్వతః స[illegible]పూ[illegible] మొదర్చి సాంఖ్య జైన బౌద్ధాదిమతములనే పూ[illegible] [illegible]వారు. మరియు స్వాభీష్టమగు శ్రుతిమాత్ర [illegible] [illegible]ద్వైతమునే బహుళముగా నిరూపించుచు శివాగమ[illegible] పూర్వోత్తర మీమాంసలకు కారణ కార్యములకు శివ[illegible]లకు అపృథక్సిద్ధ భేదపూర్వకాభేదమును సాధించియున్నారు.

శివాద్వైతములో పరతత్త్వము ముక్త[illegible] శివుడు - ఉపాస్యుడుగాను, చైతన్య నిత్యత్వ [illegible] శివ తుల్యుడైన జీవుడు - ఉపాసకుడుగాను, ఉపాసన [illegible] ప్రపంచము నిత్యముగాను, నిత్యత్వాదిసముడైనను జీవుడు [illegible] వాడగుటచే కించిజ్ఞుడై శివేచ్ఛావశీనుడై [illegible] మాయాకర్మాది మలత్రయవిశిష్ట సంసారములో [illegible] పరంపరలో కడపటి జన్మయందు ప్రపంచభోగముల [illegible] నశ్వరము తెలుసుకొనుటకై భక్తి [illegible] [illegible]ములం బడసియు శివానుగ్రహపాత్రుడై ముక్త[illegible] జీవుడు మొదట ప్రారబ్ధాదులను శివేచ్ఛావిని[illegible] [illegible] కర్మజ్ఞానేంద్రియ విషయములన్ని [illegible] శివార్పణబుద్ధి నభ్యసించుటకై "[illegible] ముముక్షు ర్వపునర్భవాయ" ఇత్యాది ప్రమాణముల [illegible] [illegible]క్షమన్త్ర గురుచరాద్యష్టావరణముల [illegible] రస్యముం జెంది ధ్యానపూర్వకముగా షట్కాలముల [illegible] మందిగాని ఏకకాలములోగాని శివాగమ[illegible] [illegible] నర్పించవలసియుండుననియు, ద్వైతసిద్ధాంతములోని [illegible] లేదనియు అద్వైతమున చెప్పబడిన కల్పితాభేద[illegible] [illegible] కాదనియు, శరీరమునకు అవయవములకునవలె శరీరశరీరులకు [illegible] లకు జీవేశ్వరులకును అపృథక్సిద్ధభేదపూర్వకాభేదము [illegible] ననియు భాష్యాది పరామర్శచే సునిరూపితమై యున్నది.

[సశేషము]

# ★ శివాద్వైతము ★

## 2

శ్రీకంఠవిద్యాభూషణ, సాహిత్యరత్న,

నిర్మల శంకరశాస్త్రి

నిర్మల

( రెండవ సంచిక తరువాయి )

[illegible] చేతనమైన ఆత్మనుండియు [illegible] శక్తిరహితబ్రహ్మమునుండియు [illegible] సృష్టిస్థితిలయాదులు సంభవింపజాలవు.

> శక్తిః శివశ్చ సచ్ఛబ్ద ప్రకృతిప్రత్యయోదితౌ
> తౌ బ్రహ్మ సామరస్యేన సమస్తజగదాత్మకౌ

బ్రహ్మ సచ్ఛబ్దవాచ్యమై సచ్ఛబ్దమునకుగల ప్రకృతిశక్తిగాను ప్రత్యయము-శివుడుగాను, శక్తిశివుల సామరస్యము (కూడిక) బ్రహ్మగా నేర్పడుటచే చేతనాచేతనసమ్మిశ్రమగు జగముయొక్క స్వరూపముకో కనుపడు శక్తిశివులు కారణకార్యావస్థలం బొందుచున్నారు.

ఇందు శక్తి విశేషముగాను, శివుడు విశిష్టముగా నుండుటచే శివునకు ప్రాధాన్యము, శక్తికి శివావినాభూతమగు ప్రకృతిత్వంబు నుపాదేయము లగుచున్నయవి.

> విశ్వాతీత మమేయ మాద్య మమలం విశ్వాత్మకం కారణం
> కార్యం చోభయ మేక మేవ, శివశక్త్యోః సామరస్యం జగత్
> ముక్తః శాశ్వత నైజలాభవిషయా సృష్ట్యాదివ్యాపారతః
> భూమ్న్యానందమయా చ, శంభుపదవి విశ్వోత్తరా వర్తతే.

తా॥ కారణావస్థాసంపన్నబ్రహ్మము స్థూలచిదచిన్మయమగు విశ్వమునకన్న అతీత మనియు, ప్రాకృతములగు సంసారి మనోవాక్కుల కగోచర మగుటచే అమేయ మనియు అస్మదాదులచే గుర్తింపశక్యము

గాని సమయమునుండియు ఏకరూపముగా స్ఫురించుచు స్పష్టాస్యైక్యత్వ మునను ఎడ తెగకుండా నిర్వర్తించుచుండుటచే అన్య మని... "... మేకః ప్రథమ మాసమ్" అను మంత్రోక్తరీతిగా సృష్టికంటె పూర్వమునను సృష్టిలోను ప్రళయమందును నే నొకడ నుంటినని చెప్పినట్లు పరమే శ్వరుడు అద్వ్యుడు కావచ్చు ననియు, "బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున" అని గీతలో శ్రీకృష్ణుడు అర్జునున కుపదేశించినట్లు జన్మాద్యనుభవములు జీవేశ్వరులకు సమానములు గాకుండా జన్మాది రహితుడు పరమేశ్వరు డనియు జన్మాదిసహితుడు జీవుడనియు గ్రహించ వలయును.

కార్యావస్థాసంపన్నబ్రహ్మము - విశ్వాత్మకముగా నుండును. ఈకారణకార్యములు రెండును విశ్వాతీతమైన బ్రహ్మముయొక్క - అవస్థా విభాగములై ఒకే బ్రహ్మగా నిర్ధారింపబడుచున్నయని.

పాదోఽస్య విశ్వా భూతాని త్రిపా దస్యామృతం దివి

ఈసమస్తమైన ప్రాణులు జగంబును బ్రహ్మకుగల విభూతిలో నాలుగవభాగ మనియు సత్యాకారమై ఆనందమయమైన అపునశ్వత్వము మొదలగు విలక్షణసంపద - జగదతీతదివ్యస్థానమునందు మూడుభాగ ములు నెలకొనియున్న దనియు శ్రుతి వర్ణించుటచే ప్రాకృతబుద్ధికి నగమ్య మగు విభూతి వేదశాస్త్రబోధితమునకన్న నధికముగా బ్రహ్మకు గలదని ఏర్పడ మగుచున్నది.

ఇట్లు శివాద్వైతమును నిరూపించువేళ శ్రీమన్నీలకంఠశివాచా ర్యులవారి మహోపదేశమును, సామంజస్యార్థప్రబోధకములైన శ్రుతి స్మృతి గీతా పురాణాది వాక్యంబులును స్ఫురించుచుండ పరులు మాపెట్టు తర్కవిధానములు, కుయుక్తులు, అన్యార్థములు, కల్పిత వ్యవస్థలును ఎంతమాత్రము జ్ఞప్తికి రాకుండును. ఇదియు శివానుగ్రహ లేశమహిమ యనియే తృప్తిపడుచు మరికొంత వ్రాయుచున్నాను.

చేతనాచేతనసమ్మిశ్రమగు శక్తియొక్కయు, ఆత్మశక్త్యమృతా స్వాదలోలుడైన శివునియొక్కయు సాయుజ్యమే అనగా ఎల్లకాలము కూడియుండుటయే జగ మగుచున్నయది.

“తజ్జలా నితి శాంత ఉపాసీత” తస్మాత్ బ్రహ్మణః, జగతః జన్మాదికం, ప్రాణనం చ భవతి ఇత్యతః బ్రహ్మ జగత్కారణ మితి శమదమాదిసంపన్న ఉపాసనం కుర్యాత్.

జగత్సంబంధము - అనగా శక్తిసంబంధము లేనిది బ్రహ్మ ఉపాస్యము కానేరదగుటచే శక్తిసమరసీభావసహితుడే సర్వోత్కృష్టాలంబన సంబంధ ముతో కారణకార్యముల ప్రాకృతపురుషులు జగద్రూపమున భావించు చున్నారు. ఒకానొక అజ్ఞాని - నాజన్మను తల్లిదండ్రుల సంయో గమే కారణముగాని పూర్వకృతము కాదని గ్రహించును. జ్ఞాని పూర్వకృతమే తల్లిదండ్రుల సంయోగప్రభృతిరూపములతో ఏర్పడు చున్నదని గుర్తెరుగజాలును. అట్లే ప్రాకృతపురుషుడు జగత్తును బ్రహ్మమునకు వేరుగా నవలోకించుచున్నాడు. జగత్కారణము బ్రహ్మ యనియు, జగము బ్రహ్మమయ మనియు భావించువాడు ప్రాకృతపురుషు డైనను ప్రకృతస్వరూపము నెరుగనేరనిది వస్తుతః జగమును బ్రహ్మ గానే భావించుచు జగద్గతములైన వికారములను పొందకుండును.

నిత్యనైమిత్తికాదికర్మలు, బహిరాద్యుపాసనలు మొదలగునవి - అవి చిత్తశుద్ధిహేతువులగుటకే ఉపయోగించునట్టివి. అనగా ముక్తికి సాధనయోగ్యతను కలిగించునవి. స్వదేహమును విడిచి పరకీయమును పొందుట ముక్తి యని భావింపరాదు. శాశ్వతము, సృష్ట్యాదివ్యాపారములు లేని దియు, ఆనందమయము నగు నిజస్థితి కలిగియుండుటయే ముక్తి యన దగుచున్నయది.

శరీరమును విడుచుట, వ్యాధి నిర్మోచన మగుట, లోకాంతర నివాసము చేయుట, ఆకలి దప్పి తీర్చుకొని విషయానంద మనుభవించు టయు ధనము సంపాదించుటయు, కీర్తి గడించుటయు ముక్తి కాజా లవు. ఇవి యున్నను నిజస్థితిని మరుగుపరచుకొనియున్నంతవర కేర్పడు నవి కావున బ్రహ్మతో సమానమైన ఆనందానుభవము కలిగియుండుట ముక్తిస్వరూప మగుచున్నయది. ఇట్టి ముక్తి నిర్హేతుక జాయమాన కటా క్షముతో ఏర్పడు నని కొందరు, జ్ఞానప్రాప్తియే మోక్ష మని మరికొందరు సమర్థించుచున్నారు. “యదా చర్మవ దాకాశం” అను శ్రుతివాక్య

ములో ఆకాశమును చర్మమువలె చుట్టగలిగినచో పరమేశ్వరుని తెలుసు కొనకయే ముక్తులు కావచ్చునని నిరూపింపబడియుండుటచే శివజ్ఞానము లేనిది శివపదప్రాప్తిరూపమోక్షము సంభవించదని తెలియుచున్నది. శివపదములో ప్రవేశించినతోడనే నిజానందము నిజరూపము ఇత్యాది సంపదయంతయు చేకూరును. “దేశవిదేశములు గ్రామపట్టణములు తిరిగితిరిగి వేసారి స్వగృహమునకు వచ్చినవాడు తనఆరోగ్యమును, విశ్రాంతిని, యోగ్యతను పొందునట్లు బ్రహ్మాండములో అనేకజన్మలందు నానాలోకములలో సంచరించుచు సుఖదుఃఖముల ననుభవించిన జీవుడు తన శివోపాసనాబలముచే శివపదములో అడుగిడినతోడనే అనాదికాల విస్మృతశివవిభూతి కలవాడగుచున్నాడు. శివుని కటాక్షము నిర్హేతుక జాయమాన మగుచో పుణ్యపాపవ్యవస్థ వ్యర్థమై జపతపోవ్రతనియమ ధ్యానాద్యుపాసనల నియమయోగంబు నేర్పడును.

“కలౌ వేదాంతినః సర్వే ఫాల్గునే బాలకా ఇవ” అనునట్లు వాఙ్మాత్రచర్చతో “జగ న్మిథ్యా బ్రహ్మ సత్యం” అని జ్ఞానమును చాటుచు ప్రచ్ఛన్నముగా మంత్రతంత్రాదిపరులగువారికి మోక్షము ఎట్టిది వచ్చునో దురూహ్యము.

విష్ణుమూర్తి చేయు శివధ్యానముతో నభిన్నమై విశ్వమునకు సంబంధించనట్టి శివపదము విరజానదీవైకుంఠముల నతిక్రమించి విరా జిలుచున్నయది.

తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః

శివోపాసకులైన జ్ఞానులు తమ నిర్మలహృదయములందు నారా యణునికి పరమధ్యేయమై స్వరూపముగా స్ఫురించు శివపదమును, అథవా నారాయణపదమును వైకుంఠమునకన్న నుత్కృష్టమగు తత్పద మును అనగా శివపదమును నిరంతరము చూచుచున్నారు. చిదాకాశము శివపద మనియు, చిదాకాశభరితజ్యోతిర్లింగము పరమాత్మ యనియు వివేకము.

( స శే ష ము )

శ్రీపార్వతీరాజరాజేశ్వరాభ్యాం నమః

# శుభాశంసనమ్

విద్యాభూషణ, సాహిత్యరత్న నిర్మల శంకరశాస్త్రీ

నిర్మలా పురాః, విశాలాంధ్రరాష్ట్రమ్

ప్రభూతశబ్దార్థవిబోధినీ వాదేః పరస్య శంభోః పరమార్థవేదినీ
అద్వైతసంసిద్ధిమనోనివర్తినీ జీయాచ్చిరం తత్త్వప్రకాశికా పరా

మహానుభావైః శివసక్తచిత్తై రారాధ్యవర్యై రనుపత్యమానా
అపూర్వస్వారస్యనిరూపిణీ ముదం తనోతి శైవీ వరపత్రికా భృశమ్

శ్రీపండితారాధ్యశుభాన్వవాయే సంజాతదేహైః శరభాఖ్యయోగిభిః
విద్వన్మనోరంజనదక్షబుద్ధిభిః సంపాద్యమానా పరివర్ధతాం శివాత్

శైవాంధ్రలోకస్య కుతూహలప్రదా సర్వాప్తకస్యా శోభానురంజితా
కించిత్ స్ఖలత్పాదకలాభిభాషిణీ విధోః కలావ త్స్ఫురితః సమేధతామ్

సదాశివధ్యానప్రసన్నచేతసాం పరేష్టలింగస్య సదానుధారిణామ్
మాహేశ్వరాణాం విమలప్రసాదాచ్ఛతం సమా జీవతు తత్త్వబోధినీ

శ్రీశివాద్వైతసిద్ధాంతబోధినీ శంకరప్రియా
ప్రవర్త్యతాం సక్రమం శ్రీశరభారాధ్యచోదనాత్

— ... —

# శివాద్వైతము - 3

శ్రీకంఠవిద్యాభూషణ, సాహిత్యరత్న

నిర్మల శంకరశాస్త్రిగారు - నిర్మల ( నైజాం )

( విడచిన సంచిక తరువాయి )

స్వవిరచిత శివాద్వైత సిద్ధాంతరత్నపంచకములో మూడవ శ్లోకము నిట నుదహరించుచున్నాను.

అనాదిపరమానందః పరాత్పరోనఘ శ్చిచ్ఛక్తియుక్తో విభుః
సాక్షాత్కారణ దేవ దోషరహితః కైలాసవాసీ ప్రభుః
భక్తోద్ధారకరో విచిత్రచరితః కారుణ్యసింధుః శివః
సృష్ట్యాదీన్ కృతిపంచకం వితనుతే లీలార్థ మే వాఖిలమ్

చిదాకాశభరితజ్యోతిర్లింగస్వరూపుడగు పరమాత్మ
పరాత్ పరతరో బ్రహ్మా తత్పరాత్ పరతో హరిః
తత్పరాత్ పరతోఽధీశః

అను శివసంకల్పప్రమాణము ననుసరించి ప్రకృతికంటె పరుడగు హిరణ్యగర్భునికన్న శ్రేష్ఠుడైన నారాయణున కతీతుడై ఉత్కృష్టానందప్రదు డుగాను. 'మాయినం తు మహేశ్వరమ్' అనుశ్రుతిగా మాయావినాభూతస్వరూపము గలవాడుగాను. సూర్యునివలె పృథివీజలాగ్నివాయ్వాకాశాదిప్రపంచమునందు ప్రకాశించువాడై ఆకాశమువలె సర్వత్ర వ్యాపించువా డయ్యును ప్రపంచగతవికారములను పొందకుండువాడుగాను 'పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాద స్యామృతం దివి' అను వచనమువలన స్వమహిమ చతుర్థాంశభూతమగు జగమునకంటె దివ్యాంతరిక్షమున మూడు భాగములు మిగిలియుండి కైలాసవాసియై సర్వనియామకుడుగాను పేర్కొనబడుచున్నాడు.

కృపాసముద్రుడైన సదాశివుడు మహేశ్వరమూర్త్యాది పంచవింశతిలీలలద్వారాను, అష్టమూర్తుల రూపముగాను, ఏకాదశరుద్రాత్మకముగాను భక్తులు కానివారి కగమ్యముగాను, భక్తులగువారి కాశ్చర్యకరముగాను, జ్ఞానులగువారికి విశ్రాంతిపదముగాను నుండు చరిత్రకలవాడై భక్తుల నుద్ధరించుటకై సృష్ట్యాది క్రియాచతుష్కమువలె పంచమకృత్యమగు ననుగ్రహమును విలాసముగా ( నితరపేక్షత్వాభావముతో ) నొనరించుచున్నాడు.

విశిష్టశివాద్వైతములో వినాశము రూపాంతరప్రతిపత్తియేగాని స్వరూపనిర్మూలనము గాదు. సృష్టి యనగా నామరూపవిభాగానర్హస్థూలత్వ మనియు, స్థితి యనగా నామరూప విభాగమును చేతనునికి

వసిలకముగా నుంచుట యనియు, లయ మనగా నామరూపవిభాగము నశింపజేసి సూక్ష్మత్వ మనియు, తిరోధాన మనగా జీవుని నామరూప విభాగావస్థస్థితిని కాపాడుచు సుషుప్తియందువలె మహాముక్తావస్థ జెందించుట యనియు నిరూపించబడుచున్నయవి.

యదా తమస్తన్న దివా న రాత్రిః న సన్న చాసత్
శివ ఏవ కేవలః

సత్ – నామరూపవిభాగార్హ చేతనములుగాని, అసత్ – నామ రూపవిభాగార్హ జడములుగాని, దివారాత్రివిభాగములుగాని లేనిసమయమున తమః – గాఢాంధకారసదృశమై ఇతరవస్తుప్రకాశాభావ సంపన్నమగు సూక్ష్మావస్థ యున్నప్పుడు, కేవల – ఇతరాపేక్ష లేనివాడై, శివ ఏవ – ఆత్మశక్త్యవ్యక్తానాదులోలుడైన పరమేశ్వరు డొక్కడే విరాజిల్లు చున్నాడు.

అహమేకః ప్రథమ మాసం వర్తామి చ భవిష్యామి చ
నాన్యః కశ్చిన్మత్తో వ్యతిరిక్తః

నే నొకడనే సృష్టికి పూర్వమును సృష్టిలోను ప్రళయమందును విలసిల్లుచుందును. కావున నాకంటె భిన్నుడగు ఒకానొక సమానవ్యక్తి యుండజాలడని పరమేశ్వరుడు స్వర్గవాసులైన మహేశ్వరు (దేవత లకు ఉపదేశించె ననియు శ్రుతివాక్యములు ప్రతిపాదించుచుండుటచేత సృష్టిస్థితిలయతిరోధానములకు సదాశివుడే కర్త యని సిద్ధాంతిత మగు చున్నది.

యదా చర్మవ దాకాశం వేష్టయిష్యంతి మానవాః
తదా శివ మవిజ్ఞాయ దుఃఖ స్యాంతో భవిష్యతి
జ్ఞాత్వా శివం శాంతి మత్యంత మేతి

ఆకాశమును చర్మమువలె చుట్టజాలువారు శివుని దెలియక దుఃఖ వినాశరూపమోక్షమును పొందవచ్చు ననియు, శివుని గుర్తెరిగి పునరా వృత్తిరహితశాశ్వతశివపదప్రవిష్టులై నిరతిశయానందము ననుభవించుట

రూపముగా నుండు నిర్వికారశాంతిని బడయవచ్చునవియు నిత్యాది శ్రుతివాక్యములు నిరూపించు నర్థమునుబట్టి శంకరునికే అనుగ్రహ రూపమోక్షము కలుగజేయు సామర్థ్యము నిత్యసన్నిహితమై యుండు నని యథార్థబుద్ధిగల జిజ్ఞాసువులును, పండితులును నగువారు భావింప వగియున్నది.

వేదపురాణేతిహాసాదులందు వచ్చు శివశబ్దమునకు విష్ణ్వర్థమును యౌగికముగా జెప్పుచు నంతయు విష్ణుపరముగా నన్వయింపవచ్చుగదా యని కొందరు తలంచుచుందురు. రుద్రేశానభవశర్వమహేశ్వరభర్గాది శబ్దములు శివునకు రూఢములై వేదములం దనేకప్రదేశములయందు ప్రయుక్తములై నన్యార్థస్వారస్యము లేనివిగా నొప్పుచున్నవి. మహో పనిషత్తునందలి నారాయణశబ్దమునకు శివార్థము ననుసంధింప శక్య మైనట్లు వైదికశివశబ్దమునకు విష్ణ్వర్థమును ప్రతిపాదింప వీలు లేదు. ఈ యొక శివశబ్దమే యనేకస్థలములం దుపయోగింపబడుటచేతను, శివ పర్యాయపదములును తథావిధము లగుటను పురాణములందు చారిత్రి కముగా శివలీలలు విపులముగా వర్ణింపబడుటచేతను శ్వేతాచార్య, బోధాయన, దుర్వాసో, దధీచి, మార్కండేయ, అగస్త్య, వసిష్ఠ, విశ్వామిత్రాదిమహానుభావులును, శంకరాచార్య, విద్యారణ్య, హర దత్త, శ్రీనాథాదులును, బ్రహ్మ, విష్ణు, శ్రీకృష్ణ, శ్రీరామ, పుష్పదం తాదులును నిరంతర శివార్చనధ్యానాదులు గావించినవా రగుటను, ప్రణవార్థమును గాయత్ర్యర్థమును శివు డగుటను శివాదిశబ్దవాచ్యుడైన పరమేశ్వరుడే సర్వశ్రుతిస్మృతిపురాణాదిప్రతిపాద్యుడై పంచకృత్యపరా యణుడుగా నిర్ధారింపబడుచున్నాడని భారతీయుల దృఢవిశ్వాసము.

— ... —

### శివస్తుతి – హరవిలాసము

నీవ పరబ్రహ్మంబవు నీ వఖిలాండాండపతివి నీవు ప్రసన్న
శ్రీవిభవారోగ్యయుక్ప్రావీణ్యప్రాభవైకఫలదుండవు శివా!

# శివాద్వైతవైభవమ్

[illegible] జ్వాలాపతిలింగశాస్త్రీ - తెనాలి

[illegible] వేదశాస్త్ర[illegible] వృక్షవరః స్కంధః షడంగాగమాః
శాఖాః [illegible] సత్కర్మాణి [illegible] పత్రాణి పుష్పాణి వై
భక్తిర్జ్ఞానముపాసనా మోక్షఫల మేవం ధర్మకల్పద్రుమో
యస్మిన్ భాతి స ఏవ పుణ్యనిలయో దేశోఽహ్యయం భారతః
తత్పంచాశత్ప్రసిద్ధప్రచురతరసుభాషావిశేషానుభావే
తస్మిన్ శ్రీభారతాఖ్యే పృథులలితకళాసర్వసంపద్విశిష్టే
దేశే యద్రాష్ట్ర మాంధ్రం మధురలలితభాషావిశేషప్రసిద్ధం
భాత్యేకైకస్వకీర్త్యా హృదయ మివ హి తద్భారతం లోకగణ్యమ్

తస్మిన్ సుఖాధికతమే మహితాంధ్రరాష్ట్రే
గుంటూరుమండల మిదం కిల భారతోర్వ్యాః
రాష్ట్రశ్రీహీరమణికాంచనహారమధ్య
భాస్వన్మహామణి రివ ప్రతిభాతి లోకే
తన్మండలసమీపస్థం తాళగిర్యాఖ్యయా స్ఫుటమ్
సర్వసంప త్సమాకీర్ణ మాస్తే జనపదం పరమ్
జ్వాలాంబాఘోరయారాధ్యౌ వర్తేతే తత్ర దంపతీ
ఉద్భటారాధ్యసంభూతికులే కళ్యాణసంకులే
పురాకృతేన తపసా శివస్య కృపయా తయోః
సాంగం వేదత్రయ మివ పుత్రత్రయ మజాయత
తేషాం మధ్యజనిః శ్రీమాన్ నాగలింగసమాహ్వయః
శివయోగీ చ విద్వాంశ్చ మహోపాధ్యాయశబ్దభాక్
అవతారః స్వయం లోకే శివ ఇత్యనుభావితః
సాంగవేదస్య విజ్ఞాతా శైవాగమవిశారదః
పురాణసర్వధర్మజ్ఞః మీమాంసాద్వయపారగః
గీర్వాణాంధ్రకృతీనాం చ బహూనాం ధర్మవర్త్మనామ్

కర్తా జ్ఞాతా చ వక్తా చ బోద్ధా గురు రితీరితః
అస్మదస్మద్దీక్షితానాం చ ప్రహోత్రైః శ్లోకపంక్తిభిః
బహుధా సర్వశాస్త్రేషు శ్రీనినాగసుధీవరైః
ప్రతినాత్మబుద్ధ్యా చ శివానుగ్రహహేతునా
జగతాముపకారాయ కృతబుద్ధిర్మహామతిః
స ఏవ నాగలింగాఖ్యః సర్వలోకైకవందితః
శతాధికాన్ మహాగ్రంథాన్ శైవధర్మప్రబోధకాన్
విరచ్య శైవసంఘస్య కీర్తిం ప్రాకాశయ ద్భువి

యః సాక్షా చ్ఛివరూపః స్ఫుట మితి సకలై [illegible]
ర్యః ప్రత్యక్షానుమేయోభయనిజచరితై రూహ్యతే తద్వదన్యై
ర్యః శైవానాం హితార్థం ప్రతనుత సగుణబ్రహ్మతత్త్వం నమస్యాం
కుర్వే శ్రీనాగలింగాహ్వయపరతనవే దక్షిణామూర్తయేఽహమ్

యం శైవాః పూర్వజన్మార్జితసుజతపసః పుణ్యమూర్తిం భజంతే
యం ద్వైతాద్వైతవిద్వన్నిచయ ఇహ భియా దర్శితుం న వ్రజంతి
యం సర్వే భక్తవర్యా శ్శివ మివ మనసా భావయంతో నమస్యాం
కుర్వే శ్రీనాగలింగాహ్వయపరతనవే దక్షిణామూర్తయేఽహమ్

యే నాధీతాశ్చ శైవాగమనిగమముఖా స్సర్వవిద్యా స్సమగ్రాః
యే నానేకా స్సుధీంద్రాః ప్రతిముఖవిజితా [illegible]
యేన జ్ఞాతాత్మవిద్యాసుఖజలధినిమగ్నా స్స్వశిష్యా నమస్యాం
కుర్వే శ్రీనాగలింగాహ్వయపరతనవే దక్షిణామూర్తయేఽహమ్

యస్మై నందీశముఖ్యప్రమథగణవరా మంగళం [illegible]
యస్మై శక్రాదిదేవా శ్శుభ మధిలవతే పద్మయోనిం భజంతే
యస్మై బ్రహ్మర్షివర్యాః స్వమత మభిమతం దర్శయంతో నమస్యాం
కుర్వే శ్రీనాగలింగాహ్వయపరతనవే దక్షిణామూర్తయేఽహమ్

యోగినో నాగలింగస్య లింగాంబాహృదయేశితుః
స్తుతిః స్యా దిష్టదా నృణాం దక్షిణామూర్తిరూపిణః

— ... — ... —

# శ్రీ మహాస్కాందము

## గౌరీ కళ్యాణము

ముదిగొండ వీరభద్రకవివరేణ్యప్రణీతము

శ్రీమహాస్కాంద మష్టాదశపురాణములలో నొకటి శివపరాత్పరత్వము నిర్ణయించువానిలో నిది యగ్రగణ్యము ఇందు శివలీలలు సర్వతోముఖముగా వర్ణింపబడినవి. ఈగ్రంథము నందు లీలలు గౌరీ కళ్యాణముతో నారంభమైనవి

స్కాందములు మహాపురాణము, ఉపపురాణము నని రెండు కలవు. కవిగారి రచన రెంటియందలి విషయమునకు సమన్వయముగా నున్నది. స్కాందమునందలి విషయవివరణమును కవి ఈక్రిందివిధముగా వివరించియున్నారు.

భారతదేశతీర్థవిభవంబులు, క్షేత్రవిశేషముల్ సదా
చారములు న్మహాత్మ్యము విశాలపవిత్రవిచిత్రగాథలున్
ధీరుల వర్తనంబులు సుధీవరశాస్త్రరసప్రసంగముల్
వీరుల యుద్ధతంత్రముల వింతలచే విలసిల్లు స్కాందమై

వీరి రచన సరసమధురముగా నున్నది. మచ్చునకు పద్యము లీక్రింద నీయబడుచున్నవి.

కలిమి గలయప్డె పరమేశుఁ గాంచవలయు
దీవ మున్నప్డె యి ల్చక్కదిద్దవలయు
లేమి నేమేనియున్ జేయలేఁడు జగతి
నంధుఁడో మూర్ఖుఁ డెన్న గర్వాంధుఁ డగుచు

శిఖుఁ డనఁ జిన్నవాఁ డగునె? చెల్వరో! యీయన కాయనేతగున్
దివి భువిఁ జూచి ధాత హరి దీనత నిల్చిరి కానలేక నీ
కెవరు వచించిరో మొఱుఁగ రెవ్వరు వానిభవమ్మునన్ భవో
ద్భవుఁ డని వేదముల్ నుడువ భక్తి భజింతురు బ్రహ్మవేత్తలున్

Printed, Edited and Publiahed by S. P. Sarabhaiah
At Krishna Printing Works, Vijayawada - 2

ఓమ్


# శైవతత్త్వప్రకాశిక

( ఆధ్యాత్మిక మాసపత్రిక )

సంపుటం ౮ || దుర్ముఖి శ్రావణము ( 1956 సెప్టెంబరు ) || సంచిక 6


## శివలీలాస్తవనివహము


ముదిగొండ మల్లికార్జునశాస్త్రి - వరంగల్


వారణవక్త్రరాత్రిచరవక్త్రమచేష్టితదూయమానపా
కారిముఖామరార్తిహరణైకఫలప్రణవోజ్జ్వలద్గజా
కారనిజావచారకృతకైటభవైరిఫణీశరూపమో
హారభటీవటిష్ఠుఁడు గజాననుఁ డిచ్చు నిరంతరాయతన్ 1

అంహస్స్తోమవికర్షణక్షమపరధ్యానప్రదీపప్రభా
బంహిష్ఠప్రతిపత్సనాదియమిరాడ్భావోత్థశంకాలతా
సంహారాదృతమౌనముద్రితవటస్థానోల్లసన్మూర్తి ధీ
సింహద్వారము విప్పి ప్రోచుత మముం శ్రీదక్షిణామూర్తియై 2

అజవిశ్రాణితదీర్ఘజీవితవిరూపాక్షావరాజన్యసా
విజయిత్వాదివరావలేపభరదుర్వృత్తామరర్షిప్రజా
ప్రజభీకృద్గజదానవప్రమథనవ్యాఖ్యాతవాత్సల్యస
ర్వజనాధారగజారిమూర్తి పురుషార్థంబుల్ ప్రసాదించుతన్ 3

ఆశువ్యాప్తాఖిలాశావ్యయుసమయశుచిప్రాంచదర్చిష్కలాపా
వేశోదన్వద్వినిర్యద్ద్విషవిషమగతిప్రేంఖదంభోజజాండా
నీకప్లుష్టాంగతాపావృతసురదనుభూనిత్యకళ్యాణకామ్యా
త్యాశాసంపీతహాలాహలశితిగళుఁ డత్యంతసౌఖ్యమ్ము నిచ్చున్ 4

తారకశూరవీరముఖదైత్యజనాహితఘోరయాతనా
పారగతిస్పృహానిహితబాంధవనిర్జరకార్యసాధన

స్వైరంతికమోహనసుసాయకసంగసమాధిభంగవి
స్ఫారితఫాలనేత్రహుతదర్పకమూర్తి యఘుం బడంచుతన్ 5

శశ్వత్త్వాయుతసిద్ధతాప్రకటనస్పష్టార్థ దేహోల్లస
ద్విశ్వోత్పత్త్యవనాంతకృత్పరశివాభిన్నాణిమాత్వాదిక
ద్వైశ్వర్యాప్తపరీవృఢాఖిలజగత్ప్రీమాన్యసిద్ధార్థవా
జ్ఞిశ్వానా మహిళార్ధమూర్తివగు నిన్ జింతింతు నశ్రాంతమున్ 6

భృశసాంసారికదుఃఖసంతతిసముద్వేగోజ్ఝితస్వీయధీ
విశదత్వద్రుహిణాద్యచేతనపశుప్రీత్యర్థకృద్వ్యాసర
ప్రశమారంభమహార్భటీనటనసువ్యాఖ్యాతలాస్యాగమ
త్రిశరీరాఖిలమర్మ్యుఁ డాదినటుఁ డాధిం బాప కాపాడుతన్ 7

సర్వజగజ్జనిస్థితినికారణకారణతాకృతాత్మధీ
గర్వితధాతృపంచముఖఖస్ఫుటనోత్థితతత్కపాలికా
ఖర్వనిశాచరాసృగుపకల్పితభైక్షమిషాభిరక్షితా
ఖర్వజనాదిభిక్షుకుఁ డఖండసుఖంబుల మాకొసంగుతన్ 8

ప్రియయాపాతకభీకభద్రతనుమత్స్వాదానశోద్గాఢవి
హ్వలధర్మాహ్వయదేవతావనకసత్ప్రీతికృతైతద్వ్రతః
ఫలకారాధకదర్శ్యశిక్షణసదాపద్వారణప్రక్రియా
కలితుం డావృషవాహనుం డిడుత మాకత్యంతసౌఖ్యంబులన్ 9

రోహిణ్యాప్తవరోడుమత్సరివరక్రూరత్వసంవృద్ధద
క్షేహాజాతమహాక్షయామయపరిక్షీణప్రసన్నాబ్జను
గ్రీవాత్యాధిగతేదమీయసుకలాప్రాంచజ్జటాజూటుఁ డా
శాహృద్యాంబరుఁ డిచ్చుఁగాత వివిధేష్టవ్యూహము న్మాకొగిన్

స్త్రీపుంసాత్మకమైన విశ్వమున కర్థి న్నిత్యకళ్యాణముల్
ప్రాపింపన్ దుహినాచలేంద్రవిమలప్రస్థస్ఫురత్సారస
శ్రీపత్త్రాంతరదృష్టమూర్తిని సతిం జెన్నారఁ బెండ్లాడు నీ
రూపోల్లాసివివాహలీల కడు సారూప్యంబు మాకీవుతన్ 11

కాపిలకోపవహ్నిహుతకాలికసద్గతిహేతుదుష్కరా
టోపతపోభగీరథకఠోరదయావనసత్వలోకపే
లావతదుత్తరంగవిమలాంగిని గంగను లోకరక్షకై
యేపుగ మౌళిc దాల్చిన మహేశుని నిన్మది సంస్మరించెదన్ 12

ఖలబలదృప్తశూరముఖకర్బురసంఘదురంతవిక్రియా
స్థలదధికారదీనసురశాతఘృణాశుచివాయుమూలకా
మలనిజబీజగాంగశరమండలదానవరిస్ఫురత్ప్రభా
వలయుతమూర్తి షణ్ముఖుcడు భవ్యశుభంబుల మాకొసంగుతన్

మేచకకంధరుండు వరమేశ్వరుc డత్యధికప్రశాంతుc డా
సేచనకాత్ముcడున్ బ్రభుc డచేతనచేతనయోని సాక్షియున్
మోచనసౌఖ్యదానచణపుణ్యవిశిష్టశివాదినాముc డి
చ్ఛాభిదుమాసహాయుc డనుషంగముతో మముc బ్రోచుc గావుతన్

కర్మకలాపజాతభవకష్టనిరాకృతిదక్షమోక్షస
న్మర్మయమాదిలక్షణసముంచితబోధనధీగృహీతస
ద్ధర్మవపుర్యమప్రథితతావకభావుక కేవలాంఘ్రియు
న్నిర్మలమూర్తి శర్మముల నిచ్చలు మాకనురక్తి నిచ్చుతన్ 15

కలధౌతామలకాంతిశోభితమహాకైలాససౌధాంతర
స్థలరత్నోజ్జ్వలసింహపీఠివయిc జిచ్ఛక్త్యంగనాసంగతిన్
జలజాతాసనముఖ్యదేవవరివస్యల్గొంచు లోకంబులన్
లలిc గాపాడు సుఖావహుండు కలకాలం బిచ్చు సౌఖ్యమ్ములన్

బలిగర్వాపహదంభవామనవపుఃప్రాగ్భారజిష్ణ్వజ్జగ
ద్వలయత్రస్తసురాసురాళి ననుకంపం బ్రోవc దచ్చర్మమున్
బలిమిం దుల్చి శరీరకీకసముc గోపం గేలc గీలించి ని
చ్చలు కంకాళధరుండవైన నిను మోక్షావాప్తికై గొల్చెదన్ 17

మీదుం గ్రిందును లేక విచ్చలవిడి న్మిట్టాడు జాలంధరున్
పాదాంగుష్ఠమహీవిలేఖనసముత్పన్నోరుచక్రోద్ధృతి

ప్రేమర్యాభతశరీరదారణగతప్రేము న్యాసం జేయు నా
వేదోక్తుండు జలంధరారి కరుణావృష్ట్యున్ముఖుం డయ్యెడున్ 18

రక్షాస్వామ్యము నైజ మాట బలవద్రాత్రించరోద్రేకసం
శిక్షాకాంక్షను విష్టరశ్రవుఁ డుపాస్తి న్మున్ను మెప్పింపఁగా
నక్షీణాస్త్రసుదర్శనాహ్వయసమాఖ్యాతంబునౌ శస్త్రమున్
దాక్షిణ్యంబున నిచ్చు చక్రిదుఁడు మా తాపంబులం బాపుతన్ 19

అరదము నేల, కన్నులు సహస్రకరాబ్జులు, మిన్ను లక్ష్యము ల్
సరసిజసూతి చోదకుఁడు, చాపము మేరువు, నారి చిల్వఱేఁ
డురగపశాయి యమ్ము నయియుండఁ బురమ్ముల మూఁటి నేస్చ న
వ్వరదుఁడు సార్వకాలికశివంబుల మా కొనఁగూర్చుఁగాతన్ 20

దురహంభావపరిగృహ్యమాణవిధియాతుద్విణ్మహాసంఖ్యసి
ర్భరసంచూర్ణితభావనావనలయాగంభాగ్నిశు భత్ప్రభా
పరిదీప్తాగణితార్చిరుజ్జ్వలచిరాభానాద్యనంతుండవై
యురులింగాకృతి నందినట్టి నిను నాయుల్లంబునం దల్చెదన్ 21

చపలాసన్నిభజాటసంఘటితచంచన్మౌళిదంష్ట్రోల్లస
ల్లపనుఁ డూర్ధ్వసహస్రశీర్షుఁడు కరాళాగ్నేయనేత్రుండు నై
కపయోజాసనముఖ్యరుండకలితగ్రైవేయకుం డుద్ధద
క్షపశుచ్ఛేత్తయు వీరభద్రుఁడు మహాసౌఖ్యప్రదుం డయ్యెడున్ 22

మీఁటున పక్షచంచుపదమేదురభీమమృగార్ధదేహలా
లాటికనేత్రఖండమృగలాంఛనశేఖరశారభాకృతిన్
హాటకకశ్యపాసృగధికాదరపానవిమత్తనారసిం
హాటనవిహ్వలీభవదజాండము ప్రోచిన నిన్ భజించెదన్ 23

ఆయువు లేశ మొట్టు లహహా యని కుందెడు తల్లిదండ్రులన్
పాయువుపెంపు నంది సుఖవంతులఁ జేయుట కచ్ఛభక్తి ని
ష్ఠాయుతలింగపూజనము సల్పు మృకండుసుతుం గదల్చు నా
గాయతపాశి గాలు నల ఖండితుఁ జేసెదు నిన్ను గొల్చెదన్ 24

పరిణతభక్తి ఫల్గునుఁడు పాశుపతంబునకై తపింపఁ ద
త్పరతఁ బరీక్ష సేయుట కతథ్యనులుబ్ధకవేష మూని సం
బరమునఁ బోర గెల్చియును భక్తులయందలి పేర్మి పెంపుచే
నరునకు నస్త్ర మిచ్చి నిను నాదికిరాతుని నెమ్మి గొల్చెదన్ 25

— । ।—

# ఉపాస్యస్థాననిర్ణయము

శ్రీపతిపండితారాధ్యుల శరభారాధ్యుడు

ఉపాస్యస్థానము దహర మని కొందరును, భ్రూమధ్య మని కొందరును, సహస్రార మని కొందరును వాదించుచున్నారు. ఇందు ఉపనిషత్సమ్మతమగు స్థాన మేదియో విమర్శించి నిర్ణయించుటయే ఈ వ్యాసపు బ్రధానోద్దేశము.

ఇదగ్ం సర్వ మసృజత
త త్సృష్ట్వా తదే వానుప్రావిశత్

అనుమంత్రములు పరమేశ్వరుఁడు సృష్టి యొనర్చి సృష్టప్రపంచమునందు అంతర్యామిరూపమున ప్రవేశించెనని చెప్పుచున్నది

యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్ తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరం జనః పరమం సామ్య ముపైతి

మానవు డెప్పుడు బ్రహ్మాదిస్తంబపర్యంతజగత్సృష్టికర్తయగు పరమేశ్వరుని సాక్షాత్కరింపజేసికొనునో యప్పుడు పుణ్యపాపరూపకర్మ బంధమునుండి విడివడి పరమేశ్వరసాయుజ్యము నొందు నని యీమంత్రము ప్రతిపాదించుచు మానవుడు జననమరణరూపమగు సంసారబంధమునుండి విడివడుటకు పరమేశ్వరసాక్షాత్కార మావశ్యక మని శ్రుతి పాదించుచున్నది.

ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిష
స్వజాతే తయో రేకః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యః అభి
చాకశీతి

ఈమంత్రము జీవేశ్వరులు శరీరరూపమగు నొకవృక్షము నాశ్రయించి యున్నట్లును, అందు జీవుడు కర్మఫలభోక్తయు, పరమేశ్వరుడు నిస్సంగుడును నైనట్లును ప్రతిపాదించుచున్నది. కాని శరీరమున జీవేశ్వరుల స్థానము లేవియో నిర్ణయింపబడలేదు.

సమానే వృక్షే పురుషో నిమగ్నోనీశయా శోచతి ముహ్యమానః జుష్టం యదా పశ్య త్యన్య మీశ మస్య మహిమాన
మితి వీతశోకః

ఈమంత్రము జీవుడు పరమేశ్వరునితో బాటుగ నొకేశరీరమందున్నను పారతంత్ర్యముచేత వ్యామోహము నంది పరితపించుచున్నాడనియును, తదనుగ్రహపాత్రుడై తత్సాక్షాత్కారము నంది దుఃఖరహితు డగుచున్నా డనియును ప్రతిపాదించుచున్నది. కాని జీవేశ్వరుల స్థానము లీమంత్రమునందును ప్రతిపాదింపబడలేదు.

అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో యం పశ్యంతి య
తయః క్షీణదోషాః

జ్యోతీరూపుడగు పరమేశ్వరుడు శరీరాంతర్భాగమున నున్నాడనియు, క్షీణదోషులగు యతు లాతని గాంతురనియు నీమంత్రము ప్రతిపాదించుచున్నది. ఈమంత్రమును పరమేశ్వరునకు శరీరాంతస్స్థితిని మాత్రము ప్రతిపాదించుచున్నదికాని యిద మిత్థ మని స్థాననిర్దేశము చేయలేదు.

అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి

అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మా సదా జనానాం హృ
దయే సన్నివిష్టః

అంగుష్ఠమాత్రరూపుడగు నంతర్యామి శరీరమధ్యమం దున్నా

డని యీమంత్రము ప్రతిపాదించుచున్నది. కాని ఈమంత్రమందుకూడ శరీరమధ్యమందని చెప్పబడుటయేగాని ప్రత్యేకముగ స్థానము నిర్ణయింపబడలేదు

తద్యథా హిరణ్యనిధి మక్షేత్రజ్ఞా ఉపర్యుపరి సంచరంతో న విందేయు రేవ మే వేమా స్సర్వాః ప్రజా స్సతి సంపద్య న వివిదు స్సతి సంపత్స్యామహ ఇతి

పైన తిరుగుచుండియు క్రిందనున్న నిధిని మానవు లెఱుంగజాలనట్లు శరీరాంతర్భాగమందున్న పరమాత్మసాంగత్యమును నిత్యమును పొందుచుండియును పరమేశ్వరోపాసన చేయనివా రీవిషయము నెఱుంగజాలకున్నారని చెప్పుచు నీమంత్రము ప్రతిదినము జీవులకు పరమేశ్వరసాంగత్యమును ప్రతిపాదించుచున్నది.

అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మి న్నంత రాకాశ స్తస్మి న్యదంత స్త దన్వేష్టవ్యమ్

హృదయాకాశమందున్న యంతర్యామి యుపాసింపదగినవాడని యీమంత్రము హృదయము పరమేశ్వరస్థానమని ప్రతిపాదించుచున్నది.

పరాత్పరం పురి శయం పురుష మీక్షతే

ఈమంత్రముగూడ దహరమే పరమేశ్వరస్థాన మని ప్రతిపాదించుచున్నది.

తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్ అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్ష శోకౌ జహాతి

ఈమంత్రమును పరమేశ్వరుడు జీవునితోబాటు హృదయగుహాయం దనుప్రవేశము చేసినాడని ప్రతిపాదించుచున్నది.

వాలాగ్రమాత్రం హృదయస్య మధ్యే విశ్వే దేవం జాతవేదసం వరేణ్యమ్ అను శ్రుతియు

ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి
భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా-

అను గీతావాక్యమును

తత్రోవ్యయాత్మా స హరి స్స్వహృత్పంకజశాయినమ్
దర్శయామాస దేవానాం మురారి ర్లింగ మైశ్వరమ్

అను నీవామనపురాణవాక్యమును హృదయమే పరమేశ్వరస్థాన మని నిరూపించుచున్నవి.

ఈపైవిమర్శవలన పరమేశ్వరునకు హృదయమే స్థానమనియును నచటనే యాతని నుపాసింపవలయుననియు నిరూపిత మగుచున్నది. కాని జీవు డెచట నున్నదియు తేలలేదు. ఇక జీవస్థాన మెచటనున్నదో విచారింతము.

ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థ్యే

గుహాం ప్రవిష్టా వాత్మానౌ హి తద్దర్శనాత్

అను శ్రుతిసూత్రము లు జీవపరమేశ్వరుల కిద్దరికిని హృదయగుహయే స్థానమని ప్రతిపాదించుచున్నవి.

ఇంతవరకు జరిగిన విమర్శవలన జీవేశ్వరుల కిద్దరికిని హృదయమే స్థాన మనియును, ప్రతిదినమును సుషుప్తికాలమున జీవునకు పరమేశ్వర సాంగత్యము కలుగుచున్న దనియు తేలుచున్నది. కాని శరీరమునందు హృదయస్థాన మేది యైనదియు తేలలేదు. ఇక హృదయస్థాన మేదియో విచారింతము,

పద్మకోశప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్
అధో నిష్ట్యా వితస్త్యాంతే నాభ్యా ముపరి తిష్ఠతి

ఈమంత్రము హృదయము నాభికంఠములకు మధ్య నున్న దని ప్రతిపాదించుచున్నది.

— సశేషము

# శైవతత్త్వప్రకాశిక

( బహుళవ్యాప్తిగల ఆధ్యాత్మికమాసపత్రిక )

3 సంపుటం | దుర్ముఖి పుష్యము 1957 ఫిబ్రవరి | సంచిక 11



శైవమతప్రచారమున - అందును ముఖ్యముగ శివలీలాప్రచారమున
హృదయపూర్వకముగ ప్రాణము లర్పించిన ధన్యజీవి
నిగమాగమవిశారద, కర్షణాదిప్రతిష్ఠాంతాధికారసంపన్న
శ్రీమదాంధ్రస్కాందరచయిత

## శ్రీముదిగొండ వీరభద్రారాధ్యులు

# ఈసంచికయందలి విషయములు -



— : : —

శ్రీలోకారాధ్య నిగమాగమవిశారద

## ముదిగొండ వీరభద్రారాధ్యనిర్యాణప్రశంసాగీతాస్తుతి

రచయిత : ముదిగొండ రామలింగశాస్త్రిగారు — తాడికొండ

ఆస్తిపాస్తులు గలిగియు నధికముగను నింద్లువాకిండ్లుగలిగియు నేమి కర్మ
మాసుపత్రియె నీజీవితాంత మగుట విధికృతము గాద నీ కిది వీరభద్ర!

లీలలెల్లఁ జూపి లీన మైపోవె శివలీల నిన్ను గలసి లీల యగుచు
మేను మరచె నిద్ర మేల్కొనఁబో వింక విమలగుణసముద్ర వీరభద్ర!

చిన్నతనమున విద్యల నెన్నొ నేర్చి స్కాందమంతయుఁ దెనుఁగున సంతరించి
శివప్రతిష్ఠాదు లెన్నియో చేసి చేసి కీరితిని గాంచి తొక్కార వీరభద్ర!

క్షితి చరిత్రాత్మకముగను శివునిలీల లెన్నియో చూపి భక్తుల కెన్నిభాన
మనఁగ తెలిసితి వేనేమ కని యెఱుంగ వినని లీలను జూపితో వీరభద్ర!

కపటభూసురవృత్తివి గావు నిజము దేవుఁ డెఱుఁగును కపటులభావమెపుడు
నాత్మసాక్షియె శివకోటియజ్ఞఫలము చేరదే నిన్ను ముదిగొండ వీరభద్ర!

కార్యభారంబు భక్తులకడనె యుంచి కల్పసిద్ధుఁడ వైతివి గాన నేఁడు
బొందితోడనె కైలాసమందు నీవు చేరుకొన్నావు గాన శ్రీవీరభద్ర

గౌరివాధ్యక్షుఁ డాదిగాఁ గార్యదర్శివరకుఁగల సాహుకార్లు నీవారు గాన
కార్యభారంబు వారిపైఁ గలదు నిజము విన్నవించితి ముదిగొండ వీరభద్ర!

రవ్వ వారిదె గాక నీ కివ్వసుంధరన్ బ్రతిష్ఠాప్రతిష్ఠలు రావు ప్రకృతిఁ
బాసినాఁడవు కైలాసవాసి వైతి వినుతశతకాద్రి ముదిగొండ వీరభద్ర!

చిత్తసంకల్పమాత్రాన సిద్ధి గంటి వౌర! శివకోటియజ్ఞకార్యంబునందు
కార్యవిఘ్నంబునందునఁ గలఫలంబు విఘ్ననాయకుఁడే పొందు వీరభద్ర!

ఆత్మశాంతిని బడయుదువుగాక! భార్యాపుత్రమిత్రాదులకు నా
హృదయపూర్వక సానుభూతి. ఓం స్వస్తి

## శివలీలామహోదధి!

( ఈశీర్షికయందు శివలీలలకు సంబంధించిన గాథలును, భక్తుల గాథలును వీలునుబట్టి నాలుగు పేజీలుగాని, ఎనిమిది పేజీలుగాని ప్రచురింపబడును. )

# బ్రహ్మశిరశ్ఛేదము

ఋషులు సకలపురాణకర్తయగు వ్యాసుం గాంచి ' ఓ మహానుభావా! సకలలోకానుగ్రాహకుడగు పరమేశ్వరుడు బ్రహ్మశిరశ్ఛేదము గావించుటకు గల కారణం బేమని ప్రశ్నింప వ్యాసుం డిట్టుల చెప్పదొడంగెను —

దివ్యతేజోవిరాజితులగు ఓ మహర్షులారా! సర్వపాపప్రణాశనశీలమగు మహాదేవుని మాహాత్మ్యము వినిపింతు వినుండు.

పూర్వకాలమున మేరుశిఖరమున గొలువున్న బ్రహ్మం గాంచి మహర్షులు భక్తివినమిత గాత్రులై నమస్కరించి సమస్తజగత్తులకు నాదికారణమెయ్యది యని ప్రశ్నించిరి. అంత మిథ్యాగర్వాభిభూతుడగు నా పరమేష్ఠి మహర్షులం గాంచి స్వయంభువుడను నేనె సకలజగత్కర్తను. అనాదియు, పరతత్త్వస్వరూపుడనగు నన్ను సేవించియే ప్రాణులు తరింతురు. నేనే సర్వదేవతలకు ప్రవర్తకుడను, నివర్తకుడను. పదునాలుగు లోకములయందు నాకన్న నధికుడు లేడు.' అని వచించెను.

అంత నారాయణాంశసంభవుడగు యజ్ఞపురుషుడు బ్రహ్మను జూచి నవ్వుచు నిట్లనియెను. ' ఇది యేమి పితామహా! ఇంత యజ్ఞానమా! ఇది నీకు తగదు. నారాయణరూపినగు నేనుగదా సకలలోకములను సృష్టించినవాడను. సర్వజగజ్జీవనహేతువగు నాకన్నను పరుం డెవడు గలడు? నేనే పరంజ్యోతిస్స్వరూపుడను. నావలన సృష్టింపబడిగదా నీవు లోకముల సృజించుచున్నావు.'

ఈవిధముగ వారు వాదోపవాదములు గావించుచుండ నాలుగు వేదములు నచటి కేతెంచి వారి వివాదకారణము నెరింగి పరమేశ్వరుని మాహాత్మ్యము నీవిధముగ వచింప నారంభించెను. అందు ఋగ్వేదము

ఇటుల వచించెను. 'మహాప్రళయకాలమున చరాచరము లెవనియందు లీనమగుచున్నవో మరల నెవనిచే సృజింపబడుచున్నవో యట్టి పరమేశ్వరుడే పరతత్త్వస్వరూపుడు. అంత యజుర్వేదము 'యాగకర్తలచే నారాధింపబడువాడును, యోగులచేత దహరాకాశమున ధ్యానింపబడువాడును నగు పరమేశ్వరుడే సకలజగచ్ఛాసనకర్త.' యని వచించెను. పిదప సామవేదము 'సకలజగన్నాటకసూత్రధారియు, సర్వభూతాంతర్యామియు. యోగిధ్యేయుడు నగు శంకరుడే పరతత్త్వ' మని వచించెను అనంతర మథర్వవేదము 'జితేంద్రియులగు యతులు దహరాంతస్స్థయగు నెవని సాక్షాత్కరింపజేసికొన యత్నింతురో అట్టి రుద్రుడే పరమకారణుడు.' అని వచించెను.

వేదములచే నీవిధముగ తత్త్వనిర్ణయము గావింపబడినను సరకుగొనక యజ్ఞానాభిభూతుడగు విధాత నవ్వి 'సామాన్యమానవునివలె భార్యాపుత్రపరివారముతో సంసారమునందు మునిగితేలుచున్న యతడా పరతత్త్వము!' అనివచించెను.

అంత నమూర్తమగు ప్రణవము మూర్తిమంతమై ధాతను గాంచి యిటుల వచించెను. 'పరమేశ్వరుడు తనకన్న భిన్నయగు పత్నితో రమించువాడు కాడు. భగవానుడగు పరమేశ్వరుడు సనాతనుడు. స్వయంజ్యోతిస్స్వరూపుడు. ఆనందస్వరూపిణియు, సకలజగద్రూపిణియు నగు నాదేవి యాగంతుక కాదు.'

ఈవిధముగ ప్రతిబోధింపబడినను వ్యామోహితుడగు చతురాననునియొక్కయు, యజ్ఞపురుషునియొక్కయు నజ్ఞానము తొలగకుండెను. అత్తరి నాకాశమధ్యమున నదృష్టపూర్వమగు జ్యోతిర్మండల మొక్కటి గానవచ్చెను. దానిం గాంచి పంచవదనుడగు బ్రహ్మయొక్క యూర్ధ్వవదనము కోపభరిత మయ్యెను. అంత నాజ్యోతిర్మండలమునుండి నాగయజ్ఞోపవీతియు, త్రిశూలధారియు, నీలలోహితుడునగు శంకరుఁడు సపరివారుడై సాక్షాత్కరింప బ్రహ్మ శంకరుం గాంచి 'యోహో నీవా! నాలలాటమునుండి యుద్భవించినవాడవు గాదా?' యనిపరిహసించెను.

అంత శంకరుడు కాలభైరవుం గాంచి ' యీతడు తనయంతరము నితరుల యంతరమును గానకున్నాడు. మిథ్యాగర్వాభిభూతుడగు నీతని గర్వ మడంచు ' మని యానతీయ భైరవు డవలీలగ బ్రహ్మయొక్క పంచమవదనమును చిదిమివైచెను.

శిరశ్ఛేద మైనంత బ్రహ్మ సంజ్ఞాహీనుడై మొదలు నరికిన తరువువలె నేలం గూలి లేవకున్న పరమేశ్వరు డాతని ననుగ్రహదృష్టితో వీక్షింప నాతడు లబ్ధసంజ్ఞుడై లేచి వామార్ధజానియు, నాగాభరణభూషితుడును, శార్దూలచర్మధారియు, త్రిశూలపాణియు, భూతిభూషితసర్వాంగుడును నగు పరమేశ్వరుం గాంచి యిట్లు ప్రార్థించెను —

' ఎంతటి యదృష్టవంతుడను! ధ్యాననిష్ఠులగు మహాయోగులు దహరాకాశమున నేపరంజ్యోతిఃస్వరూపుని బాహ్యవిస్మరణపూర్వముగ నుపాసింతురో యాశంకరుని కనులార గాంచు భాగ్య మబ్బినది. ఒక్కసారి నమస్కరించినంతమాత్రమున నజ్ఞానాంధకారమును పటాపంచలు చేయు రుద్రుడు సాక్షాత్కరించినాడు. లింగరూపియగు నే దేవుని బ్రహ్మవాదులగు మహాత్ములు నియమపూర్వకముగ నర్చింతురో యాశివుడు నాయం దనుగ్రహించినాడు. పుష్పముగాని, పత్రముగాని, ఫలముగాని, కడకు జలముగాని భక్తిశ్రద్ధలతో నర్పింప గొని సంసారపంకమునుండి సముద్ధరించు కరుణామూర్తి పరమపావనుడు నగు శంకరుడు సాక్షాత్కరించినాడు.

దేవాధిదేవుడవగు నీకును, మహాదేవివగు నీకును నమస్కారము సర్వలోకశంకరుడవగు నీకును, సర్వమంగళవగు నీకును నమస్కారము. సకలజగత్సృష్టికర్తవగు నీకును, మూలప్రకృతివగు నీకును నమస్కారము సంసారనాశకుడవగు నీకును, సంసారోత్పత్తి హేతుభూతవగు నీకును నమస్కారము. యోగేశ్వరేశ్వరుడవగు నీకును, యోగరూపిణివగు నీకును నమస్కారము. పరబ్రహ్మస్వరూపుడవగు నీకును, విద్యారూపిణి వగు నీకును నమస్కారము. '

అని యీవిధముగ తన్మయుడై పార్వతీపరమేశ్వరుల స్తుతించి

శతరుద్రీయమును బఠించుచు సాష్టాంగదండనమస్కారము గావించెను.

అంత బ్రణతార్తిహరుడగు పరమేశ్వరుడు బ్రహ్మను లేవనెత్తి 'వత్సా! సంతసించితిని. లెమ్ము.' అని వచించి భైరవుని గాంచి 'పురాణపురుషుడగు నీసృష్టికర్త యవధ్యుడు. మన్నియోగమువలననే సృష్టివ్యాపారమునందు బ్రవృత్తుడైనాడు. కావున నీకును రక్షణీయుడు కాని, గర్వోన్మత్తుడగు నీయజ్ఞపురుషుడు శాసింపదగినవాడు. దేవతలందరును గర్వితులై యున్నారు. వారిగర్వ మడంచుచు బ్రహ్మహత్యాప్రయుక్తమైన భిక్షాటన మను నెపమున సందరినుండియు భిక్ష గొనుచు లోకమున బ్రహ్మహత్య తొలగించుకొనుటకై చేయవలసిన వ్రతమును ఆచరించి చూపుము.' అని వచించి యంతర్ధాన మందెను.

భైరవుడును బ్రహ్మకపాలధారియై భిక్షాటనవ్యాజమున లోకసంచార మొనర్ప బయలువెడలి ప్రథమమున వైకుంఠమున కేగి ద్వారపాలకుడగు విష్వక్సేనుం గాంచి 'ఓయీ! లక్ష్మీనారాయణు లెచట నున్నారు? భిక్షార్థినై వచ్చితి' నని వచించెను. భైరవమహాత్మ్యము నెఱుంగక విష్వక్సేనుడు లోని కేగకుండ వారించెను. భైరవు డాతని త్రిశూలమున గ్రుచ్చి మడియించి అంతఃపురములోని కేగెను. ధ్యానసమాహితుడై సింహాసనాసీనుడైయున్న నారాయణుడు మత్తుడై లేవకున్నం గాంచి కుపితుడై త్రిశూలమున నాతని శిరమును గ్రుచ్చెను. గ్రుచ్చుటయు శివజటాజూటమునుండి వెడలు గంగాధారవలె నారాయణశిరమునుండి రక్తధార ప్రవహింప నారంభించెను. అంత భైరవు డాధారచే కపాలమును నింప నారంభించెను. కాని యెంతకాలమైనను కపాలము నిండు నటుల గన్పడలేదు.

రక్తప్రవాహముతోబాటు గర్వ ముపశమింప నారాయణుడు భైరవుం గాంచి యిట్లనెను.

'స్వామీ! ఈకపాలధారణ మేమి? పరమేశ్వరలీల లవాఙ్మానసగోచరములు. మత్తుడనై మిమ్ము గాంచి లేవని నాయజ్ఞానమునకు క్షమించుడు. రక్తస్రావముతోబాటు గర్వమును విచ్ఛిన్నమైనది. ఇ దేమి?

ఈ బ్రహ్మహత్య మిమ్ము వెంటాడుచున్నదేమి? ఇటనుండి యెచటి కేగెదరు?' అని యడుగ భైరవుడు నారాయణుని గాంచి 'యోగా! మత్తుడగు బ్రహ్మ మహర్షులు గావించిన ప్రశ్నకు సమాధానముగ తానే పరతత్త్వస్వరూపుడ నని వచించినాడు. అది విని త్ర్యంశసంభవుడగు యజ్ఞపురుషుడును తానే పరబ్రహ్మస్వరూపుడ నని వివదించినాడు. అంత పార్వతీసహితుడగు పరమేశ్వరుడు సపరివారుడై సాక్షాత్కరించి బ్రహ్మ యొక్క పంచమవదనచ్ఛేదము గావింప న న్నాజ్ఞాపించినాడు. నేను నటులే గావించితిని. మూర్ఛితుడగు బ్రహ్మయు పరమేశ్వరానుగ్రహ మున లబ్ధసంజ్ఞుడై లేచి పరమేశ్వరుని స్తోత్రము చేయ పరమేశ్వరు డాతని క్షమించి బ్రహ్మహత్యాపనోదనార్థము భిక్షాటనవ్రతము నాచ రింపవలసినా దను విషయమును లోకమున కాచరించి చూపు మని యాజ్ఞాపించి యంతర్హితుడైనాడు. కావున భిక్షార్థినై వచ్చితిని. కపాల మెంతవఱకును నిండకున్నది.' అని వచించెను.

అంత నారాయణుడు ''స్వామీ! బ్రహ్మ మరణించలేదుగదా? అట్టిచో బ్రహ్మహత్య యనుట యెట్లని ప్రశ్నించెను.

'మరణించలేదు వాస్తవమే. బ్రాహ్మణబాధాకరమైన యేకార్యమైనను బ్రహ్మహత్యాతుల్యమే. కావుననే యీ వ్రతము నాచరింపుమని పరమేశ్వరాజ్ఞ' అని భైరవుడు సమాధాన మొసంగెను.

అంత నారాయణుడు 'మహానుభావా! భక్తానుగ్రహార్థమై పరమేశ్వరుడు వారణాసియందు నిత్యసన్నిహితుడై యున్నాడు. బ్రహ్మహత్య యందు ప్రవేశింపజాలదు. కాన నట కేగు' డని ప్రార్థించెను.

భైరవుడును నారాయణుని వెంటగొని సర్వదేవగర్వసంహారము గావించుచు వారణాసిని సమీపించెను. బ్రహ్మహత్య వారణాసిని ప్రవేశింపజాలక హాహాకారము గావించుచు పాతాళమున ప్రవేశించెను. అంత భైరవుడు బ్రహ్మకపాలము నట పారవైచి వారణాసి కేగుచు విష్ణువుతో "నా యీ కపాలవేషమును స్మరించుచు ఈకపాలమోచనతీర్థమున ప్రవేశించి స్నానమాడి దేవర్షిపితృతర్పణము గావించినవారు తప్పక

బ్రహ్మహత్యాపాపమునుండి విడివడుదువు'' అని వచించుచు విష్ణువు నాలింగనము గావించి వీడ్కొల్పి వారణాసిని బ్రవేశించెను. విష్ణువును భైరవునిచే ననుజ్ఞాతుడై వైకుంఠమున కేగెను.

—(కూర్మపురాణమునుండి)

---

# నృసింహావతార భంగము

దక్షప్రజాపతి కుమార్తెయగు దితి చిరకాలంబు సంతానము లేకపోవుటవలన జింతనొంది భర్తయగు కశ్యపుం గాంచి 'నాథా! నీ యనుగ్రహంబువలన నా సపత్నులందరును సంతానవతులై యున్నారు. సంతానహీననగు నాకు వారలకడ కేగుటకే సిగ్గగుచున్నది. భార్యకు భర్తకన్న వేరు దిక్కు గలదా? వినయవతియు, బతిదేవతయు, ననురక్తయునైన సతివలన గలుగు సంతానంబువలనగదా వంశము కీర్తి గాంచును. కావున నా మనోరథం బీడేర్పు' మని ప్రార్థించెను. అంత కశ్యపుండును భార్యం గాంచి 'సంతానార్థినివై నాకడ కరుదెంచిన నీ కోర్కె దీర్చుట భావ్యమే. కాని యిప్పుడు సంధ్యాసమయమగుట నిషిద్ధము. ఒక్క త్రుటికాల మోపికపట్టుము. నిషిద్ధకాలమున నిన్ను గవయుట రాక్షసకృత్య మగును.' అని యెంత చెప్పినను వినక దితి పురదృష్టంబు ప్రేరేప బలాత్కారంబున నాలింగనంబు గావించుటయు గశ్యపుండును మోహంబు దాటనేరక కాంత నేకాంతంబున జేర్చి యభీష్టంబు దీర్చి పశ్చాత్తప్తుండై యిట్లనియె. 'నా యుపదేశంబు పెడచెవిం బెట్టి నీవు కావించిన యీదుష్కృత్యంబునకు ఫలంబుగ నీకు లోకభీకరులగు సుతు లిరువురు జనించెదరు పొమ్ము' అనిన దితి 'నా దురదృష్టం బిట్టు లుండ నొరుల నే మన్న నేమి ప్రయోజన' మని ధైర్యము వహించి మిన్నకుండెను.

అంత గొంతకాలంబునకు దితి గర్భవతి యయ్యెను. కశ్యపవీర్య సంభరితంబగు దితి గర్భంబునుండి లోకభీకరమగు నొక్క తేజము వెలువడుటంగాంచి దేవత లద్దానిం గాంచి భీతులై వనజాసనుపాలికిం బోయి యిట్లు విన్నవించిరి. 'ఓ మహానుభావా! అతిలోకంబై దుర్నిరీక్ష్యంబైన యిమ్మహాతేజం బెక్కడిది? ఏతత్తాపంబునకు బదునాలుగు లోకంబు లడలుచున్నవి. దీని నుపశమింపజేయుమార్గం బెరిగించి లోకరక్షణంబు గావింపుడు!'

అంత నాహిరణ్యగర్భుండును దీనులగు సురలం గాంచి 'యెరుగుదురుగదా పరమేశ్వర పాదపద్మసేవాధురంధరులగు మత్తనయుల సనకాదులను. వా రొకప్పుడు లోకసంచార మొనర్చుచు రమామనోహరుని శ్రీమన్నారాయణుని గాంచుకోర్కె వైకుంఠంబున కేగిరి. వయోవృద్ధులయ్యును నైదేండ్లబాలురవలె గన్పట్టు వారిం గాంచి ద్వారపాలకులగు జయవిజయులు అట్టివారి నంతిపురి కరుగనిచ్చిన మాటవచ్చునేనియు, నిర్భయంబుగ నేతెంచు నా బాలకులను లోనికి బోనిచ్చుట తమ గౌరవమునకు భంగమనియు నెంచి నారాయణుం గాంచుట కిది యదను గాదని వారించిరి.

వారించుటయు నా మౌనులు కుపితులై 'నారాయణదర్శనార్థులమై వచ్చిన మ మ్మిమ్మావిధంబుగ వారించిన యీ రాక్షసకృత్యంబునకు ఫలంబుగ భూలోకంబున రాక్షసులరై జన్మింపు' డని శపించిరి. జయవిజయులును భీతులై గడగడ వడంకుచు 'మహానుభావులగు మిమ్ము వారించిన మా యవినీతికి ఫలం బనుభవింపక తప్పునా? కాని పరోపకారపారీణులగు మీరు మా నేరంబులు సైరింపు' డని విన్నవించు నంతలో నారాయణుం డచటి కేతెంచి సనకాదులం గాంచి యిట్లనియె. 'ఒడలుమరచి వీరు గావించిన నేరమునకు దగిన శిక్ష నొసంగితిరి. మీ శాపము ననుసరించి వీరు పుడమియందు జన్మింతురు నాయందలి భక్తిచేగాని, లేక విరోధంబుచేగాని మూడుజన్మంబులకు మీద మరల మత్సమీపంబు జేరునట్లు శాపావధి నొసంగుడు.'

సనకాదులును 'యుష్మద్దర్శనలాలసులమై వచ్చిన మాకంతరాయంబు ఘటించిరను కారణంబున శపించితిమి. ఐనను నీ యిష్టప్రకారము వీరు వైరంబుచే మూడవ జన్మాంతమున నీ యంతికంబునకే చేరుదురుగాక' యని వచించి విధివిధానంబు మనసవగాహంబని తలంచి యబ్బురపడుచు నెందేని చనిరి.

ఆ విధముగ సనకాదులచే శపింపబడిన జయవిజయులు ప్రథమ జన్మంబునకై దితి గర్భంబున ప్రవేశించిరి. దితియు నూరు సంవత్సరములు గర్భము దాల్చి యిద్దరు బాలుర గనెను. కశ్యపుడును వారిరువురకు హిరణ్యకశ్యప, హిరణ్యాక్షులని నామకరణం బొనర్చి యతి గారాబంబున పెంచుచుండెను.

అంతట హిరణ్యకశ్యపుడు బ్రహ్మ నారాధించి వరంబులం బడసి మహాపరాక్రమోపేతుడై ఇంద్రాదిబృందారకుల జయించి పదునాలుగు భువనంబులందు దన్నెదిరించువారు లేమి నిర్భయుడై రాజ్యపాలనంబు గావించుచుండెను. రెండవవాడగు హిరణ్యాక్షుండును నన్నకు బాసటయై యుండి యెదురించువారు లేమిం జేసి తన పరాక్రమము వ్యర్థమగుటకు జింతించి యొక్కనాడు నారాయణుడు తమ కోడి వసుంధరోద్ధరణవ్యాజమున పాతాళమున డాగియున్నాడని తలంచి దాడిసేయుటయు వరాహరూపుడగు నారాయణు డాతని వధియించెను.

సోదరమరణంబునకు వగచి హిరణ్యకశ్యపుడు నారాయణునిపై పగగొని మందరాచలంబున కేగి నిరాహారుడై బ్రహ్మనుగూర్చి యనేక దివ్యవర్షంబులు తపము గావించుచుండెను. అతిలోకంబగు నాతని తపోగ్నికి లోకంబులు బెగ్గడిలుటం గాంచి దేవతలు బ్రహ్మకడ కేగి 'మహానుభావా! హిరణ్యకశ్యపుడు ఘోరంబగు తపం బొనర్చుచున్నవాడు. తత్తపోగ్నికి లోకంబులు తల్లడిల్లుచున్నవి. లోకావనతత్పరులగు మీరిటు లూరకున్న నేది గతి?' యని ప్రార్థింప బ్రహ్మ వారలం గాంచి 'ఔనౌను. లోకాపకార మొనర్ప నన్నుగూర్చి తపంబు గావించు నాతనికి వర మిచ్చుట చేజేతుల నాపద గొనితెచ్చుటయే.' అని యూరకుం

మటయు పాడి గాదని చింతించుచు కాలయాపన గావించితిరి. విధివిధాన మలంఘ్యముగదా! మీరు రదుగుడు.' అని వారలం బంచి హిరణ్యకశ్యపు సన్నిధి కరిగి యిట్లనియె. 'ఓయీ! నీతపంబున కేను సంతసించితిని. నీ వాంఛిత మెయ్యదియో వచింపుము.'

అంత నారక్కసుడు పితామహుం గాంచి 'స్వామీ! పంచభూత ములవలనను, అహోరాత్రములవలనను, నాగాద్యుత్తమజంతుప్రాది సమస్త ప్రాణికోటివలనను, నిఖిలశస్త్రాస్త్రములవలనను మరణము లేకుండు నట్లు వరం బొసంగుము' మని ప్రార్థింప ధాతయు నట్ల యనుగ్రహించి యంతర్హితుం డయ్యె.

బలగర్వితుండగు హిరణ్యకశ్యపుడు నింద్రాదిసకలదేవతలను దిక్పా లకులను జయించి స్వర్గమర్త్యపాతాళంబుల దన్నెదిరించువారు లేకుండ జేసి నిరాటంకంబుగా మూడులోకంబులను లోగొని పాలించుచుండెను.

అంత గొంతకాలమునకు హిరణ్యకశ్యపున కొక కుమారుడు జనించెను. శిశువునకు ప్రహ్లాదు డని నామకరణము గావించి తలిదండ్రు లల్లారుముద్దుగా పెంచుచుండిరి. ఐదేండ్లవాడైనను ప్రహ్లాదు డెవరితోడను మాటలాడ కుండుటయు, ఏమియు గోరకుండుటయు చివరకు తోడి బాల కులతో మాటలాడకుండుటయు గాంచి తండ్రి చింతాక్రాంతుడై యిట్లని తలపోయసాగెను.

'రత్న మమూల్యమైనను సానబట్టక రాణించనట్లు బాలు డెంత గుణాఢ్యుడైనను గురుసన్నిధిని విద్యాభ్యాసము సేయక రాణింపజాలడు. తగిన గురువులయొద్ద విద్యాభ్యాసంబు సేయింపమి తలిదండ్రుల దోషంబు'

ఈవిధంబుగ తలపోసి కులగురువులగు చండామర్కులను రావించి బాలుని వారల కప్పగించి తగిన పారితోషికంబుల నొసంగి పంపెను. ప్రహ్లాదుండును గురువులయొద్ద విద్యాభ్యాసంబు సేయుచున్నను పూర్వ జన్మసంస్కారవశంబున నబ్బిన విష్ణుభక్తి చేతనైన గురువుల కెదురాడక వారు చెప్పినట్లు చదువుచుండెను.

ఇట్లు కొంతకాలము గడచెను. అంత నొకనాడు హిరణ్యకశ్యపుడు

కుమారుని విద్యాభ్యాసం బెటు లున్నదో యెరుంగగోరి కుమారు రావించి లాలించి యంకతలంబున గూర్చుండబెట్టుకొని 'నాయనా! సురాసురవంద్యుడగు కుమారునివలనగదా కులము వన్నె కెక్కును? కానినాడు తన యందు పుట్టిన నేమి? గిట్టిన నేమి? అట్లగుటంజేసి యహోరాత్రములు నీయందె ప్రాణంబులు నిలిపి నీవే లోకంబని భావించియున్న నాకు హితంబు గూర్చుట నీకు పరమ ధర్మం' బని వచించెను.

అంత ప్రహ్లాదుండు వినయవినమితగాత్రుండై తండ్రి కిట్లనియె. 'సర్వవిద్యాపారంగతులగు భార్గవు లనుగ్రహపూర్వకంబుగ జదివించిరి. నేనును దత్సన్నిధి సర్వశాస్త్రంబులు పఠించితిని. సర్వవిద్యలకును బర్యవసానభూమియగు పరమేశ్వరు డొక్కరుడే యుపాస్యుడు. అతనివలననే యీచరాచరప్రపంచంబు సృజింపబడుచున్నది. అంత్యకాలమున నాతని యందే లీనమగుచున్నది. యోగిహృద్ధ్యానగమ్యుడగు నారాయణుని జేరు మార్గము నరయుటయే చదువులకు ఫలము.'

అని వచించుటయు హిరణ్యకశ్యపు డుగ్రుడై కుమారు నంకతలము నుండి యీవలకు ద్రోచి 'ఓరీ! ఇదియా నీచదువునకు ఫలము? విరోధి గుణముల నుగ్గడించుచుంటివా? చిరుతవగుట నేమి చేయుటకును చేయూడకున్నది. ఇకముం దీవిధంబుగ బల్కి మన్నిగ్రహంబునకు బాల్పడకుము. పొమ్ము.' అని ప్రళయాంబుదగర్జానుకారియై పల్కెను.

అంత ప్రహ్లాదుడు తండ్రిం గాంచి యిట్లనియెను. 'జనకా! వయోవృద్ధుడవును, అనితరసామాన్యవిక్రమాఢ్యుడవునునగు నీ విట్టుల బల్కపాడియా? నావంటి పామరులకు మార్గ మెరింగింపవలసిన నీవే యావిధి హరినింద గావించిన నే మనగలను? ఎండమావులవంటి యీయైశ్వర్యము సతమా? సకలజగన్నియంతయగు నాహరిపాదపద్మసేవ గావించుటకన్న తరించుటకు వేరు మార్గము గలదా?'

ఈవిధముగ వచించు కుమారుని పలుకులకు దండతాడితభుజంగంబుమాడ్కి కుపితుడై యిట్లు వచించెను. 'ఏమీ! తండ్రిమాట వినక ధర్మము విడనాడి పగతుడగు వెన్నుని బొగడుచుంటివా? చాలు నీయాగడము గట్టిపెట్టుము. అంతకునంతటివాడును నాయెదుర నోరు మెదల్పం

జాలడే! స్వర్గాధిపునంతటివాడు ద్వారప్రదేశమున పడిగాపులు కాయు చున్నాడే! సకలదేవకోటికిరీటమణిరంజితపాదపద్ముడనగు నాయెదుగనా వెన్నుని బొగడుట!' యని గద్దించి పలికి రాక్షసయోధులం గాంచి 'దుర్వాదియగు నీతని శిక్షించి మార్గమునకు దెం' డని నియోగించెను.

వారును బాలుండని దయదలపక రాజపుత్రుండని భీతిలక నాతని నానావిధంబుల బాధింపం దొడంగిరి. ప్రహ్లాదుండును నారాయణనామో చ్చారణంబు గావించుచు దానవయోధులు పెట్టు బాధల కిసుమంతయు వెరువకున్నం గాంచి రోషాతిరేకంబున గద ద్రిప్పుచు హిరణ్యకశ్యపుడు 'తనయుడవని యెంత చెప్పినను వినక యిట్టుల ప్రేలెదవేల? ప్రాణము లందాస గలదేని నావచనము లాలింపుము. లోకముల, లోకాధిపుల నరిగాపులు గొన్న నాప్రమోలగా నీయాగడము? విష్ణువు సర్వాంతర్యామి యనిగదా వచించుచుంటివి? ఈకంబమున నీహరి యున్నాని జూపగలవా' యని వచించి యటనున్న యొక యుక్కు కంబమును గొట్టిన ప్రళయా ర్కకోటిప్రభాపటలముగోలె తనుకాంతి దిక్కుల వెలుంగజేయుచు పర్వత కందరంబువంటి వదనగహ్వరముతో, అంకుశములవంటి నఖములతో నిడుద లగు దంతములతో నృహరి యావిర్భవించెను.

అంత హిరణ్యకశ్యపుం డావిధముగ నావిర్భవించిన నరహరిం గాంచి 'యహంకారాంధుండగు నీదురాత్ముడు పిలుచుటయు నీవు వచ్చు టయునా? ఈసంకరరూప మేమి? ప్రాణభీతిచే నిటులే యేవంకరవేసమో ధరించి యిన్నినాళ్ళనుండి తప్పించుకొనుచుంటివి. ఇపు డెం దేగగలవు? ఇంక నీయాగడములు సాగ' వని గద్దించుచు గద నరహరివక్షస్థలంబు దాకునట్లు వైచిన నాత డుగ్రుండై యద్దానిం బట్టి విరిచి భుజంగవల్లభు నొడిసి పట్టుకొను గరుత్మంతునిపోలె హిరణ్యకశ్యపుం బట్టి యుత్సంగం బున బడవైచి తీక్ష్ణంబులగు నఖరంబుల నాతని వక్షఃకవాటపాటనంబు గావించి చిమ్మనగ్రోవిచే జిమ్మబడినట్లు వెల్వడు కదుష్ణంబగు రుధిరంబుం ద్రావి మత్తిలి బొమలు ముడివెట్టుచు, దంతంబులు పటపటలాడించుచు ప్రళయకాలజలధరంబుభంగి భయంకరముగ హుంకరించుచున్న నృహారిం గాంచి కమలాసనాదులు వడంకుచు 'సకలజగదాధారుండవును, స్థితి

కర్తృవగు నీకన్న మాకు దిక్కెవరు? నీయీభయంకరమగు రూపంబు నుపసంహరించి లోకంబుల గావు ' మని ప్రార్థింపం దొడంగిరి.

కాని రక్తపానమత్తుడగు నాతడు శాంతిలక లోకోపద్రవం బొనరింప నమకట్టుటయు దేవతలు భీతులై దేయునదిచేక ' కంచెచేనే మేసినటు లైనది. లోకరక్షణనియుక్తుడగు నారాయణుడే లోకోపద్రవంబు గావింప నింక దిక్కెవ్వరు? భక్తాపన్నివారకుడగు నాశంకరుడ యీయుపద్రవమునుండి లోకముల రక్షింపవలయు ' నని యెంచి కైలాసమున కరిగి పరమేశ్వరుసన్నిధి కేగి సాష్టాంగదండప్రణామంబు లాచరించి యిట్లని విన్నవించిరి.

' విశ్వైకరూపుండవును, విశ్వాతీతుండవును, సృష్టిస్థితిలయతిరోధానానుగ్రహరూప పంచకృత్యపరాయణుండవునునగు నీకివే జోహారులు. లోకముల కాపద గల్గినపుడెల్ల నానాలీలలు ధరించి యాయాపదలం గడవంద్రోచి రక్షించు నీకివే నమస్కారములు.

హిరణ్యకశ్యపు డుద్ధతుడై లోకముల గలంచుచుండ నారాయణు బ్రార్థింప నాతడు నరసింహాకృతిం దాల్చి రాక్షసు వధించియు నాయవతారము నుపసంహరింపక లోకముల నేచుచున్నాడు. రాక్షసబాధ లంతరించెనని సంతసించునంతలో నృసింహబాధ యొకటి యాసన్నమైనది. తల్లి కూర్మి లేక తనయుల బాధింపం దలంచునేని దండ్రిగాక పరు లెవ్వ రాబాధ దీర్పగలరు? నృసింహబాధ దప్పింప నీవకదా మాకు శరణ్యుడవు. పాయని యిడుములంబడి కుందుచున్న మాకు నీవే దిక్కు. ఇట్టితరి కన్న బిడ్డలమగు మాయం దుపేక్ష వహింపక కాచు భారము నీయది '

ఈవిధముగ దీనులై ప్రార్థించు గీర్వాణగణంబుం గాంచి దయాసముద్రుడగు శంకరుడు వారలం గాంచి ' మంచిది. నే నిదె నృసింహబాధ దప్పించుటకై వలయు యత్నంబు గావించెద. మీ రేగు ' డని వారలం బంచి నారసింహాకృతికై శరభప్రభుని స్మరియించెను.

స్మరియించుటయు కల్పాంతజ్వలనజ్వాలావిలసన్నేత్రత్రయుండును బాలేందుమండితశిరోభాగుండును ప్రచండహుంకారబధిరితదిఙ్ముఖుండును

బాలేందుమండితశిరోభాగుండును నగు వీరభద్రు డరుదెంచి పార్వతీపరమేశ్వరులకు మ్రొక్కి యి ట్లనియెను.

‘ స్వామీ! ఏమి కారణమున నన్ను స్మరించితిరి? లోకముల కేదైన నాపద జనియించెనా? ఆజ్ఞాపింపుడు. మీయాజ్ఞ శిరసావహించి లోకముల యాపద లడంచి యిదె మీపాదసేవనము గావించెద. ’

అని పలుక వీరుం గాంచి శంకరుండు ‘ ఓయీ! రక్షోరక్తపానమత్తుడగు నృసింహుడు లోకముల గలచుచున్నా డని దేవతలు మొర వెట్టుచున్నారు. ఆతనిబాధనుండి లోకములను రక్షింపవలసిన అవసరము కలిగినది. కావున వినుము. సామము సకలార్థసాధకము. శత్రుజయకారణంబగు నుపాయచతుష్టయమున సామము కార్యసాధకము కావున దొలుత సామవాక్యములచే నతని నృసింహు నుపశమింపజేయుము. వినకయుండెనేని నాతని నిస్తేజుం గావించి రమ్ము. పొ ’ మ్మని యాజ్ఞాపించి పంపెను.

అంత వీరభద్రుడు నరసింహుని సమీపించి సామంబున నాతని శమింపజేయం దలంచి యాతనితో ని ట్లనియెను.

‘ లోకములకు కష్టము సంభవించినప్పుడెల్ల నాయాయవతారంబులు దాల్చి లోకోపకార మొనర్పవలసిన నీ విట్టుల లోకాపకార మొనర్చుట భావ్యము గాదు. బ్రహ్మవరమున గర్వితుడై లోకముల గలంచు హిరణ్యకశిపుని సంహరింప నరసింహరూపము ధరించి యాతని వధించితివి. కాని యంతట స్వస్వరూపమును ధరించక యీరీతి భయంకరుడవై లోకోపద్రవము గావించుట జనార్దనుడవగు నీకు దగదు. ఇంతటనైన భయంకరమగు నీమూర్తి నుపసంహరింపుము. ఇయ్యది పరమేశ్వరాజ్ఞ. దీన లోకములకును, నీకును లగ్గగు. కాదేని పరమేశ్వరాజ్ఞాధిక్కారమునకు దగిన ఫల మనుభవింపవలయును ’

అని శాంతవచనంబులు పలుక నృహరి పాదతాడితభుజంగంబు పగిది గంపించుచు ‘ ఓరీ! నీ వెవ్వడవు? నోటికి వచ్చినట్లెల్ల ప్రేలుచున్నావు. పొమ్ము. జగన్నాథుండనగు నన్ను శాసించెడువాడు గలడా?

నాయెదురనా నీబింకము? నీవా యిది యని యని నా కుపదేశించు
వాడవు? నిగ్రహంబున లోకముల హతమార్పను అనుగ్రహంబున సుఖా
పజేయను సమర్థుడనగు నాకా నీ వుపదేశించునది? బ్రహ్మ నానాభి
కమలమున జనించినాడు. ఆతని లలాటమునుండికదా రుద్రుడు జన్మిం
చినది? ఈనీయపరాధంబును సైచితి. ఈదోసము వాయుటకు నాపద
సేవ గావించి యెందేని చను ' మని పలుకుచుండు వీరభద్రుండు కోప
విస్ఫురితాధరుండై యిట్లని వచించెను.

' మాధవా! కమలాసనాదిసమస్తదేవతాసమూహశిరంజితపాద
పద్ముడగు నుమాధవు మహిమం బెఱుంగవా? ఏమని యూచితివి? ఈ
రీతి దుర్వాదములు సల్పుట నీకు పాడియా? మహత్త్వద్వేషకారంబుల
నీకావించిన నేరంబులకు ఫలం బనుభవించినది మఱచితివా? ఈ శుకరా
కారంబు దాల్చుటకుగల కారణంబు మఱచి లాపుగలాడ ననుచు లో
కాపకార మొనర్చుటయా? ప్రకృతిరూపుడవగు నీయందు పురుషాత్ముడగు
శశాంకశేఖరుడు తనవీర్యంబు నునుప నీనాభికమలంబునుండి కమలాసను
డుద్భవించినాడు. పంచాస్యుడగు నాబ్రహ్మ భూతసృష్టి చేతగామి
ఫాలంబున ధ్యానింప పరమేశ్వరు డాతని ఫాలభాగంబునుండి యావిర్భ
వించె. ఇంతమాత్రము నెఱుంగక యిట్లు ప్రల్లదములు పలికిన బుద్ధులు
నగునా? పరమేశ్వరు నాజ్ఞ నయుంబున బోధించి స్వస్థుని గావించుటకును
కాకున్న సంహరించియైన లోకోపద్రవంబు వారించుటకును నేతెంచి
నాడ. కరణ, అకరణ, అన్యథాకరణరూప సామర్థ్యత్రయవిశిష్టుడగు పర
మేశ్వరు నాజ్ఞ మీఱరానిది.

' కూర్మావతారమున నతిక్రాంతమర్యాదుడవగు నిన్ను సంహ
రించి నీకపాలమును హరుడు తనహారమందు ధరించిన దెఱుంగవా?
అటులే వరాహావతారమున నీదంష్ట్రను ధరించి దంష్ట్రి యను నామము'
ధరించిన యుదంతము మఱచితివా? కాన నిప్పటికైనను శాంతింపుము,

అని యీవిధంబుగ వచించు వీరభద్రుని సామవాక్యంబులకు
కట్టలుక రెట్టింప ప్రళయకాలజలధరంబువగిది భూనభోంతరంబులు బ్రద్ద

లంగూలముల గర్జించుచు నృసింహు డట్టె లంఘించి వీరభద్రునిపై బడు
టయు నాతఁడు రోషభీషణుండై యాకాశంబున కెగసి బాహాసహస్ర
యుతంబును, సమ్యగార్ధశరీరంబును, సపక్షంబును, భీకరచంచూకలితం
తంబును, నతితీక్ష్ణమహాదంష్ట్రింబును, వజ్రసన్నిభనఖాయుధంబును
హుంకారయుతంబును నగు శరభసాళ్వరూపంబున గనుపట్టుటయు నర
హరి పంచాస్యదర్శనంబున భీతిలిన గజేంద్రంబువలెఁ గంపింపఁ దొడంగె.

అంత వీరభద్రుండును పక్షప్రసారమాత్రమున కులాచలంబుల
నయితము కంపింపఁజేయుచు నుద్ధతవేగంబున నెగసి నిజపాదంబుల
నరహరిం బట్టి పుచ్ఛంబున పాదంబులు మెలియుచు బాహులచే బాహు
వులు నొక్కుచు, నురమున మోదుచు నాలోరగంబును వైనతేయుం
డట్లు అంతరిక్షంబునకు గొనిచని క్రింద బడవైచుచు ననేకవిధంబుల
హింసింప నారంభించెను.

అనూహ్యమగు పారమేశ్వర తేజ మట్లు హింసించుటయు నిర్వా
పితదీపశిఖవోలె నరహరి ప్రశాంతతేజస్కుండై పరమేశ్వరు నీవిధముగ
బ్రార్థించెను.

' మహానుభావా! సృష్టిస్థితిలయతిరోధానానుగ్రహపంచ
కృత్యపరాయణుండవగు నీయనుగ్రహము లేక అస్మదాదులు మనలేరు
నీ కింకరు నాజ్ఞాపాలకులు. దాసానుదాసుడవగు నాయీయపరాధమును
సయిరింపుము.

మాయను మాయ చేసి యణుమాత్రమైనను జలింపకుండు నీ
మాయను దరింప మాదృశులకు వశమా? హేయమై యనిత్యమైన ఈ
యైహికసుఖమే యపవర్గం బని భ్రమించి జననమరణపరంపరం బడి
వ్రగ్గు నాశ్రితలోకము నుద్ధరింపుము.

దయామయా! అహంకారదూషితుడ నై నపుడెల్ల యీవిధమున
నాయజ్ఞానమును బోకార్చి జ్ఞానభిక్ష నొసంగుచుండుము. ఏతద్విషయ
స్మారకంబుగ నాకృత్తిని ధరించి కృత్తివాసుడవు గమ్ము. మఱియును నీ
నృసింహశిరస్సును నీమాలయందు నాయకమణిగా ధరింపుము. '

అని ప్రార్థించుటయు నట్ల యగాక యని వీరభద్రుం డంతర్హితుం డయ్యె. దేవతలును బరమేశ్వరు నుద్దేశించి యత్యంతముదంబున 'నెవ్వని భయంబున నగ్నియు సూర్యచంద్రులును బవనుండును మృత్యువును స్వకృత్యంబు నిర్వహింపుచుందురో యట్టి నీకివే మా జోహారులు. ఘోరాఘోరాకృతులు దాల్చి దుష్టనిగ్రహశిష్టానుగ్రహంబులు గావించు నీయనుగ్రహం బుండ మా కేమి కొదువ?' అని ప్రార్థించుచు సంతుష్టులై యథేచ్ఛం జనిరి.

# వరాహావతారభంగము

సనకాదుల శాపమువలన జయవిజయులు భూలోకమున హిరణ్యకశిపు హిరణ్యాక్షు లనుపేర కశ్యపున కదితియందు జనియించిరి. అందు హిరణ్యకశిపుడు చతుర్ముఖప్రసాదాసాదితమహాపరాక్రమోపేతుడై ప్రపంచంబున నొదును దన్నాహవంబున నెదిరించు యోధుడు లేమి నిరంకుశంబుగ రాజ్యము పాలించుచుండెను.

హిరణ్యాక్షుండును సోదరు నాజ్ఞ శిరసావహించి రక్కసిసేనల వెంట నిడుకొని దిగ్విజయంబునకై వెడలి యెదురైన దేవసేనం జీకాకు పరచి దిక్పాలుర నెల్ల నిర్జించి పోర నెదురువాడు లేమిం జేసి యిట్లని చింతింపసాగెను.

'నాభుజముల కండూతి దీర నాహవమున నన్నెదుర్కొనువాడెన్నండైన గాన్పించునా? తగినవానితో యుద్ధ మొనర్చి జయించిన నాడుగదా కీర్తి గలుగుట? కానినాడు నాపరాక్రమ మడవి గాచిన వెన్నెలయేగదా?

దేవతల నిర్జించితిని. మానవలోకవాసులు దాసోహ మనినారు. నాగులో నెవర నిలువనేలేకపోయిరి. బ్రహ్మసృష్టియందుగల సమస్త ప్రాణిజాలమును జయించి యసదృశయశము గడించితిని. ఇక నా కెదు రెవ్వ' రని దురహంకారుడై గదాదండంబు భుజాగ్రంబునం ధరించి యెల్లలోకంబుల దిరుగుచుండెను.

అట్లు దిరుగుచు నొక్కనాడు ఉత్తుంగతరంగసంయుతమును, రత్న సంతానమున కాకరంబును, నర్థిజనావనదక్షమును నగు సముద్రతటము జేరి ' వరుణునకు నివాసస్థాన మగుట నిమ్మహోదధి కొంతవర కానంద సంధాయకము గావచ్చు ' నని యెంచి గద సారించి యంతఃస్థ భూత సమితి గలంగునట్లు మోదుటయు సంద్రము పాయలుగ విచ్చెను.

అంత నాతడు లోన బ్రవేశించి హుటాహుటి నేగుచు నెదురైన సైనికనికాయంబుల గలంచుచు వరుణసమీపమునకు జేరి యి ట్లనియెను ' ఎల్ల లోకముల గెలిచితిని. న న్నెదిరి నిల్చు ధైర్యము గలవా డొక డేని గాన్పించకపోవునే యని గాలించుచుంటిని. కాని నాశ్రమము సార్థకము గాదయ్యె. నాయదృష్టమువలంజేసి యిప్పటికి నీసమాగమము లభించినది. యుద్ధార్థినగు నాకు ముదంబు గూర్పుము. పౌరుషశాలియగు రాజు విక్రమంబు మెఱయ జయాభిలాషియై తిరుగుట భావ్యముగాని పందవోలె నిట్లు వార్ధిమధ్యమున డాగిన పగతురు నవ్వరా? లెమ్ము. యుద్ధసన్నద్ధుడవు గమ్ము. వైరి యాహవమున కాహ్వానింప నూరకుంట యేలాటి పౌరుషము. '

వరుణుండును నాతనిం గాంచి సామవాక్యంబుల నిట్లని పలికెను. శరీరము సత్వశూన్య మైనది. ఇంద్రియపాటవము నశించినది. ముదుసలినై యీవిధి యుదధిమధ్యంబునం బడియున్న నేనా పడుచువాడవగు నీతో యుద్ధ మొనర్చునది? పదునాల్గు లోకముల నెందును నెదురించువాడే లేడని పల్కుచుంటివిగదా? అట్టి నీకు నాపై దండెత్తుటభావ్యమా వృద్ధుండనై కదలమెదలలేకయున్న నావలన నీకోర్కె నెరవేరునా? తృప్తి దీరునట్లు నీతో యుద్ధము చేయుగలవా డొక కేశవుండు గలడు. ఆతని కడ కేగిన నీకోర్కె సఫలం బగును. '

అనుటయు హిరణ్యాక్షుండు దండతాడితభుజంగమువగిది క్రుద్ధుడై గర్జించుచు వరుణునితో ని ట్లనెను. ' ఇస్సీ! పౌరుషము వలదా? కదనకాంక్షినగు నా కిదియా నీసమాధానము? కేశవు డెవడు? ఆతని నివాసమెచట? ఆహవరంగమున న న్నెదిర్చి నిల్చునంతటివాడా? లేక పందవగు

నీవలెనె మఱొక్కరుని నెదుకఁ బొమ్మనెనా? ఆహవోత్సాహము నెల్ల
గోల్పడియున్న నాకు దీటగువాఁడొక డున్నాడని చెప్పితివి. మంచిది.
ఇప్పుడే యేగెదను. '

అంత వరుణుం డాతనిం గాంచి ' యోయీ! దానవాంతకునే
యెఱుంగవా? భవత్పరాక్రమంబు వమ్ము సేయ నాతం డొక్కండె సమ
ర్థుండు. ఆతడు వైకుంఠమున నుండును. పొమ్ము. నీభుజకండూతియును
దీఱు ' నని పల్క హిరణ్యాక్షుండు నటనుండి వెడలి బిరబిర వైకుంఠ
మున కేగుచు దనమనంబున నిట్లని యాలోచింపసాగెను.

' ఎందుకును గొఱగాని కొందరు దేవతలు నీయంతవారు లేరని
పొగడుచుండ విఱ్ఱవీఁగు నాహరిని కదనభూమిం దునిమి రాక్షసపీడ వద
ల్చెదను. చేతగాని యేకొందఱసురులనో జయించినంతమాత్రమున
దైత్యాంతకుడ నని చెప్పుకొనుట కాతనికి సిగ్గేల లేదు? ఆతడు దాన
వారియో, నే నమరారినో యిప్పుడుకదా యెఱుకపడును? '

ఈవిధముగ నాలోచించుచు మహోత్సాహముతో వైకుంఠమున
కేగుచు మార్గమధ్యమున నారదుం గాంచి ' యోమహానుభావా! ఎట
నుండి యరుదెంచుచున్నారు? నారాయణునితో యుద్ధ మొనర్ప నెంచి
వైకుంఠమున కేగుచున్నాను. మాయావి నారాయణుడు వైకుంఠమునం
దున్నాడా? నేను వచ్చుచుంటి నని యెవరైన నాతనికి జెప్పినారా? నా
కొఱ కెదురుచూచుచున్నాడా? నాపరాక్రమము నెఱిఁగి పారిపోయి యెం
దేని డాగినాడా? ' యని యడుగుటయు నారదుం డిట్లనియెను.

' ఓయీ! దనుజోత్తమా! నారాయణుడు వైకుంఠమున లేడు.
అబ్ధిమగ్నయగు భూదేవి నుద్ధరించుతలంపున వరాహరూపంబు దాల్చి
పాతాళమున నున్నాడు. ఆతని మార్కొను తలంపు గలదేని యట
కేగుము. కాని నామాట వినుము. సోమకు డలంతియా? బలి సామా
న్యుడా? అంతవారి గతి యంత యైనది. బ్రతుకునం దాస గలదేని ఆ
ప్రయత్నమునుండి విరమింపుము. కొండను డీకొను తగరుమాడ్కి నిప్పు
పై కురుకు శలభంబువిధంబున దామోదరు నేల మార్కొందువు? సరి

వారి మూర్ఖోక్తులను టొప్పును. ఇందిరారమణుతో బోరుమని యెవరు చెప్పిరి. '

ఈరీతి తన క్షేమము గోరి వచించు నారదుని పలుకులకు గినిసి హిరణ్యాక్షుడి ట్లనియెను. ' హరి వైకుంఠమున నున్నాడా యని యడిగితిని. కాని యాతని నొక పెద్దగా జేసి సన్నుతింపు మంటినా? సరిసరి. కాలము వ్యర్థము సేయక వచ్చిన దారి నేగుము. హిరణ్యాక్షు డనగా గానునకును గొరగానివానివలె గాన్పించుచుండెనా? ఇదె పోయి ముకుందుని, నాతని నాశ్రయించి విజ్జుపీగు దేవతలను మడియించెద. '

అని వచించుచు రసాతలమున కేగి యుద్దండకరాళదంష్ట్రమును, కాలమేఘసదృశపీనోన్నత దేహమును, ఘుర్ఘురారావసంత్రాసితభూతని కాయమును నగు వరాహముం గాంచి కన్నులనుండి నిప్పుకణములు రాల డాయం బోయి యి ట్లనియెను.

' ఇదియా నీబంటుతనము. కదనరంగమున నెదురుగా నిల్చి పోర నేరక పందివై పాతాళమున దాగితివా? మూర్ఖులనువారి సాయమున సముద్రమథనము గావించి యందుండి వెల్వడిన యమృతమున వారిపాలీక మోసగించితివిగదా? ఇట్టినీ వొక పోటుబంటు వని యాదేవముని నారదుడు గీర్తింప విని వచ్చితిని. ఇ దేమి? ఈవిధముగ గిటివై నీళులం బడి ఘుర్ఘురించెద వేల? కిటి వైనంతమాత్రమున వీడి పోదునని యెంచితి వేమొ? అ ట్లెన్నటికిని గాదు. '

అని యీవిధముగ బీరంబులు వలుకు నాదనుజుం గాంచి హరి ' యోరీ! నిశాచరాధమా! అంతటి పోటుబంటవేని శౌర్యంబు మెఱయ కదనరంగమున నిలిచి పోరాడుట తగును గాని యీవట్టి బీరంబు లేల? రాక్షసజన్మ మెత్తితివిపో, ఉచితరీతి మెలగిన తగును. కానినాడు మత్కోపాగ్ని కింధనంబు గాక తప్పునా? అటుల తప్పించుకొనినవారి నేరినైన వింటివా? దుష్టశిక్షణ, శిష్టరక్షణములు నానిత్యకృత్యములు. '

అంత కాంచనాక్షుండు క్రోధాతిరేకంబున హరిం గాంచి ' ఆత్మస్తుతి గావించుకొనుటయేనా నీపౌరుషము! నాపరాక్రమమున కింధనము

గావింపక నిన్ను బోవిడుతునే? ' అని యార్చుచు బాణపరంపర విడుచుటయు హరి యాబాణపాతమును వారించి ' యోరీ దుష్టా! ఇప్పటికైనను తొలగిచనుము. లగ్గగు. కాదేని మరణంబు తప్పదు ' అని వచియించెను.

హిరణ్యాక్షుం డది విని శోక దోర్కిన తాచువలె మండుచు నతిభయంకరంబగు గద ద్రిప్పుచు నొడికంబున దాకుటయు నారాయణు డాతని గదాఘాతంబు వారించి విజృంభించె. ఇట్లు వారిరువురు పరస్పర జయాభిలాషులై మత్తవేదండంబులమాడ్కి గదాభిఘాంబుల నొప్పించు కొనుచు, సింహకిశోరంబులవడువున దిక్కులు పక్కటిల్ల గర్జించుచు పోరుచుండిరి. ఆరీతి నతిభయంకరంబుగ జరుగుచున్న యుద్ధంబు గాంచు వేడ్క దేవగంధర్వాదు లెల్లరు నాకసంబున జేరి కోలాహలంబు గావించుచుండిరి.

అత్తటి పద్మసంభవుడు హరికి జయము చేకూరునట్లు పరమేశ్వరు బ్రార్థించి నారాయణుం గాంచి ' యోమహానుభావా! ఈవిధి కాల క్షేపము సేయుచున్న సంధ్య సమీపించును. సంధ్యయె సమీపించిన నాతనిం జంప నేరికిని దరంబు గాదు. కాన నికనైన నాలసింపక వానిం జంపు వెర వూహింపు ' మనుటయు హరి యసురకులదక్షమగు చక్రమును గొని యారాక్షసుని వక్షంబువయి గొట్టుటయు నాతడు మొదలు నరికిన తరువువలె నేలం గూలి యసువులం బాసెను.

అంత వరాహరూపియగు వెన్నుండు రోషంబు దీరక యాతని యురమునుండి స్రవించు కవోష్ణమగు రుధిరము ద్రావి మత్తుడై గిరుల పెల్లగించుచు, భూతవ్రాతంబును బట్టి వధించుచు, సురసమూహమును బారం దోలుచు వీరవిహారంబు సల్పుచుండెను.

ఇవ్విధి పుండరీకాక్షుండు బ్రహ్మాండముల నెల్ల గలగుండువడం జేయుటంజేసి ద్వాదశాదిత్యుల దర్పం బడంగె. ఏకాదశరుద్రుల గర్వ ముడిగె. గ్రహములు రూపరె. తారాగ్నులు చల్లారె. నవబ్రహ్మల యాయువు కడముట్టె. కాలధర్మము విపరీతగతి వహించె.

ఆమహోపద్రవకారణమున లోకసంచయ మెల్ల జీకాకుపడుటం గాంచి కమలాసనుఁడును, నింద్రాదిదేవతలును దత్ప్రతీకారంబు సలుప నెంచి యొకచో జేరి యిట్లని చింతింపసాగిరి.

' రాక్షస బాధ మాన్ప హరియె సమర్థుఁ డని యెంచితిమి. కాని యివ్విధి లోకముల గలంచిన గతి యేది? దానవునకు వెఱచి తనయండ జేరిన మన నీవిధి బాధింప హరికి దగునా? కంచెయే చేను మేసినట్లు లైనది. ఎవ్వని దాపు జేరిన మన మీవెత బాయుగలవార మో! ఇయ్యెడ మన కభయం బొసంగువా రెవరు? ఏది గతి? '

అని యీవిధి వరాహకృతబాధ శమింపజేసికొను నుపాయంబు గానక యాలోచించి దురమున కోలంబును దునుమగలవా డొక్క శంభుండె యని యెంచి పరమేశ్వరదర్శనార్థులై బ్రహ్మాదిదేవతలు రజత గిరి కేగి భక్తసులభుండును, నాశ్రితజనావనదక్షుండునగు శంభుం గాంచి నిటలతటఘటితకరకమలులై యీవిధి ప్రార్థించిరి.

' చిరకాలమునుండియు నీయనుగ్రహమువలన నెట్టి యాపదల నైన దరించి సుఖముగ నుంటిమి. అమృతము ద్రావి జాహ్నవీతీరమున హాయిగ జరించు మాకు నేటి కీదురవస్థ వచ్చినది. దానవబాధ కోర్వ లేక వెన్నుని గొల్వ నాత డుద్ధతుడై దానవరక్తపానమున మత్తుడై లోకోపద్రవం బొనరించుచున్నాడు. ఇయ్యెడ రక్షింప నీకన్న వేరెవ్వరు గలరు? లోకములకు బాధ గలిగినపుడెల్ల యాబాధల బోకార్చి రక్షించు చుంటివిగాదె! దానవబాధ తొలంగునుగదా యని సంతసించునంతలో నారాయణుండు దయారహితుడై లోకముల నేచ దొడంగె. అజ్ఞానవశ మున లోకముల గలంచు నావరాహమును సంహరించి మాయార్తిని బోకార్పవే! మమ్ము బ్రోవ వరాహరూపంబు ధరించి మాకెన యెగ్గొ రించుట యిది యేటి ధర్మము? తల్లి కోపపడిన దండ్రిగాక భృత్యులు రక్షింప సమర్థు లగుదురా? '

ఈరీతి దీనులై ప్రార్థించు నమరులం గాంచి జాలి దలంచి పరమే శ్వరుం డిట్టు లనియెను.

‘ ఏమీ! జగద్రక్షణనియుక్తుడగు వెన్నుడు సామరసంబో లేక లోకోపద్రవమునకు గడంగినాడా? తెంపరియై ముందువెనుక లారయక లోకముల గలంచు నధికారం బాతని కెవ రొసంగినారు? సృష్టికర్త లెవరు? స్థితికర్త లెవరు? ఎవని సంహరింపదగు? ఎవ్వాని రక్షింపవలె? ఏరీతి జరించిన దనకును, నితరులకును శుభం బగు నని యాలోచింపక మత్తుడై చరించువాని నుపేక్షింపజనదు. జలజాక్షుడు తా నొనరించునది యధర్మ మని నన్ను దలంచియైనను భీతిలడా? ఆతని స్థైర్యసాహసము లెట్టివో యిప్పుడ యేగి కనుగొందుగాక! నిశ్చింతులై వేఁగుడు.’

అని వారిం బనిచి యాయజ్ఞవరాహంబు చరించు ప్రదేశమున కేగి యేరీతినైన సామవాక్యంబుల దాని నుపశమింప జేయం దలంచి యిట్టు లనియె.

‘ లోకరక్షణనియుక్తుడవగు నీ వీరీతి జగంబుల క్షోభింపజేసిన లోకంబులకు దిక్కేది? అధికార మున్నదని యనుచితకార్యములకు గడంగుట భావ్యమా? తెలిసియో తెలియకయో నీయొనరించిన యీ దుర్నయము లోకసంతానంబుల గలగుండువడం జేసినది. ఇంతటనైన శాంతుడ వగుట యుచితము.’

అని శంకరుండు మందలించుటయు, వెన్నుండు కినుక వహించి మండిపడుచు ‘ ఎవ్వడవు? ఒకింతేని భీతి లేక చివ్వకు కాలు దువ్వెదవు? సకలావనీశ్వరుడనగు నన్ను బూరికిం గొనక యెదియో వచింప వచ్చితివి. అంతటి హిరణ్యాక్షునిగతి యట్టులైనది. చాలు చాలు. వచ్చినదారి నేగుము.’ అని గర్జించి పలికెను.

అతిక్రాంతమర్యాదుండై వెన్నుం డీరీతి పలికిన పలుకులకు గినుకయు, నబ్బురంబును బెనంగొన త్రిపురాంతకుండు ఘనంబగు రోషంబు పెంపున నీతండు దండంబుననగాక సామంబున జక్కబడ డని యెంచి శూలంబున గ్రుచ్చుటయు వరాహంబుశరీరంబు దొఱగి వెన్నుండై నిల్చి శంకరు నీరీతి ప్రార్థించె.

'మహానుభావా! భవన్మహిమం బెఱుంగక నాయొనర్చిన యీ యపరాధమును సహింపుము. ఎన్నియోమాఱు లిట్లె మన్నించి కాపాడితివి. ఈరీతి జగంబుల గాదించిన నాయుద్ధతి హరించుట యుచితం బని యెంచి కృపాళుడవై యాదరించితివి. తెలిసియో తెలియకయో నా చేసిన కలుషంబు దొలగిపోవురీతి యీవరాహరూపంబు బాపి జ్ఞానము గూర్చితివి. వసుధోద్ధరణవ్యాజంబున దంష్ట్రి నైతిని. లోకార్తిం బాప వరాహరూపంబు ధరించి రక్షోరక్తపానంబున మత్తుడనై లోకంబుల బెగ్గడిలం జేసిన నాయహంకృతి బోకార్చితివి. కాన నాయీదంష్ట్రను ధరించి దంష్ట్రి యను నామమును ధరింపుము.'

అని పలువిధముల బ్రార్థించు వెన్నునియెడ కనికరము వహించి భక్తావనదక్షుడగు చంద్రశేఖరు డిట్లు లనియె.

'సకలచరాచరంబులును నావలననె యుద్భవించు. కావున వానికి గావించు నపకార మెదియేని నాకె చెందు. ఇది యెఱుంగక యహంకారంబున లోకోపద్రవంబు గూర్చినవాని నప్పుడ వధియించి లోకరక్షణంబు సల్పుట మదీయకృత్యంబు గంచిది, నీప్రార్థనము ననుసరించి నీయొసంగిన దంష్ట్ర ధరించి దంష్ట్రి యను పేరు వహింతు.'

అని వచించి పరమేశ్వరుండు కైలాసంబున కరుగుటయు రమాపతియు శివానుగ్రహంబున పూతచరిత్రుడ నైతినని సంతసించుచు దన లోకంబున కరిగె. (లింగపురాణమునుండి)

... — ...

# జలంధరనిగ్రహము

ఒకప్పుడు నైమిశీయ మహర్షులు సకలపురాణేతిహాసవేది యగు సూతుం గాంచి 'మహానుభావా! సకలపాపనోదకంబులును, పరమపావనంబులునగు పరమేశు గాథ లెంత వినినను తృప్తి లేకున్నయది. జలంధరుం డనువా డెవ్వడు? ఆతడు దర్పించి మహేశునితో బోరుటకు గల

కారణం బెయ్యది? వినిపింపు ' మని ప్రార్థింప పురాణమ్ములపుట్టినిల్లును పరతత్త్వవేదియు, వ్యాసశిష్యుండునగు సూతుం డిట్టు లనియె.

' పరమేశ్వరుడు సకలపాపహరుడు. ఆతనిమహిమ లనంతములు. బ్రహ్మవిష్ణ్వాదులకేని నెరుంగరాని యాతనిలీల లగమ్యములు. శ్రద్ధాళులరై వినుడు. '

కలడుగదా త్రిజగదాధీశ్వరమావతంసుడును, శచీపతియు నగు నిందుడు. ఆతం డొకనాడు దేవసేనాపరివేష్టితుండై దేవగురుండగు బృహస్పతిం గూడి యైరావతంబు నధిరోహించి ముముక్షుజనాశ్రయుండును, భక్తసులభుండును నగు పార్వతీపతిం దర్శింపం గోరి దర్శనమాత్రభస్మీకృతసకలపాపనిచయంబును, సకలమునిజనసేవ్యమానోపత్యకంబును నగు కైలాసంబును జేరి సేనల నొకచో విడియించి గురుని వెంట గొని యేగుచు మనంబున నిట్లు లూహింపందొడంగె.

ఏతత్పర్వతదర్శనంబునగాదే సంసృతికష్టంబులెల్ల దొలంగి చేతోవీధి శివార్చనాసౌశీల్యంబు ప్రాపించు. ఇదికదా సమస్తలోకైకనాథుడగు భవానీపతి కావాసస్థానము. '

అని తలంచుచు నానందపారవశ్యవిస్మారితేతరకార్యభారుడై రమణీయోన్నతసానుమంతంబును, బ్రహ్మర్షినివాసయోగ్యమునునగు తారకాచలమును ప్రవేశించి బహిర్ద్వారంబున నైరావతంబు డిగ్గి కులిశపాణియై గురుని వెంట గొని కతిపయకక్ష్యలం దాటి చనుచు నొకకక్ష్యయందు భూతిభూషితసర్వాంగుండును, త్రిలోచనుండును, గజచర్మపరిధానుండు నగు నొకని ద్వారమున కడ్డముగ నున్నవానిం గాంచి సామాన్యప్రమథుండని యెంచి నిర్భయుండై యిట్టు లనియెను.

' ఓయీ! ఏను పురుహూతుం డనువాడ. అతీంద్రియగోచరుండును, ధ్యానగమ్యుండు నగు సంబికాపతి గొల్వ వచ్చినాడ. అతిథుల గౌరవింపదగినవాడవుగదా. దారి యిమ్ము. కాలయాపన కిది వేళ గాదు. శివపూజ గావించి వైళమ చనవలయును. లోకరక్షణకార్యనియుక్తుడనుగదా! '

అని యెంత చెప్పినను ద్వారస్థుండగు నావింతప్రమథుడు మందహాసం బొనరించుచు లేవకున్న 'ఆహా! ఏమీ! సామాన్యప్రాణివైయుండి యీరీతి సురేశ్వరునంతవాని నన్ను ధిక్కరింపఁ గోరుచుంటివే! లోకములకెల్ల నధీశుండనని యెఱుంగవా? పూర్వులుకక నాచేతనునిలిచి పదవులొ మొదలక పైపెచ్చు మందహాసం బొనరించుచుంటివే! సేవకులకును వారికిట్టి పెంకెబుద్ధి యున్న గోపపురుషులకు తా వెద్ది? అట్టివని ప్రయోజ్యంబున ననవసరమైనను నధికుడై యున్న నెట్లెరుగుదు.' అని యీవిధంబుగ నూహించుచు నమరేంద్రుండు మహాగ్రహంబున ముందు వెనుకలారయక వజ్రంబును ఝళిపించుచు 'ఓయీ! తలగి చనుము. కాదేని యిదె మదీయకరస్థం బీకులిశంబు తావకగర్వవిదళనంబు కావింపగలదు' అని యార్చుచు కులిశంబున ప్రమథుని గొట్టుటయు నయ్యది కొండ దాకిన యేనుగుకొమ్ము వోలె తునుకలుతునుకలై నేలం బడియె.

అంత నాకుహానాప్రమథుండును నుగ్రుండై నిలిచి సర్వప్రపంచభస్మీకరణసామర్థ్యవిశిష్టంబగు ఫాలనేత్రంబు దెరచుటయు వాసవుండును వడవడ వడంకుచు నాల్క తడబడ నశ్రులు జాలువార గద్గదకంఠుడై యిట్లని ప్రార్థించె.

'సర్వలోకనియంతవగు నోమహానుభావా! ఎఱుగక చేసిన యీతప్పు సైరింపవే! నీయనుగ్రహము నన యీయైశ్వర్యము పొందినాడ నను విషయము మఱచిన యీబుద్ధిహీను మన్నింపవే! నీయనుగ్రహము సర్వప్రాణులకును సుఖప్రదానం బగుటగాదె శంకరుండ వైతివి. మహాప్రళయకాలమున సమస్తబ్రహ్మాండంబుల క్షణకాలములో బూది సేయజాలు నీకంటిమంటను పిచ్చుకపై బ్రహ్మాస్త్రమట్టుల నావంటి యల్పుల మీదనా ప్రయోగించునది? మహాపాపియగు నొక్కనిమూలమున పంగడము కడగండ్లపాలగునట్లు అల్పబుద్ధినగు నాయపరాధమువలన లోకజాలము లేమగునో యేమొ! అయ్యో! మంటలు భూనభోంతరములు నలమికొని దిగంతంబుల నాక్రమింపనున్నవి. కృపానిధీ! అనుగ్రహించి యీమంటల నుపశమింపజేయవే!'

అని దీనుండై యనిమిషపతి పలువిధంబుల బ్రార్థింప నంచుక శాంతించి శంకరుం 'డోయీ! సామాన్యప్రముఖుండె యనుము. మదీయానుచరుం డనియైన నంచుక దర్పంబుమెయి వజ్రప్రహారం బొనర్ప దలంచితివిగా! ఎట్టివానినైనను నాభక్తుని జెనకుట నన్ను జెనకుటయ యని యెంచుము. సామ్రాజ్యాధిపత్యమున కిదియా ఫలము! నన్ను భజింపవచ్చితివిగదా? నాయెడ నీ వొనర్చిన యీయపరాధంబువలన నిప్పుడు లోకోపద్రవంబు గానున్నది. పశ్చాత్తప్తుడవై ప్రార్థించితివిగాన నీయీతప్పు సైరించితిని. ప్రమాదంబుననేని నిట్టి యకార్యంబులకు బాల్పడకుము. పొమ్ము. లగ్గగు' నని వచియించి యాతనిం బంపి భక్తలోకావన దక్షంబగు సవ్యపాణితలంబున ఫాలాగ్నిం గొని సముద్రజలంబున బడవైచె.

ఆవిధంబుగ సముద్రంబున విసరబడిన శంకరుఫాలాగ్ని బాలుండై పయోధితరంగంబుల గేరింత లాడుచుండెను. ఆసమయంబున పరివార సమేతుండై యీశ్వరదర్శనంబున కరుగుచున్న వరుణుం డాబాలకుం గాంచి సంబరపడి 'యీపాప డెవ్వడు? అలలకు దలగక జలములందు మున్గడుగాక రాయంచకూనయట్లు లున్న యీయర్భకుం గాంచినంత నామనంబు ప్రేమార్ద్ర మగుచున్నయది.' యని వచించుచు బాలకుం గొని వక్షంబునం జేర్చి 'పరమేశ్వరానుగ్రహంబువలన నీయర్భకు డిట లభించినా' డని తలంచుచు నింటికిం గొనిపోయి పుత్రప్రేమంబున బెంచుకొనుచు నాబాలుండె తనరాజ్యంబునకెల్ల నధిపతి కాగలం డని యుబ్బుచుండె.

అంతం గొంతకాలంబునకు కమలాసనుం డొకనాడు మునుల తోడం గూడి దిక్పాలురం గాంచు తలంపున నేగుచు వరుణువీటి కరుదెంచుటయు నాతండును నభిముఖుండై యరిగి యింటికి గొనివచ్చి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యుచితాసనం బిడి యిట్లనియె.

'మహానుభావా! మహాత్ము లూరక రారుగదా! మీరాక సర్వమంగళములకును మూలము.'

అంత కమలాసనుండు వరుణుం గాంచి ' వరుణా! సృష్టికర్త నగుట నిరంతరము జగత్క్షేమము గాంక్షించుట నాకర్తవ్యముగదా! లోకసంచారంబునకై వెడలి నీక్షేమం బారసిపోదమనుకదా యని యిట కరుదెంచితి ' నని వలుకుటయు బ్రచేతసుండును సంతుష్టాంతరంగుండై యీవిధి విన్నవించెను.

'స్వామీ! యుష్మద్దర్శనంబున నాజన్మము ధన్యమైనది. అకారణంబుగ నేడీవిధి నరుదెంచుట యెల్లశుభంబుల కాస్పదంబుగదా! ఈశ్వరదర్శనార్థినై యరుగుచుండ సముద్రమధ్యంబునం దీబాలుని గనుగొంటిని. అనపత్యుండనుగాన నింటికిం గొనితెచ్చి యుల్లాసముద్దుగా బెంచుచుంటిని. ' అని వచించుచు గాంచనడోలికయందు గాఢనిద్రాముద్రితుండైయున్న యర్భకు నెత్తి ధాతచేతం బెట్టె. అతండును వరుణుం గనుంగొని 'యీతడు జలముల బుట్టినవాడుగాన జలంధరనామంబున బరగు. ఈతడు దేవదానవభయంకరుండై లోకాతిశాయి యగు ' నని వచించి నిజేచ్ఛం జనియె.

వరుణుండును సంతుష్టుండై బాలుని నతివాత్సల్యంబున బెంచుకొనుచుండె. జలంధరుండు బాల్యంబు గడచి యౌవనదశ జెందియున్న యెడ వరుణుండును కాలనేమికూతును బృంద యనుదాని సన్నివిధంబుల దగియున్నదాని బాణిగ్రహణంబు గావించి జాలంధరంబను నొక్కపురంబును నిర్మించి యందాతని నభిషిక్తు గావించి తాను విభావరీపురంబున సుఖంబుండె.

జలంధరుండును పతివ్రతాలలామయగు బృంద గావించు సపర్యలకును, ప్రభుభక్తిపరాయణులై తంత్రవేత్తలగు నమాత్యవరుల కృతజతకును నలరుచు యథేచ్ఛం గాలంబు పుచ్చుచుండ గొన్ని వత్సరంబులు గతించె.

అంత నొక్కనాడాతం డాత్మగతంబున నిట్లని తలపోయసాగె. 'ఇంద్రుండును, తక్కుంగల దిక్పాలురును మదీయశౌర్యంబునకు వెరచి యుపాయనంబుల గొనివచ్చుచున్నారు. ఐనను వారిని విశ్వసింపరాదు.

ఆశ్రితులవలె సంచరించుచున్నను సమయము దొరకిన రంధ్రాన్వేషణంబు గావింతురు. కావున నట్టివారియెడ గనికరించుట పాడి గాదు. ఇంతియే గాదు. స్వర్గము నెల్లకాలము ననుభవించు నధికారము వారి కెవ రొసంగిరి?'

అని యిట్లు తలపోసి విశ్వాసపాత్రులగు మంత్రిసామంతాదుల రావించి వారితో 'బలంబుల నాయితంబు గావింపుడు. నేడె యస్మద్యాత్ర కరుగవలయు,' నని వచించుటయు వారును మీయాన శిరసావహించి పదునాలుగులోకంబులవారి నరిగాపుల గావింపక విడతుమే యని బీరంబు లాడిరి.

జలంధరుండును జైత్రయాత్రోన్ముఖుడై సహస్రహయబంధురంబును, వివిధశస్త్రాస్త్రభరితంబును నగు రథం బధిరోహించి దానవయోధులు తోడరా దొలుత నింద్రుని జయింప గోరి స్వర్గంబు చేరి యమరావతిని ముట్టడించుటయు నింద్రుండును నాతని మార్కొనను విక్రమంబు లేమిం జేసి భార్యయగు శచీదేవిని వెంట గొని త్ర్యంబకుని సేవించి యాతని యనుగ్రహంబున జయంబు గొన నెంచి కైలాసంబున కరిగెను.

జలంధరుండును శతమన్యు పలాయనవార్త విని ముట్టడి నాపి యొక దానవవీరు నాకంబున బ్రతిష్ఠించి యటనుండి వెడలి క్రమంబున దిక్పాలుర నెల్ల జయించి వారివారి స్థానంబుల దనవారిని నియమించి దానవాంతకుడగు పుండరీకాక్షుని జయింప నెంచి పశుపతికి శశికళాఖండంబును, నారాయణునకు లక్ష్మిని, దేవతల కమృతంబును నొసగిన క్షీరాబ్ధిం జేరెను.

అంత నారాయణుండును జలంధరుని రాక విని క్రుద్ధుడై నానావిధశస్త్రాస్త్రంబులు ధరించి గరుడవాహనారూఢుండై జలంధరసేనలం దాకి భయంకరంబుగ బాణవర్షంబు గురియించిన దైత్యసేనలు గకావికలయి నలువలంకులకును బారం దొడంగె.

అంత దానవనాథుడు సింహనాదంబు సేయుచు నిజసేనల బ్రోత్సాహించుచు జనార్దనుం దాకె. అంత వారిరువురికిని ఘోరంబగు రణంబు ప్రవర్తిల్లె. ఆయుద్ధంబున దనశస్త్రాస్త్రంబు లెల్ల వ్యర్థంబు లగుటం గాంచి కపటోపాయంబువలనగాక యీతనిబారినుండి తప్పించుకొనుటకు వెరవు లేదని యెంచి హరి మెల్లన నాతనిపజ్జం జేరి యిట్లనియె.

'ఓహో! పలాయనమంత్రము పఠించు పందలపైననా నీపరాక్రమము చూపుట! నీ కెనయగు యోధు లీపదునాలుగులోకంబుల గలరా? కపర్దికిదక్క కదనంబున నిన్ను మార్కొను సాహసం బెవరికి గలదు? సామాన్యదానవుండవని యెంచి యెదిర్చితిని. నాయీనేరంబు సైచి త్వదనుగ్రహపాత్రు జేయవే' యని పలుకుచు వెన్నుండు కాంచన మణిమయభూషణాదు లుపాయనంబుగా నిచ్చిన జలంధరుండును జాలి నొంది 'యోయీ! భయరహితుండవై వైకుంఠంబు నేలికొనుము. సుఖం బుండుము. పొ'మ్మని యాతని వీడ్కొని జాలంధరంబున కరిగె. నారాయణుండును జలంధరు వృత్తాంతంబు పరమేశ్వరునకు విన్నవింపం గోరి కైలాసంబున కరిగె.

జలంధరుండును నిర్విచారుండై బృందం గూడి వివిధసుఖంబు లనుభవించుచు నొక్కనా డేకాంతంబున ప్రేయసిం గాంచి యిట్లనియె

'చతుర్దశభువనంబుల శూరుండ నని చెప్పుకొనువానికెల్ల మత్పరాక్రమంబు చవి చూపించినాడ. ఇక ముక్కంటి యొక్కం డున్నవాడు. ఆతనిగూడ సంగరంబున జయించినంగాని యనన్యసామాన్యంబగు మత్తేజంబు సార్థకంబు గాదు. ఆతని భీమత్వ మెట్టిదియో తెలిసి కొందుంగాక!'

అని పలుకు వల్లభుం గాంచి విస్మితయై బృంద 'ఇది యేటి యన్యాయము! సకలజగన్నియంతయగు పురాంతకునితోడనా వైరము! ఎల్లలోకముల గెలిచితివి. కీర్తికాంత జేపట్టితివి. సరివారల మన్ననల నందితివి. ఇప్పటికిని ఆహవవాంఛ తీరదా? కాలకాలునా దలపడ నెంచెదవు? మనపూర్వు లందరు నాకరుణామయు సేవించి యాతనియనుగ్ర

హంబునగదా కీర్తి గాంచినారు. ఆతని యనుగ్రహంబునగాదె సకల లోకంబులు సుఖించుచున్నవి. భవబంధమోచకుండగు నాదయామయు సేవించి తరించుము. గురునిందయు, నాశ్రితులయెడ దురితం బొనర్పుటయు, శివద్వేషంబును బనికిరా పనికదా పెద్దలు వచింతురు. ఎదిరిబల మెఱుంగక మార్గాన నెంచువాడు అగ్గిం బడిన మిడుతవోలె నశించు. కాన మత్ప్రార్థనం బాలించి యీప్రయత్నంబు విరమించి యావన్నార్తిహరుండగు నాశంకరు సేవించి సుఖంబున మను ' మని వచించె.

ఆపలుకులకు దరహాసం బొనరించుచు దానవేంద్రుండు భార్యం గాంచి యిట్లు లనియె. ' ఆహా! అకుంఠితవిక్రముండగు నాత్రివిక్రము పాదాక్రాంతు గావించిన నాతోడనా యీపలుకులు! అంతెటి పరాక్రమవంతుండేని నాయుగ్రుండు దేవతల జక్కడగించుచుండ వచ్చి యేల యడ్డుపడడయ్యె. అట్టిభీరునా నాకడ నొక పోటుబంటని పొగడుచుంటివి. త్రైలోక్యప్రథమానకీర్తియగు నీదానవేంద్రుడాహవమ్మున నాతని జయింపండేని జగదేకశూరుండ నను నాబిరు దెటుల సార్థకం బగు? ఇదె యిప్పుడ పోయి యాతని జయించి వత్తు. మార్వలుకక నన్నానించి పంపుము. '

అని వచించు భర్తపలుకులకు మార్వలుకక కానున్నది కాక మానదని యెంచి బృంద మిన్నకుండె. దానవేంద్రుండును నపారంబులగు సైన్యంబుల వెంట గొని కైలాసాచలంబు చేరం జనె.

ఇట నారాయణుండును సలోకసామాన్యంబగు బృందాసౌందర్యంబు గాంచి వ్యామోహితుండై తద్విరహంబు సైపక కతిపయదినంబులు గడపి యొకనాడు జలంధరరూపంబున బృందా సన్నిధి కేతెంచి ' పంచకృత్యపరాయణుండగు నాపరమేశ్వరు డేడ? సామాన్య దానవుండనగు నే నేడ? అతనిచే మడసినను కైవల్యం బబ్బు. కాని యంతకంటె యాతని సేవించి తరించుట మంచి దని యెంచి మరలి వచ్చితి ' వని నమ్మం బలికి బృందం గూడి సుఖించుచుండె.

అట జలంధరుండును నపారచమూసమేతుండై కైలాసంబు చేర

జని యయ్యచలంబు చుట్టుముట్టుటయు దద్భయంబున నట దల దాచు
కొని వచ్చిన దేవత లది గాంచి భీతులై పర్విడి మహాదేవుం జేరి యా
వార్త నెఱింగించుటయు నప్పురాంతకుండును ప్రమథుల వెంట గొని
దానవునొద్ద కేగి 'ఓయీ! రణాభిలాషచే నింతదూర మరుదెంచి
తివిగాబోలు. మంచిది. కయ్యము వియ్యము నెయ్యము సములకుగదా
రాణించు. అంతటి పోటుబంటవేని యిదె యీచక్రంబు నెత్తగలవేని
ప్రతిద్వంద్వి వని యంగీకరించి రణం బొనరింతు' నని పలికి జలనిధిజలం
బుల పాదాంగుష్ఠంబున చక్రాకృతి నిర్మించుటయు దానవుండును ఆహా
ఇదియా త్రిలోకైకవీరుండనగు నన్ను పరీక్షించు మార్గము! ఇదె కనుం
గొనుము. ఇప్పుడ యీచక్రంబును తృణమునట్లు లెత్తెద నని యహం
కరించి హస్తమ్మున యెత్తి శిరంబునం దుంచుటయు నాతని మూర్ధంబు
తునుకలై నేలం బడియె.

అంతి పరమేశ్వరుండును నిజనివాసంబున కరిగె దానవసేనలు
చేయునది లేక యద్దానవనాథు మృతశరీరంబు గొని జాలంధరంబున కేగి
బృంద కావృత్తాంతం బెరింగించుటయు నామె వడవడ వడంకుచు దన
వద్ద నిలువంబడియున్న వెన్నుం గాంచి యోయీ! పరదారగామీ!
పతిగతప్రాణనగు నాయెడనా యిట్టియపచారము? ఇంతటి మహాపరాధ
మొనర్చిన ని న్నేమి గావించినను దోస ముండదు. మించినదానికయి
వగచిన ప్రయోజన మున్నె? జలంధరరూపమున నుంట భర్తృభావం
బున నిన్ను గవయుట నాపాతివ్రత్యంబున కెట్టిలోటును లేదు. నిన్ను
శపించి లక్ష్మీదేవిసౌమంగల్యంబునకు భంగంబు గావించిన నా కొరగున
దేమి? ఆయుబలం గాంచి నీయపరాధంబు సైరించితిని. తలగి చనుము.
ఆలసింపక సహగమనం బొనరించి పరలోకంబున నున్న పతిం జేర
వలయు నని వచించి పతిదేహంబు చితియం దుంచి యందు ప్రాణం
బులు వదలె.

దామోదరుండును బృందావిరహంబున కోర్వక యామె సహ
గమనం బొనరించిన తావునంగల భస్మరాశియందు బడి పొరలుచుండె.

ఎంతకాలంబునకు నారాయణుండు తిరిగిరామికి వ్యాకులమ్మై

లక్ష్మీదేవి సత్యలోకంబున కేగి బ్రహ్మ కనుగుటయు నతడు లక్ష్మికి నారాయణుని స్థితి నెరింగించి తా మట కేగినను బ్రయోజన ముండ దని వచించి యామెను వెంటగొని కైలాసంబున కరిగి పరమేశ్వరునివద్ద కేగి సాష్టాంగనమస్కారం బాచరించి లోకరక్షణనియుక్తుండగు రమా వల్లభుం డున్మత్తునిరీతి బృందాభస్మరాశియందు బొరలుచున్నాడు ఏమి సేయవలయునో తోచకున్నది. అనుగ్రహించి యాతని స్వస్థు జేయవే యని ప్రార్థించెను.

అంత దయామయుండగు పరమేశ్వరుండు కొన్ని బీజంబు లిచ్చి యోయీ! ఆభస్మరాశిని బోదిగావించి యం దీబీజంబుల నుంచి జలసేకంబు గావింపుడు. అందు మొలచిన యంకురంబులు తులసియను నామంబున వ్యవహరింపంబడు. వానిగంధ మాఘ్రాణించినంతమాత్రన నారాయణుండు స్వస్థుండై వైకుంఠంబున కరుదెంచు నని యానతిచ్చె.

బ్రహ్మయు లక్ష్మీదేవితో నారాయణు డున్నయెడ కేగి పరమే శ్వరు డానతిచ్చిన విధంబున గావించి తులసీగంధాఘ్రాణమున స్వస్థు డగు నారాయణుని లక్ష్మితో వైకుంఠంబునకు బుత్తెంచి తానును నిజ నివాసంబున కరిగె.

- లింగ శివపురాణములనుండి

— ... —

# వ్యాసనిగ్రహము

ఒకప్పుడు నానాశాఖాప్రభేదములుగల వేదములను విభజించి నట్టియు, అష్టాదశపురాణకర్తయు, పంచమవేదప్రసిద్ధిజెందిన మహాభార తమును రచించిన కృష్ణద్వైపాయనుడు భూలోకమందలితీర్థక్షేత్రములు దర్శించుచు నొకనాడు నైమిశారణ్యము ప్రవేశించి త్రిపుండ్రాంకిత ఫాలభాగులును, రుద్రాక్షమాలాభరణులును, రుద్రసూక్తజాపకులును లింగారాధనవత్పరులునునగు శౌనకాదిమహర్షులను గాంచ నేగెను.

వారును వ్యాసు నర్ఘ్యపాద్యాదివిధుల బూజించి తృప్తు గావించి సుఖాసీనుడై యున్నతరి 'మహానుభావా! ఎల కేగుచు నిట కేతెంచితిరి? ఎటనుండి వచ్చుచుంటిరి? విశేషము లేమి?' యని యడుగ వ్యాసుం డిట్టు లనియె.

'భూలోకమునంగల తీర్థములను, క్షేత్రములను దర్శించుచు యుష్మద్దర్శనకాంక్షినై యిట కేతెంచితిని. సర్వత్ర నారాయణమాహాత్మ్యము గోచరించుచున్నది. వేదములకన్న నుత్తమగ్రంధము లేనట్లు నారాయణునికన్న నుత్తమదైవమును లేడు. ఐశ్వర్యప్రదు డాతడొక్కడే. జనార్దనునికన్న భుక్తిముక్తిప్రదాత యన్యుడు గానరాడు. సుఖేప్సులగువా రాతనినే సేవింపవలయును. అతని సేవింపనివారికి సంసారప్రవేశము తప్పదు. ఆతని సేవించువారు ముల్లోకములయందును మాన్యులు. వేదహీనులగు ద్విజులవలె నారాయణుకంటె నన్యదేవతల నారాధించువారు బహిష్కార్యులు.'

ఈవిధముగ వేదశాస్త్రవిరుద్ధముగ వచించు పారాశర్యుం గాంచి మహర్షులు విస్మయావిష్టులై యిట్లు పలికిరి.

'ఏమయ్యా! ఇది యేమి? వేదముల విభజించి యష్టాదశపురాణముల రచించితివిగదా! తత్త్వపరిజ్ఞాతలలో నగ్రేసరుడవుగదా? ఇంత విరుద్ధముగ వచించుచుంటివేల? సామాన్యులకుగూడ శ్రద్ధ కలుగుటకు వీలులేనియటుల పలుకుచుంటివే! నారాయణుడే పరతత్త్వ మని ప్రతిజ్ఞాపూర్వకముగ వచించుచుంటివిగదా? మంచిది. ముక్తిమండపమగు వారణాసియందు విశ్వేశ్వరునియెదుట నీప్రతిన నిలబెట్టికొందువేని నిన్ననుసరించి నారాయణసేవ గావింతుము.'

అంత వ్యాసుడు కుపితుడై పదివేల శిష్యులను వెంటగొని కాశి కేగి పంచనదమున స్నానమాడి మాధవు నర్చించి తద్భజనము గావించుచు విశ్వేశ్వరునిసన్నిధి కేగి బాహువు లెత్తి నైమిశమున మహర్షుల యెదుట ప్రతిన గావించినట్లే

న వేదా దపరం శాస్త్రం న దేవోచ్యుతతః పరః
భుక్తే ర్ముక్తే రిహాన్యత్ర నాన్యో దాతా జనార్దనాత్

అని యొకమారు ప్రతిన గావించి రెండవమారు గావించుటకు చేతు లెత్తబోవుటయు నందీశ్వరుడు వాగ్భుజాస్తంభనము గావించెను. అంత వ్యాసుడు చేయునది లేక మనస్సునందు శ్రీహరిని ధ్యానింప నాతడు ప్రత్యక్షమై ' ఇది యేమి మహర్షీ! ఎంతటి యపరాధము! నేనా విశ్వేశ్వరుడను? వారాణసీపతికన్న విశ్వేశ్వరు డన్యుడు కలడా? ఇంతమందమతి వైతి వేమి? అతని యనుగ్రహమునగదా నాకు త్రిలోకరక్షాసామర్థ్య మబ్బినది. లక్ష్మీపతి నైతిని. ఇంతటనైనను తరింపగోరుదువేని భుక్తి ముక్తిప్రదాతయగు నాజగన్నాయకు నారాధింపు ' మని మందలించెను

వ్యాసుడును వాక్కురామి దీనుడై కనులవెంట నీరు జాలువార పరితపించుచుండ నారాయణు డాతని దీనస్థితిని గుర్తించి యాతని కంఠమును స్పృశింప స్వస్థుడై పరమేశ్వరు నీవిధముగ స్తుతించెను.

ఏకో రుద్రో న ద్వితీయో యత స్త
ద్బ్రహ్మైవేదం నేహ నానాస్తి కించిత్
యద్య ప్యన్యః కోపి వా కుత్రచి ద్వా
వ్యాచష్టాం త ద్యస్య శక్తి ర్మదగ్రే ౧

యః క్షీరాబ్ధే ర్మందరాఘాతజాతో
జ్వాలామాలీ కాలకూటోతిభీమః
తం సోఢుం వా కోఽపరో భూ న్మహేశా
ద్యత్కీలాభిః కృష్ణతా మాప విష్ణుః ౨

యద్బాణోఽభూ చ్ఛ్రీపతి ర్యస్య యంతా
లోకేశో యత్స్యందనం భూ స్సమస్తా
వాహా వేదా యస్య యే నేషుపాతా
ద్దగ్ధా గ్రామా స్త్రైపురా స్తత్సమః కః ౩

యం కందర్పో వీక్షమాణ స్సమానం
దేవై రన్యై ర్భస్మ జాతః స్వయం హి
పౌష్పై ర్బాణైః సర్వవిశ్వైకజేతా
కో వా స్తుత్యః కామజేతు స్తతోఽన్యః ౪

యం వై వేదా వేద నో నైవ విష్ణు
ర్నో వా వేధా నో మనో నైవ వాణీ
తం దేవేశం మాదృశః కోల్పమేధా
యాథాత్మ్యేన ద్వై వేత్త్యహో విశ్వనాధమ్ ౫

యస్మిన్ సర్వం య స్తు సర్వత్ర సర్వో
యో వై కర్తా యోవితా యోపహర్తా
నో య స్యాది ర్య స్సమస్తాది రేకో
నో య స్యాంతో యోంతకృ త్తం నతోస్మి ౬

య స్త్యైకాఖ్యా వాజిమేధేన తుల్యా
య స్యానత్యా చైక యాలేంద్రలక్ష్మీః
యస్య స్తుత్యా లభ్యతే సత్యలోకో
య స్యార్చాతో మోక్షలక్ష్మీ ర్నదూరా ౭

నాన్యం దేవం వే ద్మ్యహం శ్రీమహేశా
న్నాన్యం దేవం స్తౌమి శంభో ఋతేహమ్
నాన్యం దేవం వా నమామి త్రినేత్రా
త్సత్యం సత్యం సత్య మేత న్మృషా న ౮

రుద్రుడొక్కరుడే జగత్కర్త. ఆత డద్వితీయుడు. సకలజగ ద్వ్యాపి. ఆతనికన్న భిన్న మణుమాత్రమును లేదు. కాదని వాదించు శక్తిగలవా రున్న వాదమునకు రండు.

క్షీ రాబ్ధిమధనకాలమున నుద్భవించి విష్ణువును కృష్ణవర్ణగా నొనరించి యొక్క గడియలో లోకముల గాల్చుటకు సిద్ధముగా నున్న యాభయంకరకాలకూటమును మహేశ్వరుడుదక్క నితరు లేరైనను మ్రింగజాలిరా?

విష్ణుని బాణముగను, విధాతను సారధిగను, విశ్వంభరను రథ ముగను, వేదముల నశ్వములుగను గావించి యొక బాణపాతముచేతనే గదా త్రిపురదాహము గావించినాడు!

పుష్పబాణములచే బ్రహ్మాదిసర్వప్రాణులను స్వవశుల గావించి విఱ్ఱవీగి కన్నుమిన్ను గానక మృత్యుంజయునంతవాని నన్యదేవసమానుగా దలంచి పంచశరు డాతనికంటిమంట బూది గాడా? కామజేతకన్న స్తుతింపదగినవా రెవరు?

వేదములు, విధాత, విష్ణువు నవా జ్మానసగోచరుడగు నేదేవు మహిమ నెరుంగరో యట్టిమహామహిమాసంపన్నుడగు నాపరమేశ్వరు నావంటి యల్పబుద్ధి యెటు లెరుంగజాలును?

విశ్వరూపియు, విశ్వవ్యాపియు, సృష్టిస్థితిసంహారతిరోధానాను గ్రహరూప పంచకృత్యపరాయణుడును, ఆదిమధ్యాంతరహితుండును, సమస్తాదియునగు నాలోకవంద్యునే నమస్కరింతును.

ఏదేవునామ మొకమారు జపించిన నశ్వమేధఫలము కలుగునో, యేదేవు నొకమారు నమస్కరించిన నింద్రపదవి లభించునో యేదేవు నొక్కమారు స్తుతించిన సత్యలోకప్రాప్తి యగునో యట్టి పరమేశ్వరుడే మోక్షదాత.

కాన త్రినేత్రునికన్న నన్యునకు నమస్కరింపను. పరమేశ్వరుని కన్న నన్యుల స్తుతింపను. పశుపతినిదక్క నన్యుల నారాధింపను. ఇది ముమ్మాటికిని సత్యము.

ఈవిధముగ వ్యాసుడు పరమేశ్వరుని స్తుతించుటయు నందీశుడు ప్రసన్నుడై భుజాస్తంభ మెడలించెను. వ్యాసు డీశ్వరునకు సాష్టాంగ నమస్కారంబు లాచరించి నైమిశీయమహర్షులం గాంచి యోమహాను భావులారా! మీకు నమోవాకశతంబులు. మీయనుగ్రహమున నేడు నాయజ్ఞానము నశించినది. ఇక మీరు స్వస్థానమున కేగి సుఖముండుడు అని వారిని వీడ్కొల్పి తనపేర వ్యాసేశ్వరు డను నొకలింగము స్థాపించి తదారాధనము గావించి కృతకృత్యు డయ్యెను.

— ... —

# శివశర్మోపాఖ్యానం

మధురాపురంబున శివశర్మయను విప్రోత్తముడు కలడు. అతడు వేదములు చదివి, ధర్మశాస్త్రములు పఠించి, పురాణంబు లధిగమించి, మంత్రశాస్త్రంబులుదెలిసి, ధనంబు సంపాదించి, భోగ్యంబు లనుభవించి, ధర్మంబు లాచరించి, పుత్రులనుత్పాదించి, వారికర్థంబు విభజించియిచ్చి యౌవనంబుపోకను ముదిమిరాకకు శోకించి వ్యాకులుండై నిజాంతర్గతం బున నిట్లు విచారింపందొడంగె.

'శాస్త్రంబులభ్యసించుటయందును, ద్రవ్యార్జనమునను, పుత్రోత్పాదనమునను, పుత్రులకర్థంబులు విభాగించియిచ్చుటలోనను, చర్వితచర్వణంబుగా ననుభూతప్రాయములగు సుఖంబుల మరల మరల ననుభవించుటయందును గాలంబతయు గడచినది. ఇంతకాలంబును కాశికా వల్లభుని విశ్వనాథుని సేవింపనైతినిగదా' !

'యజ్ఞయాగాదిక్రతువుల నమరసంఘంబును దనివి నొందింప జాలనైతిని. తటాకనిర్మాణంబు గావింపనైతిని. సలిలసత్రంబునైనను సాగింపజాలనైతిని. శతరుద్రీయమును, పంచాక్షరంబును, ప్రణవ మంత్రంబును ప్రతిదినము జపింపనైతిని.'

'నాయొనర్చిన పుణ్యకర్మ మొక్కటిదక్క ఈహర్మ్యములు, ఈ వాహనములు, ఈనగలు, ఈసేవకులు, ఈధాన్యములు, ఈదేహము నావెంట వచ్చునా' ?

'పొడిదగ్గు కంఠము నావరింపకముందు, తల నెరకుంట కారంభి కముందు, నేత్రములకు దృష్టిబలము తగ్గకముందు, శ్రోత్రేంద్రియంబు పాటవంబును గోల్పోకముందు, ఆననమున ముడుత లారంభము కాక ముందు , హృదయము దిటవు తప్పకముందూ, పండ్లు కదలువారక ముందు, గాత్రము శిథిలము గాకముందు, మృత్యుదేవత చూపు

ప్రసరింపకముందు కాలునే యాడుకాలమున దీర్ఘసేవకు కదలవలయునని కదా పెద్దలు వచింతురు.'

ఈరీతి తీర్థయాత్రాపరాయణుడగుచు నిల్లు వెడలి రెండుమూడు పయనంబులు సాగించి యొక వటవృక్షముక్రింద విశ్రమించి యంతరంగంబున నిట్లు వివితర్కించె.

'ఆయువు కరికర్ణాంతచంచలము. యౌవనము బుద్బుదము వంటిది. ఇట్టియెడ చతుస్సముద్రముద్రితమగు సీధరావలయంబునగల దీర్థంబు లన్నింటిని గాంచగలనా? ఐనను ముక్తిజనకములగు సప్త పురంబులదర్శించి కృతార్థుడ నయ్యెదగాక!'

ఈవిధముగ కృతనిశ్చయుడై యయోధ్యకేగి సరయూతరంగిణి యందు స్నానమాడి, పిమ్మట నల్లుదెల్పునునైన నదులకూటమున ప్రయాగయందు అవగాహనం బొనరించి, కాశికేగి గంగయందును, మణికర్ణికయందును గ్రుంకులిడి కైవల్యకల్యాణఘంటాపథంబైనన మ్మహాదేవుక్షేత్రంబున విశ్వేశు దర్శనంబు గావించుచు గొంతకాలంబు గడపె.

అంత మార్తాండుండు మకరరాశిం బ్రవేశింప మాఘమాసంబున ప్రజాపతిక్షేత్రంబగు ప్రయాగ కరిగె. యాగంబులన్నింటికంటె ప్రకృష్టంబగుటంజేసి యాక్షేత్రమునకు ప్రయాగనామమన్వర్థంబై యుండు అందు గంగాయమునానదీసంగమంబున స్నానమాడి క్షేత్రాధిపతిం దర్శించి కృతార్థుడయ్యె.

వెండియుగాశికేతెంచి మణికర్ణికయందవగాహనం బొనరించును. మరల బ్రయాగమున కేగి గంగాయమునానదీసంగమంబున గ్రుంకు లిడును. జంతువులకు బ్రాణావసానకాలంబున విశ్వేశ్వరుడు ఓంకారాక్షరమంత్రరాజము నుపదేశించుగావున గాశి బెడబాయలేక యందు గొంతకాలము వసించు.

కాశిలో నెడమప్రక్కయిమరణించు మశకశిశువునకైనను నభ

వుడు ఓంకారమంత్రరాజము నుపదేశించుటం గాంచి యమర సంఘము తమ వృథాజీవములకు సిగ్గుపడుచుందురు.

ఆక్షేత్రమున ప్రాణత్యాగముగావించి యర్థనారీశ్వరసారూప్యము నందిన జంతుతతులు కుడి భాగము గన్గొని చోద్యమంది పిమ్మట నెడమభాగమును గాంచి యచ్చెరువుపాటు నొందుచుందురు.

జాతి చాపల్యంబుననను, విప్రతిపత్తి జనకంబులగు శాస్త్రంబుల బహుముఖత్వంబువలనను శివశర్మ యమృతక్షేత్రంబగు వారణాసిని విడచి యింకను నైర్మల్య ప్రదంబులగు తీర్థంబులు గలవని యన్యక్షేత్రగమనోన్ముఖుండయ్యె.

ఆనందవిపినమగు వారణాసీ మహిమ నెఱుంగడా? దేవలోక నిశ్శ్రేణియగు గంగయొక్క నిత్యమహిమ గాంచడా? మణికర్ణికా తీర్థ మాహాత్మ్యము చూడడా? నిగమాగమ పురాణేతిహాసాదులయందు విశ్వేశ్వరు మహిమ గాంచడా? ఉదక మున్నత భూమియం దుండలేక పల్లమునకు బారునట్లు శివశర్మ కాశిని వీడి తీర్థాంతరగమనోన్ముఖుండయ్యె.

అటనుండి కదలి మహాకాళ నివాసస్థానంబును, ననంతములగు శివలింగముల కాలవాలమును నగు నుజ్జయిని కేతెంచి సిప్రానదియందు దానమాడి మహాకాలుసేవించి జగయోగ తత్పరుడై యట కొంతకాల ముండె.

అనంత బ్రహ్మాండ నిర్మాతయగు పరమశివుడు స్వర్గమర్త్య పాతాళములయందు తారకేశ్వర, మహాకాళ, హాటకేశ్వరనామంబుల లింగరూపియై యున్నాడు విశ్వేశ్వరు నివాస స్థానంబగు నుజ్జయిని యందు వామకర్ణములు క్రిందుగ దీర్ఘనిద్ర జెందిన జంతువులదేహములు కందవు, వికారము నొందవు, దుర్గంధంబుల టూరయవు. ఇట్టిచోద్యము నింక నే తీర్థమునను గాంచజాలము.

అట్టి పావనతీర్థరాజమగు నుజ్జయినియందు మహాకాళు సేవించి బ్రాహ్మణుండటనుండి కదలి ఏకామేశ్వర స్థానమగు కాంచి కేగి యట నేడునాళ్ళు వసించి కాంచీపురాధినాథు భజించి ప్రభాసక్షేత్రంబు మీదుగా ద్వారవతి కేగె. శివశర్మ యట గొన్నినాళ్ళుండి పరమభాగవతుల సేవించి నారాయణు నారాధించి యటనుండి గదలి తొలిజన్మమున పాపము చేసిన మానవులకు దుష్ప్రాపమగు మాయాపురి కరిగెను.

ఆ నగరమును గొందరు హరిద్వార మందురు. కొందరు మోక్షద్వార మందురు. కొందరు గంగాద్వార మందురు. అటనుండి నిర్గమించియే భాగీరథి మున్నీటియందు బెక్కుముఖంబుల గలసె.

అట్టి మాయాపురంబునందు తీర్థోపవాసంబు దీర్చి జాగర ముండి తెల్లవారినంత గంగయందు స్నానమాడి పితృతర్పణము చేసి పిండ ప్రదానంబు గావించి యగ్నికార్యంబు సేసి హరు నారాధించి వంటకంబు కుడువ గూర్చుండి వడ్డించుకొనదలంచునంతలో శిరస్తాప మావహిల్లె. చలివెట్టె మెడ నొచ్చె.

అంతశివ శర్మ నిజాంతర్గతంబున నిట్లని చింతింపందొడంగె. 'ఇంక బ్రతుకుమీది యాస కల్ల. అనుదినము గృహారామ పశువీక్షణము నెవడు గావించును? నవవైధవ్య దుఃఖార్తయగు పత్ని యేవిధంబుగ కాలక్షేపము గావించును? పుత్రులు ధనవిమునకై పోరాడక యానుకూల్యమున నుండగలరా? కానిచోట నీరీతి దిక్కుమాలిన ప్రేతనై తిరుగవలసెగదా? ఐనను సంతోషమేల? విశ్వనాథుకు శివుని ధ్యానింప సర్వసంతోషము లడంగవె? ఇహ నందెల్ల సుఖము లనుభవించితిని. సప్తపురీయాత్ర గావించితి.'

ఈ విధంబుగ జింతించునంతలో నాతని కాపాదమస్తకంబు కోటివృశ్చిక దంశనబాధ జనియించి తన్నెఱుగక యెదిరి నెఱుగక కనులు దెరువలేక నోటియూరుపున నట్టులే గొన్నాళ్ళుండి మాయాపురోప కంఠమున గంగాతీరమున కాలధర్మము నొందె.

అంత నీలమేఘశ్యామవర్ణులును, మంగళాకారులును నగు పుణ్యశీలసుశీలు రను విష్ణుకింకరులు గరుడకేతనసహితంబగు విమానంబు దోడ్తెచ్చుటయు మాయాపురీమరణప్రభావంబున హరిసాయుజ్యము నందిన శివశర్మ తద్దివ్యవిమానం బధిరోహించి యావిష్ణుకింకరులం గాంచి యిట్లని వచియించె.

'పురాణేతిహాసములయందు పుణ్యశీలసుశీలు రను నిరువురు పుణ్యపురుషులు అచ్యుతసన్నిధి నుందురని పెద్దలు చెప్ప వినియున్న వాడ. తులసీమాలికాలంకృతులును, కంబుజాక్షులును, దివ్యాకృతులును, చతుర్బాహుయుతులును నగు మీరు వారలు కారుకదా' అని యడుగుటయు నాతడు 'ఓమహాత్మా! నీవంటి మహానుభావులకు దెలియని యర్థంబులు కలవె! నీవు పురాణేతిహాసంబులయందు పెద్దల వలన విన్న పుణ్యశీలసుశీలురము మేము యగుదుము. అనేకలోకంబులు గడచి కాని వైకుంఠమునకు బోరాదు. మార్గప్రాప్తంబులగు నాయాయి లోకంబుల విశేషంబులు నీకుం జెప్పెదము అడుగవలసిన యర్థంబుల నడుగు' మనుటయు 'నట్ల కాక' యనుచుం జనువాడు ముందట భయంకరాకారులగు కొందరం గాంచి 'వీ రెవ్వ' రని యడుగ నా విష్ణుకింకరు లిట్లనిరి.

'ఇది పిశాచలోకము. వీరు పిశాచరాజులు. ప్రసంగవశంబున చంద్రశేఖరుని గొలిచినవారు.' అని వచియించుచు జనునంత విమానం బప్సరోలోకంబు సమీపింప బోవు నవసరంబున కృతాంతుండు సౌమ్యమూర్తియై కనకరథం బధిరోహించి పార్శ్వయుగంబుల నాప్త కింకరులు గొలువ నెదురుగా వచ్చి సాధువాగంబుల నిట్టు లనియె.

'షడంగసహితంబగు వేదం బభ్యసించితివి, గురుపరిచర్య గావించితివి. పురాణేతిహాసాదిసద్గ్రంథముల జదివించితివి. హరిహరుల నేకాంతభక్తి భజించితివి. మాయాపుర్యాదిసర్వతీర్థంబుల గ్రుంకులిడితివి. నీసుకృతగరిమ యెంతటిదియోకదా! మాయింతలేసివారల నమస్కా

రంబులు గొనుచున్నావు.' అని శివశర్మ నభినందించి ధర్ముండు నిజ నివాసంబునకు జనియె.

తదుపరి శివశర్మ విష్ణుకింకరులం గాంచి 'ఓయాయనఘులారా! యమునిరూపంబు భయంకరంబుగా వర్ణింతురుగదా? అతని జూడ గన్నులు చల్ల నయ్యెనే! ఇవ్వి పారావారసరేఖ లెందు బోయినవి? ఇదియె యాతని సహజరూపమా? ఇది కాక యాతని కింక నొకరూప మున్నదియా? ఆనతీయుం' డని యడుగ వార లిట్లు లనిరి.

'ఓమహానుభావా! నినుబోంటి పుణ్యవంతులు కాతడు సౌమ్య మగు నాకారంబున గాన్పించు మరియు పాపుల కతండు భీకరంబుగ నుండును.

'పరదారగమనం బొనర్చిన యాచలడాలుని పాదంబులు ప్రచండతరఖడ్గంబున ఖండఖండంబులు గావింపుడు. పరసంతాపకారియగు నీకుటిలబుద్ధిని నింగలంబులం గ్రాగిన మంగలంబుల వేపుడు. పరుని యందు మిథ్యాదోషం బారోపించిన యానిర్దయు పూయశోణితకర్దమంబున ముంపుడు. గురునిందాకర్త యగు నీధూర్తుని నోటియందు తప్త లోహంబు పోయుడు. దేవస్వాపహారులను, బ్రాహ్మణద్రవ్యభోక్తలను కృతఘ్నులను, పరక్షేత్రాపహర్తలను, కూటసాక్షులను, సురాపానరతులను, ప్రజాపీడాకరులను రౌరవ, మహారౌరవ, కాలసూత్ర కుంభిపాక, అంధతామిస్ర సంహారనామకనరకంబుల దలక్రిందులుగా వ్రేల గట్టించియు, సంధకూపంబుల ద్రోయించియు, నినుపముక్కుల కాకులం గరపించియు బెక్కువిధంబుల బాధింపు డనియు, భగవన్నామజపంబు చేయు భక్తులు మీకు మాననీయు లనియు నిజదూతల ననుశాసించు.'

అని యివ్విధంబున యమలోకవర్ణనంబు గావించుచు నేగునంత విమానం బప్సరోలోకంబునకు జేరె. అంత శివశర్మ వారలం గాంచి యిట్లు లనియె.

## —: అప్సరోలోకవృత్తాంతము :—

'నానారత్నమాలాలంకృతలు భువనమోహనమూర్తులు నగు వీ రెవ్వ' రని ప్రశ్నించిన నా కింకరు లిట్లు లనిరి.

'రంభ, మేనక, ఊర్వశి, ఘృతాచి, తిలోత్తమ మొదలుగా నరువదివేలు దివ్యాప్సరస లీలోకంబున వసింతురు.' అని చెప్పుచుండ విమానంబు భాస్కరలోకంబు సేరం జనుబయు నేకచక్రంబును సప్తసప్తియు, ననూరుసారథికంబును, నిజనసేవితంబునగు రథం బధిరోహించి నభోమార్గంబున జను కమలబాంధవుని జూపి విష్ణుకింకరు లిట్లని వచియించిరి.

## —: సూర్యలోకవర్ణనము :—

'ప్రతిదినంబును ప్రాతరారంభవేళ నరగరుడోరగసిద్ధచారణగంధర్వాదులందరు నీపద్మబంధుని భజింతురు. ఈతను జగదుపకారార్థమై సంచరించుచు నహోరాత్రివిభాగంబు గావించు. జనుల దృష్టికి బాధాకరంబుగ వెలుగుచున్నను ప్రాణులకు చైతన్యంబు గలిగించు. తీక్ష్ణకిరణుండయ్యు శీతలామృతము వర్షించు. ఈప్రభాకరుడు సకలభువనములకును జీవనప్రదాతయై విలసిల్లు.'

అని వచియింప శివశర్మ తా నొనర్చు నమస్కారంబు లంగీకరించుచు నిమేషార్ధమాత్రంబున రెండువేల రెండువందల రెండు యోజనంబు లతిక్రమించినం జూచి యాశ్చర్యం బంది యాగోవిందకింకరుల నిట్టు లనియె.

'ఓ మహానుభావులారా! సూర్యమండలాంతర్వర్తియై యొక మహాపురుషుండు విరాజిల్లు నని బుధులు వచియింతురు. ఆతని నెట్టుల సేవింపవలయు?

అని యమభటులు వారలి ట్లనిరి. ‘ ఆకాశమధ్యస్థుఁడగు నీభాను బింబము లక్షయోజనవిస్తృతము. ఈమండలమధ్యమున హిరణ్యశ్మశ్రు కేశుఁడు, హిరణ్యవర్ణుఁడునగు చంద్రశేఖరుని కనులారఁ గాంచి సోహంభావమున నారాధించుచుండు. దాన మూఁడువేళల బ్రహ్మవేత్తయగువాఁడు నర్ఘ్య మిడి సేవింపవలయు. కాలలోపంబు సేయరాదు, కాలమునకయి కనిపెట్టికొనియుండి ధర్మ మాచరింపవలయును. కాలంబునఁగదా ఓషధులు ఫలించు. కాలంబునఁగాదె మేఘములు వర్షించు. కాలంబుదప్పక యుపాస్యమానుండై భానుండు ఆయురారోగ్యాది సకలైశ్వర్యంబులను బ్రసాదించు. అష్టాదశవిద్యలలో మీమాంసాశాస్త్రము మిన్నయగును. మీమాంసకంటె ధర్మశాస్త్రము ప్రాభవమున మిగులు. దానికన్నను తర్క మధికంబు. తర్కంబుకన్న వేదరాశి మిన్న. అందునను నుపనిషత్తు లభ్యర్హితంబులు. అందు మంత్రరాజమగు గాయత్రి విరాజిల్లు. మంత్రములలోన గాయత్రియు, నగరములలోన గాశియు, దేవతలలో జంద్రశేఖరుడును శ్రేష్ఠములై యుండు. కావున సూర్యమండలాంతర్వర్తియగు నీశ్వరు నారాధించుట విధివిహితంబు. మోకాళ్ళు భూమిపై మోపి కరయుగంబున నర్ఘ్యపాత్ర వహించి పాత్రను ఫాలపర్యంతమున నెత్తి యర్ఘ్య మిడిన యుపాసకునికి ఆయురారోగ్యధీవివేకభాగ్యసౌభాగ్య వైభవప్రాభవములు కలుగు. ’

అని పుణ్యశీలసుశీలురు సూర్యలోకమాహాత్మ్యం బభివర్ణింప నాకర్ణించుచు శివశర్మ ముందట నయనానందకరంబగు నొకపట్టణంబు గనుంగొని ‘ యోసర్వజ్ఞులారా! ఈపట్టణంబు కన్నులపండువుగావించుచున్నది. ఇది యేలోకము? దీనిచరిత్ర యెట్టి ’ దనిన వారి ట్లనిరి.

## స్వర్గలోకవర్ణనము

‘ ఇయ్యది యమరావతి. ఈకన్పడునది నందనోద్యానము.

అందు మహావృక్షములు మందార, కల్పవృక్ష, హరిచందన, సంతాన, పారిజాతము లనునవి. ఇయ్యది సుధర్మ యను నింద్రసభ. రెండవ కైలాసమునగా విరాజిల్లుచున్నది. ఈలోకంబున తరురత్నంబగు పారిజాతంబును వనరత్నంబగు నందనంబును, తురగరత్నంబగు నుచ్చైశ్శ్రవంబును, గజరత్నంబగు నైరావతంబును, రత్నరత్నంబగు చింతామణియు గలవు. ఇందు నారదాదిమునులును, గంధర్వయక్షకిన్నర కింపురుషులును, సగరనలనహుషమాంధాత్రాదివసుంధరాధిపతులును, జ్యోతిష్టోమాదియాగంబులు గావించిన సోమయాజులును, తులాపురుషాది దానంబు లొనర్చిన మహాదాతలును, సంగ్రామంబుల నపరాఙ్ముఖులై పోరాడి యీల్గిన వీరులును వసియింతురు.'

అని పలుకుచు విమానం బగ్నిలోకంబు చేరువకుం గొనిపోయి యాకింకరు లిట్లనిరి.

## అగ్నిలోక వర్ణనము

'అమరావతిరాజు పాకశాసనుడు. అగ్నిమతీపురమునకు రాజు హుతాశనుడు. సంయమినీపురంబున కేలిక యముడు. పుణ్యవతికి పాలకుడు నిరృతి. అమలవతీపట్టణమున కధిపతి వరుణుడు. గంధవతీపురశాసకుడు పవమానుడు. అలకాపురంబును కుబేరుడు పాలించును. ఐశాని కధినేత యీశానుడు.

ఇయ్యది దిక్పాలపురంబులలో రెండవది. పరమేశ్వరుని యష్టమూర్తులలో నొకండగు నీయగ్ని నారాధించియే బ్రహ్మేంద్రాదిబృందారకులు భుక్తిముక్తు లందుచున్నా' రని వచింప శివశర్మ 'యో మహాత్ములారా! వైశ్వానరుం డనగ నెవ్వండు? ఎవ్వని తనూజుండు? ఏప్రకారంబున నిట్టిమహత్తర తేజం బితనికి సంభవించె' నని యడుగుటయు వార లిట్లనిరి.

'పరమేశ్వరసేవానిరతుండును, శాండిల్యగోత్రసంజాతుండును నగు విశ్వానరుండను నొక్క బ్రాహ్మణోత్తముండు గలడు. అతడు గర్భాష్టమమున నుపనీతుండై నిఖలశాస్త్రంబుల నభ్యసించి యాశ్రమ

విహితాచారంబులను ధర్మంబుల ననుష్ఠించుచు నొకనాఁ డేకాంతంబున నిట్లని యాలోచింపం దొడంగె.

‘ఆశ్రమంబుల నాల్గింట నెయ్యది యుత్తమంబు? దేని కదియె లెస్స యనిన ట్లుండు. వర్ణాశ్రమాచారంబులు శివానుగ్రహంబున మోక్షదాయకంబు లగు. అందు బ్రాహ్మణుండు బృహస్పతిసవనంబునను, రాజు రాజసూయంబునను, వైశ్యుండు వైశ్యస్తోమంబునను యజియింతురు. ఇవి వర్ణధర్మంబులు.

అధ్యయనాదులు బ్రహ్మచారిధర్మంబులు. అగ్న్యాధానాదులు గృహస్థధర్మంబులు. అరణ్యవాసాదులు వానప్రస్థధర్మంబులు. శ్రద్ధాదులు యతిధర్మంబులు. ఇవి యాశ్రమధర్మంబులు. ఈయాశ్రమంబు లుత్తరోత్తరంబు లుత్కృష్టంబులు. నాలుగాశ్రమంబులవారును నిజకర్మానుష్ఠానంబులు దప్పక యీశ్వరపూజాపరతంత్రులైన సిద్ధిపడయుదురని యార్యులు వచియింతురు.

నాకుం జూడ నన్ని యాశ్రమములకును నాధారభూతమైనది గృహస్థాశ్రమంబని తోఁచుచున్నది. కొందరు వర్ణాశ్రమాచారనిష్ఠునకు బ్రహ్మనిష్ఠ సంభవింపదు. బ్రహ్మనిష్ఠ సర్వవ్యాపారపరిత్యాగంబునం గాని కుదురదు. కర్మానుష్ఠానకర్మత్యాగంబులకు పరస్పరవిరోధంబు. కావున కర్మకారునియందు బ్రహ్మనిష్ఠ సంభవింప దండ్రు.

పరదార పరాఙ్ముఖత్వంబునను, నాత్మదార పరితోషంబునను, ఋతుకాలాభిగమనంబునను బ్రహ్మచారియు, రాగద్వేషకామక్రోధ వర్జనంబున వానప్రస్థుండును, అయాచితోపస్థితంబున దేహపోషణము గావించుకొనుచు భిక్షుకుండును నై యిట్లు గృహస్థుండు కర్మానుష్ఠానంబున కైవల్యంబు వడయుటకు చక్కని యవకాశంబు గలదు’

అని యీవిధంబున గృతనిశ్చయుండై విశ్వానరుం డనురూపయగు శుచిష్మతి యను నొక్కవిప్రకన్యను వివాహంబై స్వధర్మానుష్ఠానపరుండై కాలంబు గడపుచుండె. వినయవివేకవతియును, సౌజన్యవతియునునగు శుచిష్మతి పతిడెందంబున కానందంబు సంపాదించుచు సేవించుచుండ బెద్దకాలంబు గడచినను బుత్రసంతానలాభంబు గలు

గమికి చింతించుచు నగచి యొక్కచో నేకాంతంబున విభుని పాదంబు లకు మ్రొక్కి యి ట్లనియె.

‘ సకలైశ్వర్యంబులు సంతానలాభంబునకు సాటిరావని పెద్దలు వచియింతురు. అట్టిది యేటికి నడసె ఇందుశేఖరుని కృప మన కేల లేదు. దయయుంచి సంతానము కలుగునట్టి యుపాయం బాలోచింపుము

అని ప్రార్థించిన పత్నిం గాంచి విశ్వానరుం ‘ తపస్వి! సంతానంబునకై యింత విచారం బేటికి? ఆశ్రితవత్సలుండగు నాయిందుమౌళి మనపాల నుండ నిది యెంతటి పని? ’ అని పలుకుటయు నామె సంతసించి ‘ మహాత్మ్యపుత్రులకు నాయందు సంతానలాభంబు బడయుట కభిమతంబేని, నే నసంప్రాప్తమాత్రం బగుదునేని ఇందుశేఖరసదృశుండైన నందనుం బ్రసాదింపు ’ మని ప్రార్థించుటయు నాతండును నామెపైగల కూర్మివలన నట్ల యగుగాక యని పలికె.

‘ ఇది యేమి! ఇందుశేఖరసదృశునా పుత్రుని గోరినది! ఏ యింతి యిట్టివరము కోరెడి? కోరినదిపో యియ్యది సాధ్యమా? అవాఙ్మానసగోచరుండగు నాపరమాత్మునిలీలావతారమా యీమె కోరినది? కానినా డీమె కిట్టి యూహ జనించుట కవకాశ మెక్కడిది? ’ అని వితర్కించి విశ్వానరుండు కృతనిశ్చయుండై భార్యను వెంట గొని భవభయసముద్రయానపాత్రంబైన కాశీక్షేత్రంబున కేగి మణికర్ణికాది పుణ్యతీర్థంబుల స్నానమాడి కాలభైరవ, ఢుంఠిగణపతి, బిందుమాధవ, లోలార్కాదుల నారాధించి మణికర్ణికాదితీర్థంబుల నిత్యదేవతల నారాధించి కానవచ్చిన లింగంబులనెల్ల బూజించుచు నొక్కనా డిట్లని వితర్కించె.

‘ ఇది యేమి? ఈవిధంబుగ గానవచ్చిన లింగంబు నెల్ల సేవించుచున్న నెంతకాలంబునకు నాకోరిక యీడేరును? క్షేత్రరాజంబగు కాశియందు లింగంబులకు కొదువయే? అర్బుదంబులు న్యర్బుదంబులు గలవుగదా! ఇన్నింటి నారాధింపవలయునన్న నొకటి కాదు నెన్నియైనను జన్మలు చాలవు. కావున నాలసింపక యాశ్రితవత్సలుండగు విశ్వే

శ్వరు నారాధించి యుచితమనోరథంబులు వడయుదు' నని నిశ్చయించి యొక్కమాసం బేకాహారుండును, నొక్కమాసంబు నక్తాశనుండును, నొక్కమాసం బయాచితాశనుండును, నొక్కమాసంబు వాయుభక్షుండును, నొక్కమాసంబు నిరశనుండునునై తపం బాచరించి యొకనాఁడు వేకువజామున సకలకలుషభంజకంబగు గంగాప్రవాహంబున నఘమర్షణస్నాన మాచరించి విరజానలసంభవంబైన భస్మంబున సర్వాంగోద్ధూళనం బొనర్చి త్రిపుండ్రధారియై రుద్రాక్షమాలలు ధరించి వ్యాఘ్రాసనంబున బ్రాఙ్ముఖుండై కూర్చుండి ప్రాణాయామంబు చేసి నిశ్చలుండై విశ్వేశ్వరలింగంబున దృష్టి నుంచి యామహాదేవు భావించుచున్నంత నాలింగంబునందు కోటిసూర్యప్రభాభాసమానుండగు నొక బాలుండు గన్పట్టెను.

అంత విశ్వానరుం డానందాశ్రుపూర్ణలోచనుండును, గద్గదికానిరుద్ధకంఠధ్వనియునై లలాటంబున నంజలిపుటంబు ఘటించి 'సృష్టిస్థితి సంహార రూపపంచకృత్యపరాయణుండవగు నీకు నమస్కారము. తోయంబునందు శైత్యంబును, వహ్నియందు దాహకత్వంబును, తపనునందు తాపంబును, చంద్రునందు ప్రసాదంబును, పుష్పంబునందు సుగంధంబును, దుగ్ధంబునందు ఘృతంబునుంబోలె సర్వప్రపంచంబునం దెవ్వం డంతరాత్ముండై యుండు నట్టినీకు నమస్కారంబు, శబ్దంబు గ్రహించు నశ్రవణుండును గంధం బాఘ్రాణించు నఘ్రాణుండును చూచు నలోచనుండును, రసంబు గొను నరసజ్ఞుండును, దూరంబు నడచు ననంఘ్రియును నెవం డట్టినీకు నమస్కారంబు. నిజభక్తుండుదక్క విష్ణువిరించి పురందరాదిబృందారకు లెవ్వానియునికి నెఱుంగ రట్టినీకు నమస్కారంబు గోత్రజన్మంబులును, నామరూపంబులును, శీలంబును దెలియరాకుండ నుండియు నెవ్వండు నిజభక్తుల కభీప్సితంబు లొసంగు నట్టినీకు నమస్కారంబు. ఎవ్వడు సర్వంబునను, నెవ్వనియందు సర్వంబును నుండు నట్టినీకు నమస్కారంబు.' అని సంస్తుతించి సాష్టాంగదండప్రణామంబు గావించె.

తదనంతరంగితంబగు నవాంగవీక్షణంబున విశ్వానరుం గాంచి వృద్ధవృద్ధుండగు బాలుం 'డోయి భూసురోత్తమా! కాశికానగరంబున నీ వొనర్చిన తపశ్చర్యకు ఫలంబుగా పరమపవిత్రయగు నీభార్య శుచిష్మతియం దచిరకాలంబున నేన నీకు నందనుండనై యవతరింతు. సంశయంబు మాని నిజాశ్రయంబునకు జనుము.' అని యానతిచ్చి యంతర్ధానము నందె.

అంత విశ్వానరుండును విశ్వాసభక్తితాత్పర్యంబులు పెనంగొన నయ్యనంగమథనుం బ్రస్తుతించుచు నిజనివాసంబునకు జనియె. అంత గొంతకాలంబునకు నెల మసలుటయు శుచిష్మతి గర్భస్థకాలకంఠుని యనుభావగౌరవమున సంధ్యాకాలముల తాండవ మాడవలయుననియు ముముక్షావేళ ప్రాణికోటి కోంకారోపదేశంబు గావింపవలె ననియు, నేనుగుమోమువాని నంకమున నుంచి యాడింపవలయు ననియు నిట్లు పరిపరివిధంబుల జనియింపబోవు బాలకుని శైవత్వము ప్రకటించుచుండ నవమాసంబులు నిండె.

అంత నొక్కనాడు గురుడు కేంద్రస్థాయియై యుండ శుభలగ్నమునందు శుచిష్మతి కర్భిమ్మంతు వంశంబున విశ్వేశ్వరు నవతారమాయన సర్వలక్షణసంపన్నుండగు పుత్రుండు జనియించె. ఆసమయంబున ఘనాఘనంబులు పుష్పవర్షంబులు గురిసె. దిఙ్ముఖంబులు ప్రసన్నంబులై పరగె. వాహినులు విమలసలిలంబు లయ్యె.

అంత పదునొకండవ దివసంబున బ్రహ్మవిష్ణుమహేశ్వరులు కుమారావలోకనాయత్తచిత్తులై యేగుదెంచి గృహపతి యని నామకరణంబు గావించి చనిరి. పిదప గురుజనంబులు నాల్గవమాసంబున గృహనిష్క్రమణంబును, నారవమాసంబున నన్నప్రాశనంబును తదుపరియుక్తకాలములందు చూడాకర్మమును, గర్ణవేధమును గావించి యైదవయేట నుపాకర్మ గావించి వేదాభ్యాసమునకై యాచార్యసన్నిధికిం బంపిరి.

అంత నొక్కనాడు యదృచ్ఛాగతుండగు నారదుం డతిథిసత్కారంబు వడసి సుఖోపవిష్టుండై తనకు నమస్కరించిన గృహపతిం గనుంగొని యాదంపతుల కిట్లనియె.

'ఓయి విశ్వానరా! ఈబాలుండు మీచెప్పినయట్లు చేయుచు నున్నవాడా? తలిదండ్రుల యాజ్ఞ పాలించుటయే తనయునకు పరమ ధర్మము. దైవ మనినను, గురుం డనినను, ధర్మ మనినను తనూజునకు తలిదండ్రులే. జననీజనకుల భక్తిమై గొల్చుటకంటె నాత్మజునకు వేరు ధర్మంబు లేదు. నవమాసములు మోసి ప్రసవవేదన కోర్చి పలుపాట్లు వడి కని పెంచిన తల్లిని దేవతాబుద్ధి పాటించి సేవింపవలయు. అందు కనియకాదె వేదంబును మాతృదేవో భవ యని వచించు. ప్రాతఃకాల కృత్యంబులు నెరవేర్చికొని జననీశ్రీపాదంబులకు నమస్కరించి తత్పావన తీర్థంబు గొనిన సుతున కాయుష్యాభివృద్ధి యగు.'

అని వచించి నారదుండు గృహపతిం జూచి 'యన్నా వైశ్వానరా! ఇటు ర' మ్మని చేరం బిలిచి తొడమీదం గూర్చుండబెట్టికొని దక్షిణహస్తంబు చూచి లక్షణంబులు పరీక్షించి యంతట నూరకొనక యాపాదమస్తకంబు నంగంబులు నుపాంగంబులు కుంకుమాకారంబగు దారంబునం గొలిచి సకలసాముద్రికాగమాభిజ్ఞుండుగావున కలరూపు సెరింగి యాదంపతులం గాంచి 'యిక్కుమారునియందు భాగ్యలక్షణం బులన్నియుం గలవు. కాని నిర్దయుండగు విధాత పరాఙ్ముఖుం డయ్యె నేని యివి యన్నియును విఫలంబులై చను. చెప్ప నోరాడకున్నది. ఏ మని చెప్పువాడ? ఎరిగిన యర్థంబు చెప్పక యెట్లు దాటు? ఈబాల కునకు పదిరెండవయేట గండంబు గలదు.' అని వచించి యథేచ్ఛం జనియె.

అంత నాదంపతు లశనిపాతదారుణంబగు నమ్మునివచనంబునకు భయంపడి హాహాకారంబు గావించి మూర్ఛాంధకారంబున మునింగి యెట్టకేలకుం దెలిసి బహుప్రకారంబుల విలపించుచుండ గృహపతి తలి దండ్రులం గాంచి యి ట్లనియె.

'తల్లీ! ఏల యీపరితాపము? ఇంత భయ మేల తండ్రీ! మీ శ్రీపాదధూళి నా కంగరక్షగ నుండ మృత్యువు నన్ను సమీపింపనైన గలదా? కాదని పైకొనునేని వామపాదతాడనంబున పండ్లు రాల తన్న

గలవాడ. నాప్రతిజ్ఞ వినుండు. మీయనుజ్ఞ గొని కాశి కేగి మృత్యుం
జయుండగు నావిశ్వేశ్వరుని గొల్చి మృత్యుభయంబు వాసి మిమ్ము
జేరవచ్చెద. '

అని వచించు కొడుకుమాటలకు బరితోషంబు నొంది 'యె
ట్టెట్టూ! కాలకాలునా సేవింతు నంటివే? భయంకరకాలపాశబద్ధుడగు
శ్వేతకేతువును గావలేదా? పసివాడగు శిలాదతనయు ననుగ్రహింపడా?
కాలకూటాగ్నిచే గ్రాగకుండ పదునాల్గులోకంబుల గాపాడడా? ఆయుః
ప్రమాణంబు నిండిన మృకండుపుత్త్రు చిరజీవిని గావింపడా? అట్టి విశ్వ
నాథునకు నిను గాచు టెంత? మంచిది. పోయిరమ్ము వచించిరి. '

తలిదండ్రు లాశీర్వదించి యనిచిన నతండు గాశి కరిగి మణికర్ణి
కయందు స్నానమాడి విశ్వనాథుని దర్శించి తజ్జ్యోతిర్లింగంబు గనుం
గొని పరమానందకందం బనియు పిండీభూతంబైన త్రిలోకీరహస్యం
బనియు, సంసారమోహగాఢాంధకారవిధ్వంసనబ్రధ్నమండలం బనియు
లింగమిషంబున నాకారంబు గొన్న పరశివతత్త్వం బనియును భావించి
భావించి నమస్కరించి యొక్క పుణ్యాశ్రమంబు నేర్పరచికొని శుభవా
సరంబున లింగస్థాపనంబు గావించి తత్సమీపంబున వత్సరద్వయంబు
ఘోరంబగు తపంబు గావించె.

అంత నొక్కనాఁ డైరావతారూఢుండై యింద్రుం డాతని కట్టె
దురం బ్రత్యక్షమై ' ఓయి బాలకా! నీతపంబునకు మెచ్చితిని. వల
సిన వరము వేడు' మన వైశ్వానరుండు 'ఏమీ నిన్నా వర మడుగుట
నీకును, నాకును నధీశ్వరుండగు నావిశ్వేశ్వరు నర్థించెద ' నని వచించె.
అంత నయ్యింద్రుండు ' విశ్వనాయకుం డన నొకవేల్పు గలడా
నేన మూడులోకముల బాలింతును. సమస్తదేవతాచక్రవర్తి నగు నా
కన్న నధికుం డెవడు? సందియంబు మాని వలసిన వరం బర్థింపు ' మన
విశ్వానరసుతుం డాతనిం గాంచి ' నీప్రభావంబును, వారాణసీపతిప్ర
భావంబును నేన కాదు మూడులోకంబులు నెఱుంగు. నాతో నీవృథా
వాగ్వాద మేల? నీవంటి బడుగుదేవతలా వాంఛితార్థము లొసంగువారు

తపశ్చర్యావిరోధం బెల గావింతువు?' అని యుల్లసమాడుటయు నిం దురిందు వజ్రంబు కేలం బూని ఝళిపించుటయు బాలుండు మూర్ఛిల్లె.

అసమయంబున విశ్వనాథుండు ప్రత్యక్షుడై 'వత్సా! లెమ్మ' అని యూరడించి పలికిన శంభుభక్తిపరుండగు విశ్వానరసుతుండు దిగ్గన లేచి ముకుళితకరకమలుండై నిలువంబడుటయు నీశ్వరుండును నబ్బాలు నాదరించి విశేషప్రదంబైన యగ్నిలోకంబున కధీశ్వరుం జేసి యంతర్ధా నంబు నొందె. గృహపతియు బరమేశ్వరానుగ్రహంబున దీర్ఘాయుష్మం తుండును, దిక్పతియునై నిజనివాసంబునకు జనియె ఇది వైశ్వానరలోక వృత్తాంతంబు.'

## నిర్రుతిలోకవృత్తాంతము

ఇటిదంబుగ విష్ణుకింకరు లగ్నిలోకవృత్తాంతంబు వినిపించిన సం తసం బంది శివశర్మ వారలం గాంచి 'ఓయయ్యలారా! యమలోక వృత్తాంతంబు మున్నె వినిచితిరి. ఇందాగ్నిలోకవృత్తాంబులునువింటిని. అనుక్రమంబున నిర్రుత్యాదిలోకంబులను జూపి తద్వృత్తాంతంబులును వినిపింపు' మనిన వారు 'మహాత్మా! సంయమినీపురంబున కానల నిర్రుతిలోక ముప్పాచుండు జాతిమాత్రంబున రాక్షసు లగువా రిందు వసింతురు. వీరు దానదయాశాంతిసత్యాహింసాస్తేయనిరతులు, తీర్థ స్నానపరులు, సర్వభోగసములు, గతశ్రుతిమార్గులై చరియింతురు.

దైవవశులై తీర్థయాత్రాకాలమున మరణించినవా రీలోకమున వసించి సర్వభోగముల ననుభవింతురు. ఒక్క కాశియందుదప్ప యన్య తీర్థములయం దాత్మహత్య పాపహేతు వందురు.

ఈలోకంబున కధీశ్వరుండైన దిక్పతిచరిత్రంబు చెప్పెదను. సావ ధానమతివై యాలకింపుము.

వింధ్యపర్వతప్రాంతకాంతారంబున నిర్వింధ్యానదీతీరంబున నొక శబరాలయము గలదు. పింగాక్షుండను నొకభిల్లుం డావక్కణంబును బాలించుచుండును.

జాతికి జోడుయైనను గ్రూరకర్మపరాఙ్ముఖుండై వర్తించు. వ్యాఘ్రాదిదుష్టసత్త్వంబులంజెప్ప సాధుమృగంబుల వధించడు. ఎట్టిమృగమైనను విశ్వసించి కదలకున్నను, నీరు ద్రావుచున్నను, నిద్రించుచున్నను, మూలుగొన్నను, రోగియైనను అనుకంపాసమేతుండై విడిచినను.

కాశీయాత్రికులైన పుణ్యాత్ములకు ఫలమూలశాకపక్వాశనాదు లొసంగియు, పాదరక్షలు, ఆతపత్రములు, తాళవృంతములు, వస్త్రములు నొసంగియు తృప్తుల గావించుచుండు. రోగార్తుల నౌషధంబుల నిచ్చి యుపచరించుచుండు. తస్కరబాధ నొందకుండ యాత్రికుల నడవి దాటించి పంపుచుండు. వారును నాతని పరిచర్యలకు సంతృప్తి నంది యగ్నిహోత్రాంతములను, జపతపానసముదాయములాదులను, భోజనాంతములయందును నాశీర్వదించుచుందురు.

ఇవ్విధి పింగాక్షుడు యాత్రికుల కేబాధయు గలుగనీయక సమస్తోపచారంబులు గావించుచుండ గొంతకాలంబు గడచె. అంత నొక్కనా డాతనిపితృవ్యుండు దాసుకుం డనువాడు తెరువుగట్టి యాత్రికులను దోచుకొనియె. అప్పు డప్పురుసవారు రక్షణకై యులమటించుచు నార్చుచు నలువలంకులకుం బారిరి.

అంతకుమున్న దైవయోగంబున వేటకై యేతెంచిన పింగాక్షుం డయ్యార్తనాదం బాలించి 'యోహో! వెరవకుడు. నేను గలుగ మీకు భయం బేల?' అని తత్ప్రదేశంబున కేతెంచి క్రీడి కురుబలంబులపై గవిసినచందంబున గవిసి పుంఖానుపుంఖంబులుగా దీవ్రబాణపరంపరలు పరపి లుబ్ధకులం దోలి సార్థవాహులం గాపాడి విముక్తశబరవిప్రయుక్త బాణఖచితసకలశరీరుండై పంకశయనంబున శయనించి విగతప్రాణుండయ్యె.

ఇవ్విధి కాశీయాత్రికుల సేవించుటవలననైన పుణ్యంబున పరమేశ్వరానుగ్రహంబున దిగీశ్వరత్వంబు నొంది నిర్మృతి యయ్యె. ఇది నిర్మృతిలోకవృత్తాంతంబు.'

## వరుణలోకవృత్తాంతము

అని వచించి యావిష్ణుకింకరులు విమానంబు వరుణలోకంబుదరికిం గొనిపోయి శివశర్మ కిట్లనిరి.

'ఓమహానుభావా! ఇయ్యది వరుణలోకంబు. పరోపకారార్థము వాపీకూపతటాకాదిజలాశయంబుల గల్పించినవా రీలోకంబున నుందురు. పరమేశ్వరునిమూర్తిరూపంబయిన లింగంబుపై ధారాకుంభము నిల్పినవారును, భూసురులకు దియ్యని పంచదారపానకములు బోసినవారును, చలివెందరలు పెట్టి మార్గస్థుల కుదకదానము గావించినవారును, దీర్ఘయాత్రాపరుల కుదకకుంభములను, పాదుకలను నొసగినవారును, వేయుపాయంబుననైన ప్రవాహపతితుల గాపాడినవారును, వాపీకూపతటాకాదులయందును నదులయందును జలాహరణార్థము సోపాననిర్మాణము గావించినవారును వరుణలోకంబున సమస్తభోగంబుల ననుభవింతురు.

ఈలోకం బేలువాడు వరుణుండు. ఈతడు జలాశయాధిపతి, యాదఃపతి, సర్వకర్మసాక్షి. ఈతనియుత్పత్తి వినిపింతుము శ్రద్ధాళువవై యాకర్ణింపుము.

కర్దమప్రజాపతినందనుండు శుచిష్మంతుం డనువాడు చిరుతవయసున తోడిబాలకులం గూడి యచ్ఛోదంబను కొలనున జలక్రీడలు సలుపుచుండ నొక్క మొసలిచేతం బట్టువడిన దోడిబాలకులు భయభ్రాంతులై యేతెంచి దేవార్చనాసమయంబున నాతని తండ్రి కత్తెరంగు విన్నవించిరి.

కర్దముండును నభిధ్యానమార్గంబున పరమేశ్వరాధీనమానసుండు గావున బ్రహ్మాండంబుల, బర్వతంబుల, వనంబుల, నదుల, సముద్రంబుల, వాపీకూపతటాకకుల్యాప్రవహకారిణులం జూచి యం దొక్కయెడ నొకకొలనియందు శుచిష్మంతుండు తోడిబాలకులం గూడి జలక్రీడలు సలుపుటయు, నాసమయమున నొక్కమహాగ్రాహం బాగ్రహంబున పరతెంచి యబ్బాలకుని బట్టుటయు, నమ్మొసలియు కుసుమసుకుమార

దేహుండగు నక్కుమారుని కనుగొండకుండ జలాధిదేవ తాసమీపంబునకు దెచ్చుటయు, నామెయు నబ్బాలకుని సముద్రసమ్ముఖంబున బెట్టుటయు నంతలో క్రోధతామ్రాక్షుడును ద్రిశూలపాణియునగు నొక్క దివ్య పురుషుం డేతెంచి ' యిదేమి సాగరా! మహాపాశుపతుండగు కర్దము తనయునా చిరుతవాని నక్రింబుచేత గరపించి తెప్పించితివి? నీలలోహి తుని ప్రభావంబు నీ కెరుంగవచ్చునే ' యని యధిక్షేపించి పలుకుటయు సముద్రుండును భీతిభీతుండై యాబాలకు నలంకరించి శంభుకింకరున కిచ్చి మకరంబును వెంట గొని వారలతోడంగూడ బరమేశ్వరునిసన్నిధి కేతెంచి బహుప్రకారంబుల నాతని స్తుతించి యపరాధంబు వాపికొను టయు నద్దేవుండు పనుప ప్రమథుండు నక్రింబుతోడ గుమారుని దన యొద్దకు గొనివచ్చుటయు నాదిగాగల సర్వంబును గాంచె.

అదియు ధ్యానావసానసమయం బగుట గన్నులు తెరచి యప్పు రమమాహేశ్వరుండు సంభ్రమంబున కొలను వెడలి మొసలిమొదల్రాటిం బట్టి వచ్చి నమస్కరించిన కుమారు నాలింగన మొనరించె.

ధ్యానాసక్తచిత్తుండుగావున కుమారునిదెస జరిగిన దంతయును నాతనికి కరతలామలకంబుభాతి గాన్పించినది. చూచితివా పారమేశ్వర ధ్యాననిష్ఠామహిమ!

పిదప శుచిష్మంతుండును దండ్రియనుజ్ఞ వడసి వారణాసీపురం బున కరిగి లింగస్థాపనంబు గావించి యైదువేలయేండ్లు తపం బొనరించి ప్రత్యక్షుంబైన పరమేశ్వరునివలన వరుణపదంబు వరంబుగా బడసి రత్నా కరంబులకు, రత్నంబులకు, సరిత్సరకిపల్వలంబులకు; వాపీకూపతటాకం బులకు పడమటిదిక్కునకు నధిపతి యయ్యె. ఇది వరుణలోకవృత్తాంతంబు

— ... —

## వాయులోకవృత్తాంతము

ఓ మహానుభావా! అల్లదె యాకన్పడునదియె గంధవతి. ఈలోక మున కధిపతి గంధవహుండు. ఈశ్వరానుగ్రహమున నీత డీపదమును

గాంచినాడు. పూర్వకాలమున గశ్యపుని వంశమున పూతాత్ముడను నొక బ్రాహ్మణుడు గలడు. ఆతడు విశ్వేశ్వరు రాజధానియగు వారాణసి యందు లింగప్రతిష్ఠ గావించి పదివేలసంవత్సరములు తపం బొనరించె.

అంతట నొక్కనాం డాతడు లింగమధ్యంబున పరమేశ్వరభావన గావించుచు 'దేవదేవా! మహాదేవా! నారాయణేంద్రాదిసర్వదేవవర ప్రద! నీవు నామరూపవివర్జితుండవు. ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు నీయవి. ఒక్కరుండవయ్యును శివశక్తిభేదంబున ద్వైతంబుభజియింతువు. నీదక్షిణాంగంబు బ్రహ్మ. నీవామాంగం బచ్యుతుండు చంద్రసూర్యాగ్నులు నీనేత్రంబులు. నీనిశ్వాసంబు శ్రుతులు. నీప్రస్వేదాంబువులు సాగరంబులు. నీశోత్రంబులు సమీరణంబులు. నీభుజంబులు దిక్కులు. నీ ముఖంబులు బ్రాహ్మణులు నీబాహువులు రాజన్యులు. నీయూరువులు వైశ్యులు. నీపదంబులు శూద్రులు. నీకేశంబు లంబుధరంబులు నీవు ప్రకృతిపురుషరూపంబున బ్రహ్మాండంబు సృజియింతువు. నీయందు సర్వభూతంబు లుద్భవించు. నీవుసర్వభూతమయుండవు.' అని యనేకప్రకారంబుల బూతాత్ముండు సంస్తుతింప ప్రసన్నుండై పరమేశ్వరుం డాతని కోరిన దిక్పాలపదం బిచ్చి తనమూర్తులయం దంశంబు ప్రసాదించి సర్వగత్వంబును, ప్రాణాపానాదిపంచమూర్తిత్వంబును నొసంగె. ఇయ్యది వాయులోకవృత్తాంతంబు.

## కుబేరలోకవృత్తాంతము

ఇక కుబేరలోకవృత్తాంతంబు చెప్పెద మాకర్ణింపుము. గంధవతికి తూర్పుదిక్కున నాకప్పడునదె యలకాపురి. దాని కధిపతి కుబేరుడు.

పూర్వకాలమున కాంపిల్యపురమున వేదవేదాంగవేత్తయును, యజ్ఞవిద్యావిశారదుండునునగు యజ్ఞదత్తుం డను నొక బ్రాహ్మణుండు గలడు. ఆతనికి గుణనిధి యను నొక కుమారుడు గలడు. గర్భాష్టమంబున నుపనయనంబు గావించి తండ్రి యాతని విద్యాభ్యాసంబునకై యాచార్యులయొద్దకు బంపెను.

అతండును తలిదండ్రుల మొఱంగి విద్య నభ్యసింపక ద్యూత క్రీడారతుండై కాలక్షేపము సేయుచుండు. ఓడినధనంబులకై తల్లి నడిగియు, నీయకున్న దొంగిలించియు, ధనము దొరకకున్న నగ లపహ రించియు జూదరుల కిచ్చుచుండు.

తల్లియు ఒక్రితిదినంబును 'నాయనా! దుర్జన సాంగత్యము విడువుము. సాధు సాంగత్యం బలవర్చికొనుము. మీతండ్రి సెప్పినయట్లు గావింపు' మని బోధించుచుండును. తండ్రియు కార్యాంతరవ్యగ్రుం డగుటతన గొడుకు వర్తనంబు పరామర్శింపక యుండె.

కాని యుప్పుడప్పుడు 'గుణనిధి యెచట నున్నాడు? స్నానమా డెనా? సంధ్య వార్చెనా? అగ్నికార్యంబు గావించెనా' యని యడుగ గొడ్డుపిగొకన్న బిడ్డను గావున తల్లియు కొడుకు ధూర్తతను గప్పిపుచ్చి 'ఇప్పటివరకు నాయొద్దనుండి యిప్పుడే తోడివిద్యార్థులతో నయ్యవారి యొద్ద కేగినాడు. అన్నిపనులును కాలాతిక్రమణము గావింపక సక్రమముగనే గావించుచున్నాడు.' అని యబద్ధములాడుచు గాలము బుచ్చుచుండె.

అంత గొడుకునకు వివాహము కర్తవము స్సగుట నెఱింగి యా దంపతు లాతనికి వివాహంబు గావించిరి. అప్పటికిని గుణనిధి తనయకృత్యంబులు మాన కుండుటం గాంచి తల్లి యత్యంతదుఃఖితయై యొక నాడు పుత్రుం గాంచి యిట్లనియె.

'నాయనా? మీతండ్రి కోపిష్ఠియగుట నీ వెఱుంగునది కాదు. నీ వొనరించు దుష్కృత్యంబు లాత డెఱుంగుట సంభవించెనేని యింత కాలంబు గప్పిపుచ్చుచున్న నాయెడ నలుగకమానడు. శ్రోత్రియులు సోమయాజులనైన కులముపెద్దలను, రాజమాన్యుడైన జనకుని, పతి దేవతలలో గణనీయునగు నన్ను, వేదశాస్త్రపురాణాది సమస్తవిద్యా నిధులగు తోడివిద్యార్థులను శివానుగ్రహామువలన గల్గిన నిన్ను, పదు నారు వత్సరంబుల భార్యను దలంచియైన నీదుర్వ్యవర్తన మానుము.

ఈవిధి పట్టణమువీధులందు వెఱ్ఱివానివలె జూదరులగూడి తిరుగుట రాజు గాంచెనేని మనవృత్తులు దక్కునా? నీవలన జివరకు కూడును గుడ్డయు లేక యలమటింపవలసివచ్చును. తండ్రివిని కొలుపుగి తల్లియే యతివాత్సల్యంబున కొడుకు నిన్నాళ్ళును గప్పిపుచ్చి పాడుగావించినదని లోకులు నన్ను నవ్వరా?'

అని యీవిధంబున దల్లి యెంత బోధించినను చెన్ను సోకనీక గుణనిధి యిట్టిట్టనక యూరకుండెను. మృగయా, మద్య వేశ్యా, చౌర్య దురోదర పరదారాభిలాషంబు లను దోషంబులు సహజతాపనారంభమున సంభవించెనేని వానినుండి మరల్ప శక్యమా? అవి బలిసి సన్నిపాతం బయ్యెను చెవియందు చేరిన శూలగ్రుచ్చురీతి గురువచనంబును సభ్యునికి బాధ గలిగించు అయథార్థనామధేయుండగు గుణనిధి యథాపూర్వముగ దనదుష్కృత్యంబుల మానక కాలము గడపుచుండెను.

అంత నొక్కనాడు యజ్ఞదత్తుడు రాజదర్శనంబున కరుగుచు నొక్కపర్వదినంబున ధారాపూర్వకముగా రాజిచ్చిన రత్నాంగుళీయక మొకజూదరివ్రేల నుండుటం గాంచి యతనికడ కేగి 'యోయీ! ఈయంగుళీయకము నీ కెట్లు లభించినది? వాస్తవంబు వచింపుము కాదేని భూపాలునెదురం బెట్టి నిజంబు దెలిపి దండింతు' నన నాజూదరియు 'నయ్యా! నీతనయుడు గుణనిధి జూదంబున నోడిన ధనంబునకై యీ యంగుళీయకంబు నా కిచ్చినాడు. ఇది యొక్కటియ యనుకొంటివేమొ? బంగారుగిన్నెలు, వెండిపళ్ళెరములు, ఇత్తడివి, రాగివి, యినుపవి యననేల దొరికినవన్నియు దెచ్చి దాకట్టు పెట్టి జూద మాడుచున్నవాడు. నీయంతటి యాగదీక్షితుడు దీక్షితులలోనను, నీకొడుకునంతటి ధూర్తుండు జూదరులలోనను మరి లేరు.' అని వచింప లజ్జాక్రోధంబులు మనంబున బెంపొందగొన దీక్షితుండింటికేతెంచి 'సోమిదమ్మా! ఏమిచేయుచున్న దానవు? నీకొడు కెక్కడం బోయె? పోవుగాకేమి? విను' మని యిట్లనియె.

'అలనాడభ్యంగన మాచరించుతరి నాయంగుళీయకము పుచ్చుకొంటివిగదా? అది యిప్పు డెచ్చట నున్నది? అద్దాని ధరింపగాని పావకునకు హావిర్దానము చేయునా?'

అనిన నామె యు నాతని కిట్లనియె. 'ఇన్ని జాములెందాఁక వచ్చి నది? మాధ్యాహ్నికసంధ్యాసమయ మైనది. అగ్నికార్య మొనర్చి పరమేశ్వరారాధన గావింపుడు. భూసురులు [illegible] మొగసాల నున్నారు. ఉంగరంబు పదిలముగ మందసపు పెట్టెలో దాచినదాన వెదకి తెచ్చుట కిప్పుడు తీరిక లేదు. భోజనమైన పిమ్మట నిచ్చెదను.'

అనిన విని సోమయాజి మండిపడుచు 'ఎట్టి కపటవేషము గంటివి! ఆహా! ఏమి సూనృతభాషణములు! ఎంతటి సాధ్వివి! సాధ్వీత్వము నకుఁ బోనిదే పోయె నంటివేల? స్నానమాడి సంధ్యావార్చినదె? స్నానమాడి సంధ్య వార్చినను ఎందులకు? మాటిమాటికి నిన్ను నమ్మి కొడుకును భ్రష్టు జేసికొంటిగదా! మంచిది. ఇంటిలోని వస్తుపాత్రము లేమైనవి? రజతతామ్రపాత్రములసంగతి యటుండనిమ్ము నీవును, నీ కొడుకును నెంతపని చేసితిరి! చాలు. ఇంక నా పాలిటి కాతడు జచ్చినవాడు. కుపుత్రత్వంబుకంటె నపుత్రత్వంబు మేలు. కులపాంసనుండైన వీనిం ద్యజించి కులంబు రక్షించుకొనుటయే నీతి!' అని వచించి ఆ[illegible]క్రియాకలాపంబు నిర్వర్తించి భార్యాపరిత్యాగంబు గావించి కొన్ని దినంబుల కొక శ్రోత్రియునిపుత్రిం బెండ్లియాడి యజ్ఞదత్తుడు గృహస్థధర్మంబు నిర్వర్తించుచుండె.

గుణనిధియు దండ్రికోపం బెఱింగినవాడై యింటికి బోక యెందేని బోవ నిశ్చయించి మనంబున నిట్లని వితర్కించె.

'ఏమి సేయుదు? ఎక్కడి కేఁగువాఁడ? చేత చిల్లిగవ్వయైన లేదు. విచ్చలవిడిగ ధనము వెచ్చించిన నాకు భిక్ష మెత్తవలసినగతి? విభయములేని విద్యాధనము ధనముగాని చోరాద్యుపద్రవభూయిష్ఠ మగు ధనము ధనమా? పరమ పవిత్రమగు సోమయాజివంశమునకు జూదరినై యెట్టియపయశంబు గొనివచ్చితిని! హా! హంతవిధీ! ఎంత పని గావించితివి? మదేకపుత్రియగు తల్లి మొగ మెట్లు గాంతును?'

అని కటకటంబడుచు జనుచుండ రాత్రి యుపవాసము నుదయంబు నుండి యేమియు దినకపోవుటచే నాకలి పెచ్చుపెరిగి బాధించుచుండ నాహారం బెచట దొరకునో యని చింతాక్రాంతుండై చనుచుండె.

ఆరాత్రి శివరాత్రి యగుటంజేసి శైవుం డొకరుండు నగర బాహ్యప్రదేశంబున నొకశివాలయంబున జాగరణంబు జేసి నాలుగు జాములు నుపహారంబులు సమర్పించువాడై నియమంబు బూని భక్తి విశ్వాసతాత్పర్యాతిశయంబున భక్ష్యభోజ్యచోష్యలేహ్యపానీయసహి తంబులగు నోగిరంబులు సమృద్ధిగ పళ్ళెరంబుల నిడికొని యాలయంబున కేగి తనవ్రతంబు చెల్లించుకొనుచుండె.

గుణనిధియు పక్వాన్నగంధంబు గాలివెరవున నాఘ్రాణించి యా యన్నంబు నెబ్బంగి గుడువసమకూరునో యనితలంచుచు శంభుభవన ద్వారంబువరకుం జని యందు ప్రవర్తిల్లు నృత్యగీతవాద్యంబులు సరి ప్రొద్దు వోవునందాక వీక్షించుచు జాగరణంబు చేసి యంతంత భక్తులు చొక్కుమడంగియుండ దా నయ్యవసరంబున చప్పుడు గాకుండ దేవ ళంబులోనికి జొచ్చి పళ్ళెరంబులయందు దధ్యాజ్యమధుసంయు క్తంబులగు నాహారపదార్థంబుల జూచి గుక్కిళ్ళు మ్రింగుచు గర్భాలయమందలి దీపంబు మందరశ్మి యగుడు వత్తి యొక్కం ద్రోచి తనవస్త్రంబు జించి వత్తిగావించి నేయివోసి యాదీపంబు వెలుగున పక్వాన్నపాత్రంబు గైకొని బహిర్ద్వారప్రదేశంబున భుజింపనెంచి వెల్వడి వచ్చుచుండ నాతనికా లచట నిద్రించుచున్న యొకని దాకుటయు నాతడు మేల్కని మ్రుచ్చు మ్రుచ్చని యఱచె ఆయఱపు విని గతానుగతికంబున నందఱును మ్రుచ్చు మ్రుచ్చని యఱచుచు నాతనివెంట బడిరి. గుణనిధియు భయవిహ్వలుండై పాఱి పోవుచుండ రక్షకభటు లతనివెంట దవిలి బాణంబుల నేసి చంపిరి.

అంత నాతని గొనిపోవ పాశహస్తులై యమభటులు వచ్చిరి. పట్టిసత్రిశూలఖట్వాంగ ప్రముఖ బహువిధాయుధపాణులై త్ర్యంబక కింకరులు విమానంబు గొని వచ్చిరి. అవ్విధి నేతెంచిన పినాకపాణి భటులం గాంచి కృతాంతకింకరులు కరకమలంబులు మొగిచి యిట్లనిరి. 'ఓ మహానుభావులారా! తగవు, ధర్మంబు, పాడి, పంతంబు తెలియు మీకు ముల్లోకంబుల నడ్డు గలదే? మీ యెదుర నిలువ నే మెంతటి వారము? వీడో కులాచారహీనుండు పితృవాక్యపరాఙ్ముఖుండు సంధ్యా

ష్పానశివద్విషేసు. మీరుమిక్కిలి శివనిర్మాల్యాపహార్త. ఇట్టివినియం దొంగనుంజేసి ధర్మలేశంబు గలిగిన నాతనియందు నివియేనను. నీనిపుణ్యా పుణ్యావివేకంబునకు నీకు ప్రమాణంబు ’

కృతాంతకింకరవచనంబు లాలకించి శివకింకరు లిట్లనిరి, ‘ శివ ధర్మ మతిసూక్ష్మము అయ్యది లేశమైన సిద్ధించిన విఘ్నమహాపాపము లాతని చేరలేవు. ఇంకొక విషయము. స్థూలదృష్టి జూచిన నిందలిధర్మ సూక్ష్మము తోపదు. సూక్ష్మదృష్టికిగాని శివధర్మమాహాత్మ్యంబు గానం బడదు అగాధంబగుశివభక్తమహిమ తాపదప్పినయట్లుండునుగాని కాన రాదు. ఇది పాపము, ఇది పుణ్యము అని వివేచించుట కజున కయినను గోచరము గాదు. శివధర్మాచారము సూక్ష్మరూపమై యుం డును. ఇతడు చేయించిన పుణ్యకర్మంబు వినుడు.

ఆహారము లభింపకపోవుటచేతనే యితడు ఏకాంతపాత్రిదను నుపవసించినాడు. పదార్థంబు లపహరించు తలంపుతోడనే గావచ్చును వేగుజామువరకు జాగరణము చేసినాడు పాత్రావలోకనంబుకొరకె కానిమ్ము వత్తి వేసి నేయి పోసి దీపంబు ప్రజ్వలింపజేసినాడు. తాను చేయకున్నను బహులు గావించిన శివపూజ గాంచినాడు. చివరకు విధి మూడి చంద్రశేఖరు నగరిముంగసాల పెంద్రోవనట్టనడుమ మరణించి నాడు. సూక్ష్మదృష్టితో విచారించి చూచిన నింతకన్న ధర్మంబు లేవి గలవు? ’

అని వచించి పార్షదులు యమదూతల వీడ్కొల్పి యతని దివ్య విమానారూఢు గావించి శివలోకంబునకు గొనిపోయి శివునిసన్నిధిం బెట్టిరి. శివుండును జాగరణదీపప్రజ్వాలనాదిపుణ్యానురూపంబైన ఫలం బున గళింగదేశాధిపతియగు నరేంద్రమునకు దనయుండై దముం డనుపేర నాదేశంబునకు రాజుగా ననుగ్రహించి పుత్తెంచె.

ఈశ్వరానుగ్రహంబున నాతండును నావిధంబుగ జన్మించి పట్టా భిషిక్తుండై తనపట్టణంబునను, దేశంబునను శివాలయంబుల నిలువరుస దీపంబులు నిలుపవలయు ననియు నట్లు సలుపనివారి తల ద్రెవ్వనేయుం

డనియు జాటించెం. అవ్విధంబున సకలలింగాధిపతి దీపికాదానపుణ్యప్రభావంబున జన్మాంతరంబున గుబేరుండై యీశ్వరునకు సఖుం డయ్యె ఆవృత్తాంతంబు వినిచెదము సావధానమతివై యాకర్ణింపుము.

పద్మకల్పంబున బ్రహ్మమానసపుత్రుండై పులస్త్యుండు జన్మించె. ఆపులస్త్యునకు మహామునిప్రవరుండగు విశ్రవ స్సావిర్భవించె. అతనికి తపఃశ్రీసనాథుండగు కుబేరుండు జనియించి నెచ్చెలికాడై లంకాధిపతి యయ్యె. మేఘవాహనకల్పంబున నాతండు ధనేశ్వరుం డయ్యె. పిదప నాత డవిముక్తక్షేత్రంబున కేగి తనపేర నొకలింగంబు బ్రతిష్ఠించి విజాతీయప్రత్యయరహిత సజాతీయప్రత్యయసంతానానువృత్తిరూపంబైన నిదిధ్యాసంబున నివాతనిష్కంపదీపంబునుంబోలె పెద్దకాలంబు కాలకంఠు మంగళజ్యోతిర్లింగంబు నంతరంగంబున భావించుచుండె.

ఇవ్విధంబున పదివేల వత్సరంబులు గడచుటయు నొక్కనాడు ఖండేందుధరుండు ప్రత్యక్షంబై వరంబు వేడు మనుటయు శతసహస్రకోటిసూర్యప్రభాభాసురంబైన తేజోమండలంబునడుమ పొడచూపిన నిందుధరుని మేనికాంతి కాతని కన్నులశక్తి గడతేర నాతం డంధుం డయ్యె. అంత చేయునది లేక పంచబ్రహ్మప్రణవపంచాక్షరాదిమంత్రంబుల బరమేశ్వరు నంతరంగంబున భావన సేయుచు ‘ మహానుభావా! మీశ్రీపాదపద్మంబులు దర్శించునట్టి భాగ్యంబు దయసేయవే ’ యని ప్రార్థించుటయు త్ర్యంబకుండును జాలిగొని యాతనికి దివ్యదృష్టి నిడె.

అంత గుబేరుండును నపరిమితానందంబున భక్తవత్సలుండగు శంకరు దర్శించు కోర్కెమెయి గన్నులు తెరువ నాతనిదృష్టి పినాకపాణి డాపలిదెస విరాజిల్లుచున్న సర్వమంగళపై బ్రసరించెను. అంత నాతం డీవిధంబుగ జింతింపం దొడంగె. ‘ జగదేకసౌభాగ్యజన్మభూమియునదగు నీయిందుబింబానన యెవరు! పరమేశు నర్ధశరీరం బాక్రమించుట కీమె యెట్టి తపంబు గావించినది? ’

ఇవ్విధంబున నీసునంబోలె గన్నార్పక తన్ను గాంచుచున్న కుబేరునిం గాంచి గిరిరాజపుత్రి పరమేశ్వరునితో నిట్టు లనియె. ‘ ఏమీ!

జగదంబనగు నాయొకమునకా యీర్ష్యపడి యపాంగవీక్షణంబుల గ్ర
హింపజేయుట! ఎట్టిమహాగతము! నీక్రూరపెంపునగదా యిట్టివెల్ల నయ్యెను!

అని యీవిధంబున కుపితయై పార్వతి పల్క వినుచుండిన శంక
రుండు హాసం బొనరించి యిందుశేఖరుం డిట్లు లనియె 'ప్రేయసీ! మత్సరం
బెగ్గు మానుము. అన్యథా భావింపకుము. ఈతడు కుమారునివంటివాడు
నందనులు బహువిధంబుల ధౌర్త్యము లాచరింతురు. వాత్సల్యంబున
క్షమియింపవలెగాని కినియవలెనా? ఈతడు పెద్దకాలం బీయవిముక్త
క్షేత్రంబున దపంబు గావించినాడు. ఏను వీనికి వర మిచ్చితి. నీవును
వర మిమ్ము.' అని పలికి పరమేశ్వరుం డాతనికి యక్షకిన్నరగుహ్యక
లోకాధిపత్యంబును ధనసఖ్యంబును నిచ్చి మన్నించె. భవానియు 'బా
రూపంబున కీసుపడి న న్నీక్షించుటం గాంచితి వయ్యది యంధం బగుఁగాక
ఈశుం డనుగ్రహించిన వరంబు లట్ల యగుఁగాక! నాస్థితి కసూయ జెంది
తివిగావున కుబేరనామంబున వరలుదువుగాక!' యని యాదరించె.

ఈవిధంబున జంద్రశేఖరునితో జెలికారంబు వడసి ధనమందు
నవనిధుల కాకరంబైన యలకాపట్టణంబున కధిపతియై యలరారుచుండు
ఇయ్యది కుబేరలోకవృత్తాంతంబు. ఇంక నీశానలోకవృత్తాంతంబు విని
చెద మాకర్ణింపుము.

## ఈశానలోక వృత్తాంతము

అలక కవ్వల నాకవ్వడునది మహోదయ మను పట్టణము. అది
యీశానరాజధాని. అందు అజైకపాదులైన పదునొకండ్రు పారిషదు
లుందురు. అందరును ఫాలాక్షులు, శశిశేఖరులు, నీలకంఠులు, వృషవా
హులు, నాగభూషణులు, ఆపాండుదేహులు. అందరును నానందకాన
నంబున దమపేర దివ్యలింగంబుల స్థాపించి యారాధించి తత్ప్రసాదం
బున నీశానలోకంబున కధిపతులై శాశ్వతసుఖంబుల నందినారు.

అనిన విని కొంతద వ్వరిగి శివశర్మ పుణ్యశీలసుశీలురం గాంచి

'ఓ మహానుభావులారా! ఇచ్చట యిది యే లోకంబు? నేత్రాహ్లాదకరంబుగా నున్నది. దీని కధిపతి యెవ్వరు? దీని వృత్తాంతంబు నిరూపింపరే ' అని యడుగుటయు వార లాతని కిట్లనిరి.

## చంద్రలోకవృత్తాంతము

' సర్గాదియందు విరించి నేత్రంబులనుండి సూర్యుని, హృదయంబున భృగువును, శిరంబున నంగిరసుని, ఉదానంబున బులస్త్యుని, వ్యానంబున బులహుని, సమానంబున గ్రతువును, ప్రాణంబున దక్షుని, శ్రోత్రంబున నత్రిని, సమానంబున వసిష్ఠుని, సంకల్పంబున ధర్మువును సృజియించె. అందు అత్రి యను మునీశ్వరుండు పరమేశ్వరు నుద్దేశించి మూడు వేలవత్సరంబులు తపం బాచరించె. అతని తేజోరసప్రవాహంబు బ్రహ్మరంధ్రంబున కెగసి యటనుండి నేత్రగోళంబులు నిండ నంతట వదిధారలై దశదిశలందున బ్రవహించె. అపిఘంబున నాభానురసంబును ధరియించి దశదిశలును గర్భంబులు ధరియించి తొమ్మిది నెలలు మోచి కఠోరగర్భలై ప్రసవకాలంబు సమీపించుటయు సత్త్వభాగంబు భరియింప లేక భూమండలంబుపై వ్రాలె. ఆదిగ్దేవతల గర్భంబున నుద్భవించిన తేజం బేకీభవించి చందురుండై యఖిలజగద్ధితార్థం బరమేశ్వరు నాజ్ఞ నాతనిరథం బెక్కి యష్టాదశద్వీపంబులు చరించి తనకుం దాన వృద్ధిబొందె.

ఆసుధాకరుండు కాశి కేగి యట నమృతోదం బను కుండంబు నిర్మించి తత్తీరంబున చంద్రేశ్వరం బను లింగంబు స్థాపించి బహుదివ్యవర్షంబులు తపంబు గావించి యాదేవదేవు ననుగ్రహంబున నోషధీశోయంబులకును ద్విజన్ములకు రాజయ్యె. మరియు నమ్మహాదేవు ననుగ్రహంబున నాచందురుండు రాజరాజై వసుధయెల్ల నేకాతపత్రంబుగ బాలించె. పిదప హిరణ్యగర్భాత్రిభృగువులు ఋత్విజులుగా హరి సదస్యుండుగా, సినీ కుహూ ద్యుతి పుష్టి ప్రభా వసు కీర్తి ధృతి లక్ష్ములను తొమ్మండ్రు ధర్మపత్నులతోడం గూడి యుమామహేశ్వరప్రీత్యర్థంబు

రాజసూయాధ్వరంబు నొనర్చి మఖసమాపనకాలంబున సదస్యులకు మూడుకలోములను దక్షిణగా నొసంగె.

ఇట్లు రాజసూయాధ్వరంబు గావించి యవభృథస్నానంబు చేసిన చంద్రుం గాంచి పరమేశ్వరుండు ' ఓయి చంద్రా! మహాతపస్వి యగు నత్రియంశంబున జనియించితివి. బ్రహ్మరథం బెక్కి యష్టాదశ ద్వీపంబుల నవలీల దిరిగితివి. త్రైలోక్యదక్షిణంబుగ రాజసూయాధ్వరము గావించితివి. నీయట్టి ధన్యుం డొకరుండు గలడె! ఏతత్ఫలంబుగ నాయష్టమూర్తులలో నొకరుండవై వర్తింపు ' మని యానతిచ్చి యంతర్హితుం డయ్యె.

— // —

## నక్షత్రలోకవృత్తాంతము

అనిన విని శివశర్మ వారలం గాంచి ' చంద్రలోకంబున కెట్టయెదుర ముత్యాలజల్లివోలె నెగడుచున్న దది యేలోకంబు? వినవలతు జెప్పరే ' యని యడుగుటయు వార లిట్లనిరి.

' సర్గాదియందు పరమేష్ఠిచరణాంగుష్ఠంబున దక్షుండు జనించె. ఆతనికి రూపలావణ్యవిలాసవతులగు నరువండ్రు కన్యకలు పుట్టిరి. వారు తండ్రియనుమతి వడసి వారాణసి కేగి నక్షత్రేశ్వరు డను పేర నొక లింగంబు స్థాపించి దివ్యవర్షసహస్రంబు తపంబు గావించిరి. అంత పరమేశ్వరుండు ప్రత్యక్షంబై వరం బడుగు మనుటయు వారును నీయట్టివాడు మాకు భర్త గావలయు నని కోరిరి. శంకరుండును వారు కోరిన వరం బొసంగి ' మీరు సమస్తజ్యోతిశ్చక్రంబునకుమ నగ్రగణ్య లయ్యెదరు మరియును మేషాదిరాసులకు గారణంబు లయ్యెదరు. సకలౌకరుండును బ్రాహ్మణాధిపతియునైన చంద్రునకు పత్ను లయ్యెదరు. చంద్రలోకంబున కూర్ధ్వంబుచ మీలోకం బలరారు ' నని యనుగ్రహించి యుం డంతర్హితుం డయ్యె. ఇయ్యది నక్షత్రలోకవృత్తాంతంబు.

# బుధలోకవృత్తాంతము

అని వినుచునంత విమానంబు బుధలోకంబు చేరం జనుటయు శివశర్మ విష్ణుకింకరులం గాంచి 'యిది యేలోకంబు? దీని కధిపతి యెవ్వ రని యడుగుటయు వార లి ట్లనిరి.

'అత్రిపుత్రుండగు చంద్రుండు శైశవంబున విద్యాభ్యాసంబు కొరకు దేవగురుసన్నిధి కేగి విద్యాభ్యాసంబు గావించుచుండె. ఆతని భార్య తార సంతానహీనగావున నాతని సుతనిర్విశేషంబున బెంచుచు లాలించుచుండె ఇట్లు కాలంబు గడచినకొలది చంద్రుండు బాల్యంబు గడచి యౌవనంబు ప్రాపించె. అంత దైవదుర్యోగంబున దార వాని రూపంబు కాంచి ముగ్ధ యయ్యె. చంద్రుండుమాత్రియు గురుపత్ని యను భావంబున మిన్నకుండె కాని తార గావించు హావభావంబులకు మనస్సు చలింప చంద్రుండు తదనుగుణంబుగ వర్తింపసాగె.

పుష్పాయుధునిచేత ప్రసూనాస్త్రంబుల నేటుపడనివాడును, క్రోధాంధకారంబున నంధుండు గానివాడును, లోభంబునకు పరవశుండు గానివాడును, ఐశ్వర్యంబున గర్వితుడు కానివాడును, గలరా? ఎంతవారైనను బాహ్యశత్రువుల జయింపవచ్చునుగాని యంతఃశత్రువుల జయించుటన సామాన్యమా?

తరువాతి వృత్తాంతంబు వినుము. క్రమంబున తార గర్భంబు దాల్చె. బృహస్పతియు చంద్రుండు చేసిన యపరాధంబు హరిహర హిరణ్యగర్భులకును, ఇంద్రాదిసురలకును నెరింగించిన వారును నియ్యది తగవు గాదని చంద్రునకు బుద్ధి చెప్పిరి. కాని చంద్రుండును తారను బృహస్పతి కప్పగింపక యుద్ధసన్నద్ధుం డయ్యె.

అంత నీశ్వరుండు చంద్రుని యౌద్ధత్యంబునకు గనలి యజగవంబున బ్రహ్మశిరోనామకాస్త్రంబు సంధించుటయు లోకోపద్రవం బగు నని భయంపడి పద్మాసనుం డడ్డుపడి ప్రమథనాథుని కోపంబు మాన్పి చంద్రునకు బుద్ధి సెప్పి తారను బృహస్పతి కిప్పించె.

అమృతమయుండుగావున సుధాంశుసాంగత్యంబున తార కశుద్ధి లేదని బ్రహ్మాదులు నిర్ణయించుటచే బృహస్పతియు దారను గైకొనియె పిదప గొంతకాలంబునకు దారయందు గర్భలక్షణంబులు గాన్పింప బృహస్పతి భార్యం గాంచి యేకాంతంబున నీగర్భం బెవ్వాని కైనది చెప్పుమని యడిగె. తారయు లజ్జాభరంబున నెంత యడిగినను చెప్పదయ్యె. అంత గుపితుండై దేవగురుండు శపింపబూనుటయు వేల్పు లామెం జేరి సత్యము వచింపు మని యనేకవిధంబుల గ్రుచ్చిగ్రుచ్చి యడిగిరి. కాని సిగ్గున నామె మిన్నకుండె.

ఇది యెరింగి పద్మాసనుం డేతెంచి కలతెఱంగు వచింపు మని యడుగుటయు నామెయు చంద్రునికైన గర్భం బని వచించె. బృహస్పతియును దారకు జన్మించిన కుమారుని జంద్రున కిచ్చె. చంద్రుం డాతనికి బుధుం డను నామకరణంబు గావించె.

బుధుండును దండ్రి యనుమతి వడసి కాశి కరిగి తనపేరున బుధేశ్వరుం డను లింగంబుం బ్రతిష్ఠించి పెద్దకాలంబు తపంబు గావించి యాలింగంబున సాక్షాత్కరించిన విరూపాక్షుం బ్రస్తుతించి యాతని యనుగ్రహంబునవలన నక్షత్రలోకంబున కూర్ధ్వంబుగనున్న లోకంబున కధిపతి యయ్యె.

అని చెప్పుచు విమానంబు శుక్రలోకంబుదరికిం గొనిపోయి వార లాతని కి ట్లనిరి.

— ... —

## శుక్రలోకవృత్తాంతము

' ఇయ్యది శుక్రలోకంబు. ఇందు శుక్రుండు వసించు. ఈతడు భర్గునివలన పదివేలవత్సరంబులు కణధూమంబు బాహారంబుగా దుస్సహంబైన తపం బాచరించి మృతసంజీవనీవిద్యారహస్యంబు సకలంబుగా

నెరింగినవాఁడు. ఈవిద్య భవానియు కుమారుండుదక్క నన్యు లెరుంగరు

హరాంధకులకు జరిగిన మహాయుద్ధంబున నీల్గిన రాక్షసులను భార్గవుండు మృతసంజీవనీవిద్యాప్రభావంబున బ్రదికించుచుండ బారిష దులు పరమేశ్వరుం గాంచి యోమహానుభావా! మీచేత వడసిన మృతసంజీవనీప్రభావంబున శుక్రుండు కదనంబున నీల్గిన రాక్షసులనెల్ల మరలం బ్రదికించుచున్నాఁడు ఈపద్ధతియే కొనసాగుచుండిన మాకు జయంబు గల్గుట యసంభవం బని విన్నవించిన నీశుండును నందికేశుం బంపి శుక్రునిం బందిగా దెప్పించి కరతలమున నుంచి చలిదిముద్దవలె మ్రింగి గర్భమునం దేర్చెను. అంధకాసురుండును భార్గవుండు లేకపోవుటచే కొంతకాలంబునకు శంకరునిచే హతుం డయ్యె.

కావ్యుండును బహుకాలంబు కాలకంధరు జఠరగోళంబునం దుండి పరమేశ్వరభావన గావించుచు తదనుగ్రహంబున శుక్రద్వారం బునుండి శుక్రరూపుండై వెడలి తత్క్షణంబ నిజరూపం బది పరమేశ్వరు నిచే నిజాత్మసంభవుడుగా నాదరింపంబడి వీడ్కొల్పబడియె.

పిదప నాతడు కాశి కేగి తనపేర శుక్రేశ్వరుం డను లింగంబు బ్రతిష్ఠించి యాలింగంబునందు మహాదేవు భావించుచు పనేకకాలం బారాధించి యాతని యనుగ్రహంబున నీలోకంబున కధిపతి యయ్యె. ఇయ్యది శుక్రలోకవృత్తాంతంబు. '

— // —

## అంగారకలోకవృత్తాంతము

అని వచియించుచుండ విమానం బంగారకలోకంబు సమీపిం చుటయు శివశర్మ వారల కిట్లనియె.

'పద్మరాగ ప్రభలను పరిభవించుచు ప్రకాశించుచున్న యీ లోకం బెయ్యది ? దీని కధిపతి యెవ్వరు ? అతని చరిత్రం' బెట్టి దని యడుగ వార లాతని కిట్లనిరి.

'తొల్లి దక్షయజ్ఞంబున దాక్షాయణి యోగాగ్ని దగ్ధయైనంత తదాలోచనా ధీనమానసుండైన పశుపతి ఫాలంబునుండి యొక ప్రస్వేద బిందువు ధరాతలంబున బడియె. తత్పరిభావంబున విశ్వంభర గర్భవతియై యొక్క కుమారుం గనియె ధాత్రీశ్వరులిద్దరును నాతని దనయుగా నాదరించిరి. ఆ విధమున పరమేశ్వరునివలన ధాత్రికి జనియించిన ఆ కుమారుండే యంగారకుడు.

అక్కుమారుండు వారి యానతి గొని కాశికరిగి పరమనైష్ఠికుడై తనపేర నంగారకేశుండను లింగంబుం బ్రతిష్ఠించి యనేకకాలంబు ఘోరంబగు తపంబు గావించి ప్రత్యక్షంబైన పార్వతీపతి యనుగ్రహంబువలన నీలోకంబున కాధిపత్యంబు వరంబుగా బడసె. ఇది యంగారకలోకవృత్తాంతంబు.'



# బృహస్పతిలోక వృత్తాంతము

అని వచించుచు విమానంబు బృహస్పతిలోక సమీపంబునకు గొనిపోయి శివశర్మతో నిట్లనిరి.

'అదె యంగారకలోకంబున కూర్ధ్వభాగంబున గన్పడునదె బృహస్పతిలోకంబు. ఈతడు సర్వశాస్త్ర విశారదుడు. ఈతండును తొల్లి లోకపాలురవలె పరమేశ్వరానుగ్రహ కాంక్షియై వారాణసి కరిగి యందు దనపేర నొక శివలింగంబు బ్రతిష్ఠించి తత్సమీపంబున బహువర్షంబులు తపంబుచేసి ప్రత్యక్షంబైన నీశ్వరు నీరీతి స్తుతించె.

జయ శంకర ! శాశ్వత ! చంద్రధరా ! భయనాశ ! గిరీశ్వర !
భక్తపరా !
నయనత్రయభాస్వర ! నాగహారా ! ఆయవర్ధన ! శాంత !
దయామధురా !
భువనావన ! పావన ! భూతపతీ ! భవ ! పన్నగభూషణ !
భద్రకృతీ !
శివ ! దేవ ! మహేశ ! విశిష్టమతీ ! భవభంగ ! ఫలప్రద !
పాపహృతీ !
శ్రితపాపవిభంజన ! సిద్ధనతా ! క్షితిజార్ధవపుర్ధర ! చిద్విదితా !
మృతిజన్మవిధూత ! హరిప్రణుతా ! సతతప్రణవధ్వని సాధరతా!

ఈ విధంబున బృహస్పతి గావించిన స్తోత్రంబునకు ప్రీతుండై పరమేశ్వరుండు ప్రత్యక్షంబై యాతనిగాంచి 'ఓయీ ! బృహన్నిష్ఠ బృహత్తపము గావించితివి గావున బృహస్పతివనియు, ప్రాణంబు ప్రాణమై భక్తి గావించితివి గావున జీవుండ వనియు, వాగాడంబరంబున నైవారంబు చేసితివిగావున వాచస్పతి వనియు నామంబుల బరగుదువు. అంగారకుండు పాలించు లోకమున కూర్ధ్వంబగు పదంబున నుండు' మని వరంబు లిచ్చి సంస్కరణమాత్రంబున నేగుదెంచిన బ్రహ్మాదిదేవతలచేత సవాచస్పతికి దేవతాచార్య పదివికి పట్టాభిషేకంబు చేయించి యంతర్హితుండయ్యె. ఇది బృహస్పతిలోకవృత్తాంతంబు !

---

# శనైశ్చరలోక వృత్తాంతము

అని వచించి విమానంబు సూర్యలోకంబు దరికి గొనిపోవుటయు శివశర్మ యాకింకరులం గాంచి 'ఓ మహాత్ములార ! రెండవసూర్యము

నా నొప్పారుచున్నదిది యెవ్వరిలోకము. ఈ లోకమున కధిపతి యెవ్వరు? ఆతని వృత్తాంత మెట్టి దన వార లి ట్లనిరి.

"ఇయ్యది శనైశ్చరలోకము. ఇతడు గ్రహములలోకెల్ల నతి విశిష్టుడు. ఇమ్మహాత్ముని శుభచరిత్రము చెప్పెదము వినుము. నారా యణుని నాభికమలంబున బ్రహ్మ జనియించె. ఆతనికి మరీచియు, మరీచికి కశ్యపుండును జన్మించిరి. కశ్యప ప్రజాపతి పుత్రుడు మార్తాండుడు. అతండు త్వష్టకూతురగు సంజ్ఞయనుదాని వివాహమాడె. ఆతని కామె వలన మనువు, యముడు నను పుత్రులును యమున యను కన్యయు గలిగిరి.

అంత గొంత కాలంబునకు అత్యంత కోమలదేహ యగు సంజ్ఞ మగని యత్యుష్ణతేజమున కోర్వలేక యాత్మసమానమూర్తియగు ఛాయ యనుదాని సృజియించి యామెతో గల్యాణీ! నేను పుట్టినింటికి బోయివచ్చెద. నామాఱుగ నీవు మదీయాజ్ఞ సూర్యునికిం బరిచర్య సేయుము. మనువును, యముండును, యమునయు నను నీయపత్యత్ర యంబును ద్వదీయంబుగా దలంపుము. ఈ రహస్యంబు కచగ్రహణకాల పర్యంతం బెవ్వరికిం జెప్పకుమని యప్పగించి పితృగృహంబునకుం బోయె.

సూర్యుండును నామెను సంజ్ఞగా దలంచియుండె. అంత గొంత కాలంబునకు సూర్యునకు ఛాయవలన సావర్ణియు, శనైశ్చరుడును నను పుత్రులును భద్రయను కన్యయు జనియించిరి. ఛాయయు సర్వస్త్రీ సహజ స్వభావంబగు సాపత్న్య గుణంబున సంజ్ఞాసంతానంబునకంటె దనసంతతియం దత్యంత వాత్సల్యము పాటించి భోజనాలంకారలాల నంబుల పట్టున వైషమ్యంబు గలిగియుండ నొక్కనాడు భవితవ్యవిలా సంబుననో, బాల్యచాపల్యంబుననో యముండు ఛాయాదేవిం గోపించి తన్నుందలంచి పాదం బెత్తెను. ఎత్తుటయు ఛాయ యొకింతైన కరుణలేక యెత్తిన పాదంబు తెగిపడునట్లు శపియించె.

సంజ్ఞాదేవి తనను నమ్మి సంతానంబు నిల్లడవెట్టి యిట్లుపరచి నది? కన్నబిడ్డయనియైన కనికరము వహింపక పట్టి సాలార్పవలయునా? తానేమి బిడ్డల గాంచదా? సవతికొడుకు తప్పొకటి లోగొన్న పోవున దేమి? ఈ యల్పదోషంబున కిట్టియననురూపంబైన ప్రబలదండన మొనర్పవలయునా?

ఈ విధం బెఱింగి భానుండు ఛాయం గాంచి 'అపరాధ మొనరించెనే యముడు. కన్నతల్లియైన నీరీతి క్రూరముగ శపియింపగలదా? సత్యంబు దాచక నీ వృత్తాంతం బెఱింగింపు' మని యడిగిన నామెయు శాపభయంబున దన తత్త్వంబు సాకల్యంబుగ విన్నవించె. సూర్యుండును దాని యపరాధంబు పొడగానక యముని జూచి మాతృ శాపంబు నివర్తింప శక్యంబు గాదు. నీపాదంబునంగల మాంసంబు క్రిమికీటకంబులు దొలిచి భక్షింప భూమిపయిం బడియెడు నని పలికి కొడుకు నూరడించి మామయింటికిం జని తనభార్య తపంబు చేయం జనుటయు, నున్న ప్రదేశంబును నెఱింగి యచ్చోటున కరిగి కురుక్షేత్రంబున నాడుగుఱ్ఱమై యేకాంతవృత్తి విపినవీధులం దిరుగుచున్న సంజ్ఞం గాంచి తానును ఘోటకరూపియై కందర్ప వికారంబువలన డాయవచ్చిన నామెయు నాతని నిజభర్తగా నెఱింగి యంగీకరించె. అంత వారికి నాసత్యులన నిద్దరు కుమారులు జన్మించిరి. వారె దేవవైద్యులైరి. అంత సంజ్ఞాసూర్యులు నిజరూపంబుల ధరించి ఆత్మనివాసంబునకు జనిరి.

అంత నక్కడ శనైశ్చరుండును వారాణసి కేగి లింగస్థాపనంబు గావించి బహుకాలంబు తపంబు గావించి పరమేశ్వరానుగ్రహంబు వడసి యా లోకంబున కధిపతి యైనవాడు. ఇది శనైశ్చర లోక వృత్తాంతంబు.'

## సప్తర్షి లోకవృత్తాంతము

అని వచించి విమానము సప్తర్షిలోకంబునకుఁ గొనిపోయి యా దూత లిట్లనిరి.

'మరీచి, అత్రి, పులస్త్యుడు, పులహుఁడు, క్రతువు, అంగిరసుడు, వసిష్ఠుడు ననువా రేడ్గురు బ్రహ్మమానసపుత్రులు. వీరికి ధర్మపత్నులు సంభూతి, అనసూయ, క్షమ, ప్రీతి, సన్నతి, స్మృతి, అరుంధతి యను వారలు. వీరివలన నామహాత్ములు నానావిధ ప్రజల సృజియించి బ్రహ్మాదేశంబున నవిముక్తక్షేత్రంబున కేగి తమతమపేర లింగంబుల బ్రతిష్ఠించి తపంబు గావించిరి. సంభూత్యాదిపత్నులును దమ పేర లింగంబుల బ్రతిష్ఠించి తపంబు గావించిరి. పరమేశ్వరానుగ్రహాలబ్ధంబైన యీ లోకంబున సప్తమహామునులును బరమసుఖం బనుభవించుచున్నవారు.

ఈ లోకంబుననే వసిష్ఠసమీపంబున నయ్యాదే యరుంధతి విరాజిల్లుచున్నది. తన్నామస్మరణమాత్రంబున గంగాస్నానఫలంబు లభించును, పతివ్రతానామగణనమునందు బ్రథమస్థానము నాక్రమించునది యొక్క యరుంధతీనామమే.

ఇది సప్తర్షిలోకవృత్తాంతము. ఇక నేమి వినవలతు జెప్పుమని యడుగుచుండ విమానంబు ధ్రువలోకంబుచెంత కరుగుటయు శివశర్మ విష్ణుకింకరులం గాంచి 'యో మహానుభావులారా! ఇది యేలోకము? ఈ లోకమున కధిపతి యెవరు? త్రిలోకమండపమున కాధార స్తంభభూతునివలె నదే యా యేకపాదమున భ్రమించుచున్నయాత డెవరు? అని యడుగుటయు, వార లిట్లనిరి.

## ధ్రువలోక వృత్తాంతము

'స్వాయంభువమనువునకు ఉత్తానపాదు డను కుమారుడు గలడు. ఆతనికి సురుచియందు ఉత్తముడును, సునీతియందు ధ్రువుడును నను

నిరువురు కుమారులు గలరు. ఒకనాడు సునీతి కుమారుని నలంకరించి సవయస్కులగు బాలకులతో దండ్రియొద్ద కనుప ధ్రువుండును సభా మధ్యంబుననున్న యుత్తానపాదునికడ కేగి తండ్రియుత్సంగమున నుత్తముం గాంచి బాల్యచాపల్యంబున తానును తండ్రియుత్సంగమున గూర్చుండ సింహాసనసోపానముల నారోహించుచుండ సురుచి ధ్రువునితో నిట్లనియె.

'ఆగు మాగుము. సునీతిగర్భసంజాతుడవగు నీకు సింహాసన మధిష్ఠించు నధికారము లేదు. అంతటి యదృష్టమే యున్న నా కడుపు ననే పుట్టియుండెడివాడవు. రాజకుమారుడవైనను మద్గర్భసంజాతుడవు కాకపోవుటచే నుత్తమునితోబాటుగ దండ్రియుత్సంగము నధిరోహించుట కర్హత లేదు.'

అని యీ విధముగ సభామధ్యమున సురుచి తూలనాడుటయు, రాజును సురుచివలననైన భయంబున గిమ్మనక యూరకుండెను. ధ్రువుండును చేయునది లేక కనులనీరు కనుల గ్రుక్కుకొని తండ్రికి నమస్కరించి మాతృసన్నిధి కేగెను. సునీతియు కొడుకుం గాంచి యతని ముఖలక్షణములవలననే యేదో యవమానము జరిగిన దని యూహించి బాలకు నోదార్చి రోదనకారణ మడిగెను.

సురుచి పలికిన యవమానవాక్యములను తల్లికి జెప్పి ధ్రువుండును 'ఓయమ్మా ! సురుచియు, నీవును రాజపత్నులేగదా ? అయిన నామెకు రాజునం దంత యధికార మెట్లు గలిగినది ? ఉత్తముడును నేనును రాజకుమారులమైనను రాజునుత్సంగమున గూర్చొనునధికార మొక్కయుత్తమునకుమాత్ర ముండి నాకు లేకపోవుటకు గారణ మేమి? సంశయింపక వచింపు' మని దీనముగ నడుగ సునీతి బాలకు నోదార్చుచు నిట్లని వచించెను.

'నాయనా ! ఇందు సురుచిదోష మావంతయును లేదు. ఆమె పూర్వజన్మసుకృతవిశేషమునలన రాజామెయందు వ్యామోహితు డైనాడు. ఉత్తముడును సురుచికొడుకగుట సింహాసనమున కర్హు

జైనాడు. నీవో మందభాగ్యవగు నాకు జన్మించుటవలన నీ విధముగ నవమానింపబడుట సంభవించినది.

'నిస్సపత్నమగు రాజ్యమును, ఛత్రచామరాది సర్వలక్షణ శోభితమగు సామ్రాజ్యమును, విస్తారమగు కలాజ్ఞానమును, అరిషడ్వర్గ జయమును, మధురభాషిణియగు వాణియును, కార్యములయం దనాలస్యమును, అదీనవాదిత్వమును, సభామధ్యమందు పరాజయము నెరుంగని పాండిత్యమును, రణాంగణమున ప్రాగల్భ్యమును, బంధువులయం దార్జవమును, క్రయవిక్రయములయందు కాఠిన్యమును, స్త్రీల విషయమున మార్దవమును, ప్రజలయందు వాత్సల్యమును, బ్రాహ్మణులయం దభయమును, నిత్యము వృద్ధపరిచర్యయు, భాగీరథీతీర వాసమును, తీర్థమరణమును, అర్థులయెడ నపరాఙ్ముఖత్వమును, నిత్యమును పితృసన్నిధివాసమును, యశోధర్మసంపాదనమును, నిత్యమును సత్సాంగత్యమును, ఇతిహాస పురాణశ్రవణమును, ఆపత్కాలమున ధైర్యమును, సంపదలయందు స్థైర్యమును, యాచకులయెడ నౌదార్యమును అనునవి కేవల తపోమాత్రలభ్యములు. అల్పతపస్కులమగుట రాజసాన్నిధ్యము నందియును మన కీ పరిస్థితి గలిగినది. మానావమానములయందు స్వకృతమే ప్రబలకారణము. స్రష్టయు స్వకృతమును మార్ప నసమర్థుడు. శోకించిన ప్రయోజనము లేదు. అదృష్టమున్న నన్నియు సమకూరును.

తల్లి పలుకుల కలరి ధ్రువుం డిట్లనియె. 'తల్లీ! బాలకుడ నని నీవును నన్నవమానింపక నా నిశ్చయమును వినుము. తపస్సు సకలార్థసంపాదక మని వచించితివికదా! అయినచో నవన్యలభ్యమగు పదము సాధించితి ననియే నమ్ముము. ఆశీర్వదించి యనుజ్ఞ నిమ్ము.'

సునీతియు బాలకుని దృఢనిశ్చయమునకు సంతుష్టురాలయి 'నాయనా! ముక్కుపచ్చలారని నిన్ను ఘోరాటవులలో తపమునకై యెట్లు పంపగలను? త్వదేకపుత్రనుగదా? సపత్నీవాక్యబాణవిద్ధమగు నా హృదయము నిన్ను గాంచక యెట్లూరడిల్లగలదు? అయినను

మహాపదప్రాప్తికై తపింప నేగు నిన్ను వారించుటకన్న నీవు వచ్చు ననుక నెట్లో కాలము పుత్తును. మంచిది, పోయిరమ్ము. కృతార్థుడవై యరుదెమ్ము' అని యాశీర్వదించి కౌగిలించుకొని యనుప ధ్రువుడు రాజసౌధమునుండి వెడలి దారి తెన్ను నెరుంగనివాడగుట నిచ్చవచ్చిన రీతి నేగుచు చివర కెట్లో గొకవనము చేరెను.

ఎప్పుడును రాజసౌధము దాటి యీవల కరుదెంచినవాడు కాక పోవుటచే నేమి చేయుటకును దోచక ధ్యాననిమగ్నుడై యాలోచించుచుండ దైవయోగమున సప్తర్షు లట కరుదెంచిరి.

అసహాయులకు భాగ్యమే సహాయకారి. రాజపుత్రుడగు ధ్రువుడెక్కడ? అతిగహనమగు నరణ్యమెక్కడ? ఎచట నెవని కేది శుభమైనను, నశుభమైనను సమకూడవలయు నచట నాతని కది సమకూర్చు భవితవ్యత బలవత్తరమైనది. మానవుడు బుద్ధిచాపల్యమున నేమియో యత్నించునుగాని విధిని మార్చగలడా? వయస్సు, బలము, ఉద్యమము - ఏవియు విధి నన్యథాకరింపజాలవు.

భాగ్యనూత్రాకృష్టులవలె నట కేతెంచిన యా సప్తర్షుల పాదముల కెరఁగి 'సునీత్యుత్తానపాద తనయుడను, ధ్రువు డనువాడను. యుష్మద్దర్శనభాగ్యమున నాజన్మ కృతార్థమైనది.' అని విన్నవింప వారును నాతనిం గాంచి, 'వత్సా! నీ యీ నిర్వేదమునకు కారణ మేమి? అర్థచింత యందమా, ఇంత పిన్నవయస్సున దానికి తావు లేదు. అవమాన మందమా తలిదండ్రులయింట నయ్యది యసంభవవిషయము. అనారోగ్యము కారణ మందమా శరీరమును గాంచిన దాని కవకాశము గాన్పింపదు. అభిలాష నెరవేరనిచో వైరాగ్య మేర్పడవచ్చును. సప్తద్వీపాధిపతియగు రాజునకు కుమారుడవైన నీకు దీరని యభిలాష యనునది యుండునా? శిశువులయొక్కయు, వృద్ధులయొక్కయు, యువకులయొక్కయు మనోగతంబు నెఱుంగుట దుష్కరము' అని వచించుటయు, ధ్రువుం డిట్లనియె.

'మహానుభావులారా! తల్లిచే రాజసన్నిధానమునకు పంపబడినవాడనయి సభామధ్యమున రాజునంకమునందున్న యుత్తమునిం గాంచి బాల్య చాపల్యంబున రాజాంక మారోహింప నేఁగిన నన్ను నవమానించు సురుచి చేత నేనును, నాతల్లియు నవమానింపఁబడితిమి. ఇదియే నానిర్వేదము నకుఁగల కారణ' మని వచింప మునులు బాలునిం గాంచి 'నీమనోరథ మెట్టిదియో, యందు మావలన నీకుఁ గావలసిన దానిం జేయ్యదియో వచింపు' మన ధ్రువుండు వారల కిట్లనియె.

'పైతృకమగు రాజ్యము నుత్తముఁడే యనుభవించుఁగాక! బాలుండ ననుట కృపాళులరై కర్తవ్యోపదేశము గావింపుఁడు. అనన్య భుక్తమును, ఇంద్రాదిదుష్ప్రాపమును నగు పదమును గోరి తపమునగాని నాయభిలాషము నెరవేర దని వచ్చినాఁడ. పైతృకమునకన్న స్వోపార్జితము ననుభవించువాఁ డుత్తముఁడుగదా! ప్రాయికముగ పుత్రులందఱును పితృసంపత్తిభోక్తలే.'

అంత మహర్షులందఱును 'వాసుదేవారాధనముగాని నీయభిలాష నెరవేర' దని వచించి నారాయణమంత్రోపదేశముం గావించి యంతర్హితు లైరి. ధ్రువుండును యమునాతటమందున్న మధువనంబు ప్రవేశించి సప్తర్ష్యుపదిష్టప్రకారంబున దత్తచిత్తుఁడై వాసుదేవార్పితమానసుండయి కాలంబు గడపుచుండె.

ఈవిధంబుగ నతిఘోరంబుగ ధ్రువుండు తపంబు గావించుట చారులవలన విని యింద్రుం డిట్లని చింతింపం దొడంగె. 'నన్నెప్పుడంబే కాంక్షించి తపం బొనరించెనేని యిప్పటికే హరించియుండెడివాఁడు. ఋషులతపోభంగమున సమర్థమగు నప్సరోగణ మీతని మోహపవనికి వచ్చునని తోఁచదు. తపస్వులతపోభంగమున కామక్రోధములు మత్సాహాయ్యకారులు కాని బాలుఁడగు నీతనియందు కామక్రోధములకు తా వెక్కడిది? కావున నీతని తపస్సునుండి విరమింపఁజేయుటకు భూతప్రేత పిశాచాదులను బంపుటకన్న మార్గాంతరము లేదు.'

అని తలంచి భూతాలిం బంప నవియు నాతని ననేకవిధంబుల

భయపెట్ట నారంభించెను. అంత శోకభూతము సునీతిరూపమున వచ్చి గుండెలు బాదుకొనుచు నాతనితో నిట్టు లనియెను.

'నిన్నావిధముగ తపస్సునకు బంపించితిని గాని నిన్ను విడచి యుండ లేక నీకొరకై నేను దిరుగని ప్రదేశము లేదు. నాయనా! బాల్యమున సవయస్కులగు బాలురతో గడపి కౌమారమున విద్యాభ్యాసము చేసి యౌవనమున ననురూపయగు కన్యను వివాహమాడి పుత్రపౌత్రుల గాంచి సర్వభోగముల ననుభవించి పుత్రన్యస్తభారుడవై తపింపవచ్చును. అవమానముననో పరాజయముననో దారిద్ర్యముననో తపించుట గలదు. కాని ముక్కుపచ్చ లారని యీపిన్నవయసున నీ కీపని యేల?'

ఈవిధంబుగ సంభవించిన తపోభంగమునకు చేయునది లేక ధ్రువుండు వాసుదేవార్పితమానసుండై ధ్యానింపం దొడంగెను. అంత భక్తవత్సలుండగు నారాయణుండు ధ్రువరక్షణంబునకై చక్రం బంప జ్వాలామాలాభీషణంబగు నద్దానిం గాంచి భూతాళి భీతభీతమై ధ్రువునకు నమస్కరించి స్వర్గంబున కేగి విన్నవించుటయు నింద్రుం డేమియుం దోచక సత్యలోకంబున కేగి యవసరం బుపలక్షించి భయకారణంబు విన్నవింప బ్రహ్మ చిరునవ్వు నవ్వి 'ఓయీ! ధ్రువపదంబును గాంక్షించి యాతడు తపంబు గావించుచున్నాడు. ఆతనివలన భయపడ నవసరము లేదు.' అని వచింప నింద్రుండును భయంబు దొరంగి మగుడి స్వర్గంబున కేగె.

తన్ను గూర్చి యతిఘోరంబుగ జపంబు గావించు ధ్రువునివద్దకు నారాయణుండు గరుడారూఢుండై యరుదెంచి 'వత్సా! నీతపంబునకు మెచ్చితిని. వరము కోరు' మనుటయు ధ్రువుండును గనులు తెరచి యెదుటనున్న పుండరీకాక్షుం గాంచి యనేకవిధంబుల బ్రస్తుతించెను. అంత హరి 'వత్సా! ధ్రువపదాభిలాష నీ వొనరించిన యీతపంబు శ్లాఘ్యంబు. అన్నంబువలన భూతంబు లుద్భవించుచున్నవి. అన్నమునకు వృష్టి కారణము. వృష్టికి కారణభూతుడు సూర్యుడు. సూర్యాదిసమస్త జ్యోతిశ్చక్రమున కాధారభూతుడవై విరాజిల్లుము. ఒకప్పుడు మహా

దేవు నారాధించి యస్మదురాసపంబగు నీపదంబు వడసితివి. ఈనాచే నీ కొసంగబడిన పదము శివానుగ్రహమువలనఁగాని స్థిరము కాజాలదు. విశ్వేశ్వరనివాసస్థానమగు వారాణసి కేగుచున్నాను. నిత్యమును పశుపతి నారాధించుటకు కాశి కేగుచుందుము. త్రైలోక్యరక్షణకుపయోగించు నా శక్తికి మహాదేవుడే కారణము. పూర్వము జలంధరాసురసంహారమునకై పరమేశ్వరునిచే నిర్మింపబడిన యీచక్రము దానవబాధ భరింపలేక తత్సంహారణసమర్థంబగు నాయుధముం గోరి నే నొనర్చిన సహస్రకమలార్చనకు సంతుష్టుండై విశ్వేశ్వరుం డొసంగినది. భూతబాధనుండి నిన్ను రక్షించిన దీచక్రమే. విశ్వేశ్వరదర్శనార్థము కాశి కేగుచున్నాను. నేడు కార్తిక బహుళ చతుర్దశి మహాపర్వదినము. నేడుత్తరవాహినియగు గంగయందు స్నానమాడి విశ్వేశ్వరదర్శనంబు నాచరించినవానికి పునర్జన్మభయము లేదు.'

అని వచించి ధ్రువుని గరుడవాహనాధిష్ఠితుం గావించి క్షణములో వారాణసి చేరి పంచక్రోశపు సరిహద్దున వాహనమునుండి దిగి పాదచారియై ధ్రువుని వెంట నిడికొని గంగయందును మణికర్ణికయందును స్నానమాడి విశ్వేశ్వరు నారాధించి ధ్రువునితో నిట్లని వచించె.

'వత్సా! ఈయవిముక్తక్షేత్రమున నీపేర నొకలింగము స్థాపించి యారాధించి కృతార్థుడవు గ' మ్మని యుపదేశించి విశ్వవ్యాపి నారాయణుండు స్వపదంబున కరిగెను. ధ్రువుండును తమయభీష్టప్రకారంబున వైద్యనాథలింగపార్శ్వంబున ధ్రువేశ్వరుండను లింగంబు ప్రతిష్ఠించి యారాధించి కృతకృత్యుండై స్వపురంబున కేగె' నని వచించి విమానంబు మహర్లోకసమీపంబునకు గొనిపోవుటయు శివశర్మ వారిం గాంచి 'యిది యేలోకము? ఇం దెవరు వసింతు' రని యడుగ నా కింకరు లిట్లనిరి.

— : : —

## మహర్లోకవృత్తాంతము

‘ ఇది మహర్లోకము. తపోధూతకల్మషులై కల్పాయుష్కులగు వారిందు వసింతురు. వీరు నిర్వ్యాజులగు మనస్సులతో సర్వేశుని బరమేశ్వరుని యనుముగా గాంచిన మహానుభావు ’ లని వచించి విమానంబు జనలోకసమీపంబునకు గొనిపోయి యిట్లనిరి.

— : : —

## జనలోకవృత్తాంతము

‘ ఇయ్యది జనలోకము. ఇందు బ్రహ్మమానసపుత్రులగు సనక సనందనాది యోగులు వసింతురు. వీ రూర్ధ్వరేతస్కులు. వీరే కాక యస్ఖలితబ్రహ్మచారులును, ద్వంద్వాతీతులును నగువార లీలోకమున నుందు ’ రని వచించునంత విమానంబు తపోలోకసమీపంబున కరుగుటయు శివశర్మ వారిం గాంచి ‘ యిది యేలోకం’ బని యడుగ నావిష్ణుకింకరు లిట్లనిరి.

— : : —

## తపోలోకవృత్తాంతము

‘ ఇయ్యది తపోలోకము. జితేంద్రియులును శిలోంఛవృత్తులును జీర్ణపర్ణభక్షులును, గ్రీష్మమున పంచాగ్నిమధ్యమునందును, వర్షాకాలము నందు స్థండిలమందును, హేమంతశిశిరములయందు జలమధ్యమునను నుండి తపించువారును, తృషితు లయ్యును కుశాగ్రస్థజలబిందుపానము జేసియు, క్షుధితు లయ్యును వాయుభక్షణము గావించియు తపించువారును నీలోకమున వసింతురు ఈలోకమున వసించువారు బ్రహ్మాయుష్కులు. ’ అని వచించుచు విమానంబు బ్రహ్మలోకంబుదరికి గొని పోయి శివశర్మతోగూడ విమానంబునుండి దిగి బ్రహ్మను సమీపించి నమస్కరింప బ్రహ్మ వారల కిట్లనియె.

'ఓ పుణ్యశీలసుశీలులారా! ఈతడు వేదవేదాంతపారంగతుడు పాపకర్మపరాఙ్ముఖుడు' అని వచించి శివశర్మం గాంచి యిట్లని వచించెను :

'మహానుభావా! బహుజన్మదుర్లభంబగు హరిద్వార మరణము గాంచితివి. మహాపుణ్యాత్ముడవు. ఈకన్పడున దంతయును నశ్వరమే. నేను నావిధి ననుసరించి ప్రళయాంతమున మరలమరల సృజించుచుందును. కాల మాసన్నమైనంత హరుడు లయము గావించు చుండును. ఇక క్షణికజీవులగు మర్త్యులవిషయము చెప్ప నేల? స్వేదజ, జరాయుజ, ఉద్భిజ్జ, అండజములను నాలుగురకములగు ప్రాణికోటియందును మానవు లుత్తములు. అందును భరతఖండమున జన్మించుట ఉత్తమోత్తమము. ఇంద్రియములను జయించి, లోభమును విడనాడి, ధర్మార్థములకు పరమశత్రువగు కామమును బోనాడి, తామసప్రవృత్తికి లోబడక, సర్వప్రమాదములకు కారణమగు గర్వ మును మట్టుబెట్టి, లాఘవనిదానమగు నహంకారమును బోకార్చి, సజ్జనావమానమునకై నను వెనుదీయని మోహము నడంచి శ్రుతిస్మృతి పురాణప్రతిపాదితమైన సన్మార్గమున ప్రవర్తించు మహానుభావు లనా యాసముగ ధర్మసోపానారోహణము గావించి యీలోకమున కేతెంచుచున్నారు. కాని స్వర్గవాసులో కర్మభూమియగు భరతఖండ మున జన్మించుటకు తహతహ లాడుచుందురు. స్వర్గము భూలోకార్జి తపుపుణ్యమును వ్యయించుట కేర్పడినదేగదా? ఆర్యావర్తమువంటి పవిత్రదేశముగాని, కాశివంటి మోక్షదాయకమగు నగరిగాని, విశ్వే శ్వరునివంటి దైవముగాని బ్రహ్మాండమున లేవు. దుఃఖరహితభోగ స్థానము లనేకము లున్నవి. అందు స్వర్గలోకమునకు మిగిలినవి చాలవు.

పాతాలము స్వర్గలోకముకంటె రమ్యమని యొకప్పుడు నారదుడు దేవసభయందు వచించినాడు. అచట సూర్యాతపప్రవేశము లేక సూర్య కాంతిమాత్రమే యుండును. వెన్నెమాత్రమే కాయును. కాని శీతబాధ యుండదు. దైత్యులు దానవులు, నాగులును పాతాల వాసియగు హాటకేశ్వరు నారాధించుచుందురు.

'ద్విజవర్గము పాతాళముకన్న రమ్యమైనది. ఇయ్యది మేరు పర్వతముచుట్టును నావరించి యున్నది. తీర్థములందు దేహత్యాగము గావించిన నీవంటి పుణ్యాత్ములచట సకలభోగము లనుభవించుచుందురు. కావున నాప్రదేశమునకు భోగభూమి యని పేరు సార్థకమైనది.

సముద్రమధ్యభాగమున ననేకద్వీపము లున్నవి. కాని జంబూద్వీపమునకు మిగిలినవి సరితూగవు. జంబూద్వీపమున నవవర్షములు గలవు. నవవర్షములయందును భారతవర్షము త్తమోత్తమము. ఇయ్యది మేరువునకు దక్షిణభాగమున నున్నది. భారవర్షమందు వింధ్యహిమవత్పర్వతములకు మధ్యనున్న ప్రదేశము పుణ్యతమమైనది. గంగాయమునామధ్య ప్రదేశమునకు అంతర్వేది యును వహారము గలదు.

క్షేత్రములన్నింటియందు కురుక్షేత్రము పావనము. దానికన్నను స్వర్గసాధనమగు నైమిశము పావనతరము. నైమిశముకన్నను, సర్వతీర్థములకన్నను తీర్థరాజమగు ప్రయాగ యుత్తమోత్తమము. ఇయ్యది స్వర్గదము, మోక్షదము, సర్వకామదమును. త్రికాలములయందును ప్రయాగనామస్మరణమాత్రముచేతనే సకలపాపక్షయమగును పూర్వజన్మసంచితమై తపోదానజపవ్రతాదులచే తొలగని పాపరాశి ప్రయాగయాత్రాసంకల్పమాత్రమున వాతాహతమగు వృక్షమువలె కంపించును. ప్రయాగము నేత్రగోచరమైనంత సూర్యు డుదయించుటతోడనే చీకటి పటాపంచలైనట్లు పటాపంచ లగును. కేశవపనము గావించుకొని నిష్పాపుడై గంగాయమునాసంగమమందు స్నానము గావించి యేయే కోరికల నభిలషించిన నవి యన్నియు నెరవేరును. సర్వకామదమగు తీర్థరాజమును విడనాడి యన్యత్రకామపూర్తికై యత్నించిన నయ్యది నెరవేరదు. మానవలోకమున పుణ్యము గావించి స్వర్గభాక్కు లగుదురు. స్వర్గమున పుణ్యకర్మ లాచరించినవారు నాలోకమునకు వత్తురు. తీర్థరాజమగు ప్రయాగమున దేహత్యాగము గావించినవారికి ఆత్మహత్యాదోషము సంభవింపదు. అదృష్టవశమున నెవనియస్థులు గంగాయమునా

సంగమమున నెంతకాల ముండునో యంతకాలము నాతనికి దుఃఖ మనునది యుండదు. ప్రయాగవాసము గావించిన బ్రహ్మహత్యాది దోషము లుండవు. కావున నభ్యుదయకాములగువారు గంగాయమునా సంగమమందలి తీర్థరాజమగు ప్రయాగను సేవింపవలయును.

'తీర్థరాజమగు ప్రయాగయందు దేహత్యాగము గావించుటవలన సర్వకామప్రాప్తి యగును కాశీమరణమువలన ననాయాసముగ ముక్తి కరతలామలక మగును. స్వయముగ విశ్వేశ్వరు డధివసించుటవలన వారణాసి ప్రయాగకన్నను, సర్వతీర్థములకన్నను పవిత్రతమ మైనది. విశ్వేశ్వరునినివాసస్థానమగు అవిముక్తమహాక్షేత్రముకన్న రమ్యమైనది బ్రహ్మాండగోళమున మరియొకటి లేదు.

'ప్రలయకాలమున నేకార్ణవమైనపుడు సముద్రజల మేవిధముగ వృద్ధినందునో యావిధముగ పరమేశ్వరుడు పంచక్రోశప్రమాణమగు కాశిని త్రిశూలాగ్రమున నెత్తుచుండును. భూలోకమునందలి నగరము లన్నియు నాచే సృష్టింపబడినవి. వారణాసినో శివుడు స్వయముగ నిర్మించినాడు.

'పూర్వకాలమున యముడు వారణాసియందు బహుకాలము సుదుష్కరమగు తపము గావించి వారణాశిని విడచి మిగిలిన ముల్లోక ములకును నాధిపత్యముగాంచినాడు. బ్రహ్మాండమందలి సర్వప్రాణులు గావించిన పుణ్యపాపకర్మలన్నియును చిత్రగుప్తునికి గోచరములే. కాశీ వాసులు గావించినకర్మ లాతనికి గోచరింపవు. యమదూతలకు కాశియందు ప్రవేశములేదు. కాశి కధిపతి విశ్వేశుడు. ప్రమథగణములు కాశిని రక్షించుచుండును అచట దేహత్యాగము గావించినవారి విష యము నాతడు స్వయముగ పరిశీలించును. కాశియందు గావింపబడిన పాపములు కాలభైరవుడు విచారించును. ఇతరత్ర పాపము గావించిన యమయాతన తప్పనట్లు కాశియందు పాపముగావించిన రుద్రయాతన తప్పదు. అచట పాపము గావించినవారికి రుద్రపిశాచత్వము ప్రాప్తిం చును. అయ్యది నరకయాతనలకన్నను దుస్సహమైనది. పాపాసక్తియే

యున్న ననంతమగు భూమండల మున్నదిగదా? ఎంత కామాతురు డైనను తల్లిని రక్షించుట పరమధర్మము. అట్లే పాపాసక్తుడైనను మోక్షార్థియగుచో కాశియందు పాపకర్మ లాచరింపరాదు పరాప వాదశీలురును, పరదారాభిలాషులును, పరధనాపహర్తలును కాశీ వాసమున కనర్హులు.

శివనిందాపరులును, వేదనిందాపరులును, వేదవిరుద్ధాచార విశిష్టులును కాశియందు నివసింపరాదు. అట్టివారు మోక్షమున కనర్హులు. జ్ఞానహీనులకు మోక్షము లేదు. చాంద్రాయణాది వ్రతముల చేతగాని, తులాపురుషాది దానములచేతగాని, స్వాధ్యాయముచేతగాని, యజ్ఞయాగాదిక్రతువులచేతగాని, తీర్థగమనాదులచేతగాని లభింపదు అయ్యది యోగముచేతనే లభించును. గురూపదిష్టమార్గమున తత్వార్థ శీలనముగావించుటకే యోగమని పేరు. దీని కంతరాయములు మెండు. జపతపములు గావింపకున్నను, యోగము నభ్యసింపకున్నను, కాశీ వాసము గావించి విశ్వేశ్వరు నారాధించినవాని కొకజన్మయందే మోక్షము కరతలామలక మగును. కాశీవాసముచే నార్జించిన పుణ్య విశేషముమువలన నీకు తప్పక సద్గతి కలుగును.'

అంత శివశర్మ బ్రహ్మం గాంచి 'యోమహానుభావా! ఆజ్ఞ యైన నొకవిషయము మనవిసేతు' నని వచింప బ్రహ్మ 'యోయీ! నీసందియమును పుణ్యశీలసుశీలురు తీర్తురు. బ్రహ్మాండమున వారికి తెలియని విషయము లేదు. వారికి భూతభవిష్యద్వర్తమానములు కరతలామలకము' లని వచించి వారిని వీడ్కొల్పెను.

అంత వారు ముప్వురును విమానము నధిరోహించి వైకుంఠమున కేగుచుండ శివశర్మ పుణ్యశీలసుశీలురం గాంచి 'యోమహాత్ములారా! ఎంతదూరము వచ్చితిమి? ఇక నెంతదూర మరుగవలయును? అయోధ్య, మధుర, హరిద్వారము, కాశి, కాంచి, ఉజ్జయిని, ద్వారక యను వానిని మోక్షదాయకములగు నగరములనికదా పెద్దలు చెప్పుదురు? కాశీవాసము గావించి విశ్వేశ్వరు నారాధించినగాని మోక్షప్రాప్తి లేదని వచించుట మీరు వినినారుగదా?

అనుగ్రహించి దీని యంతరార్థ మేమో వచియింపు డని యడుగ
వారలి ట్లనిరి.

'ఓపుణ్యాత్మా! నారాయణానుగ్రహమువలన మాకు గోచ
రముకాని విషయము లేదు. సూర్యకిరణప్రసారముగల యీసముద్ర
కాననమగు ప్రదేశమునకు భూలోక మని పేరు. భూలోకమున కూర్ధ్వ
భాగమునను న్న యంతప్రదేశమున కాకాశమని వ్యవహారము కలదు.
భూమికి లక్షయోజనముల దూరమున సూర్యమండల మున్నది.
సూర్యునకు లక్షయోజనముల దూరమున చంద్రమండలమును చంద్రు
నకు అంతియే దూరమున నక్షత్రమండలమును నున్నవి. నక్షత్రమండ
లమునకు రెండులక్షల యోజనములదూరమున బుధుడును, ఒకరొకరి
కంతియే దూరములందు శుక్ర, అంగారక, బృహస్పతి, శని, సప్తర్షి
లోకము లున్నవి. సప్తర్షిమండలమునకు లక్షయోజనములదూరమున
ధ్రువమండల మున్నది.

'కాలితో నడువదగి, సముద్రద్వీపకాననములతోగూడిన భాగ
మునకు భూలోక మని పేరు. భూలోకమునుండి సూర్యలోకమువర
కును భువర్లోకముగలదు. సూర్యలోకమునుండి ధ్రువమండలమువరకును
నున్నది స్వర్గలోకము. మహర్లోకము భూలోకమునకు కోటియోజన
ముల దూరమునను, జనలోకము రెండుకోట్లయోజనములదూరము
నను, నాలుగుకోట్లయోజనములదూరమున తపోలోకమును, ఎనిమిది
కోట్ల యోజనములదూరమున సత్యలోకమును నున్నవి. సత్యలోక
మున కూర్ధ్వముగ భూలోకమునకు పదునారుకోట్ల యోజనముల
దూరమున విష్ణులోక మున్నది. వైకుంఠమునకు పదునారుకోట్ల యోజన
ముల దూరమున శివనివాసమగు కైలాస మున్నది.

'ఇందుమాసహితుడగు శివుడు ప్రమథగణపరివృతుడై విరా
జిల్లుచుండును. ఆపరమేశ్వరుని లీలావిభూతియే యీలోకజాల మంత
యును. ఆవిశ్వేశ్వరుని యాజ్ఞానుసారముగ నీలోకము లన్నియు ప్రవ
ర్తించుచున్నవి. సర్వశాసకు డాత డొక్కడే. ఆతని శాసించువారు

లేరు. ఈసర్వలోకములకును సృష్టి స్థితి సంహారకర్త యాతఁ డొక్కఁడే. సర్వజ్ఞుఁడను వ్యవహార మాతని కొక్కనికే గలదు. ఆతనికి ప్రవర్తకుడుగాని, నివర్తకుడుగాని యెవఁడును లేఁడు.

'అమూర్తమగు నాశివతత్త్వమే సృష్టికాలమున సమూర్తమై విరాజిల్లుచున్నది. సర్వవ్యాపియు, నిత్యమును, సత్యమును, ద్వైతవర్జితమును, సర్వకారణకారణమునునగు నాతత్త్వము బ్రహ్మవిష్ణ్వాదులకైనను నందనిది. కావుననే యవాఙ్మానసగోచర మని శ్రుతిశిరస్సులయందు ప్రతిపాదింపబడినది. నానారూపమయ్యును, నరూపమును, సర్వగమయ్యును నగోచరమును, అనంతమయ్యును నంతకమును, సర్వజ్ఞమయ్యును, కర్మవర్జితమునునగు నాతత్త్వవిభూతియే యీసర్వమును ఆతత్త్వమందే బ్రహ్మాండము లన్నియు నోతప్రోతముగ నావరించియున్నవి. నిరాకారుఁడైనను శివుఁడు భక్తానుగ్రహార్థము సాకారుఁడై భుక్తిముక్తిప్రదుఁ డగుచున్నాఁడు. లోకస్థితికొఱకే ముల్లోకముల కాధిపత్యము నారాయణున కొసంగిన దాతఁడే. శివానుగ్రహమువలననే నారాయణునకు లక్ష్మీవిశిష్టమగు వైకుంఠము లభించినది.

'ఇప్పటివరకును లోకములయు లోకాధిపతులయు చరిత్రమును వివరించితిమి. ఇక నీకు నిర్వాణముగలుగుస్థితిని వివరించెద మాకర్ణింపుము

'హరిద్వారమరణమువలన లభించిన పుణ్యవిశేషము వలన వైకుంఠమున సకలభోగముల ననుభవించి పిదప నందివర్ధన మను నగరమున వృద్ధకాలుఁడను రాజువై జన్మించి నిస్సపత్నమును, సర్వసంపత్సమృద్ధమునగు రాజ్యము నేలి మున్నూరు పుత్రులం బడసి యొకనాఁడు వారణాసీసమాగతులైన కొందరు తపస్వులు 'మహారాజా! నామస్మరణమాత్రమున భుక్తిముక్తిప్రదుఁడగు వారణాసీపతి యనుగ్రహమునకు పాత్రుఁడ వగుదువుగాత' మని యాశీర్వదింప కాశీనామశ్రవణమాత్రమున నానందపరవశత్వము నంది వారిని సత్కరించి వీడ్కొల్పి రాజ్యభారము పుత్రులయం దుంచి యనంగలేఖయను భార్యను వెంటగొని వారాణసి కేగుదువు. అట వృద్ధకాలేశ్వరుఁ డను పేరున నొకలింగ

మును స్థాపించి యారాధించుచుండ నొకవృద్ధతాపస్వి నీకడ కరుదెంచి యిట్లనును.

'ఓయీ! నీ వెవడవు? ఇచటి కేల వచ్చితివి? ఈ రెండవ వ్యక్తి యెవరు? ఈయాలయమును నెవరు నిర్మించిరి? ఈలింగము పే రేమి?

'మహానుభావా! నే నొకదాక్షిణాత్యుడను రాజును. నా పేరు వృద్ధకాలుడు. ఈమె నాభార్య. పరమేశ్వరుని ధ్యానించుటయే కోర దగినది శివానుగ్రహముదప్ప మ రేదియును లేదు. పరమేశ్వరుడే యీ యాలయనిర్మాత. లింగము పే రేమని యడిగితిరి. ఆరాధకునకు పేరులతో పని యేమి?

అని నీవు వచింప నావృద్ధుడు 'సాధకమునకు లింగము పేరుతో పని లేదంటివి. మంచిది. ఆలయనిర్మాత యెవరన్న శివుడని వచించితి వేల? నిత్యమును నిటనున్న నీ కీయాలయమును నిర్మించిన దెవరో తెలియకుండునా? వాస్తవము నేల దాచెద' వని యడుగ నీవు 'స్వామీ! కర్తయును, కారయితయును శివుడే అసత్య మాడునావ శ్యకత నా కేల? కానిపోని యీయాలోచనలతోలి యేల? యని సమాధాన మిత్తువు.

అంత నాతాపసి 'దాహము వేయుచున్నది కొంచెము నీరు తె'మ్మని యడుగ నీవు ఆలయసమీపముననున్న బావినుండి జలము తెచ్చి యిత్తువు. వృద్ధు డాజలము ద్రావినంత తరుణులుగ మారుటయు నాశ్చర్యావిష్టుడవై నీవు 'ఓస్వామీ! ఇ దేమివింత? ఈమా ర్పెటుల కలిగినది' అని యడుగ నాతాపసి యిట్లని వచించును

'మహారాజా! ఈనీభార్య యనంగలేఖ పూర్వజన్మమున తుర్వసుడను బ్రాహ్మణునికుమార్తె ఈమెభర్త నైధ్రువుడు. భర్త బాల్యమున మరణించుటచే శేషజీవితమును భర్తృచింతామగ్నమాన సయై గడపి యుజ్జయినియందు మరణించి యీజన్మమున పాండ్యరాజ కుమార్తెయై జన్మించి నిన్ను పెండ్లాడినది నీవు క్రిందటిజన్మమున మధు రాపురవాసియగు శివశర్మ యను బ్రాహ్మణుడవు. హరిద్వార మరణ

మునవలన నందివర్ధననగరమున వృద్ధకాలు డను పేర జన్మించితివి. అయోధ్య, మధుర, హరిద్వారము, కాంచి, ఉజ్జయిని, ద్వారక అను నీ యాఱుక్షేత్రములయందు వసించి దేహత్యాగము గావించినవారు స్వర్గాదిలోకములయందు సకలభోగముల ననుభవించి పునర్జన్మమున కాశియందు మోక్షమును గాంతురు.

'ఇంకొక విషయము. కర్తయు, కారయితయు శివుడని వచించితివి. చేసినసత్కార్యములను చెప్పుకొనరాదు. చెప్పుకొనుటవలన నంతయు వ్యర్థమగును. శివాజ్ఞలేని దేదియు నెరవేరదు కాన కర్తయును, కారయితయును నాతడే' యని వచించుచు నాతపస్వి మిాదంపతులను వెంటగొని వృద్ధకాలువయందు ప్రవేశించు నని చెప్పుచుండ విమానము వైకుంఠమును సమిాపించెను.

# భస్మ మాహాత్మ్యము

## భస్మ సంపాదనము

'ఓమహాభావా! గురు లింగ జంగమ తీర్థ ప్రసాద భస్మ రుద్రాక్ష పంచాక్షరీమంత్రము లను సప్తావరణములలో నారవదియగు భస్మమాహాత్మ్యమును దెలిపి నన్ను ధన్యుని గావింపు' మని బృహస్పతి యనంతరుదుని ప్రార్థింప నాత డిట్లని యానతిచ్చెను.

సకలమైనవానిలో విద్యాశక్తియే ముఖ్యమైనదని చెప్పబడు చున్నది. అట్టి విద్యాశక్తి త్రిగుణములను, త్రిగుణములును నా విద్యాశక్తిని పరస్పరము నాశ్రయించియుండును. గోవు గుణత్రయరూపమైనది. గోమయము విద్యాశక్తి. గోమూత్ర ముపనిషత్తని చెప్పబడును. కావున నట్టి గోమయగోమూత్రములచే భస్మమును సంపాదింపవలయును.

# భూమిక.

ఉపమన్యుమహాముని వ్యాఘ్రపాదుని కుమారుఁడు. వశిష్ఠ మహామునికి మేనల్లుఁడగును. ఈయన బాల్యమున శైశవమునందు మేన మామయింట కామధేనువు పాలుద్రావుచుండెను. ఆయభ్యాసవశంబున తండ్రియింటికిఁ బోయిన పదంపడియు పాలకై మొఱవెట్టుచుండెను. అప్పుడు క్షీరము లలభ్యములగుటఁ జేసి యా యనఘునితల్లి శోకిల్లియు, జేయునది లేక బియ్యపుపిండి నీరునందు గలిపి యిచ్చెను. పాలవలె తెల్లనగు నాపిండము గాంచి యా మునిసూనుఁ డవి దుగ్ధములే యని వానిం ద్రావఁబోయి యందు మాధుర్యము లేమిం జేసి యవి క్షీరములు గావని గ్రహించి యా పిండపాత్రము దొరలించి యేడ్చుచుండ నమ్ముని మాత్ర వగచి నిజతనయు నోదార్చుచు, కుమారా! మనము తొలిజన్మ మున శివునిఁ బూజింపమైతిమి. అట్టి మనకు క్షీరము లెట్లులభించును. అవి మనకు నలభ్యములుగాన వానిం గోరకుమని బోధించెను. అమ్మాట వినగనే మహర్షినందనుఁడు 'తల్లీ! శివునిబూజించునెడ పాలు దొరకునా? అని యడిగెను. నావుడు నిస్సంశయముగా దొరకునని పలికెను. ఆ మునితనయుండు బహుజన్మసంచిత సుకృత పరిపాక యుతుండుగాన తల్లిమాట వినగనె యందు దృఢవిశ్వాసంబు నొందెను. సమయంబునకై వేచి జనని జలంబునకై పోవ నత్తఱి యిల్లువెడలి పోవుచుండెను. వ్యాఘ్రపాదు నాశ్రమము చిదంబరక్షేత్ర సమీప మున నె కలదు. దానికి చేరువనె శ్రీ వేదారణ్యక్షేత్రంబు గలదు. నాలుగు వేదములు వృక్షరూపములుగా నున్నవని స్కాందము తెలుపు చున్నది. ఆ మునికుమారుఁ డా క్షేత్రమును జేరి నలుదిశలు పరికిం చెను. అందు నెటజూచినను శివలింగములు, జలపూరితంబులగు తటా కంబులు, ఫలపుష్ప శోభితంబులగు వృక్షంబులు మొదలుగా గన్ప ట్టెను. ఈ క్షేత్రము శివునిబూజింప ననుకూలమని యెంచి యా యన ఘుండందుగల మహాలింగమును నిర్మలజలములచే నభిషేకించుచు,

పత్రపుష్పాదులచే బూజించుచును నిట్లుతదేకాయత్తచిత్తుండై శివారాధ
నంబు సేయుచుండ గొంతకాలమునకు భవానీవల్లభుండు మునిసూను
నెడ సుప్రసన్నుండయ్యు నా దృఢచిత్తుఁ బరీక్షింపనెంచి మహేంద్ర
రూపంబున నేతెంచి వరము గోరుమనుటయు నతండు 'నీవెవ్వరవో
తెల్పుమని యడుగ నద్దేవుండు నేను దేవేంద్రుఁడనని తెలుప విని
మునిపుత్రుఁ డద్దేవు నుద్దేశించి యేను శివునిదప్ప నింకొకనిని వరము
వేడను. నిన్నెవరు బిలిచిరి? నీదారింబొమ్మనియెను. అప్పు డుపమ
న్యునకు నింద్రరూపుఁడగు పరమేశ్వరునకును జరిగిన సంవాదము మహా
భారతమున నానుశాసనిక పర్వమునందు నెంతో యధికముగ వర్ణింపఁ
బడియున్నది. కొనకు నీకు వరమునీకుండ నేను బోనేరనని యింద్రుఁడు
వలుకగా నమ్మునిసూనుండు మహేంద్రు నవలోకించి నీవు నా తపంబు
భంగంబుసేయ నేతెంచితివిగాన శపింతునని నుడువ నాలించి పరమేశ్వ
రుం డమ్మునికి మారునెడ పరమహర్షంబు నొంది నిజరూపంబుదాల్చి
నేను పరమేశ్వరుఁడను- నిన్ను బరీక్షింప నింద్రరూపంబు దాల్చితి-
నీయెడ మెచ్చితి- వరంబు వేడుమనిన నతండు ప్రహర్షపరవశుండై
స్తుతించి నాకు క్షీరము నిమ్మని యడిగెను. అంత నుమాకాంతుండా
యనఘునకు పాలసముద్రంబు నొసగెనని యీచరిత్రమునందెయుఁ దన
శిష్యుఁడగు శ్రీ కృష్ణునకు నుపమన్యుండు తెలిపినట్లు మహాభారతంబు
ననె కలదు. దీనింబట్టి యుపమన్యు మునీంద్రుండు శ్రీకృష్ణునకు దీక్షా
గురువని తెలియుచున్నది. ఈ మహాత్ముడు గావించిన శివస్తుతి చమ
త్కారార్థబంధురముగా నున్నకతన దీని నిట ప్రచురించితి. మహాజను
లీ స్తోత్రంబును పఠించుచు పరమేశ్వరు ననుగ్రహంబున భోగమోక్షం
బులు వడయుదురుగాక. ఇట్లు, ప॥ సం॥

——(౦)——

# శ్రీ ఉపమన్యుకృత పరమేశ్వర స్తవః

శ్లో॥ జయశంకర పార్వతీపతే మృడశంభో శశిఖండమండన ।
మదనాంతక భక్తవత్సల ప్రియకైలాస దయాసుధాంబుధే ॥ ౧

తా॥ ఓ శంకరా! ఓ పార్వతీపతీ! శంభూ! చంద్రఖండశిఖామణీ! మదనాంతకా! భక్తవత్సలా! కైలాసవాసా! కరుణామృత సాగరా! జయింపుము.

శ్లో॥ సదుపాయ కథాస్వపండితో హృదయే దుఃఖశరేణ ఖండితః ।
శశిఖండశిఖండమండనం శరణంయామి శరణ్యమీశ్వరం ॥ ౨

తా॥ దుఃఖశరంబుచే హృదయంబున ఖండితుండనై సుఖోపాయంబు నెఱుంగని యేను శశిఖండమండనుండగు పరమేశ్వరుని శరణు జొచ్చితి.

శ్లో॥ మహతః పరతః ప్రసర్పత స్తమసో దర్శనభేదినో భిదే ।
దిననాథ ఇవ స్వతేజసా హృదయవ్యోమ్ని మనాగుదేహినః ॥ ౩

తా॥ పరమేశ్వరా! అపారమై యంతటను గ్రమ్ముచు దృష్టికి నష్టికరమైన యజ్ఞానాంధకారమును భేదింప ప్రభాకరుని మాడ్కి నిజ తేజంబుతో నాదు చిత్తాకాశంబున నుదయింపుము.

శ్లో॥ నవయంతవ చర్మచక్షుషా పదవీమప్యుపవీక్షితుంక్షమాః ।
కృపయాఽభయదేన చక్షుషా సకలేనేశవిలోకయాశునః ॥ ౪

తా॥ స్వామీ ! మేము చర్మచక్షువుతో నీ యున్నతావు నేని గనంజాలము. కావున నీవ శీఘ్రముగ నభయమొసఁగుచు కరుణా కటాక్షమున మమ్ము విలోకింపుము.

శ్లో॥ త్వదనుస్మృతి రేవ పావనీ స్తుతియుక్తానహివక్తుమీశసా ।
మధురంహిపయస్స్వభావతో ననుకీదృక్సితశర్కరాన్వితం ॥ ౫

తా॥ అమృతమయూఖశేఖరా ! నీయనుచింతనమే పావనమైనది. ఇఁక నది స్తోత్రయుక్తమైనచో నద్దాని నేమని వర్ణింపవలయు ? ఎట్లనిన క్షీరంబులు స్వభావంబుననె మధురంబులు. ఇక వానియందు చీని చక్కెరం జేర్చినెడ నవి యెట్లుండును ?

శ్లో॥ సవిషోప్యమృతాయతే భవాం ఛవముండాభరణోపి పావనః ।
భవఏవ భవాంతకస్సతాం సమదృష్టి ర్విషమేక్షణోపిసన్ ॥ ౬

తా॥ శివా ! నీవు విషము గలిగియున్నను నమృతుండవై యున్నాఁడవు. తలపుర్రెలు నొడవులుగా దాల్చియు పావనుఁడవై యుంటివి. మఱియు భవుఁడవయ్యు సజ్జనుల భవము గూల్చుచున్నాఁడవు. విషమలోచనుఁడవయ్యు నెల్లరయందు సమదృష్టి గలిగియుంటివి.

శ్లో॥ అపిశూలధరో నిరామయో దృఢవైరాగ్యరతోపి రాగవాన్ ।
అపిభైక్ష్యచరో మహేశ్వర శ్చరితం చిత్ర మిదంహితేప్రభో ॥ ౭

తా॥ ఈశ్వరా ! శూలధరుఁడవయ్యు నారోగ్యయుతుండవు. (శూలమనగా త్రిశూలము. దీనికి శూలరోగ మని యర్థాంతరము. శూలరోగము గలవాఁడు వ్యాధిరహితుఁడనుట విరోధము.) దృఢమగు వైరాగ్యము గలిగియు రాగవంతుఁడవు. (కాముని జంపియు గామిని నర్ధాంగమున దాల్చితివనుట.) మఱియు భిక్షావృత్తి జరించువాఁడవయ్యు మహేశ్వరుఁడవు, ప్రభూ ! నీ చరిత్ర మతిచిత్రముగా నున్నదిగదా ?

తా॥ కరుణానిధీ! నీ వేకంటితో జూచినంతన పెక్కురు మునీంద్రులు వాంఛితార్థములఁ గాంచి ధన్యతనొందిరో ఆకంటితో దీనుడనగు నన్నిప్రుడు జూడుము.

శ్లో॥ ప్రణమామ్యథ యామి చాపరం శరణం కం కృపణాభయప్రదం ।
విరహీవ విభో ప్రియామయం పరిపశ్యామి భవన్మయం జగత్ ॥ ౧౨

తా॥ దేవా! ఇం దెవనిం బ్రణమిల్లుదు? మఱి యెవ్వని శరణుఁ జొచ్చెదు? నీకన్న దీనార్తిహరుఁ డెందుగలఁడు? విరహిజనునకు జగమెల్ల ప్రియామయంబుగ గన్పడు చందంబున నాకు నీజగమంతయు నీరూపంబుగ గన్పట్టుచున్నది.

శ్లో॥ బహవో భవతానుకంపితాః కిమితీశాన నమానుకంపసే ।
దధతా కిము మందరాచలం పరమాణుః కమఠేన దుర్ధరః । ౧౩

తా॥ మహాదేవా! నీచేత నెందఱో రక్షింపబడిరిగదా? నన్నేల రక్షింపవు? మందర నగేంద్రమును వహించిన కమఠరాజము పరమాణువును వహింపజాలకుండునా?

శ్లో॥ అశుచిం యదిమా ఽనుమన్యసే కిమిదం మూర్ధ్ని కపాలదామ తే।
ఉతశాఠ్య మసాధుసంగినం విషలక్ష్మాసి న కిం ద్విజిహ్వధృక్ ॥ ౧౪

తా॥ భూతపతీ! నన్నపవిత్రునిగా నెంచితివేమొ? అట్లేని, నీశిరంబున నున్న తలపుఱ్ఱెల పేరు పవిత్రమైనదే యగునా? ఇంక నాయందు క్రూరతయున్న దనిశంకించెదేని నీయందు విషచిహ్నంబు లేదె? మఱినన్ను దుర్జనసాంగత్యముగల వానిగా భావించెదేని నీవు ద్విజిహ్వంబుల ( పాములను, అసత్యవాదులనని యర్థాంతరము ) దాల్పలేదా?

శ్లో॥ క్వద్యశంవిదధామి కింకరోమ్యనుతిష్ఠామి కథంభయాకులః ।
క్వనుతిష్ఠసిరక్షరక్షమామయి శంభో శరణాగతోఽస్మితే॥ ౧౫

తా॥ విశ్వేశ్వరా! ఏటుచూతును? ఏమిసేయుదును? భయవ్యాకులుండ నెట్లు వర్తింతును? హా శంభూ! నీవెందుంటివి? నీకునేను శరణాగతుండను. వేగిరము నన్ను రక్షింపుము.

శ్లో॥ విలుఠామ్యవనౌకిమాకులః కిమురోహన్మి శిరశ్ఛినద్మివా ।
కిముఃరోదిమి రారటీమికిం కృపణంమాం నయదీక్షసే ప్రభో॥ ౧౬

తా॥ మహాప్రభూ! దీనుండనగు నన్ను జూడవేమి? ఏను నేలమీందంబడిపొర్లుదునా? గుండెయులవియగొట్టుకొందునా? శిరము ద్రుంచివేసికొందునా? ఏడ్చుదునా? మిగుల నఱచుదునా? ఏమిసేయుదు?

శ్లో॥ శివసర్వగశర్వశర్మద ప్రణతో దేవదయాం కురుష్వమే ।
నమఈశ్వర నాథదిక్పతే పునరేవేశ నమోనమోఽస్తుతే॥ ౧౭

తా॥ శివా! సర్వవ్యాపకా! శర్వా! సుఖప్రదా! దేవా! నమ్రుడనైతిని. నన్ను గృపంజూడుము. ఈశ్వరా! నాథా! ఈశా! నీకు పునః పునః ప్రణామంబు లాచరించుచున్నాండను.

శ్లో॥ శరణం తరుణేందుశేఖర శ్శరణం మే గిరిరాజకన్యకా ।
శరణం పునరేవతావుభౌ శరణం నాన్య దుపైమి దైవతం॥ ౧౮

తా॥ బాలశశాంకమౌళియె నాకు శరణము. (రక్షకుండు.) హిమగిరికన్యకయె నాకు శరణము. మఱియు వారలిద్దరె నాకు శరణమగుదురు. గాన నే నింకొక దైవతమును శరణువేడను.

శ్లో॥ ఉపమన్యుకృతం స్తవోత్తమం జపతశ్శంభు మీాపవర్తినః ।
అభివాంఛిత భాగ్యసంపదః పరమాయుః ప్రదదాతిశంకరః॥ ౧౯

తా॥ శివసాన్నిధ్యమున నుపమన్యుకృతమగు నీ స్తోత్రరత్నమును జపించు వానికి శంకరుఁడు సకలవాంఛితములను భాగ్యసంపదలను పరమాయువును నొసఁగఁగలఁడు.

శ్లో॥ ఉపమన్యుకృతం స్తవోత్తమం ప్రజపేద్యస్తు శివస్యసన్నిధౌ ।
శివలోకమవాప్య సోఽచిరా త్సహతేనైవ శివేన మోదతే ॥ ౨౦

తా॥ ఉపమన్యుమహర్షి విరచితమగు నీ స్తోత్రము నే జనుఁడు శివుని సన్నిధియందు జదువునో ఆపుణ్యాత్ముఁడు శివలోకమునుంచి శివునితో గూడ నానందము నొందుచుండును.

ఇత్యుపమన్యుకృతం శివస్తోత్రం

స మా ప్తం.

శి వ ం

——(౦)——

శ్రీ

శ్రీ సాక్ష్యాంనమః.

హారపయోధరం.

శ్లో॥ విభిన్నేహ్యగ్రింథా వికచయుగళ పాత్రాద్వ్యగరితే
వినష్టేచేష్టాష్టే మనసిచమహామోహ్యవివశే
వినిష్ఠాయస్యస్యావరణ మధచండాగ్ర సుభగో
గిరీశస్యోల్లాసం రసయతి రసం కంచనకదా. ౧

శ్లో॥ ఏకత్వేపి విభాత్యనేక ఇవయో యస్యావృతిస్త్రైగుణీ
యస్సంకోచ వికాసభావసులభో యశ్చోపదిష్టాదిపః
యంసంశ్రిత్యచిరాయ బిభ్రతిశ్రుతిం హారాశ్చముక్తామయాః
తంచేదంహృదయం పయోధరవిభుం క్లిష్యన్ ప్రహృష్యేత్కదా॥ ౨

శ్లో॥ వశ్యాదేః ప్రథమం స్మృతోపకరణం సిద్ధేస్సమృద్ధిప్రదో
వకారైర్భిస్త్రిహుభిః పరీతమభితో రేఖాభిరాభోగభృత్।
మధ్యేమండలమగ్న బిందుమహసా కాళేయశైలీం సృజ
త్తచ్చక్రద్వయమద్వయం నయనయోరగ్రే కదాసక్త్రితా॥ ౩

శ్లో॥ ముక్తాత్మస్వగుణం త్రియోపరిచయా న్మాక్తస్వయంభూశ్శుచిః
కుబ్జః పాండుమహాతరు ప్రీతినిధిః స్తబ్ధోనభస్సంస్థితః।
శ్రీమచ్ఛ్యామ శిరాస్సువర్ణ కవచశ్చంద్రార్ధ చూడామణిః
నిష్ఠాయస్యవృతింకదా మదయితాగాత్రీణి కుంభేశ్వరః ౪

శ్లో॥ భాస్వద్భవ్యవిభావ సౌరభలసచ్ఛాయాను భావోదిత
ప్రీమర్భావకలః కళంకరహితః స్వచ్ఛస్స్వయంభూరసః।
అద్వైతోపి లసద్విరూప సుగుణాలంకార విభ్రాజితో
ధాతామేహృదయే కదాసుఖముఖాం సిద్ధింసనద్యాత్తవః॥

ఇతిశ్రీభట్ట శ్రీనారాయణీయం హారపయోధరం.

సంపూర్ణం.

# మహేశ్వర స్తవః.

శ్లో॥ జటాతటిచ్ఛటా॰ కటాహపాటవోల్లుఠ ద్వయా
త్సరిత్పయః ప్రపన్ని షేచితార్ధమూర్ధమూర్ధజం
కనద్ఘనద్ఘనాఘన పరికాశ కేశపాశ భృ
న్మమాద్య కృష్ణపింగళం మహ స్తనోతుమంగళం॥

శ్లో॥ మనోభవపరితోషణ ప్రమోషణ పరిధాచణ
పరిఫుల్లపంకజపరిభా ప్రసిద్ధ శతృమిత్రదృక్
గుణా స్తరేణ నాభిభూత నాభిభూతిభూషితం
చిరేణ చంద్రశేఖరం చినోతుశం మహాన్మహః.

శ్లో॥ జనార్దనావమర్దనావన ద్రిమర్దశధ్వన
ద్ధిమిద్ధిమిద్ధిమిధ్వని ప్రచండచండ తాండవం
ధగద్ధగద్ధనంజయ స్ఫులింగ సంగతాళికం
మహాన్మునీలలోహితం మనోనుస్పృత్యాతుస్థిరం.

శ్లో॥ ఉరోవిలోల లేలిహానజాలపాలమాలికా
మయోపవీత వేణికాగతస్ఫుటావృత స్తనం
సువర్ణశైల బాలకీరహ స్త మస్తవిభ్రమం
తదస్తువస్తునఃస్తుతౌ మహామహం మహాన్మహః

శ్లో॥ అమూర్తమూర్ధజస్థిత గ్రహర్క్షపుష్పనిష్పత
స్మరందబిందు బుద్ధికృద్వియచ్ఛదీనటజ్జటం
శిఖాచ్ఛటా జటాలస న్నిటాల దృక్కటాహభృత్
భరిమత్ప్రరేత భూతజాత పీతమస్తు వస్తువః

శ్లో॥ మహామహం మహేశ్వరో ధనం ధనాధిపశ్రితః
శ్రియంశ్రియః పతిప్రియ స్తథాయురంత కాంతకః

కైలాసశాఖస్థః పరాం శ్రియం పుష్ణన్సమీక్షిత
స్సదాశివ స్సదాశివం దదాత్వనస హ్యాక్రీతః. ౩

శ్లో॥ నమో నమః కపర్దినే నమో నమః కపాలినే
నమో నమః పినాకినే నమో నమోస్తు శూలినే।
నమో నమో ఽస్త్వఘచ్ఛిదే నమో నమో మఖచ్ఛిదే
నమో నమస్స్మరచ్ఛిదే నమో నమో యమచ్ఛిదే॥ ౭

ఇతి

శ్రీభట్ట శ్రీనారాయణ కృతో మహేశ్వర స్తవః

అథ

మహేశ్వర దండకం.

జయ జయ జగదీశ దేశాద్యవచ్ఛేద శూన్య స్వయం భాస మానాసమానప్రకాశ ప్రమాణాప్రమేయ స్వరూపానుసంధాన సంసిద్ధికతానానుమాన ప్రమాణోర్ణనాభ ప్రతీకాశ మేతజ్జగజ్జాత మాత్మాంతరా దాత్మనైవాంతరా వ్యంజయన్ రంజయన్ భంజయన్నంజసా పుంజితానేక కంజప్రియద్యోత మంజుప్రభాపుంజ పాకేతమః ప్రస్ఫుర త్సచ్చిదానంద రూపాను రూపాత్మమాయా సమాయాతమూర్తే! త్రిమూర్తే! శ్రుతిర్వా హరిర్వా వృషావావృషో వేతిపారాశికీభిర్వ్యథాభిః కథాభిః ప్రథాభిః ప్రమాభిశ్చదుర్బోధ గాఢేతరాబాధ భూమైక సీమాన మత్యంత గత్యంతరాభావ తస్సన్నిపత్యాభి తస్సన్నిరుద్ధాభి రుర్వీజుషాం యోగినామాన్తరే స్వత్వసంస్థైకవచ్ఛన్న మచ్ఛాచ్ఛగా త్రోల్లసత్పూత్కృత్మపక్ష్మాణ ముక్షాణ మక్షీణ మక్షామ మక్షామ మానందినీం నన్దినీం ద్రష్టుమాగత్య వీక్షోల్లసత్సప్రకర్షప్రహర్షం స్వమంగం సమారోప్య జామాతరం నేతుకామం వనీహారశైలం సమా స్థాయ భూయస్సమాస్థావహానాం సదాస్థానభాజాం శరీరివ్రజానామ

జాఘోత్కషజేందాద్రి సామ్నాయసూనాని భాగ్యాని దోగ్యానిదాతుం! వదాన్యోయు మన్యోన్యధన్యోభపీతి శుద్రితిఖ్యాతకీర్తే! అష్టమూర్తే పరిభాత పరిపుల్లార విస్తాళి తేజస్తిరస్కారధీర పరిభాపూర నిత్యప్రకల్పప్త పరివార పరిసూనోపహార క్రియాచార చేలాన్తరా ద్యోపచారాంఘ్రి పుష్పద్వయాశాంత సంకాంత శాంతాంతరంగాంతరంగ! పరిశాంతాంతరంగ! శ్రీయోద్యచ్ఛరత్కాల రాకాశశిప్రాప్త పర్యస్తతః పాణి జోత్కీర్ణ లేఖాంశలే శైరివాప్తైర్నఖై ర్వ్యాప్యగాబద్ధ బింబే కదంబేను చామంబురాశి భ్రమావేశ మజ్జన్మహా కచ్ఛపచ్ఛందవృత్తాయి తోన్నత పాదద్వయీ పృష! బంహిష్ఠ సాధిష్ఠ శబ్ద పరిపంచ పరిసిద్ధత్వ పద్మేశపర్యంక భూతత్వ కాళీకరోర్మిత్వ భూభార విశ్రామ భూమిత్వ పూర్వాప్రమేయాత్మ మాహాత్మ్య భృన్నాకపురీ భూప శేషాహి శీర్షచ్ఛటా స్యూతశోణ స్ఫటారత్న నిర్యత్న నిర్యన్మయూఖా ర్చిరాసార నీరాజనప్రాప్త లోహాభిసార స్మరస్మేర తూణీరశంకా కరో న్మృష్ట గోపుచ్ఛ తుచ్ఛీకృతివ్యక్త వృత్తాను పూర్వాత్మ జంఘామనోజ్ఞ శ్రితాళీ మనోజ్ఞ! అంఘ్రియుగ్మస్థ సాహిత్య శృంగార భృంగార జాను ద్వయగ్రంథి శోభాపరాభూత కల్యాణఖేటద్యుతే! హాటకేశాదిగ గ్రాఘు రూఢస్థితే! నీరనీరంధ్ర వృతాద్రి వేతండశుండా ప్రచండోరుదండాశ సే బ్రహ్మహత్యాది కృత్యాపహోచ్చండ హిండత్తమస్కాండ కాండాశనే! (సూర్య) ద్రుతకనక సన్నద్ధమిద్ధ ప్రభం మధ్యమధ్యోల్లసచ్ఛాత్రమవేఖం వపుర్భస్మపాంసుచ్ఛటాదిగ్ధ మామధ్యమత్యంత పీతం పరికృత్యా పరికృత్యా సనత్వాది వృత్యా సమావృత్య వృత్యంత రావృత్త్య భావాది వాబద్ధయుద్ధ స్పృహాం సావహేళం సమాకృష్య వేణీం త్రివేణీమివాధిక్షి పన్తం మహాన్తం సహాన్తస్వజీవాళి మప్యన్తికస్థస్య జన్తోర్భయం భావ యన్తంచ వైయాఘ్రచర్మ ప్రకాండంవసానం మదాసంగ మాతంగ రాజాంగ భంగాను షంగోద్య మత్తెద్రికంగోచరో వీక్ష్యతాం మయ్యా పీత్యాగ్రహేణేవ మత్తేభకృత్తిం సదా దాదదానం కదాచిత్ సదాపి

శాంత చూడామణే! సుకులగరకేళీ టనిస్తారి కల్యాణ ఘూర్ణ ఘృణాన
పరిజేశ పరిత్రితాంశ మద్ధ్యే పరాగ్రే పరాగ్రోత్సవితాయి తాపీపస్ఫూర్తక్త
నక్షోజశాటకశ్రియా పాటనం విస్ఫురచ్ఛ్వేత శాతోద్యోత నవ్యాభిపత్యంద
ధద్ధత్రితణాభ్యాం, పదాంభస్యాయు పాలాశీమూలాలనాలాయు మహా
మణీష్టేంద్ర దంష్ట్రేయ కాంత్యాలక పాత్రీయు ఫ్రాంస్వృతి భాసాపద
ప్రక్రియా వ్యాకరియా సంప్రదాయ ప్రభావాది మహాచార్యవర్యోప
దేశకత్రియాచార్య ధుర్యానసిద్ధార్థ శిరోన్యసుఫణిసుఫణాంచ
ఫణాం, తథైవా భయం భూతజాతీయు పీతాయ సంకీర్ణయన్న
వ్యయం చాప్తయం సంపదానో సితాభ్యాం పదాభ్యాం కరాభ్యామ
శేషశ్రితిప్యాత్రమూర్తిం లసద్ధానసంపత్తికా శైవలాళీకరీరాగ్రి గాఢ
త్స్రతశ్యామగాత్రిం పరిక్రృత్త్యోరుపా ప్రకృత్యేవ కంఠస్థలోల్లాసి గౌరా
సితశ్యామలేఖం వటాశ్వత్థవృక్షాంకురాపార సాకార మాకోటికాన్వాను
పూర్వ్యాసతం కోటిసారంసదాచర్విత తామ్రి బింబవత్సనాయూష
లౌహిత్యసంస్కార మాభాదఖండాశ్రితుండం దధానం సహాసాదరం
కీరమాత్మస్తుతివ్యగ్ర భక్తాగ్రిగణ్యేష్టదానైక మత్యంచ నిత్యం సుఖ
ప్రిత్యయాంకం విశంకాకళంకం వరాంకంచబిభ్రత్ క్వచిద్భస్మ
ధూళీః క్వచిన్నాభిపాళీః క్వచిత్సర్వనారాః క్వచిత్పుష్పహారాః
క్వచిత్ క్ష్వేళయోగం క్వచిద్గంధరాగం క్వచి త్కాంచుకస్పృష్టింక్వచిత్కాం
మఘృష్టిం క్వచిత్పింగళాభాం క్వచిత్కృష్ణశోభాంచ పుష్ణన్నదంభోసి
సద్భక్తి సిద్ధాంజనానాం జనానాం కృతే క్లప్త సాక్షాత్కృతే! సర్వ
సాక్షిన్! సమాశ్చర్య చర్యాకృతే! కంఠకాంత స్థితేనార్తనైతానమే
యేన పాథోముచా వాపికేనాథ వాహోశుకేవ ప్రవేశతృణాపర్ధిత శ్వ
క్రగోపోను చూతప్రవాళోను బింబీఫలాంశోను కింవాన్యదేవేతి సందేహ
సందోహదం దంత వాసస్తదంతర్వచోవ్యాజ పీయూషనిష్యూత విస్ఫూర్తి
ర్తికాశాః స్వమూలాంతరోద్యోత నివ్యాపశేషాం కురాభాస సంఫుల్ల
కున్దపరిచ్ఛద్యరూపా ననంక్షీణశృంగా నసత్యర్ధతుంగాః వదాతాంశ్చ
దంతాన్ల్లలన్మాసనోక శ్శిశుస్మేర కాంతిస్మితంచ పరిషంచ్య క్వచిద్రి

త్వ్రిభువనాభృతా వృష్టియష్ట్రిక సంస్థానయోర్నిత్య విద్వేషిణో
ర్నాస్తశృంగార యోర్మాన్యస్మసౌహార్దసర ఇత్యాకలయ్యేవ నిక్షిప్తయా
సేతుభూలేఖయా చంప కాకార సంపన్న్యలోపిత్రియమానాసయా బంధురా
స్యామ్మృతాంశో. లలత్కేశలోక స్థిరాతిమంద సౌహిత్యనాడింధమం
పల్లవితోప్ప్రప్రాణిషుణ్యాని కర్ణేషు సాక్షాత్కృతి వ్యగ్ర మగ్రాగ
సాహసి సంక్షోభసమాపన్న మాలామయం కాలచక్రప్రవృత్తి
క్రియానాభి మన్యాయవాప్య గ్రీవాపృహ్యాహ సామ్రాజ్యశోభం పరిభావేన
సర్వ్వసుమత్రాణజాతం జగజ్జాత పుష్యద్రిసప్రక్రమోత్క్రాంతేచ నిష్పాదితా
గారిమ్య విదుర్మ్యవిద్రోణి వేలాఘుటీయంత్ర మాదిత్యసంజ్ఞావ దక్షైక
మన్యక్షేలా సన్యజస్వాంత పట్టంభశిష్టంభకం సర్వసర్వంసహాది త్రిలోకీ
ఫలగ్రాస ధీరస్ఫురజ్జ్వాల మాలా కరాళాస్త్రరం నిత్యమాముద్రితం
పద్రుతార్ధ పరిభాగార గోరోచనాచిత్రకాభం బృహద్భాను సంజ్ఞం
తధార్ధం పుమర్ధే పరార్ధే జగన్నేత్రి కౌతూహలాంభోధి జృంభాప్రియం
భావుకం కించ లక్ష్మీసుధాసోదరం తారకారాధిపత్యాసికాధామ
జైవాతృకాఖ్యం యథార్థాఖ్య మక్ష్యైక మేవోద్ధధానేన వామేన
మానేష్య వామేన పాత్రాదవామేన శాణాశ్మనిర్ణిక్త ముక్తాపరాగాచ్ఛ
భస్మచ్ఛటాకల్పితం శ్వేతపానస్మరాటోప సంక్షేప పూర్వార సంహార
సంపాదితం కీర్తికూటత్రయం వాత్రిపుండ్రం వహనంచ వామేన వామేన
గోరోచనా చిత్రకప్రాంత సంక్రాంత ముక్తాలలంతీలతాంచాపి విద్యోత
యంతీ మశేషాధిపత్యాంక కల్యాణపట్టాయమానా మనభ్రాష్టఖీచంద్ర
లేఖాభిరామాం లలాటస్థలీ మావహనేన వక్త్రేణ వక్త్రప్రధావత్
ప్రధావత్కవివార్తజాతావలేపాపహ! అశేషభూతాంతరోద్భూతతా
పాపహ! ప్రతిపదవివృతస్ఫుటాపృష్ట సప్తాతసీసూన గుచ్ఛచ్ఛవిచ్ఛంద
కాళచ్ఛవిజ్యాకళాహీన కాండాసనచ్ఛాయ లేఖామయాఖాలసద్గాత్రి
నాగేంద్రయోగాత్త వృత్తాకనీలస్ఫురత్కుండలవ్రీక్రియైకత్ర హస్తస్థ
కీరాశనపత్త్ర మత్రత్వసత్త్వోద్దళద్దాడిమీ భిత్తశంకాకరపస్ఫురద్రత్న
తాటంక సంపత్తి రన్యత్రి చైకత్ర శంపాళిసంపాత పింగః కపర్దో

భక్తాగ్రిగణ్యాచ్యుతప్రత్త చక్రాయుధ! స్ఫారచక్రాభిధావిస్ఫురద్దండక
పరిస్రుతాత్మప్రశస్తిస్తుతిస్తోమ! సోమావతంస! ప్రధీన్ద్రసద్దానసత్త్వ
సాహిత్య నారాయణానన్ద కన్దాయితామన్ద వన్దారుమన్దార!
సంక్రాన్తసూర్యోదరావాసధీచోదనాశేష చర్యానమశ్శేషనారాయణ
సూరిత్యుదీత్యార్థ! నారాయణాఖ్య! ప్రపన్నార్తిహారిన్! నజానేఽర్థజానే!
పరాత్మాగతిం భూతయోనే! వియోనే! యథేష్టం మమేష్టం ప్రవృష్టం
కృపిష్ఠాః పరికృష్టపరిభావేశ! యజ్ఞేశ! యోగీశ! వైద్యేశ! విద్యేశ!
శంభో! మహాదేవ! శంభో! నమస్తే నమస్తే నమః॥

ఇతి

శ్రీభట్ట శ్రీనారాయణీయం మహేశ్వర దండకం

సంపూర్ణం.

శివం



# పొంగలి వ్రతము.



అనఁగా దీనినే కొండకు గురునాథపొంగలి వ్రతము.

యజమానః పత్న్యాసహమంగళస్నానం కృత్వా సంధ్యాదినియమానంతరం। స్వగృహస్య ఈశాన్యభాగే మంటపం కృత్వా ఆమ్రపల్లవపుష్పమంజర్యాదిభిరలంకృత్య బ్రాహ్మణాన్ బంధూంశ్చాహూయ మంటపే అఖండదీపారాధనం కృత్వా ప్రణమ్య॥

ఏవంగుణ విశేషణవిశిష్టాయాం శుభతిథౌ సకుటుంబస్యమమ ఇహజన్మని గురునాథ సిద్ధిద్వారాసకలోపద్రవశాంతిపూర్వక దీర్ఘాయుఃపుత్రపౌత్రధనధాన్యాద్యైశ్వర్యాభివృద్ధ్యర్థం మంటపారాధన పాయసహవిః పచనాదిగురునాథ దేవతాపూజాం కరిష్యే ॥ నిర్విఘ్నపరిసమాప్త్యర్థమాదౌగణాధిపతిపూజాంకరిష్యే। ఇతికలశగణాధిపతి పూజాంకృత్వా పాయసహవిశ్చరుంగంధపుష్పాక్షతైరలంకృత్య॥ శ్లో ॥ క్షీరాన్న వసనుద్భూతే కామధేనోమునిప్రియే। ప్రదాతుంగురవే హవ్యం దేహిక్షీరాణి కామదే ॥ ఇతిగోక్షీరాణిహవిశ్చరౌవిన్యస్య గృహమధ్యదేశే అగ్నిం ప్రజ్వాల్య। హుతాశనప్రాగుచ్ఛిక్తపయః పూర్ణాచ్చరో స్వాహా।గురునాథాస్వాద్యహవ్యంపచ్యతాం నవతండులైః॥ ఇత్యగ్నౌక్షీరాణ్యుత్తాప్య సంప్రదాయానుసారేణ తండులాన్ హవిశ్చరౌవిన్యస్య ద్వాదశాంజలిపరిపూరిత తండులాన్ క్షీరపాత్రేనిక్షిపేత్ తతోహవిస్సిద్ధపర్యంత్యగురునాథ పూజాంకుర్యాత్ ॥ అలంకృతమంటపమధ్యే సింహాసనం ప్రతిష్ఠాప్య తత్పార్శ్వద్వయో స్త్రిశూలంఖడ్గంచ విన్యస్యప్రాణప్రతిష్ఠాపనంకృత్వా ధ్యానావాహనాది పూజాంకుర్యాత్॥

ఏవంగుణ విశేషణవిశిష్టాయాం శుభతిథౌ గురునాథదేవతాప్రీత్యర్థంధ్యానావాహనాదిపూజాంకరిష్యే॥ అథధ్యానం ॥ శివకేశవసంభూతం । చతుర్బాహుంత్రిలోచనం । త్రిశూలఖడ్గ డమరుచక్రాద్యాయుధధారిణం । గురునాథమహంధ్యాయే సర్వకామవరప్రదం॥ గురు

నాథ దేవతాభ్యోనమః। ధ్యానంసమర్పయామి। అశ్వత్థపత్రశయ్యాయాం సంజాతంప్రమథాధిపం। లోకసంరక్షణాసక్తం గురుమావాహయామ్యహం। గురునా... ఆవాహనం సమర్పయామి॥ సువర్ణచిత్రితంపీఠం నవరత్నసమన్వితం। సింహాసనంప్రదాస్యామి సంవిశధ్వమిహాప్రభో। గురునాథ- ఆసనంసమర్పయామి ॥ సరోవరసమానీతం జలంకలశసంస్థితం। పాదయోర్గురునాథాహమర్పయే పావయస్వమాం॥ గురునాథ-పాద్యం సమర్పయామి। సువర్ణకలశానీతం సుగంధకుసుమాన్వితం। గురునాథ గృహాణార్ఘ్యం సర్వసంపత్ప్రదాయకం॥ గురునాథ - అర్ఘ్యం। పవిత్రముదకందివ్యం స్వర్ణపాత్రస్థితంశుచిః। గృహాణాచ మనార్థాయ గురునాథసుఖప్రద॥ గురునాథ - ఆచమనం। పంచామృతైః పంచమంత్రైర్దధిక్షీరఘృతాదిభిః। మధునాచమహాబాహో స్నాపయేశంకరాత్మజ॥ గురు - పంచామృతస్నానం ॥ గంగాదిపుణ్యతీర్థేభ్యో మయానీతేన వారిణా। స్వర్ణకలశస్థితేనాద్య స్నానమంగీకురుప్రభో॥ గురునాథ-స్నానం॥ స్వర్ణాంచల సమాయుక్తం వస్త్రయుగ్మం కటిప్రభం। మయార్పితం గృహాణ్యేశంకమ్యం హరిహరాత్మజ ॥ గురునాథ-వస్త్రయుగ్మం। సువర్ణతంతుసంభూతం యజ్ఞసూత్రం మయార్పితం। అంగీకురుష్వ దేవేశ గురోమంత్ర పవిత్రితం ॥ గురునాథ- యజ్ఞోపవీతం। సుగంధద్రవ్యసంయుక్తం కస్తూరేణసువాసితం। చందనం తేప్రదాస్యేహమంగీకురువిలేపనం॥ గురునాథ - గంధం ॥ హరిద్రాచూర్ణ సంయుక్తాన్ కుంకుమేన సమన్వితాన్। మయార్పితానక్షతాంశ్చ గృహాణప్రమథాధిప॥ గురునాథ - అక్షతాన్ ॥ బిల్వపత్రైర్ద్రోణపుష్పైః కరవీరైః కుశేశయైః తులస్యా కర్ణికారైశ్చ గురునాథాహమర్చయే ॥ గురునాథ- పుష్పాణి।

అథాంగపూజా.

గురవేనమః పాదౌపూజయామి, నాథాయనమః కటింపూజయామి, ఈశ్వరాత్మజాయ నమః నాభింపూజయామి, శాస్త్రేనమః, హృదయంపూజయామి, శూలఖడ్గధరాయనమః భుజాన్ పూజయామి, లోకరక్షకాయనమః కంఠం పూజయామి, పాయసాహార నిరతాయ నమః ముఖంపూజయామి, భక్తసంపత్ప్రదాయనమః నాసికాంపూజ

యామి, త్రినేత్రాయనమః నేత్రాణీపూజయామి. జ్యోత్స్నాకళాపతి ప్రియాయనమః కర్ణౌపూజయామి, మోహనాసి సుతాయనమః లలాటం పూజయామి, హరిమానాత్మజాయనమః శిరఃపూజయామి ॥

అధాష్టోత్తర శతనామావళిః.

ఓంశివాయ నమః
మహేశ్వరాయ
శంభవే
పినాకినే
శశిశేఖరాయ
ఓం వామదేవాయన నమః
విరూపాక్షాయ
కపర్దినే
నీలలోహితాయ
శంకరాయ
ఓం శూలపాణయే నమః
ఖట్వాంగినే
విష్ణువల్లభాయ
శిపివిష్టాయ
అంబికానాధాయ
ఓం శ్రీకంఠాయ నమః
భక్తవత్సలాయ
భవాయ
శర్వాయ
త్రిలోకేశాయ
ఓం శితికంఠాయ నమః
శివప్రియాయ
ఉగ్రాయ
కపాలినే

ఓం కామారయే నమః
అంధకాసురసూదనాయ
గంగాధరాయ
లలాటాక్షాయ
కాలకాలాయ
ఓం కృపానిధయే నమః
భీమాయ
పరశుహస్తాయ
మృగపాణయే
జటాధరాయ
ఓం కైలాసవాసినే నమః
కవచినే
కఠోరాయ
త్రిపురాంతకాయ
వృషాంకాయ
ఓం వృషభారూఢాయ నమః
భస్మోద్ధూళితవిగ్రహాయ
సామప్రియాయ
సర్వమయాయ
త్రయీమూర్తయే
ఓం అనీశ్వరాయ నమః
సర్వజ్ఞాయ
పరమాత్మనే
సోమసూర్యాగ్నిలోచనాయ

ఓం హవిషే నమః
యజ్ఞమయాయ
సోమాయ
పంచవక్త్రాయ
సదాశివాయ
ఓం విశ్వేశ్వరాయ నమః
వీరభద్రాయ
గణనాథాయ
ప్రజాపతయే
హిరణ్యరేతసే
ఓం దుర్ధర్షాయ నమః
గిరిశాయ
గిరీశాయ
అనఘాయ
భుజంగభూషణాయ
ఓం భర్గాయ నమః
గిరిధన్వనే
గిరిప్రియాయ
కృత్తివాససే
పురారాతయే
ఓం భగవతే నమః
ప్రమథాధిపాయ
మృత్యుంజయాయ
సూక్ష్మతనవే
జగద్వ్యాపినే
ఓం జగద్గురవే నమః
వ్యోమకేశాయ
మహాసేనజనకాయ

ఓం చారువిక్రమాయ నమః
రుద్రాయ
భూతపతయే
స్థాణవే
అహిర్బుధ్న్యాయ
ఓం దిగంబరాయ నమః
అష్టమూర్తయే
అనేకాత్మనే
సాత్త్వికాయ
శుద్ధవిగ్రహాయ
ఓం శాశ్వతాయ నమః
ఖండపరశవే
అజాయ
పాశవిమోచకాయ
మృడాయ
ఓం పశుపతయే నమః
దేవాయ
మహాదేవాయ
అవ్యయాయ
హరయే
ఓం పూషదంతభిదే నమః
అవ్యగ్రాయ
దక్షాధ్వరహరాయ
హరాయ
భగనేత్రభిదే
ఓం అవ్యక్తాయ నమః
సహస్రాక్షాయ
సహస్రపదే

ఓం అపవర్గప్రదాయ నమః
అనంతాయ నమః
తారకాయ నమః
ఓం పరమేశ్వరాయనమః
ఓం శ్రీగురునాథస్వామినేనమః
అథ శివసహస్రనామ పూజాంకుర్యాత్॥

ఇత్యష్టోత్తర శతనామావళి సమాప్తః.

---

శ్లో॥ దశాంగంగుగ్గులోపేతం సుగంధసమన్వితం । గురునాథప్రదాస్యామి ధూపమంగీకురుప్రభో ॥ గురు-ధూపం। శ్లో : పంచవర్తిసమాయుక్తాంగోఘృతేనసమన్వితాం।దీపమ్ప్రదాస్యామిశంభోభవహరాత్మజ॥ గురునాథ-దీపందర్శయామి॥ అథనైవేద్యం॥ శ్లో॥సుపక్వంపాయసంస్వాదు వ్యంజనాపూపసంయుతం। స్థితంద్వాదశపాత్రేషు శుచిగోఘృతమిశ్రితం। గురునాథార్పయామీదం భుజ్యతాంవరదోభవ॥ గురునాథ-నైవేద్యం॥ శ్లో॥ నాగవల్లిదళైశ్చైవత వజైః పూగీఫలాన్వితం। ముక్తాచూర్ణలవంగైశ్చ యుక్తంతాంబూలమర్పణే! గురునాథ తాంబూలం ॥ శ్లో ॥ పూజాసాద్గుణ్యసిద్ధ్యర్థం స్వర్ణపుష్పసమన్వితాం దక్షిణాంతేప్రదాస్యామి భక్త్యైశ్వర్యప్రదాయక ॥ గురునాథ-దక్షిణాం॥ శ్లో॥ అనేకవర్తిసంపన్నం గోఘృతాక్తం సుమంగళం । నీరాజనందర్శయామి గురుకర్పూరసంయుతం॥ గురునాథనీరాజనం॥ ఈశ్వరాత్మజదాస్యామి పుష్పాంజలిమహప్రభో। గురునాథగృహాణేమం॥ సర్వసంపత్ప్రదాయక॥ గురునాథ...మంత్రపుష్పంసమర్పయామి। ప్రదక్షిణత్రయం కృత్వా ॥ పరిణమామిముహుర్ముహుః । అపన్నివారణంకృత్వా సర్వసంపత్ప్రదోభవ। గురునాథ- ప్రదక్షిణనమస్కారాం త్సమర్పయామి॥ అథఅర్ఘ్యః॥ శ్లో॥ మార్గశీర్షేధనుర్యుక్తే పూర్ణిమాగురువాసరే।అర్ఘ్యాన్ యాంభక్తరక్షార్థం జాతోహరిహరాత్మజ। గురునాథదేవతాభ్యోనమః ప్రథమార్ఘ్యంసమర్పయామి।ఏవంప్రకారేణద్వాదశార్ఘ్యానిదద్యాత్ తతఃభగవత్ప్రార్థనంకుర్యాత్ ॥ శ్రద్ధాంమేధాంయశఃప్రజ్ఞాంవిద్యాం బుద్ధింశ్రియంబలం । ఆయుష్యంతేజఆరోగ్యం గురునాథప్రదేహిమే ॥ యస్యస్మృత్యాచనా మోక్త్యాతపఃపూజాక్రియాదిషు। న్యూనంసంపూ

ర్ణతాంయాతి సద్యోవందేతమచ్యుతం ॥ మంత్రహీనం క్రియాహీనం
భక్తిహీనంహరాత్మజ। యత్పూజితంమయాదేవ పరిపూర్ణంతదస్తుమే।
అనయాధ్యానా వాహనాది పూజయానై వేద్యేనచ భగవాన్గురునాథ
సుప్రసన్నోవరదో భవంతు......కల్పోక్తసంపూర్ణ సకలఫలావాప్తి
రస్తు॥ఆచరితవ్రతంసువ్రతమస్తు బ్రాహ్మణాయసపాయసంద్వాదశా
పూపవాయనదానంకృత్వా బ్రాహ్మణాన్ భోజయిత్వా గురునాథహవిః
ప్రసాదంస్వయం బంధుభిస్సహభుక్త్వా బ్రాహ్మణేభ్యో దక్షిణాతాంబూ
లాదికందద్యాత్ ॥సర్వంగురునాథదేవతార్పణమస్తు॥ పూజకాలేనమక
పారాయణంకుర్యాత్ ॥

# అథకథాప్రారంభః.

సూతఉవాచ॥ శ్లో॥ శృణ్వంతుఋషయస్సర్వే నైమిశారణ్యవాసినః।
రహస్యమద్భుతంచైవ చరితంలోకపావనమ్ ॥ శివకేశవపుత్రస్య జన్మ
కర్మాశ్రయంమహత్ । తస్యోపాసనయోన్నాణా మాయుర్వృద్ధిర్భవి
ష్యతి॥ వినశ్యంత్యాపదశ్శీఘ్రం తథైవాయాంతిసంపదః। పుత్రపౌత్రా
భివృద్ధిస్స్యాత్పశుధాన్యధనోచ్ఛ్రయః॥ ఋషయఊచుః॥

తా॥ శ్రీమదఖండ భూమండలమునకు నలంకారభూతంబైన భరత ఖండము
నందు మిగుల బుణ్యాకరంబగు నైమిశారణ్యమునందు శౌనకాది మహామునులు దీర్ఘ
సత్రయాగమును జేయుచుండగ నచ్చటికి వ్యాసశిష్యుడై సకలపురాణార్థములనుదెలిసి
యున్న సూతుండువచ్చె అట్లువచ్చినసూతుని గారవించి కూర్చుండనియమించి అనే
కములగు పురాణములనువినుచుండిరి అట్లువినుచుక్రమముగ కూర్మపురాణమునువిను
టకుద్యమించిరి, అట్లు ప్రయత్నించిన మునివరులు సూతునితో నిట్లనిరి అయ్యాకథ
కులోత్తమా మామనస్సులయందు శాస్తయనుమారు పేరుగల గురునాథుడని దేవోత్త
ముని వృత్తాంతమును వినవలయునని యభిలాష గలిగియున్నది మా యభిలాషంబు
ను దీర్చవేయమనిన నక్కథకోత్తముండిట్లనియె నైమిశారణ్యవాసులగు ఓ శౌన
కాదిమునివరులోత్తములారా మిగుల దాచతగినదియు ఆశ్చర్యమును చేయతగినదియు
లోకములను పవిత్రములుగ జేయునదియునగు శివకేశవ పుత్రుండైన గురునాథుని

చరిత్రమును సమగ్రముగ జెప్పెదను సావధానులై వినుడు గురునాథుని సేవించు మానవుల కాయుర్వృద్ధి యగును సకలైశ్వర్యంబులును గలుగును ఆపదలన్నియును నశించును సంపదలు వచ్చును పుత్రపౌత్రాభివృద్ధి యగును ధాన్యములును ధనము లును నధికముగ గలుగుననినవిని శౌనకాదిమునివరు లిట్లనిరి.

శ్లో॥ సూతసర్వరహస్యజ్ఞ మహాపూరుషరూపయోః ।
శివకేశవయోఃపుత్రః కథంజాతోమహామునే॥

శ్లో॥ కీదృశంతత్స్వరూపంవా నామధేయంచకీదృశమ్॥
తస్యపూజావిధానంచ తచ్చరిత్రించకీదృశమ్॥
అతిచిత్రమివాభాతి బ్రూహిసర్వంసవిస్తరమ్॥

తా॥ ఓసూతమహాఋషీనీవు సకలరహస్యములను దెలిసినవాడవు మహాపురుష రూపులగు శివకేశవుల కిరువరకును గురునాథుడు పుత్రుండెట్లయ్యె గురునాథదేవుని స్వరూపమెట్టిది ఆగురునాథదేవునకు బూజాదుల నెట్లుచేయవలయును ఆదేవుని చరిత్ర యెటువంటిది నీకువచనములు మిగుల నాశ్చర్యమును గలుగజేయుచున్నవి ఈవిషయ ములనుదెల్పి మమ్ముల కృతార్థులఁజేయుమనిరి.

సూతఉవాచ॥ శ్లో॥ వక్ష్యేతచ్చరితంసర్వం శృణుధ్వంశౌనకాదయః॥
కేశవేశ్వరిసంబంధి పావనంసర్వదేహినా ॥

తా॥ సూతుండుచెప్పుచున్నాడు ఓశౌనకాదిమునివరులారా గురునాథదేవుని వృత్తాంతమును సర్వమునుసవిస్తరముగ జెప్పెదనువినుఁడు. శివకేశవులకు పుత్రుడగు గురునాథుని చరిత్ర సకల ప్రాణులను పవిత్రము జేయుటకు దగిన సామర్థ్యము గలిగియున్నది.

శ్లో॥ పురాదేవాసురాస్సర్వే సమవేతాస్సహస్రశః ।
అమృతోత్పాదనార్థాయ ప్రయత్నంచక్రుహోజసా ॥
మందరాద్రింసముత్పాట్య కృత్వామంథానముద్భృతం ।
రజ్జుంకృత్వావాసుకించ మమంథుఃక్షీరవారిధిమ్ ॥

తా॥ పూర్వము దేవతలును రాక్షసులును వక్కటిగాజేరి తమ తేజస్సుచేత నమృతమును బుట్టింపవలయునని ప్రయత్నించి మందర పర్వతమును బెల్లగించియుత్పా

ద్భుతమగు కవ్వమునుగా జేసి ఆదిశేషువును నాకత్రాడుగా చేసి పాలసముద్రమును మథించుచుండిరి.

శ్లో॥ నిమగ్నంమందరక్షీర వారిధౌభగవాన్హరిః।
దధారకూర్మరూపేణ సమందు స్తేసురాఃపునః॥

తా ॥ ఆవిధముగ మథించుచున్న సమయమునందు మందరపర్వత మాక్షీర సముద్రమునందు మునిగెటప్పుడా నారాయణుడు కూర్మరూపమునుధరించి యాపర్వతమును దనవీపునఁ బెట్టుకొని యాపర్వతమును లేవనెత్తెను పిమ్మటను దేవతలును రాక్షసులును మరల సముద్రమును మథించుచుండిరి.

శ్లో॥ మథ్యమానేంబుధౌతస్మా జ్జాతంహాలాహలంవిషమ్ ॥
తద్విషంభక్షయామాస లోకనాశకరంశివః॥

తా॥ అట్లుసముద్రమును మథించుచున్న సమయమునం దాసముద్రము నుండి హాలాహలమను పేరుగల విషముపుట్టె లోకములను నశింపచేయునట్టి సామర్థ్యము గల యావిషమును పరమేశ్వరుడు భక్షించెను

శ్లో॥ ఐరావతఃపారిజాత స్తథైవోచ్చైశ్శ్రవాహయః।
శ్రీ దేవీకామధేనుశ్చ కౌస్తుభోప్సరస స్త్రియః॥
తతఃపయోధేసంభూతా రత్నభూతాదివౌకసామ్॥
అచ్యుతేంద్రాదయోగృహ్ణా న్నేతాః ప్రేమపురస్సరమ్।
తథైవావిర్బభూవాథ పయోధేరమృతంశుభమ్॥

తా॥ అనంతరమందా సముద్రమువలన నైరావతము, పారిజాతము, ఉచ్చైశ్శ్రవము, లక్ష్మీదేవి, కామధేనువు, కౌస్తుభమణి, అప్సరస్త్రీలు మొదలగునవి పుట్టె అవియన్నియు దేవతలకురత్నములవలె మనోహరములై నవయ్యె వానిని నారాయణుఁడు దేవేంద్రుడు మొదలగువాడు ప్రేమగలుగునట్లు గ్రహించిరి అంతటకల్పవృక్షాదులు పుట్టినవిధమున మిగుల శుభకరమగు నమృతముపుట్టెను.

శ్లో॥ దృష్ట్వాతదసురాశ్శీఘ్రు మగృహ్ణా బలశాలినః।
తేభ్యోపిబలినోగృహ్ణాన్ నపరేదానవాస్సుధామ్ ॥
ఏవంగృహీతేబలిభి రమృతేథదివౌకసః।
అహోగతాసుధేత్యేవం చుక్రుశుర్దుఃఖితాస్తదా॥

శ్లో॥ ఇతితస్యాయయాభ్రాన్తా స్తే మోహాన్మైవ్యదదుస్సుధామ్।
సామోహినీబభాషేథ సస్మితం దేవదానవాన్॥

తా॥ ఇట్లు పలికి మోహినీమాయచే మోహమును జెందినవారై న యాజగన్మోహినికి నమృతమునిచ్చిరి అంతటనా జగన్మోహిని యా యమృత కలశమును గైకొని దేవదానవులబిలచి చిరునగవు గలుగునట్లు నిట్లనియె.

శ్లో॥ పంక్తిశోపవిశధ్వంహి ద్విధా దేవాసురాః పృథక్ ।
తథోపవిష్టేషుహరి ర్మోహయన్నసురాన్దృశా ।
స్మితేననర్మభిశ్చాథ దేవేభ్యః ప్రదదౌసుధామ్।
సముద్రమథనంసమ్య క్పూర్వముక్తంమయాఖిలు ॥

తా॥ ఓ దానవోత్తములారా మీరందరు వేరువేరుగ పంక్తులనుతీర్చి కూర్చుండుడు అట్లుచేసితిరేని మీకందఱకును నమృతమును సమముగ బంచియిచ్చెదనని చెప్పి నారాయణుఁడు తనజూపులచేతను భావగర్భితములగు వచనములచేతను నవ్వుచేతను రాక్షసులమోహపరచుచు నాయమృతమంతయు ముందుగ దేవతులకొసంగెనని చెప్పి సూతుండు మఱలనిట్లనియె ఓ మునిశ్రేష్ఠులారా పూర్వమందు మీకు సముద్రమథన వృత్తాంతమును సవిస్తరముగ జెప్పితినిగదా కావున నిప్పుడింకొనదానినిఁ జెప్పెదను.

శ్లో॥ తాంజగన్మోహినీంద్రష్టు మావిరాసీన్మహేశ్వరః ।
తామువాచమయాసార్ధం సంభోగః క్రియతాంశుభే ॥

తా॥ ఆ జగన్మోహినీ రూపమును జూచుటకు పరమేశ్వరుడచ్చోటునకు వేంచేసి యా రూపమును జూచి మన్మథోద్రేకము చేత నోతరుణీమణీ నాతోడఁగ్రీడింపుమని యడిగెను.

శ్లో॥ త్వయ్యతీవానురాగోమే వర్తతేద్యవరాననే।
ఇత్యుక్తవంతమీశాన మబ్రవీన్మోహినీపునః॥

తా॥ ఇట్లు పలుకుచు పరమేశ్వరుఁడు ఓ మోహినీ నీయందు నాకు మిక్కిలి ప్రేమ వర్తించుచుండెననగా నాజగన్మోహిని యీశానునితో నిట్లుపలికినదాయెను.

శ్లో॥ కథమీశమయాసాకం సంభోగః క్రియతేత్వయా।
నారాయణోహమధునా మోహినీరూపమాశ్రితః ॥

తా॥ ఓ పరమేశ్వరా నాతోఁగూడనీవు సంభోగము చేయవలయునని పతూ హాలమెల్లుగలుగుచున్నది నేను నారాయణుడను దానవరాక్షసులను వంచించి దేవతుల కమృతంబీయదలచి మోహినీరూపము ధరించినవాడనయితిని.

శ్లో॥ ఇత్యుక్త్వాలజ్జయానమ్ర వదనామబ్రవీచ్ఛివః ।
ప్రకృతిఃపార్వతీకాలో నారాయణఇతిప్రియే॥
చతస్రఃశక్తయఃపూర్వం నిర్దిష్టాఃసృష్టికారణాత్ ।
శక్తీనాంచతసృణాంమే మధ్యేత్వంపురుషాహ్వయః ॥

తా॥ ఈ ప్రకారముగా పలికి లజ్జపడి తలవంచుకొనిన మోహినిం జూచి పరమేశ్వరుడు బలుకుచున్నాడు ఓ జగన్మోహినీ పూర్వము సృష్టికొఱకు ప్రకృతియనియును పార్వతియనియును కాలుడనియు నారాయణుడనియును నాలుగుశక్తులు నాచేతఁబుట్టింపబడె నాశక్తులలోపల నేను పురుషుడనై యుంటిని.

శ్లో॥ శక్తిరూపంపురాత్వాంతు భుక్త్వా... వాప్యజీజనం ।
దారుకాఖ్యేవనేరమ్యే కదాచిన్మోహయన్మునీన్॥
త్వమేవేన్మృకస్వరూపేణ మయారంతుంపురేచ్ఛసి ।
ఈశత్వయారమిష్యేహ మితిప్రార్థయనేకిల ॥

తా॥ పూర్వము శక్తిరూపుడగు నీతోఁ గ్రీడించి బ్రహ్మదేవుని పుట్టించితిని మనోహరమగు దారుకయను వనమందొకానొకప్పుడు మునులకు మోహమును గల్పించుచు నీవునిటువంటి స్వరూపము చేత నాతోఁ రమించుటకు నభిలాష గలవాడవై యిచ్ఛయించితివి గదా.

శ్లో॥ కాలాంతరేరమిష్యేహ మిత్యబ్రువముపిప్రియే।
తస్మాన్మయారమస్వాద్య ప్రార్థనానవృధాతవ॥

తా॥ ఆ ప్రార్థించినపుడు ఇది సమయముకాదనియు మఱియొక కాలమందు గ్రీడించెదనని చెప్పియుంటిని కావున నీకుకోర్కె యీనాకువచనములు వ్యర్థముగాఁ గూడదు యిప్పుడు నాతోఁ గ్రీడించుమనెను.

శ్లో॥ ఏవముక్త్వాపిధావంతీం ప్రేమసూభువనమోహినీ।
అనుధావన్మహేశోపి చేలాంచలమథాగ్రహీత్ ॥

తా॥ ఇట్లు బలుకుచున్న ఈశ్వరుని వచనములువినిజగన్మోహినిలోకములను మోహింపచేయుటకు సమర్థురాలై సిగ్గుచేపరుగిడిచుండె నా ఈశ్వరుడు నామెయొక్క పైటకొంగును బట్టుకొని వెంటనంటి పరుగిడుచుండెను,

శ్లో॥ మేరుప్రాంతవనేరమ్యే జంబూకుంజవిరాజితే।
సాలవృక్షతలేరమ్యే మోహిన్యాసహశంకరః ॥

తా॥ అట్లు పరుగెత్తి పరుగెత్తి మిక్కిలిసుందరమగునట్టియు నేరేడుగుంపులచే ప్రకాశించుచున్న మేరుప్రాంత వనమునందలి సాలవృక్షతలమునందు మోహినితో శంకరుఁడు క్రీడించినవాఁడాయెను.

శ్లో॥ తస్యోచ్చరతిఖేదంసా స్వేదాక్తాసోఢుమక్షమా।
ఉద్గారయామాసతథా ఫేనిలంజలమాస్యతః ॥

తా॥ అప్పుడాజగన్మోహిని పరమేశ్వరునియొక్క క్రీడను సహింపజాలకశరీరమందంతట చెమటగలదై ముఖమువలనుండి ఫేనిలోదకము ప్రవింపచేసెను.

శ్లో॥ తద్వాంతసలిలాజ్జాతా గండకాఖ్యామహానదీ।
సాలగ్రామశిలాస్తస్యాం గండక్యాంప్రభవంతిహి ॥

తా॥ అట్లుస్వేదోకము గండకయను పేరున మహానదియయ్యె ఆనదియందు సాలగ్రామములును పుట్టుచున్నవిగదా,

శ్లో॥ తయోరేవంసంగతయో ర్మోహినీహరయోస్తదా।
కాలేనకియతాగర్భం దధానామోహినీశ్వరాత్ ॥

తా॥ ఇట్లు పరమేశ్వరుని సంగమమువలన కొంతకాలమునకు నా జగన్మోహినిసద్యోగర్భమును ధరించినదాయెను

శ్లో॥ అథాశ్వత్థతలేపత్ర పుంజేపుత్రమజీజనత్।
త్రిలోచనంచతుర్బాహుం పీతాంబ్రస్వరూప్యవిగ్రహం ॥
త్రిశూలఖడ్గచక్రాదిధరం షోడశవార్షికం।
వీరభద్రసమంశౌర్యే సౌందర్యేమన్మథోపమం॥
మహాక్షీరేధరుస్యాశ్తే పూర్ణిమానుపవాసరే।
ఆర్ద్రాయామంభక్తరపోర్థం జాతోసౌ హరిహరాత్మజః॥

తా॥ ఆటుపిమ్మట రావిచెట్టుగల ప్రదేశములో పత్రసముదాయమునందు మూడు నేత్రములు గలవాడును, నాలుగు భుజములు గలవాడును, శివకేశవుల సత్వ రూపమయిన వాడును, త్రిశూలఖడ్గ చక్రాదులనుధరించినవాడును, పదునారుసంవత్సరముల వయస్సు గలవాడును, వీరభద్రునింబోలు శౌర్యము గలవాడును జగన్మోహినితో సమానమగు సౌందర్యముగలవాడును, హరిహరతనూభవుడగు గురునాధుడు మార్గశిరమాసమున ధనుర్యుక్తపూర్ణిమా గురువాసరమునందు ఆర్ద్రా నక్షత్రమందు మోహినీదేవతకు బుట్టినవాడాయెను.

శ్లో॥ చకారనామధేయాని తంద్పృష్ట్వాచంద్రశేఖరః ।
గురునాధశ్చశాస్తాచ తథాహరిహరాత్మజః ।
శూలఖడ్గధరోలోక రక్షకశ్చేశ్వరాత్మజః ।
పాయసాహారనిరత స్త్రినేత్రో మోహినీసుతః ।
భక్తసంపత్ప్రదోశ్వత్థ శాఖాపత్రప్రియ స్తథా ।
ఇతిద్వాదశనామాని ప్రఖ్యాతానిభవంతి తే ।

తా॥ అట్టిపుత్రునింజూచి చంద్రశేఖరుండు నామధేయంబుల నేర్పరచె గురునాధుడనియును, శాస్తయనియును, హరిహరాత్మజు డనియును, శూలఖడ్గధరుడనియును, లోకరక్షకు డనియును, ఈశ్వరాత్మజు డనియును, పరమాన్న ప్రియుడనియును, త్రినేత్రుడనియును, మోహినీసుతుడనియును, భక్తసంపత్ప్రదుడనియును, అశ్వత్థశాఖాపత్ర ప్రియుడనియును, పదిరెండు నామములు గలవాడవగుమని నామకరణంబులునుం జేసెను.

శ్లో॥ ఇత్యేవంకృతనామాసీ త్ప్రతాకైలాసవాసినా ।
ప్రణమ్యమాతరంపుత్రః కిమాజ్ఞేత్యబ్రవీ త్తతః ॥

తా॥ ఇట్లు శంకరునిచేత నామకరణమును బొందిన గురునాధుడు తల్లికి నమస్కారమును చేసినవాడై ఓతల్లీ చేయవలసిన కృత్యము లెవ్వియనియడిగెను.

శ్లో॥ ఏపుత్రధనధాన్యాది సంపత్కామాద్విజాదయః ।
పాయసాపూపభక్ష్యాద్యైః పుత్రత్వాంపూజయంతు తే॥

తా॥ పుత్రోత్తముడవైన యోగురునాధా! పుత్రధాన్యాది సంపదలను కోరు

బ్రాహ్మణులు మొదలగు వారు పరమాన్నము చేతను భక్ష్యాదులచేతను నిన్ను పూజించుదురని చెప్పెను.

సూతఉవాచ॥ శ్లో॥ ఇత్యుక్త్వాజననీతస్మై వాత్సల్యాదమృతందదౌ ।
తతఃప్రణమ్యపితర మబ్రవీద్భక్తిపూర్వకం॥
ఆజ్ఞాప్రదీయతాంతాత కింకర్తవ్యంమయాప్రభో ।
వసతిఃకుత్రమేబ్రూహి కుత్రవావిహరామ్యహం॥

తా ॥ సూతుండు మఱల నిట్లనియె ఓ శౌనకాది మునివర్యులారా ఇటుల చెప్పిజననీ ప్రేమవలన కుమారునికి నమృతమును నిచ్చెను పిమ్మట గురునాథుడు తన తండ్రయగు నీశ్వరునకు మిగులభక్తితో నమస్కారముచేసి యిట్లనియె ఓతండ్రీ పరమేశ్వరా నేను చేయతగినపని యెయ్యదియాజ్ఞనొసంగుడు నేనెచ్చోటవసించియుందును నేనువిహరించుటకు తగినప్రదేశమెక్కడ వీటినన్నింటిని తెలుపుమనెను.

ఈశ్వరఉవాచ – పరమేశరుం డిట్లనియె.

శ్లో॥ కైలాసేనివసత్పుత్ర ప్రమధానాంప్రభుర్భవ।
లోకసంరక్షణాయత్వం విహరస్వజగత్త్రయే ॥

తా॥ ఓ పుత్రోత్తమా గురునాథా కైలాసమందునివసింపుము. ప్రమథగణములకు ప్రభుడవుగమ్ము లోకసంరక్షణ యను పని నవలంబించుచు ముల్లోకముల యందు సంచరించుము.

శ్లో॥ త్వాంపూజయంతియేభక్త్యా మనుజాజగతీతలే ।
ఆయుశ్శ్రియంయశఃపుత్రాన్ దేహితేభ్యోనిరంతరం ॥

తా॥ భూమియందుండిన మనుజులెవరు భక్తితోనిన్ను పూజించుచున్నారో వారలకు నెల్లప్పుడును ఆయుష్యమును, సంపదను, కీర్తిని పుత్రపౌత్రాదుల నొసంగుమనిపరమేశ్వరుండు గురునాథునితోఁజెప్పెను.

సూతఉవాచ – సూతుండుమఱలయిట్లనియె.

శ్లో॥ ఇత్యుక్త్వాతనయంతత్ర మోహినీచంద్రశేఖరౌ।
అంతర్ధానంగతౌస్వస్వ లోకంజగ్మతురంజసా ॥

తా॥ ఇట్లు పలికి మోహినీ చంద్రశేఖరులు నచ్చటనే యంతర్ధానమునుం బొంది తమతమ లోకంబులకు బోయిరి.

శ్లో॥ తతశ్చతుర్ముఖోభ్యేత్య దక్షభృగ్వాదిభిస్సహ।
బృహస్పతిప్రభృతిభి రింద్రాద్యష్టదిగీశ్వరైః॥
తంద్రుష్ట్వాపూజయామాస సాక్షాద్ధరిహరాత్మజమ్।
పూజయిత్వాస్వయం వేధా దక్షాదీన్ప్రబవీత్సురాన్॥

తా॥ అటుపిమ్మటబ్రహ్మదేవుడచ్చోటకువచ్చి దక్షభృగు బృహస్పతీంద్రాది దిక్పాలాదులతోగూడ నేగుదెంచి హరిహరాత్మజుడగు నాగురునాథునిఁజూచి షోడశోపచారంబులఁబూజించె అట్లుపూజించి యాబ్రహ్మదేవుడు తనతోవచ్చినదక్షుడు మొదలగుదేవతులనుజూచి యిట్లనియె.

శ్లో॥ శివకేశవయో స్తేజ స్సాక్షాద్దేవాకృతిం గతా।
పూజయధ్వంప్రజానాధం గురుం త్రైలోక్యరక్షకమ్॥

తా॥ ఓ దేవతులారా శివకేశవులయొక్క తేజస్సు ప్రత్యక్షముగా నొక్క యాకారమునుధరించె కావునప్రజానాధుడును లోకరక్షకుండైన యీ గురునాథ దేవుని పూజింపుడనియె.

శ్లో॥ తతః ప్రజేశాదక్షాద్యా ఇంద్రాద్యష్టదిగీశ్వరాః।
మరుతోవసవస్సిద్ధాః పితర స్తమపూజయన్॥

తా॥ అనంతరమున దక్షాదిబ్రహ్మలును ఇంద్రాది దిక్పతులును మరుత్తులును వసువులును సిద్ధులును పితృదేవతులును నాగురునాథుని బూజించిరి.

శ్లో॥ తదాదుందుభయోనేదు ర్ననృతుశ్చాప్సర స్త్రియః।
అస్తువన్శివతనయం నారదాద్యాస్సురర్షయః॥

తా॥ ఆసమయమందున దేవదుందుభులుమోగె, అప్సరసలనునృత్యమునుఁ జేసిరి. పరమేశ్వర పుత్రుడగు నాగురునాధుని నారదాదిమునివరులనేక విధములను స్తోత్రమును జేసిరి.

శ్లో॥ ప్రతియాతేషు దేవేషు బ్రహ్మాదిషుతదాజ్ఞయా।
కైలాసాద్రింగతశ్చాస్తా రేమేప్రమథనాయకః॥

తా॥ అంతట బ్రహ్మాదులందరు గురునాధుని యనుమతంబునుబొంది తమతమ లోకంబులకుంబోయిరి పిమ్మట గురునాధుడును కైలాస పర్వతమునకుబోయి ప్రమథాధిపత్యమును బొంది యచ్చట విహరించుచుండెను.

ఋషయఉవాచ - ఋషీశ్వరులడుగుచున్నారు.

శ్లో॥ సూతసూతమహాప్రాజ్ఞ సర్వశాస్త్రవిశారద ।
గురునాధస్యపూజాయాః క్రమంబ్రూహియధావిధి ॥

తా॥ ఓ సూతా మహాప్రాజ్ఞా, సర్వశాస్త్రప్రవీణా గురునాధదేవుని పూజాక్రమమును శాస్త్రప్రకారమున విస్తరించితెలియజేసిమమ్ములగృతార్థుల చేయుమనిరి.

శ్లో॥ శృణుధ్వమృషయస్సర్వే వక్ష్యేతత్పూజనక్రమమ్ ॥
పురామయాశ్రుతంకుంభ సంభవాదృషిసత్తమాత్ ॥

తా॥ ఓ మునికులోత్తములారా మీరందరును వినుడు సవిస్తరముగను గురునాధ పూజాక్రమమును జెప్పెదను పూర్వము నేను మునివరుండైన యగస్త్యముని వలన గురునాధ పూజాక్రమమును వింటిని అదెట్లనిన.

శ్లో॥ లోపాముద్రస్వభర్తారం కదాచిత్కుంభసంభవమ్ ।
శిష్యాణాంశృణ్వతామేవ మృవాచమృదుభాషిణీ ।

తా॥ తొలియొకనాడు లోపాముద్రనిజభర్తయగు నగస్త్య మునివరునితో శిష్యులందఱువినుచుండ మృదుమధురవచన రచనంబుల నిట్లనియె.

శ్లో॥ కథయస్వమహాభాగ కస్యోపాసనయాదృతమ్।
సంపదామభివృద్ధిస్స్యాత్తథాన శ్యేయురాపదః॥

తా॥ మహానుభావుడవైన యోయగస్త్యమునివర్యా యేదేవునిబూజించుటచే సంపద లభివృద్ధి పొందును, ఆపదలు నశించును, ఆవిషయంబును దెలిపి నన్ను గృతార్థురాలినిగా జేయుమని ప్రార్థించినదాయెను.

అగస్త్యఉవాచ - ఇట్లుపలుకుచున్న లోపాముద్రతో నగస్త్య మునివరుం డిట్లనియె.

శ్లో॥ అస్తిశాస్త్రప్రియేసాక్షా ద్విష్ణుశంకరయోస్సుతః।
మోహిన్యాంశంకరాజ్ఞాతః కుత్రచిత్కారణాత్పురా॥

తా॥ ఓ ప్రియాంగనా పూర్వమునందొక కారణమువలన శివకేశవపుత్రుఁడను నామమను దేవుఁడొకఁడుగలఁడు శ్రీమహావిష్ణువు జగన్మోహినీ స్వరూపమును ధరించినపుడు పరమేశ్వరునివలన నతఁడుపుట్టెను.

శ్లో॥ తస్యోపాసనయాక్షేమం వృద్ధిశ్చాపిచసంపదామ్ ।
కింబహ్వాత్రప్రియేసాక్షాత్ ప్రీతేహరిహరాత్మజే ॥

తా॥ అట్టి గురునాథదేవుని బూజించుటచే నతిశీఘ్రముగ సంపద లభివృద్ధి పొందును ఓ ప్రియురాలా శివకేశవ సుతుఁడు ప్రత్యక్షముగ ప్రీతిబొందినటులయితే సర్వకోరికలను బొందగలరు.

శ్లో॥ ఉపాసనావిధింవక్ష్యే గురో స్తస్యయథావిధి ।
ఏకాగ్రచిత్తాసర్వేపి శృణుధ్వయూయమాదరాత్ ॥

తా॥ ఆగురునాథుని సేవించెడు దనుకీతిని శాస్త్రోక్త ప్రకారముగ జెప్పుచున్నాను ఓమునివర్యులారా మీరందఱు సావధాన చిత్తులరై యాదరమున వినుఁడు.

శ్లో॥ మార్గశీర్షేపూర్ణిమాయాం శాస్తారంపూజయేత్సుధీః ।
ఆర్ద్రాయాంవాప్రియతమే వాసరేవాబృహస్పతేః ॥

తా॥ బుద్ధిమంతుడగువాడు మార్గశిరశుద్ధ పూర్ణిమయందు గురునాథదేవుని బూజింప వలయును, ఆర్ద్రానక్షత్రయుక్త గురువారంబులు సంప్రాప్తంబులయ్యె నేని యత్యుత్తమంబని యెన్న వలయును.

శ్లో॥ మాఘ్యాదిదోషరహితే ష్వన్యమాసదినాదిషు ।
ప్రశస్తేష్వపివాకుర్యా త్సపర్యాంవిధినాగురోః ॥

తా॥ మాఘము మొదలగు దోషములులేని యితర మాసములలో ప్రశస్తతిథి వాసరములయందు విధ్యుక్తముచేత గురునాథుని బూజంపవలయును.

శ్లో॥ ప్రాతస్స్నాత్వాశుచిర్భూత్వా కృత్వాసంధ్యాజపాదికమ్ ।
గృహస్యైశానదిగ్భాగే సుధాధాతువిరాజితే ॥
మంటపంరచయేద్దారా చతుస్తంభసమన్వితం ।
రసాలాశ్వత్థకదళీ శాఖాస్తంబకపల్లవైః ॥

తా॥ ముందు ప్రాతః కాలస్నానముచేసి సంధ్యావందనమును జపంబును జేసి సున్నముచేపూతచేయఁబడి పరిశోభించుచున్న యింటియందలి యీశాన్యభాగమునందు తీయమామిడి, రావి, అరటి వీట్లయొక్క సంబంధములయిన కొమ్మలచేతను పుష్పగుత్తులచేతను. చిగురుటాకులచేత నలంకరింపఁబడిన నాలుగు స్తంభములు గల మంటపమును నిర్మింపవలయును.

శ్లో॥ ఆహూయబ్రాహ్మణాన్బ్రహ్మ వాదినోస్వజనానపి।
మంటపేగోఘృతాద్దీప ముద్దీప్యప్రణమేత్సుధీః ॥

తా॥ అనంతరమందు బ్రహ్మవేత్తలగు బ్రాహ్మణులను బంధు జనులను బిలచి మంటపమునందు గోఘృతము వలన దీపమును వెలిగించి భక్తి వినయములతో నమస్కారమును జేయవలయును.

శ్లో॥ యావత్ప్రాతఃప రేద్యుస్తం దీపయేద్భక్తిపూర్వకం।
తతస్సంకల్ప్యవిఘ్నేశం పూజయేద్విఘ్నశాంతయే ॥

తా॥ అట్టిభక్తిచే చేసినయఖండ దీపారాధనను మరుదినంబున ప్రాతఃకాలము వఱకు నఖండముగ వెలుగునట్లుజేసి పిమ్మట సంకల్పమునుచేసి విఘ్నశాంతి కొఱకు విఘ్నేశ్వరుని బూజింపవలయును.

శ్లో॥ తతశ్చరుమలంకృత్య హవిషశ్చందనాదిభిః ।
గోక్షీరాణిసమానీయ్య ప్రార్థయే దేవతాదరాత్ ॥

తా॥ పిమ్మట చందనాదులచే చరువను నలంకారమును చేసి గోక్షీరములను దెచ్చి॥ శ్లో॥ క్షీరార్ణవసముద్భూతే కామధేనో మునిప్రియేః హవ్యంప్రదాతుంగురవే దేహి క్షీరాణికామదే॥ అనుమంత్ర ముచ్చరించుచు చరువునందు క్షీరములను బోసి క్షీరదేవతా ప్రార్థనంబు చేయవలయును.

శ్లో॥ ఏవంసంప్రార్థ్యగోక్షీరైః పూరయేద్ధవిషశ్చరుం।
గృహమధ్యేసమే దేశె ధ్యాయన్నగ్నింప్రదీపయేత్ ॥

తా॥ ఇట్లుప్రార్థించిన పిమ్మట చరువును క్షీరములచేనిండించి గృహమధ్యమందలి ప్రదేశమందగ్నిని ధ్యానించుచు యగ్నిని ప్రతిష్ఠచేయవలయును.

శ్లో॥ హుతాశనప్రాగుచ్ఛిష్ట పయఃపూర్ణాచ్చరోః స్రువా ।
గురునాథాస్యకృత్యహవ్యం పశ్చాత్తాంనవశంమంత్రైః ।
ఏవంధ్యాత్వాచరుంతస్మి న్నగ్నౌవినిక్షిపేత్ ।
క్షీరాజ్యాత్రాస్యశేషత్తై స్తండులాన్ప్రక్షిపేచ్ఛరౌ ॥

తా॥ హుతాశనమను మంత్రము నుచ్చరించుచు అగ్నిహోత్రునిధ్యానమును జేసి చరువునగ్నియందుంచి పిమ్మట సాక్షీరములను మెల్ల మెల్లగ తండులములను నాచరువునందుఁ బోయవలయును.

శ్లో॥ ఏకత్రిపంచాన్యతమ ప్రస్థపూరితతండులాన్ ।
విన్యసేత్క్షీరకలశే యజమానపురస్సరమ్ ॥

తా॥ వారి వారి కులాచార క్రమమున నొకటిమూడైదు సంఖ్యగల ప్రస్థములబియ్యమును మూడేసివోసిళ్లబియ్యమును యజమాన పురస్సరముగా సాక్షీరకలశమునందు బోయవలెను.

శ్లో॥ పునస్తండులసంపూర్ణాన్ ప్రక్షిపేద్ద్వాదశాంజలీన్ ।
తద్ధవిఃసిద్ధవత్కృత్వా సపర్యామారభేద్గురోః ॥

తా॥ మఱల పదిరెండు దోసిళ్లబియ్యము సాక్షీరభాండమునందు బోసి హవిస్సును సిద్ధపరచి గురునాథపూజ నారంభింపవలయును.

శ్లో॥ అలంకృత్యసమంపీఠం తతస్సంస్థాప్యమంటపే ।
అశ్వత్థశాఖాంపత్రంవా పీఠేవిన్యస్యభక్తితః ।
ప్రతిమాంగురునాథస్య పత్రేతస్మిన్నివేశయేత్ ॥

తా॥ అనంతరమందు పీఠమునకు నలంకారమునుజేసి యాపీఠముంచినమంటపమందశ్వత్థ శాఖనైనను తత్పత్రమునైనను భక్తితోనుంచినపిమ్మట గురునాథప్రతిమను యాపత్రమునం దుంచవలయును.

శ్లో॥ హరిద్రయావాప్రతిమాం రచయేచ్చందనేనవా ।
త్రిశూలందక్షిణేతస్యా వామేఖడ్గంచవిన్యసేత్ ।

తా॥ ఆ గురునాథప్రతిమను చందనముచేతనైనను పసుపుచేతనైనను నిర్మింప

వలయును ఆగురునాథప్రతిమకు దక్షిణభాగమునందు త్రిశూలమును వామభాగమునందు ఖడ్గమును నుంచవలయును,

శ్లో॥ ఆయుధాభ్యాంసహప్రాణ ప్రతిష్ఠాంమంత్రపూర్వకమ్।
కృత్వాథగురునాథస్య ధ్యానంకుర్యాత్సమాహితః ॥

తా॥ అట్టి యాయుధములతోగూడ గురునాథునకు మంత్రసహితముగ ప్రాణప్రతిష్ఠనుచేసి సమాహితమనస్సుగలవాడై గురునాథుని ధ్యానించవలెను.

శ్లో॥ ఆవాహనాసనార్ఘ్యాదీ నుపచారాంత్సమర్పయేత్ ।
పంచామృతైః శుచిస్నానై ర్మార్జయేతయథావిధి॥

తా॥ పిమ్మట క్రమముగ నర్ఘ్యాద్యుపచార ములనుచేసి యనంతరము శాస్త్రీయప్రకారముగ పంచామృతస్నానములను చేయించవలెను.

శ్లో॥ వస్త్రోపవీతశ్రీగంధా నక్షతానర్పయేత్తతః ।
తులసీబిల్వపత్రైశ్చ పూజయేత్కుసుమైరపి ।
అంగపూజాంపరికుర్వీత గురోర్ద్వాదశనామభిః॥

తా॥ వస్త్రమును, ఉపవీతమును, శ్రీగంధమును, అక్షతలను,సమర్పించితులసీబిల్వపత్రములచేతను, పుష్పములచేతను, బూజించి పిమ్మట ద్వాదశ నామముల చేత గురునాథునకంగపూజను జేయవలెను.

శ్లో॥ పూజయేత్కేశవాద్యైశ్చ శివాష్టోత్తరనామభిః।
అర్చయిత్వాథధూపదీపా నైవేద్యంచనివేదయేత్ ॥

తా॥ కేశవాదినామములచేతను, శివాష్టోత్తరశతనామములచేతను, పూజించి ధూపదీపనైవేద్యముల నీయవలయును.

శ్లో॥ పాత్రాణిద్వాదశాస్తీర్య మంటపస్యసమీపతః।
కదుష్ణంతద్ధవిస్తేషు వాగ్యతఃపరివేషయేత్ ॥

తా॥ మంటప సమీపమునందు పదిరెండుపాత్రలు పరచియాపాత్రలయందు నియమముగ హవిస్సును వడ్డించవలెను.

శ్లో॥ సశర్కరాపూపదధి గోఘృతవ్యంజనంహవిః ।
నివేదయేన్మంత్రపూర్వం గురునాథాయభక్తితః ॥

తా॥ ఇట్లుపాత్రలయందుంచిన హవిస్సును శర్కరాపూప దధిగోఘృతవ్యంజనాదులతోగూడ మంత్రముతో గుణనాథునకుభక్తిపూర్వకముగ నివేదనచేయవలెను.

శ్లో॥ తతఃపానీయతాంబూలే దక్షిణాంచసమర్పయేత్ ।
నీరాజనందర్శయిత్వా పుష్పాంజలిముదార్పయేత్ ।

తా॥ తర్వాతను పానీయమును తాంబూలమును దక్షిణను సమర్పించి నీరాజనపుష్పాంజలులను సమర్పించవలెను.

శ్లో॥ ప్రదక్షిణత్రయంకృత్వా దండవత్ప్రణమేత్సుతమ్।
ద్వాదశార్ఘ్యాణ్యతోదద్యాత్ సాక్షతాం తామ్రభాజనే ।

తా॥ పిమ్మట మూడుప్రదక్షిణములుచేసి సాష్టాంగదండప్రణామంబులుచేసి రాగిగిన్నెయందు నక్షతలతోడ నర్ఘ్యములను బదిరెండు నొసంగవలయును.

శ్లో॥ శాస్తారమేవంసంపూజ్య బ్రాహ్మణాయకుటుంబినే।
ద్వాదశాపూపదానంచ కుర్యాద్ఘృతసపాయసమ్ ।

తా॥ ఇట్లు గుణనాథునిపూజించి కుటుంబవంతుడగు బ్రాహ్మణుని కొఱకు పాయసముతోకూడ పదిరెండపూపములను దానంబీయవలయును.

శ్లో॥ బ్రాహ్మణేభ్యోహవిశ్శేషం దద్యాచ్చాన్నంచతుర్విధమ్।
బ్రాహ్మణాన్భోజయిత్వాతు స్వయంభుంజీతబంధుభిః।

తా॥ పిమ్మట మిగిలిన హవిస్సును చతుర్విధాన్నముతో బ్రాహ్మణులకుం బెట్టి తనబంధుజనముతోగూడ గూర్చుండి భుజింపవలయును.

శ్లో॥ సాయంసంపూజ్యశాస్తారముచితైరుపచారకైః।
పరేద్యుఃప్రాతరుత్థాయ కృత్వాస్వనియమాదికమ్ ।
ఆరాధయిత్వాశాస్తారం ప్రణమ్యోద్వాసయేత్సుధీః ।

తా॥ సాయంకాలము నందును కల్పోక్తవిధిచే గుణనాథుని పూజించి మరునాడు ప్రాతఃకాలమునందు నిద్రలేచి నిత్యకృత్యములను దీర్చుకొని గుణనాథుని మఱలపూజించి పిమ్మట నమస్కారములనుచేసి యుద్వాసనముచేయవలెను.

శ్లో॥ పూజైవంగుణనాథస్య క్రియతేయైర్యథావిధి ।
తేషాంప్రియతమేశీఘ్రం భవంత్యఖిలసంపదః ॥

తా॥ ఇట్లు గురునాథునిపూజించినయెడల వానికతిశీఘ్రముగ సకలసంపదలును గలుగునని యగస్త్యుండులోపాముద్రకు తెలియఁజెప్పెను.

శ్లో॥ అథోత్సవవిధింవక్ష్యే మహాసామ్రాజ్యదాయకమ్।
పరివర్షంప్రకుర్వీత గురునాథమహోత్సవమ్ ॥
ద్వాదశాబ్దేషువాకుర్యా దథవావత్సరత్రయే ॥

తా॥ పిమ్మట మహాసంపదలనిచ్చుగురునాథ మహోత్సవవిధిని జెప్పుచున్నాను వినుడు ప్రతిసంవత్సరమున పూజింపుచు క్రమముగా పదిరెండు వత్సరములుగాని లేక మూడు వత్సరములు గాని బూజించిన యెడల వ్రతసాంగము గలుగునని తెలియ జెప్పెను.

శ్లో॥ మార్గశీర్షేశుక్లపక్షే త్రయోదశ్యాంసమారభేత్ ।
చంద్రోపరాగమాఘాద్యాది రహితాయాంశుభాననే ॥

తా॥ ఓ మంగళముఖీ మార్గశిరశుద్ధ త్రయోదశీ తిథియందున గ్రహణములు మాఘములులేని కాలమందు ప్రారంభింప వలయును.

శ్లో॥ త్రయోదశ్యాంప్రియతమే పూర్వాహ్ణేభరణీయది ।
నకుర్యాత్ప్రథమారంభం వర్షేవర్షేనదూష్యతే ॥

తా॥ ఓ ప్రియాంగనా! త్రయోదశీతిథియొక్క పూర్వాహ్ణమందు భరణీనక్షత్రము గలిగి యుండెనేని ప్రారంభమును జేయగూడదు యీ దోషములు ప్రారంభ సంవత్సరమునందు మాత్రమే గాని పిమ్మట పదుకొండు సంవత్సరములయందువిచారణచేయ నక్కరలేదు.

శ్లో॥ ప్రాతఃకాలేత్రయోదశ్యాం కృత్వాస్వనియమంబుధః ।
విప్రానాహూయపుణ్యాహం వాచయిత్వాథమంటపే ॥
కుర్యాచ్ఛఖండదీపంచ మాతృకాపూజనంతతః ।
రజితప్రతిమాంశాస్త్ర ర్మంటపేసాయుధంన్యసేత్ ॥

తా॥ త్రయోదశినాటి ప్రాతఃకాలమందు నిద్రనువదలి శాస్త్రోక్తముగ నిత్యకర్మలనుదీర్చి బ్రాహ్మణోత్తములను బిలచి పుణ్యాహవాచమును చేయించియనంతరమందఖండదీపారాధనను మాతృకాపూజను చేయించవలయును గురునాథుని వెండిప్రతిమనుమంటపమునందు నాయుధములతోగూడఁ బెట్టవలయును.

శ్లో॥ నవగ్రహారాధనంచ ప్రియేకుర్యాద్యథావిధి।
బ్రాహ్మణాన్వరయేత్పశ్చా ద్ద్వాదశబ్రహ్మవాదినః॥

తా॥ పిమ్మట వేదవేదాంగ వేత్తలగు పండ్రెండు బ్రాహ్మణుల నాహ్వానము జేసి నవగ్రహారాధనమును శాస్త్రోక్తప్రకారముగ చేయవలయును.

శ్లో॥ జపార్థంపుష్పసూక్తానా మేకాదశవినిర్దిశేత్ ।
అంతఃప్రవిష్టఇత్యేతన్మంత్రే మేకేనజాపయేత్॥

తా॥ పదునొకండు బ్రాహ్మణులచేత పుష్పసూక్తపారాయణము పదునొకండు పర్యాయములు జపింపచేయవలయును పదిరెండవబ్రాహ్మణునిచే "అంతః ప్రవిష్టే" యనుమంత్రమును జపింపవలయును.

శ్లో॥ మంత్రంతుద్వాదశశతం జపేన్మాసదినేదినే ।
పూర్వోక్తవిధినాకుర్యా త్పాయసాద్యైర్నివేదనమ్ ॥

తా ॥ అంతట ప్రతిదినమందును మంత్రము పానముచే పదిరెండునూరుల పర్యాయములు జపింప వలెను, మఱియు పూర్వోక్త ప్రకారముగా పాయసాదుల చేతను నివేదనను చేయవలెను.

శ్లో॥ ఏవమేనంచతుర్దశ్యాం కుర్యాత్పూజాంయథావిధి ।
ప్రాతఃకాలేపూర్ణిమాయాః స్థాపయిత్వాహుతాశనం ॥

తా॥ ఇట్లు చతుర్దశి రోజున యథావిధిచే పూజించి పూర్ణిమయందు ప్రాతః కాలంబునపూజాదికమునుచేసి యగ్నిహోత్రమును స్థాపింపవలయును.

శ్లో॥ అంతఃప్రవిష్టఇత్యేత న్మంత్రేణాష్టోత్తరంశతమ్ ।
ఆజ్యమశ్వత్థసమిధః పాయసంజుహుయాత్క్రమమ్॥

తా॥ అశ్వత్థసమిధలను నేతియందుముంచి అంతఃప్రవిష్టే- యనునూటయెనిమిది పర్యాయములు హోమములు చేయవలెను - మఱియు నూటయెనిమిది పర్యాయములు పాయసముతోగూడహోమమును జేయవలెను.

శ్లో॥ తతఃపూర్ణాహుతింకృత్వా హోమశేషంసమాపయేత్ ।
బ్రాహ్మణాన్భోజయేత్పశ్చా ద్విత్తానుసారతః॥
ద్వాదశబ్రాహ్మణాన్సమ్య క్పూజయేద్దక్షిణాదిభిః।

తా॥ అటుపిమ్మట పూర్ణాహుతిని హోమశేషమును సమాప్తిని బొందించి బ్రాహ్మణభోజనమునుచేయించి శక్త్యానుసారముగ పండ్రెండు బ్రాహ్మణులకుదక్షిణాదులనొసంగి చక్కగా పూజించవలయును.

శ్లో॥ కుర్యాత్ప్రేద్యుదుషసి ప్రతిమోద్వాసనాదికమ్।
ఇత్థమారాధనంశాస్తుర్మహాసామ్రాజ్యదాయకమ్॥
విప్రక్షత్రియవైశ్యానాం స్త్రీజనస్యచభామినీ॥

తా॥ ఓ భామినీరత్నమా! మరునాడుప్రాతఃకాలమున ప్రతిమోద్వాసనాదికమునుచేయవలెను, ఇవ్విధముగ గురునాథపూజను చేయుటచేత బ్రాహ్మణులకును రాజులకును, వైశ్యులకును, స్త్రీలకును, సకలసామ్రాజ్యములును గలుగును.

శ్లో॥ మహోత్సవమిమంశాస్తుర్యేకుర్వంత్యనువత్సరమ్।
తేభవంత్యచిరేణైవ కుబేరేంద్రసమాభువి॥

తా॥ ప్రతిసంవత్సరమందును నీవిధముగా గురునాథుని బూజించువారలు భూలోకమునందు కుబేరేంద్రసమానులగుదురని యగస్త్యుండు లోపాముద్రకు దెలియ చేసెను.

శ్లో॥ ఇతిపూజోత్సవవిధి మత్రౌషంకుంభసంభవాత్।
ఉపాసాంచక్రిరేగస్త్య పత్నీశిష్యాస్తతోగురుమ్॥

తా॥ ఓమునికులోత్తములారా! ఇట్లనియగస్త్యమునివరుని వలనగురునాథుని బూజాక్రమమును వాటిని యాయగస్త్యమునివరుండును లోపాముద్రయు వీరిశిష్యులును ఈవిధముగా గురునాథుని బూజించినవారైరి.

శ్లో॥ సర్వేపియూయంతత్పూజాం నైమిశారణ్యవాసినః।
కురుధ్వంశ్రద్ధయాకుంభ సంభవోక్తవిధిక్రమాత్॥

తా॥ నైమిశారణ్యమందుండునట్టి మీరందరును పైనచెప్పఁబడిన ప్రకారముగా నాగురునాథపూజను చేయుడు.

శ్లో॥ పురుషైరథవాస్త్రీభిశ్శ్రద్ధయావిధినాకృతా।
ఉపాస్తిర్గురునాథస్య సత్యమాశుఫలప్రదా॥

తా॥ ఈగురుసాధబూజను స్త్రీపురుషులలో నెవ్వరాచరించినను శీఘ్రముగ ఫలమును బొందుదురు.

శ్లో॥ హరిహరసుతపూజనం ద్విజన్మాయ దికురుతే కలశోద్భవోక్త రీత్యా। జననమపివిచిత్రమక్ష్యశ్శృణ్వా౯ సుతధనధాన్యసమృద్ధి మేతిశీఘ్రమ్।

తా॥ బ్రాహ్మణోత్తముం డగస్త్యమునివరునిచే జెప్పఁబడినరీతిని శివకేశవ పుత్రుఁడగు సురనాథునిబూజించినయెడలసకలైశ్వర్యములనుబొందును యీచరిత్రను గూడవినువారలు ధనధాన్యాది సంపదలను యష్టైశ్వర్యములను బొందుచున్నారు.

ఇతి శ్రీకూర్మపురాణే జగన్మోహినీశ్వర పుత్రచరిత్ర వర్ణనం నామచతుః షష్ఠితమోధ్యాయః॥

గ్రంథశ్చాయం సమాప్తః.

---

# శ్రీ గురు భ క్త వి జ య ము.

## ప్ర థ మ ఖ ం డ ము.

### పాండురంగ శ్రీరంగ పటలములు.

ఆంధ్రదేశమునందలి భక్తులతరుణోపాయమునకై యిది శ్రీగురువుల యనుగ్రహమున లభించినదియును ఇదివఱకు వ్రన్న భక్తవిజయములన్నింటి కంటెను ఆకారమునను అందమును క్యాలికోబైండు విషయములు మున్నగు వానియందును ప్రాచీనభక్తులందఱియొక్క చరిత్రములు సంపూర్ణములుగా ఇంపు చక్కనిశైలితోను ముద్దులు మూటగట్టు పదజాలముతోను స్వీకరింపఁబడి యుండుటచేతను సర్వవిధముల గురుత్వము వహించి యున్నదగుట చేతను గురుభక్తవిజయము, పేరు సార్థక మగుచున్నది గదా!

భక్తులపాలిటికిది కల్పవృక్షము. విజ్ఞానమునార్జించుటకు రెండవ చింతామణియే ముక్తిసంపద నొందువారికిది రెండవ కామధేనువే!

ఇంతయేల—ఇట్టిభక్తవిజయమును తామింతవఱకును కని వినియెఱుంగనిది వందలకొలది కథలింపు చక్కఁగానందముగా పొందుపరుపఁబడినవి.

తాము భక్తులైనను లేక కథాపాఠకులయినను లేదా భాషాచమత్కారముల నరయఁగోరు విమర్శకులయినను వేయేలసమభక్తి విజ్ఞానమును వేదాంతవిజ్ఞానమును ఒక్కొక్కచోట తేనెలొలుకున్మృదుమధురగుంఫనములతోఁ జూడఁ దలచితిరేని అందులకేమి సాధనము? దేనిని చదువవలెను? పైగ్రంథమనగా

శ్రీగురు భక్తవిజయమును ఇంత చక్కని శైలిలో యిప్పుడే ముద్రించితిమి, గ్రంథమందుండు మాధుర్యమునుఒకతూరిగ్రంథమును తెప్పించుకుని జదివి జూడగలరు యిదివరకు బెంగుళూరు పట్టణంబున ముద్రింపఁబడిన ప్రాచీనమహాభక్తవిజయముకన్న బహువిషయములు భక్తులయొక్కచరిత్రలుసంపూర్ణముగా నాల్గుపటలములుగా విభజింపఁబడినది. ౧ పాండురంగ భక్తపటలము, ౨ శ్రీరంగపటలము, ౩ శ్రీశైలపటలము, ౪ కాశ్మీరపటలము—అనిఇందు మొదటి౪పటలములు ఈమొదటి భాగమున కూర్పఁబడినవి— ఇదియే 800 పేజీలకు మించిన రాయల్సైజు గొప్పగ్రంథమైనది రెండవభాగమును త్వరలోవెలువడఁగలదు, కనుక మీరు వెంటనే ఈదిగువఅడ్రసుగలవారిపేర వ్రాసిన వీ - పీ - టపాలో పంపుదుము.

శ్రీగురు భక్తవిజయము.

ఈ గ్రంథము తెప్పించుకొను పుణ్యపురుషులకు రెండవభాగ పుస్తకమందు ప్రోత్సాహకుల పేర్లు అన్నియును ముద్రింపఁదలచితిమి తమపేరు పుణ్యాత్ములందఱు పఠించుదురు.

౧ మీరు తెప్పించి చదువుట ౨ మీ మిత్రులతో మనవి చేయుటప్రాముఖ్యము ప్రథమభాగ పుస్తక క్రయము 6—౦—౦

వెంటనే ఆర్డరకు నిరీక్షించితిమి.

ఆర్యానంద ముద్రాక్షరశాల, బచ్చుపేట, మచిలీపట్టణము.

అష్టమూర్తయేనమః, అనేకాత్మనేనమః, సాత్వికాయన
యనమః, శాశ్వతాయనమః, ఖండపరశవేనమః, అజాం.
మోచకాయనమః, మృడాయనమః, పశుపతయేనమః, దేః
హాదేవాయనమః, అవ్యయాయనమః, హరయేనమః, పూ
మః, అవ్యగ్రాయనమః, దక్షాధ్వరహరాయనమః, హరాయనః
త్రభిదేనమః, అవ్యక్తాయనమః, సహస్రాక్షాయ, సహస్రపాదే
ప్రదాయ,అనంతాయనమః, తారకాయనమః, ఓంపరమేశ్వరాయనిత్యే

శ్రీశివ అష్టోత్తర శతనామస్తోత్ర నామావళి సంపూర్ణం.

---

# శ్రీ శివలింగాష్టకము.

౧. ఓం బ్రహ్మమురారిసురార్చితలింగం - నిర్మలభాసితశోభితలింగం
జన్మజదుఃఖవినాశకలింగం - తత్ప్రణమామిసదాశివలింగం.

౨. దేవమునిప్రవరార్చితలింగం - కామదహనకరుణాకరలింగం
రావణదర్పవినాశనలింగం - తత్ప్రణమామిసదాశివలింగం.

3. సర్వసుగంధసులేపితలింగం - బుద్ధివివర్ధనకారణలింగం
సిద్ధసురాసురవందితలింగం - తత్ప్రణమామిసదాశివలింగం

౪. దక్షసుయజ్ఞవినాశనలింగం - కనకమహామణిభూషితలింగం
ఫణిపతివేష్టితశోభితలింగం - తత్ప్రణమామిసదాశివలింగం.

౫. కుంకుమచందనలేపితలింగం - పంకజహారసుశోభితలింగం
సంచితపాపవినాశనలింగం - తత్ప్రణమామిసదాశివలింగం.

౬. దేవగణార్చితసేవితలింగం - భావైర్భక్తిభిరేవచలింగం
దినకరకోటిప్రభాకరలింగం - తత్ప్రణమామిసదాశివలింగం.

౭. అష్టదళోపరివేష్టితలింగం - సర్వసముద్భవకారణలింగం
అష్టదరిద్రవినాశితలింగం - తత్ప్రణమామిసదాశివలింగం.

౮. సురగురునరవరపూజితలింగం - సురవనపుష్పసదార్చితలింగం
పరంపరంపరమాత్మకలింగం - తత్ప్రణమామిసదాశివలింగం.

లింగాష్టకమిదంపుణ్యం యఃపఠేచ్ఛివసన్నిధౌ
శివలోకమవాప్నోతి శివేనసహమోదతే.

లింగాష్టకం సంపూర్ణము.



ఇంతవేల—ఇట్టివి గనిది వందలకొల బడినవి. తాము చమత్కారః విజ్ఞానము

శివపూజాదురంధులు పూజచేయుటకు

# అష్టోత్తర శతనామస్తోత్ర నామావళి.

ఓం శివాయనమః, ఓం మహేశ్వరాయనమః,
ఓం శంభవేనమః, ఓం పినాకినేనమః, శశిశేఖరాయనమః, వామ
దేవాయనమః, విరూపాక్షాయనమః, కపర్దినేనమః, నీలలోహితాయన
మః, శంకరాయనమః, శూలపాణయేనమః, ఖట్వాంగినేనమః, విష్ణువల్ల
భాయనమః, శిపివిష్టాయనమః, అంబికానాథాయనమః, శ్రీకంఠాయన
మః, భక్తవత్సలాయనమః, భవాయనమః, శర్వాయనమః, త్రిలోకేశా
యనమః, శితికంఠాయనమః, శివాప్రియాయనమః, ఉగ్రాయనమః, కపా
లినేనమః, కామారయేనమః, అంధకాసురసూదనాయనమః, గంగాధరా
యనమః, లలాటాక్షాయనమః, కాలకాలాయనమః, కృపానిధయేనమః,
భీమాయనమః, పరశుహస్తాయనమః, మృగపాణయేనమః, జటాధరాయ
నమః, కైలాసవాసినేనమః, కవచినేనమః, కఠోరాయనమః, త్రిపురాం
తకాయనమః, వృషాంకాయనమః, వృషభారూఢాయనమః, భస్మోద్ధూ
ళితవిగ్రహాయనమః, సామప్రియాయనమః, స్వర్ణమయాయనమః, త్ర
యీమూర్తయేనమః, అనీశ్వరాయనమః, సర్వజ్ఞాయనమః, పరమాత్మ
నేనమః, సోమసూర్యాగ్నిలోచనాయనమః, హవిషేనమః, యజ్ఞమయా
యనమః, సోమాయనమః, పంచవక్త్రాయనమః, సదాశివాయనమః, వి
శ్వేశ్వరాయనమః, వీరభద్రాయనమః, గణనాథాయనమః, ప్రజాపతయే
నమః, హిరణ్యరేతసేనమః, దుర్ధర్షాయనమః, గిరీశాయనమః, గిరిశాయ
నమః, అనఘాయనమః, భుజంగభూషణాయనమః, భర్గాయనమః, గిరి
ధన్వనేనమః, గిరిప్రియాయనమః, కృత్తివాసనేనమః, పురారాతయేనమః,
భగవతేనమః, ప్రమథాధిపాయనమః, మృత్యుంజయాయనమః, సూక్ష్మ
తనవేనమః, జగద్వ్యాపినేనమః, జగద్గురవేనమః, వ్యోమకేశాయనమః,
మహాసేనజనకాయనమః, చారువిక్రమాయనమః, రుద్రాయనమః, భూత
పతయేనమః, స్థాణవేనమః, అహిర్బుధ్న్యాయనమః, దిగంబరాయనమః,

# పీ ఠి క.

---

ఆర్యులారా!

జగద్రక్షకుండగు భగవంతుఁడు ధ్యేయుండనియు బ్రహ్మవిష్ణ్వీం
ద్రాదులు ధ్యాతలనియు నిగమాగమపురాణేతిహాసంబులు మొఱలిడు
చుండ తద్ధర్మంబనుసరించి త్రికరణసిద్ధిగలుగు ఫేనిధు లటులనె వర్తింపు
చుండ రాప్రకారంబుగాక మాయావాదులౌ శైవులు కొందరు శివకే
శవులిద్దరు ధ్యేయులగుదురు వారికి భేదంబు లేదని సమష్టిగా వచింపు
చు గాంచువారి సమ్ముఖంబున నటులనే నటింపుచు నంతరంగంబున శక్తి
యే దైవాధిక్యరాలని జర్పింపుచు భస్మరుద్రాక్షధారులై జూచువారికి
శైవులుగా గనుపించుచు సభాస్థలుల విష్ణుమూర్తిని గీర్తింపుచు శివునకు
జీవునకు భేదంబు లేదని బల్కి [illegible]దిరుగా జీవన్ముక్తి నవలంబించి మాయా
వాదులగుచు తమ సమయంబెల్ల వైష్ణవహితంబుగను జరుపుకొనుచు నీ
యైదువిధంబులుగా వర్తించెదరు. వారి హరు లిద్దరకు భేదంబు లేదను
వా రభేదభావంబుల విలసిల్లుట ధర్మంబుగదా యవ్విధంబు గాక వీరు
స్నానంబు సేయు నది మొదలు కాలోచితకృత్యంబులెల్ల విష్ణుమూర్తి
ప్రీతిగానే సల్పుచుండెదరు. ప్రతిసంవత్సరాది మొదలు చైత్రమాస శుక్ల
పక్షంబున శ్రీరామ జననం బాదిగా గలుగు మహోత్సవంబులు దప్పక
గావించెద రీవ్రతంబు శైవపరమా వైష్ణవపరమా యోచింపుడు. మరియు
శైవశబ్దంబున కర్థం బేమో తద్ధర్మంబు లెటుల గావించవలయునో తదో
పాసన లెవ్విధంబో వీరు మనోవాక్కాయకర్మంబులం దించుకైన
దలంచువారుగా దోచరు. వీరిన్యాయంబులు గాంచువారు శైవులనినమ్మ
దురె శివకేశవు లిద్దరు సమమనువారు ధ్యేయధ్యాతత్వంబులు దలపో
యవలదె. శ్రీమన్నారాయణమూర్తి దశావతారంబుల శివపూ

నటులను భస్మరుద్రాక్షమాలికాలంకృతుండై వర్తించినప్రకారం బనేక ప్రమాణంబులు గానంబడుచున్నవి. శివుండు కేశవుని బూజించినరీతిగా నీ యూర్ధ్వపుండ్ర తులసిమాలికలు ధరించినటుల సప్రమాణం బొక్కటైనను గానంబడదు. హరిహరులు సములని యనేక దేవతోపాసనలు గావించి బుణ్యాత్ములై కడతేరిరను ధర్మంబే గ్రంథంబుల వినంబడదు. శివునిగాని కేశవునిగాని నమ్మి కృతార్థులై రనుట కనేక గ్రంథదృష్టాంతంబులు గలవు. ప్రకృతము ముఖ్యంబుగను రెండుగ్రంథములు శైవవైష్ణవ పరంబుగను సూచించెద. మార్కండేయులనుగురించి తచ్చరిత్రమును ప్రహ్లాదునిగురించి భాగవతాంతర్గతంబగు సప్తమస్కంధంబును వీరిరువు రేకదేవతోపాసకులై కడతేరిరా లేక యనేకదేవతోపాసకులై గడతేరిరా చర్చింపుడు.

శ్లో. ఏకోవాసః పట్టణంవా వనంవా, ఏకః పుత్రోభూపతిర్వా యతిర్వా,
ఏకానారీ సుందరీ వా దరీవా, ఏకోదేవః కేశవోవా శివోవా.

అను ధర్మంబు వీరు మనంబులనైనను దలంచరు గాబోలు వీరటుల నమ్మకములు లేనివారలై హరిహరు లిర్వురు సములని పాటింపుచుందురేగాని వచించువాక్యంబులకు సార్థకంబుగాక త్రికరణసిద్ధిలేక విలసిల్లెద రెట్టు లన వైశాఖశుద్ధత్రయోదశి నృసింహజయంతి యని మహోత్సవంబులు గావించెదరు. తన్మాసంబున బహుళత్రయోదశిని శరభజయంతి యని మహోత్సవంబులు సల్పనికారణం బేమోజర్చింపుడు వీరికి శరభేశ్వరుండుగావించిన యపకారంబేమో దెలియదు. శరభవిజయమును గురించి కలహంబుగావించెదరేగాని కలనైన తత్కార్యంబు గావింపనొల్లరు. వీరు వ్యష్టిభావులుగారనుటకు కారణంబెల్లగు ప్రతిమాస శుక్ల బహుళపక్షంబుల నేకాదశీవ్రతం బాచరించెదరు. ప్రతిమాసంబున బహుళ చతుర్దశిని రాబడిన మాసశివరాత్రి వ్రతంబుగావింపరు. రాజమాత్రుండగు పార్థునకు కృష్ణుండుపదేశించిన భగవద్గీతలు పారాయ

ణము సల్పువారు తద్మాహాత్మ్యము వచింపువారే శతాధికగ్రంథంబులనే
కంబులుగా విరచింపువారు గలరుగాని శివగీతలు పారాయణంబు
సల్పువా రెవ్వారైనఁగలరే? శ్రీరామునకు శంకరుం డుపదేశించిన శివ
గీతలు సాంఖ్యతారకామనస్కాద్యనేకం బై పదునెనిమిది యధ్యాయం
బులు గలిగి పద్మపురాణాంతర్గతంబుగా వెలసియున్న శివగీతలు పారాయ
ణంబులు గావింపరు మీరు మేము సమస్తులము పల్కుటకు నోరాడునే?
మీరు కేశవాలయంబులకుఁబోయి తీర్థప్రసాదంబులు తులసీదళభక్ష్యాదనంబు
మొదలగు ప్రసాదంబులు భుజించెదరు. శివాలయంబుల కేగకుండిరి శివ
నిర్మాల్యంబు ముట్టరాదని వచించెదరే? కృష్ణంబు ఏ భాగమున పురాణేతి
హాసంబుల నెందైనఁగలదో తెలియదు. శివనిర్మాల్యంబు మాహాత్మ్యం బగుటకు
కారణం బెట్టిదో యెఱుంగ. శివనిర్మాల్యధారులైనవారు శివునకు
మాత్రము భక్తులగుటెట్లు? శివద్వేషులైన దక్షప్రజాపతిమొదలగువారు
బొందిన దురవస్థలు స్కాందపురాణాది గ్రంథంబుల వినలేదో. శుద్ధ
వైష్ణవులమను మీరు గరుత్మంతునిఁగాంచి విష్ణువాహనం బనుచు కృష్ణా
ద్వారకావాసా యని నమస్కరించెదరు వినగా ద్వితీయకేశవుండని పేరుబడ
మది ధర్మంబుగానే యున్న దేలనన భగవత్సేవకుని వైంకర్యపరులటుల
భావించుట న్యాయంబెగదా కొందరు జానువారంబున గరుత్మంతుని
దర్శనములేనిది భుజింపకుందురు. గరుడపురాణంబు సార్థకంబుగా
వచింపుచుందురు. మఱికొందరు తాక్ష్యసమూహంబునకు మత్స్యా
హారంబు లొసంగెదరు. గరుడపంచమీవ్రతంబాచరించెద రిట్టిధర్మంబు
లన్నియు సార్థకంబులేగదా? శివవాహనప్రాయంబైన వృషభేశ్వరనిజాం
శంబులౌ గోరాట్సమూహంబును నుతించడముగాని తత్కథావిషయం
బు వినుటగాని గలదే యోచింపుడు. తత్సంబంధమైన గోవుల శివము
ఖోద్భవంబు లని మీ రెఱుంగరేమో,

శ్లో. నందాభద్రాచసురభి సుశీలాసుమన స్తథా, పంచగావా శ్శివాజ్జాతా
సద్యోజాతాదివక్త్రితః, కపిలాః కృష్ణధవళాః ధూమ్రారక్తా స్తథైవచ.

ఈరీతి విలసిల్లుగోవులు లోకోపకారంబు గావింపుచున్నవనియు విరజానల భస్మంబునకు గోమయంబే సాధకం బనియు కాలాగ్నిరుద్రో పనిషత్తు ఘంటానాదంబుగా ఘోషించుటయగాక శ్రీరామచంద్రుండా విరజానలభస్మంబే శ్రేష్ఠంబుగా భావించె నని దెలిసియుండియు,గోవృష భపూజలు తత్ప్రార్థనలు గావించువా రెందుగలరో జర్చింపుడు. ప్రతి కార్యంబునకు రామాయణాంతర్గతం బగు సుందరకాండపారాయణంబు జేసిన సార్థకం బని వచించెదరు. రఘువీరుడేనమ్మి పఠించిన శివగీతలు పారాయణంబుగావించిన యసార్థకంబుగాబోలు. వాల్మీకిప్రోక్తం బగు శ్రీమద్రామాయణమునగాని రఘురాముని గురుం డగు వసిష్ఠమహర్షి విరచితం బగు రామాయణంబుననుగాని లేనికల్పనాకథయగు విశ్వా మిత్రప్రోక్తం బైన యధ్యాత్మరామాయణం బొక ప్రామాణ్యంబుగా గైకొని సీతారామనామము పార్వతికి భర్గుం డుపదేశించె నని సాటిం పుచు ప్రమాణపూర్వకంబు లేమి దెలుపకనే సకల జనంబులకు బోధిం పుచుందురు. పార్వతీదేవి కృతయుగమెల్ల జడస్వభావురాలుగానే యుండి త్రేతాయుగంబున శ్రీరామనామంబుచే గృతార్థురా లాయెను గాబోలు. నిట్టివాక్యంబులు వచించువారికి గలుగు పాతకంబునకేను మిక్కిలి భీతిల్లెద. నివ్విధంబున దురాలాపంబులు పల్కువారు లలితా ఖండంబును దేవీభాగవతంబును సప్తశతి శ్రీమదప్పయ దీక్షితులవారు సంగ్రహించి ప్రకటించిన రామాయణసారసంగ్రహ భారతసారసంగ్రహ ము మొదలుగాగల గ్రంథంబులు గాంచరేమో. శ్రీరాములవా రగస్త్యు లవారిచే శైవదీక్షబొంది గృతార్థుడై రావణాసురుని జయించె నని సప్ర మాణముగా శివగీతలు ఘోషింపుచుండ దశకంధరవధానంతరంబున రాముండు సేతువను లింగప్రతిష్ఠ గావించి రామలింగేశ్వరుం డనినామం బిడినా డని సేతూమాహాత్మ్య ఖండంబు ఘంటానాదంబుగా వచింపు చుండ శ్రీరాముండు శంకరు శిష్యుం డను సప్రమాణంబులు గ్రహిం చక శ్రీరామనామమహిమ పార్వతికి శంభుండు బోధించెనని బలుకు

వారికి గలుగు పాతకం బెంతెంతని బలుక నలవియగునే తారకము
రామషడక్షరి జపించువారు యజ్ఞోపవీతంబుగ “శ్రీ. నమస్తారాయ
చ” యను పదంబు జపింపరేని. శ్రీమన్నారాయణమూర్తి సంబంధ
మైన దశావతారంబుల చిత్రపటంబులనుంచి పూజించుచు దశావతార
చరిత్ర లనేక కావ్యరూపంబులుగా రచింపుచుండుదురు. శివపంచవింశతి
లీలలు చిత్రపటంబులనుంచుకొని పూజించుటగాని తచ్చరితంబుల రచిం
చుటగాని తద్విషయంబుల జపించు టేమైనగలదే. యట్టి భేదబుద్ధిచే
వర్తించువారు శివకేశవులకు భేదంబులులేవని పల్కుదురు. వీరికి త్రికరణ
సిద్ధిగలదేమో జపింపుడంతియేగాక కేశవునకు శివుండు భక్తయని శివ
రహస్యఖండంబాదిగా యనేకప్రమాణంబులుగల వట్టి గ్రంథంబులు
గాంచరేమో వీరు జీవునకు భేదంబులేదని ఖండితంబుగా వచింపుచు,

శ్లో. దేహో దేవాలయఃప్రోక్తో, జీవో దేవస్సనాతనః,
త్యజేదజ్ఞాననిర్మాల్యం, సోహంభావేనపూజయేత్.

అని జక్కగా నొక్కిపల్కుచు నించుక కాలంబునకే జీవవృత్తి
సంబంధమగు కర్మనాచరించెదరది ధర్మంబేనా వారు త్రికరణసిద్ధిగలవా
రగుదురే. పైశ్లోకమునగల యర్థమునకు వ్యతిరేకముగ నటింపుచు జీవునకు
శివునకు భేదంబులేదని బల్కదగునే. నీరు క్షీరమునగలిసిన క్షీరమగు
గాని నీరగునే. జీవుండు శివుని గలిసిన శివుండగుగాని జీవుండగునే. జీవభే
దంబులేదనిబల్కువారు పితృలోకం బొకటిగలదనియు పితృకార్యంబు
జేయవలెననియు బలుకదగునే. నడనుడిభావంబు లోకరీతిగానుండనివా
రిని మాయావాదులనదగరే నేనిటులవచించితినని మనంబుల నసూయ
జెందక నిందు దెల్పిన ధర్మంబులన్నియు శాంతహృదయులై దలపోసి
రామునివలెనె శివదీక్షాపరులై త్రికరణసిద్ధిగా శైవవృత్తి నవలంబించెద
రని గోరుచున్నవాడ.

శ్రీమత్సర్వాంగసోముఖవీర బడబానల శరభవిజయంబు రచించెద
నని సోమనాథభాష్యాది గ్రంథంబుల బ్రకటించితి. పిదప నామసంబున
కొక సందియంబుబొడమె నదెట్లులన నితండు వీరశైవుండుగాన మతాభి
మానంబుగా తద్గ్రంథంబువిరచించెనని వంచకులుబల్కుదురనిదలంచి,

శ్లో. అష్టాదశపురాణానాం, కర్తాసత్యవతీసుతః.

అను ధర్మంబుగలదు గాన శ్రీ వేదవ్యాసులవారిచే రచింపబడిన
యష్టాదశపురాణంబులలో బదునొకొండవ పురాణంబగు లింగపురాణ
పూర్వభాగంబునగల వీరశరభసాళ్వేశ్వరు కథాభాగంబుగైకొని తత్క
థకు పూర్వంబున శరభోపనిషత్తునుజేర్చి శ్రీమత్పానుగుంటవంశాబ్ధి
చంద్రులును నందిగోత్రోద్భవులును నాగమాంబాగర్భశుక్తిముక్తా
ఫలప్రాయులును, లింగయదేవరవారి సత్పుత్రులును, వీరశైవశే
ఖరులగు కోటిలింగశాస్త్రిగారిచే నేతచ్ఛరభోపనిషత్తునకును, వీరశర
భసాళ్వ విజయమునకును తెనుగు తాత్పర్యము వ్రాయింపంబడియె.
దుష్టులు గొందరు శివపురాణంబులెల్ల తామస పురాణంబులని వచించె
దరు. శ్రీవేదవ్యాసులవారు నే రచించు శివపురాణంబులు తామసమని
యు నివి యప్రమాణంబు లనియు పురాణంబులలో నే భాగమందైన
వ్రాసిరా? లేక నిట్లువచించు మతద్వేషులు పూర్వు లేమైనను వ్రాసి
పురాణంబు సంపుటీకరణంబుజేసిరో దెలియ. శివాధిక్యంబుగల శైవ
పురాణంబులు నిందితములైన శివపూజమాత్రము నిందితము గాకుం
డునె. మఱియు శివపురాణంబులు తామసంబులై ధర్మవిరుద్ధంబులుగా
నున్న శ్రీమచ్ఛంకరాచార్యులవారు స్కాందపురాణసహితమగు సూత
సంహితకు భాష్యంబు విరచించుదురే. యాశంకరులవారీప్రాకృతుల
కన్న పురాణచర్చజేసినవారుగాదుగాబోలు. సంహితశబ్దంబైనను జర్చిం
పరు. స్కాందపురాణంబు వేదసమాన మని బలుకుట కనుమానంబు
గలదే. భాష్యసహితమగు సూతసంహిత పారాయణంబుగావించిన వీరికి

గలుగు ప్రాకృతంబు నిర్వాణం బగు. ఈమాయావాదులు వీరికీయుక్తముగ విషయంబులుగల పురాణంబులు రాజససాత్త్విక పురాణంబు లనియు వీరి కయుక్తమగు పురాణంబులు తామసపురాణంబు లని వచించుట వీరికి నైజం బిందుకు దృష్టాంతంబుల గొన్ని చెప్పెద. మామూడు ముప్పదిసంవత్సరములకు వెనుక, పువ్వాడ-వెంకటప్పారావు చెన్నపురిని యచ్చొత్తించిన లింగపురాణోత్తరభాగంబున లింగధారణ లింగార్చన విధులున్ను భక్తమహేశ్వరాది షట్స్థలవివరంబు మొదలగు ధర్మంబులు గలవి నల బొంబైలో లింగపురాణం బచ్చొత్తించునాడు లింగధారణాది విషయంబులుగల యధ్యాయంబు లన్నియు ప్రోక్షివేసి యచ్చొత్తించిరి ధర్మం బగునే.

శ్లో. 'కలశస్యముఖేరుద్రః' అని యున్నమంత్రమును మార్చి శ్లో॥ 'కలశస్యముఖేవిష్ణుః' అనియు, శ్రు. 'అపవిత్రఃపవిత్రోవా సర్వావస్థాంగతోపివా, యస్మరేత్ప్రతిఃకాత్రాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః' అని మంత్రంబుగలుగ, శ్రు. 'యస్మరేత్పుండరీకాక్షం' అని మార్చిరి. ఈమాయావాదులు క్రమవరీతికైతవంబు గావించుటకు మిక్కిలిశ్రేష్ఠులు. శ్లో. 'మూలతోబ్రహ్మరూపాయ మధ్యతోవిష్ణురూపిణే, అగ్రతశ్శివరూపాయ వృక్షరాజయతేనమః.' అను శ్లోకం బెన్నడైన నీ మతద్వేషులు వినియుండరేమో. వీరు గావించు యధర్మంబు లనేకంబులు గలవు. మరియు నీ వీరశరభసాళ్వవిజయంబునకు పప్రమాణంబు లింగపురాణంబునసేగాక కాశీఖండము మొదలుగాగల యనేక గ్రంథములను గలవు. వైష్ణవపరంబగు నష్టముఖగండభేరుండమంత్రమున కుపసంహారరూపంబగు సర్వతోముఖవీరబడబానలశరభేశ్వరమంత్రం బీ గ్రంథ మంత్యభాగమునవ్రాసి యచ్చొత్తించినాడ నీగ్రంథం బంతయు శాంతమానసులై పారాయణంబుగావించి ప్రతివత్సరంబున వైశాఖబహుళత్రయోదశిని

శరభజయంతి గావింపుచు శైవశ్రేష్ఠత్వమును బొంది కృతార్థు లగుదు రని కోరుచున్నవాడ.

ఇట్లు విన్నవించు,
నెల్లూరుజిల్లా తోటపల్లి గూడూరికిజేరునయుగు
కోకిలగ్రామనివాసి వీరశైవపుంగవుండు,
గంగపట్టణపు - సుబ్రహ్మణ్య దేవర.



శ్రీ మదుమామహేశ్వరాయ నమః.

# శ్రీమద్వీరశరభమాహాత్మ్యవిజయము.

శ్లో. అష్టాంఘ్రిశ్చ సహస్రబాహు రనలజ్వాలాయుతోయుగ్మదృ
క్త్రిస్త్ర్యక్షోఽతిజవో ద్విపక్షచఞ్చురధరస్త్వాతోన్నతఃసింహాసనః,
అత్యుగ్రేణాపి మృగాకృతిః పునరథాప్యగ్రేణ పక్ష్యాకృతిః
శ్రీ వీరశ్శరభస్సపాతు సతతం చింత్యస్సదా మే హృది.

సటీకా. శరభోపనిషత్ అథర్వణశిరశ్శాఖాయాం. పాఠంః. అథ హై
నం పిప్పలాదో బ్రహ్మాణ ముహాచ-భోభగవన్ బ్రహ్మ విష్ణురుద్రాణాం మ
ధ్యేకోవాధికతరో ధ్యేయ స్స్యాత్తత్త్వమేవనో బ్రూహీతి.తస్మై సహోవా
చ పితామహశ్చ హేపైప్పలాద శృణువాక్యమేత స్య హానిపుణ్యాని కృ
తాని యేన తేనైవ లభ్యఃపరమేశ్వరోసౌ.యస్యాంగజోహం హరిరింద్రము
ఖ్యాః మోహన్నజానంతి సురేంద్రముఖ్యాః,ప్రభుం వరేణ్యం పితరం మహే
శం యోబ్రహ్మాణాంవిదధాతితస్మై. వేదాంశ్చ సర్వాన్ ప్రహిణోతి చాగ్ర్యం
తం వై ప్రపితరం దేవతానామమాని,విష్ణోర్జనకం దేవమీడ్యం. యోంత
కాలేసర్వలోకాన్ సంహరం సఏకశ్శ్రేష్ఠశ్చ సర్వశాస్తాసఏవ. యోఘోరం
వేషమాస్థాయ శరభాఖ్యం మహేశ్వరః. నృసింహంలోకహంతారం సంజ
ఘానమహాబలహరిగ్ం హరంతం పాదాభ్యాం మను యాంతిసురేశ్వరాః.
మావధీః పురుషం విష్ణుం విక్రమస్వమహానసి, కృపయా భగవాన్విష్ణుం
విదదార నఖైః ఖరైః చర్మాంబరో మహావీరో వీరభద్రాబభూవహ,సఏ
కోధ్యేయస్సర్వేషాం సర్వసిద్ధయే. యోబ్రహ్మణః పంచమవక్త్రహ
న్తా తస్మైరుద్రాయనమోఽస్తు. యోవిస్ఫులింగానలలాట జీవసర్వం జగ
త్భస్మసాద్వైకరోతి పునశ్చసృష్ట్వా పునరప్యరక్షు, దేవగోంస్వతంత్రంప్ర
కటీ కరోతి తస్మైరుద్రాయ నమోఽస్తు. యోవామ, వామపాదేనఖఘా
నకాలం ఘోరంపపావథ హాలాహలంతం తస్మైరుద్రాయనమోఽస్తు.

యోవామ పాదార్చిత విష్ణునేత్రస్తస్మై । దదౌ చక్రమతీవహృష్టః,
తస్మై రుద్రాయ నమోఽస్తు.

తా. అనంతరమందు పిప్పలాదమహర్షి బ్రహ్మనుగురించి పలికెను. ఓ భగవంతుడగు బ్రహ్మా! బ్రహ్మ విష్ణు రుద్రులయొక్క మధ్యయందు దెవ్వడధికుండు, యెవడు మిక్కిలిధ్యానింపదగినవాడు అగునో, వానిని మాకుజెప్పుమా అని యడిగెను. ఇట్లడిగిన పిప్పలాదునికొఱకు బ్రహ్మదేవుడి ట్లనియె. ఓ పిప్పలాదఋషీ, యీవాక్యమును వినుము. యెవనిచే ననేక పుణ్యములు జేయబడుచున్నవో వానిచేత నైయ్యావే పరమేశ్వరుడు పొందదగినవాడు. నే నెవనియొక్క దేహమందు పుడితినో, ఇంద్రుడు విష్ణుమొదలగు దేవతుల జ్ఞానమువలన తమ దండ్రియైనట్టియు, సేవించదగిన మహేశ్వరుని గుర్తెరుగుచున్నారుగారో, యెవడు బ్రహ్మనుబుట్టించి అతనికొరకు సమస్తవేదముల నిచ్చెనో, దేవతలకును, నాకును, విష్ణువునకును యెవడుతండ్రియో, యెవ్వడు ప్రళయకాలమందు లోకము నశింపజేయునో, ఆశివు డొక్క డయ్యేవే. శ్రేష్ఠుడు సర్వులను శిక్షించువాడు శివుడే. యేమహేశ్వరుడు శరభమనే పేరుగల ఘోరమైన వేషమునుబొంది మహాబలముగలవాడై, లోకములను హరించుచున్న నృసింహావతారమును బరిమార్చెనో, అట్టి శివునిపాదముల ననుసరించి దేవతులందరు దిరుగుచుందురు. యెవడు గోరులచేత హస్తములచేత నృసింహామూర్తిని ఛేదించెనో, యెవడు చర్మాంబరుడై, మహాపరాక్రవంతుడై వీరభద్రుడాయెనో, అట్టి వీరభద్రస్వరూపుడగు శివుడే అందరికి సర్వకార్యసిద్ధికొరకు పూజించదగినవాడు. అనగా వీరభద్రార్చన సర్వమైన వర్గములవారికి యోగ్యమైనదని భావము. యెవ్వడైతే బ్రహ్మయొక్క అయిదవ శిరస్సుసంహరించి బ్రహ్మకపాలధరుడాయెనో, అట్టి శివునికొరకు నమస్కారము. యెవడు తనఫాలనేత్రాగ్నిచే లోకంబుల భస్మముజేసి మరల సృష్టించి రక్షించి స్వతంత్రమును ప్రకటనజేసెనో, అట్టి రుద్రునికొఱకు నమస్కారము. యెవడు వామపాదముచేత యమునిందన్ని మార్కండేయుని రక్షించెనో, యెవడు ఘోరమైన విషమును పానముజేసెనో, అట్టి రుద్రునికొఱకు నమస్కా

రము. యెవని పాదపద్మము, బ్రహ్మాద్య దనకేత్రకమలములచే పూజిం
పగా సంతోషముగలవాడై విష్ణువునకు చక్ర మొసగెనో, అట్టిశివునకు
నమస్కారము.

యో దక్షయజ్ఞే సురసంఘాన్విజిత్య విష్ణుం బబంధోరుపాశేన శివః,
తస్మైరుద్రాయ నమోఽస్తు. యో లీలయైవ త్రిపురం దదాహ విష్ణుం క
లంకోమ సూర్యాగ్ని నేత్రః. సర్వేదేవాః పశవో భవన్తి యస్య స్వయం త్వ
ష్ట్రా పశుపతిర్బభూవ తస్మై నమో రుద్రాయ నమోఽస్తు. ఏవం ప్రకారైర్బహుధా
ప్రతుష్ట్వా క్షమాపయామాసు రక్షం మహేశ్వరం. యో మత్స్య
కూర్మ వరాహ సింహాన్విష్ణుం క్రమంతం వామనమాది దేవతః, వివి
క్లబం పీడ్యమానం జఘానభస్మీ చకార సంస్మృత్యం యమంచ తస్మై రుద్రా
యనమోఽస్తు. ఏవం ప్రకారేణ బహుధా ప్రతిష్ట్వా క్షమాపయామా
సుర్నీలకంఠం మహేశ్వరం, తాపత్రయ సముద్భూతైః జన్మమృత్యు
జరాదిభిః, నానావిధాని దుఃఖాని జహార పరమేశ్వరః. ఏవం మన్త్రైః
ప్రార్థ్యమాన ఆత్మాత్మై సర్వదేహినాం, శంకరో భగవానాద్యో ర
క్షసకలాః ప్రజాః. యత్పాదాంభోరుహద్వంద్వం మృగ్యతే విష్ణునాధు
నా, స్తుత్వా స్తుత్యం మహేశాన మవాఙ్మనస గోచరం. భక్త్యాన మ్ర
శే విష్ణో ప్రసాద మకరోద్విభుః, యతో వాచా నివర్తంతే అప్రాప్య
మనసాసహ. ఆనందం బ్రహ్మణో విద్వాన్నబిభేతి కదాచన, అణో రణీ
యాన్మహతో మహీయాన్, నాత్మాస్య జంతోర్నిహితే గుహాయాం, తమ
క్రతుం పశ్యతి వీతశోకో, ధాతుః ప్రసాదాన్మహిమానమీశం, వసిష్ఠ
వైరియా సికవామదేవ, విరించిముఖ్యై హృదిభావ్యమానః, సనత్సుజా
తాదిసనాతనాద్యైః, రీడ్యో మహేశో భగవానాదిదేవః, సద్యోసితత్వ
స్సర్వసాక్షీ మహేశో, నిత్యానందో నిర్వికల్పో నిరాఖ్యః, అచింత్యశక్తి
ర్భగవాన్ గిరీశ, స్వవిద్యయా కల్పితమానభూమిః, అతిమోహకరీమా
యా మమవిష్ణోశ్చ సువ్రత.

తా. యెవడు దక్షయజ్ఞమందు సుర సంఘములను జయించి
పరాక్రమవంతుడై గొప్పది యగుపాశముచేత విష్ణునిబంధించెనో అట్టిరుద్రు

నికొరకు నమస్కారము. యెవడు, చంద్రసూర్యాగ్నులనెడి త్రినేత్రములు గలవాడై, స్వలీలచేత త్రిపురములను, మన్మథుని యముని దహింపజేసెనో, యెవడు స్వతహాగా పశుపతియైయుండ సర్వదేవతలు పశుత్వమును పొందిరో, అట్టిశివుని కొరకు నమస్కారము. ఈప్రకారముగా ననేక విధములుగా మహేశ్వరుని సంతోషింపజేసి శాన్తిని బొందించిరి. యెవడు మత్స్యకూర్మవరాహనృసింహవామనరూపములను శిక్షించెనో అట్టిరుద్రునకు నమస్కారము. ఈప్రకారముగా శరభసాళ్వేశ్వరుని స్తుతించి శమింపజేసిరి. తాపత్రయము వలన బుట్టినటువంటి జన్మమృత్యుభయాదుల చేతనగు, నానావిధ దుఃఖములను పరమేశ్వరుడు బోగొట్టును. ఈప్రకారముగా మంత్రములచే ప్రార్థింపబడినవాడై, సర్వజీవులకు ఆత్మయైన, భగవన్తుడగుశంకరుండు సకలప్రజలంరక్షించుగాక. యేశివునియొక్క పాదపద్మద్వయమును, ఇప్పుడును విష్ణువు వెదకి పూజించుచున్నాడో, స్తుతించదగిన, అవాఙ్మానసగోచరుడైన మహేశుని, విష్ణు స్తుతించగా దనను స్తుతిజేయు విష్ణుమూర్తియందు జగద్వినుతుడైనశివుడు అనుగ్రహించెను. యెవనిస్తుతియించలేక, పొందశక్యముగాని మనస్సుచే వాక్కులు మరలుచున్నవో, యెవడు సత్యజ్ఞానానందస్వరూపుడో, యెవడణువులలో నణుస్వరూపుడో, యెవడు మహద్వస్తువులలో మహాస్వరూపుడైయుండెనో అట్టిపరమశివుడు నెవ్వడు జూచునో, వాడు పోయిన దుఃఖముగలవాడగుచున్నాడు. యెవడు వశిష్ఠవైయాసికి వామదేవ విరించ్యాది ఋషులచే మనస్సందు భావింపబడునో, ఎవడు సనాతన సనత్కుమారాదులచే పూజింపబడునో అట్టి భగవన్తుడే మహేశ్వరుడు యోగ్యవ్రతుడైన యోపిప్పలాదఋషీ, ఆదిదేవుడైన యీశ్వరుడు నిత్యుడు సర్వసాక్షి, నిత్యానందుడు, నిర్వికల్పుడు, కొనియాడతరముగాని శక్తి గలవాడు, నాకును విష్ణువునకు నతిక్రమించ నలవిగాని మాయను జయించిన మహానుభావుడు శివుడే యని దెలియుము.

తస్యపాదాంబుజధ్యానా ద్దుస్తరా సుతరాభవేత్, విష్ణుర్విశ్వజగద్యోనిః స్వాంశభూతై స్స్వకృస్సహ, మమాంశసంభవో భూత్వా పాలయత్యఖిలంజగత్, వినాశంకాలతోయాతి, తతోఽన్య

స్వరూపుడైన యొకడగువిష్ణువు, అనేకములైన వేరగుభూతములను,మూ డులోకములవ్యాపించి భూతాత్మయై సర్వమును బొందుచున్నాడు.యెవ డు మొదలునాలు గాహుతులచేతను, పిదపనాలుగింటిచేతను, పిదపరెం టిచేతను, పిదపనైదింటిచేతను, తిరిగిరెంటిచేత హోమము జేయబడునో, ఆవిష్ణువు నాకప్రసన్నుండగుగాక. బ్రహ్మార్పణమైనదియు, బ్రహ్మాగ్ని యందు, బ్రహ్మచే హోమముజేయబడినదియు, బ్రహ్మహవియు, సర్వ ము, బ్రహ్మమయ్యేవే. అనగా సర్వము బ్రహ్మస్వరూపమని భావము. గాన బ్రహ్మకర్మసమాధిచేత బ్రహ్మనుబొందదగినది. సమస్తజీవకోటుల యందెల్లపుడు స్వతహాగా, హరిప్రకాశించును. మహామునివైనయోపి ప్పలాదఋషీ! సాక్షాన్మోక్షమొసగునటువంటి శరభసాళ్వేశ్వరుడే పర బ్రహ్మకంటె విష్ణువధికుడు. విష్ణువుకంటె శివు డధికుడు. శివునితో సమానుడు శివునికంటె నధికుడు లేడు. ఒకశివుడయ్యేవే నిత్యుడు. ఆహే తువువలన మిగిలిన దస్తయునబద్ధము. ఆహేతువువలన విష్ణ్వాదిదేవతలను వదలిశివుడయ్యేవే. ఎల్లపుడు ధ్యానించదగినవాడు. శివుడయ్యేవేసర్వసం సారదుఃఖముల బోగొట్టువాడు.అట్టిమహేశ్వరునికొరకు నమస్కారము. ఓపైప్పలాదఋషీ! యీమహాశాస్త్రము యెవనికిన్ని యివ్వదగినదిగాదు. దేవుడులేడనువానికిని, చేసినమేలుమరచినవానికిని, దురాచారునకుదుర్వృ త్తిగలవానికిని, డంబముగలవానికిని హరము. మిక్కిలికోపముగలవానికి అబద్ధములాడువానికి నివ్వతగదు. గురుభక్తునకును శాంతునకును శివభ క్తునకు సత్యవాదికి నివ్వదగును. ఓపిప్పలాదఋషీ! యీశాస్త్రమును జదివి న వినినవాడు మరలబుట్టక శివైక్యుం డగును.

శ్లో. యోజానితే సోమైతత్వంజగజ్జగత్ గర్భవాసాద్విముక్తోభవతి సు రాపానాత్పూతోభవతి స్వర్ణస్తేయాత్పూతోభవతి బ్రహ్మహత్యాత్పూ తోభవతి గురుతల్పగమనాత్పూతోభవతి ససర్వాన్వేదానధీతోభవతి స సర్వాన్ దేవాన్ ధ్యాతోభవతి ససప్తమహాపాతకాత్పూతోభవతి తస్మా దవిముక్తమాశ్రితోభవతి సతతంశివప్రియోభవతి సశివసాయుజ్యమేతి ననప్రవరావర్తతే ననప్రవరావర్తతే బ్రహ్మైవభవతిత్యాహభగవాన్ బ్రహ్మేత్యుపనిషది. అధర్వణశిరశ్శాఖాయాం శరభోపనిషత్సమాప్తా. శరభసాళ్వేశ్వార్పణమస్తు.

తా. యెవ్వరైతే యీరాజగుహ్యతమము గోప్యతత్త్వమునగు నీస్తవ
మునో, అనగా శివగుహ్యతమము శివస్తవరాజమును గ్రహించునో ఉమయా
సహ వర్తితిసోమః సోమేతిత్వం సోమతత్త్వం ఉమతో గూడినవాడు
సోముడు. అనగా పార్వతితో గూడినవాడు సోముడనబడు. అట్టి శివమయ
మైనది లోకమని దెలిసినవాడు గర్భనరకమువలన విముక్తుడగును. సురా
పానము జేసినవాడైనా పవిత్రుడగును. బంగారమును దొంగిలించినవా
డైన పవిత్రుడగును. బ్రహ్మహత్యవలన పవిత్రుడగును. గురుతల్పగమన
మువలన పవిత్రుడగును. ఈశరభోపనిషత్తును వినినవాడు, వ్రాసినవాడు,
జదివినవాడు, సర్వవేదముల జదివినవాడగుచున్నాడు. సర్వదేవతల స్తో
త్రించినవాడగును. యెల్లప్పుడు శివప్రియుడగును. శివసాయుజ్యమును
బొందును. మరల వాడు పుడమికి రాడు బ్రహ్మయగుచున్నాడు. ఈలా
గనిన భగవంతుడై శివుడు అని బ్రహ్మ పలికెను.

ఓం.

షట్స్థలశివపరబ్రహ్మణే నమః.

శ్రీమతే రేణుకాచార్యాయ నమో నమః.

సర్వేభ్యో భూరుద్రేభ్యో జంగమేభ్యో నమః.

శ్రీలింగపురాణే, వేదవ్యాసప్రోక్తే, పూర్వభాగే, సప్తనవతితమోధ్యాయే

శ్రీమద్వీరశరభసాళ్వవిజయః.

శ్లో. నమశ్శివాయ సోమాయ షట్స్థలబ్రహ్మమూర్తయే, సచ్చి
దానందరూపాయ సదసద్వ్యక్తిహేతవే. శ్రీ వీరరూపబడబానలకాంతి
దేహ శ్రీసర్వతోముఖమహాశరభేశ్వరాఖ్య, అష్టాననప్రకటదోర్బల
నారసింహగర్వాపహార విబుధాశ్రితపోష పాహి. శ్రీ బైందవాసని సు
రార్చితపాదపద్మే దంష్ట్రాకరాళవదనే వికటాట్టహాసే, ఘోరాసుర
ప్రముఖసంహరణాభిరామే మాం పాహి శ్రీశరభకాళి త్రిలోకమాతః.
ఋషయః. కథం దేవో మహాదేవో విశ్వసంహారకారకః, శర

భాఖ్యం మహాఘోరం వికృతం రూపమాస్థితః, కిం కిం ధైర్యం కృతం తేన బ్రూహి సర్వ మశేషతః. సూతః. ౧. ఏవ మభ్యర్చితో దేవై ర్నతిం చక్రే కృపాలయః, యత్తేజస్తు నృసింహాఖ్యం సంహర్తుం పరమేశ్వరః. ౨. తదర్థం స్మృతవాన్ రుద్రో వీరభద్రం మహాబలం, ఆత్మనో భైరవం రూపం మహాప్రళయకారకమ్.

తా. ఓసూతమహర్షీ! మహాదేవుడును, జగత్సృష్టిస్థితిసంహారకర్తయైన శివుడు యేలాగున వికృతమైన శరభేశ్వరరూపమును పొందెను. అప్పుడు శరభసాళ్వేశ్వరునిచే నేదేది జేయబడియెను. ఆసమస్తము శేషములేకుండా మాకు జెప్పుమని ఋషులు సూతమునిని యడిగిరి. అప్పుడు సూతుం డిట్లనియె. ఓఋషులారా! యీప్రకారముగా దేవతలచే పూజింపబడినవాడై దయకు స్థానమైన పరమేశ్వరుడు యేనృసింహసంబంధమైన తేజస్సుగలదో ఆతేజస్సును సంహరించేటందుకొరకు పరమేశ్వరుడు మహాబలవంతుడగు వీరభద్రునిన్ని మహాప్రళయకాలకుడును దనస్వరూపుడైన భైరవుని దలంచెను.

శ్లో. 3. అజగామపురానద్యో గణానామగ్రతోహాసన్, సాట్టహాసైర్గణవరైః రుతద్భిరితస్తతః.౪.నృసింహరూపైరత్యుగ్రైః కోటిభిః పరివారితః, తావద్భిరభితోవీరైః నృత్యద్భిశ్చముదాన్వితైః. ౫. క్రీడద్భిశ్చమహావీరైః బ్రహ్మాద్యైః కందుకైరివ, అదృష్టపూర్వైరన్యైశ్చ వేష్టితో వీరవందితః. ౬. కల్పాంతజ్వలనజ్వాలో విలసల్లోచనత్రయః, ఆత్తశస్త్రో జటాజూటే జ్వలద్బాలేందుమండితః. ౭. బాలేందు ద్వితయాకార తీక్ష్ణదంష్ట్రాం కురద్వయ, ఆఖండలధనుఃఖండసన్నిభభ్రూలతాయుతః. ౮. మహాప్రచండహుంకార బధిరీకృతదిఙ్ముఖః, నీలమేఘాంజనాకార భీషణశ్మశ్రురద్భుతః.౯.పాదఖండమఖండాభ్యాం భ్రామయంత్రిశిఖంముహుః, వీరభద్రోపి భగవా న్వీరశక్తివిజృంభితః. ౧౦. స్వయంవిజ్ఞాపయామాస కిమత్రస్మృతికారణమ్,ఆజ్ఞాపయజగత్స్వామిన్ ప్రసాదఃక్రియతాంమయి.

తా. శివుడు వీరభద్రునిదలచగా అట్టహాసములతో గూడిన ప్రమథగణములు యతని సేవించుచుండ నృసింహరూపధరులగు కోటివీరుల

తోడ కూడుకున్నవాడై కల్పాంతాగ్నివలె ప్రకాశించుచు, ప్రకాశించుచున్న నేత్రత్రయము గలవాడై, హస్తములందు శస్త్రములధరించి, జటాజూటంబున బాలచంద్రుడు ప్రకాశించుచుండ, తీక్ష్ణములైన దంతములు గలవాడై, దేవేంద్రుని ధనుస్సుతో సమానమైన కనుబొమ్మలు గలవాడై మహాప్రచండమైన హుంకారములచేత దిక్కులెల్ల చెవుడుగలవానినిగా పిక్కటిల్లజేయుచు, నీలమేఘము కాటుకవంటి రూపము గలవాడును, భయంకరములైన మీసములు గడ్డములచేత ఆశ్చర్యకరుడైన వాడును, భగవంతుడగు వీరభద్రుడు ఈశ్వరశక్తిచే విజృంభించుచున్నవాడై, స్వోత్సాహగా శివునితో విజ్ఞాపనము జేసెను. జగత్కర్తవైన యోశంకరా! నన్ను దలచిన కారణమేమో నాయందు దయగలిగి ఆజ్ఞాపింపుమని పలికెను. అప్పుడు శివు డిట్లనియె.

శ్లో. శ్రీభగవాన్. ౧౧. అకాలే భయ ముత్పన్నం దేవానామపి భైరవ, జ్వలితస్స నృసింహాగ్ని శ్శమనీయో దురాసదం. ౧౨. నాస్త్వయన్నోప్యధయాధాతం తేనకింనోపశామ్యతి, తతో మత్పరమంధామం భైరవంసంప్రదర్శయ. ౧౩. సూక్ష్మం సూక్ష్మేణసంహృత్య స్థూలం స్థూలేన తేజసా, వక్త్రమానయకృత్తించ వీరభద్రమమాజ్ఞయా. ౧౪. ఇత్యాదిష్టోగణాధ్యక్షః ప్రశాన్త వపురాస్థితః, జగామరంహసా తత్ర యత్రాస్తే నరకేసరీ. ౧౫. తతస్తం బోధయామాస వీరభద్రో హరోహరిం, ఉవాచవాక్యమీశానః పితాపుత్రమివౌరసమ్.

తా. భగవంతుడగు శివుడు వీరభద్రునితో నిట్లనియె. ఓవీరభద్రా! కాలముగాని కాలమందు దేవతలకు భయముపుట్టినది. భైరవుడు ప్రకాశించుచున్నవాడై, ఈనృసింహాగ్నిని శమింపజేయును. ఈనృసింహాగ్ని మరియొకదానిచేత శాంతినిపొందనేరదు. ఆహేతువువలన, మత్స్వరూపమైన భైరవుని జూపింపుము. ఆభైరవుండు, నృసింహావతారమును, స్థూలదేహమును, స్థూలస్వరూపముచేతను, సూక్ష్మదేహము సూక్ష్మస్వరూపము చేతను, మిగుల తేజస్సుచే సంహరించి వచ్చును. ఓ వీరభద్రా! మదాజ్ఞాప్రకారము ఆనృసింహామూర్తి

యొక్క ముఖమును, చర్మమును తీసుకరమ్ము. ఈప్రకారముగా శివుని చేత నాజ్ఞాపించబడినవాడై గణాధ్యక్షుడగు వీరభద్రుడు, శాంతమైన దేహమునుబొందినవాడై, శీఘ్రముగా యెచ్చట నృసింహమూర్తిగలడో అక్కడికివెళ్ళెను. అనంతరమందు వీరభద్రుడు, దనతండ్రియగు శివుడు దనతో నెట్లుజెప్పెనో, ఆలాగుననే నృసింహరూపధరుండైన విష్ణుమూర్తినిగురించి యిట్లనియె.

శ్లో. ౧౬. వీరభద్రః. జగత్సుఖాయభగవ న్నవతీర్ణోఽసి మాధవ, స్థిత్యర్థేనచయుక్తోఽసి పరేణపరమేష్ఠినా. ౧౭. జన్తుచక్రంభగవతా రక్షితం మత్స్యరూపిణా, పుచ్ఛేనైవ సమావధ్య భ్రమన్నేకార్ణవేపురా. ౧౮. భిభర్షికూర్మరూపేణ వారాహేణోధృతామహీ, అనేన హరిరూపేణ హిరణ్యకశిపుర్హతః. ౧౯. వామనేన బలిర్బద్ధః త్వయావిక్రమతా పునః, త్వమేవ సర్వభూతానాం ప్రభావప్రభురవ్యయః. ౨౦. యదాయదాహిలోకస్య దుఃఖంకించిత్ప్రజాయతే, తదాతదావతీర్ణ స్త్వం కరిష్యసి నిరామయం. ౨౧. నాధిక స్త్వత్సమోప్యస్తి హరే శివపరాయణ, త్వయా ధర్మాశ్చవేదాశ్చ శుభేమార్గేప్రతిష్ఠితాః. ౨౨. యదర్థమవతారోయం నిహతస్సోపికేశవ, అత్యంతఘోరం భగవ న్నరసింహవపుస్తవ, ఉపసంహర విశ్వాత్మన్ త్వమేవ మమసన్నిధౌ.

తా. భగవంతుడవగు ఓమాధవా! జగత్సుఖముకొరకు మీరవతరించితిరి. జగద్రక్షణయందు పరబ్రహ్మచేత నీవు నియమింపబడినవాడవైతివి. యీభూచక్రము నీచేతరక్షింపబడనది. పూర్వమందు నీవు మత్స్యస్వరూపధరుఁడవై లోకముల రక్షించితివి. కూర్మధరుండవై పూర్వంబున సముద్రంబున దిరుగుచున్నవాఁడై లోకములనుభరించితివి వరాహరూపముచేత భూమినెత్తిధరించితివి. ఈనృసింహరూపముచేత హిరణ్యకశిపునిసంహరించితివి. వామనరూపధారివై బలిచక్రవర్తిని బద్ధునిజేసితివి. సర్వభూతములకు నీవయ్యేవే ప్రభుడవు. నీవు అవ్యయుడవు. నీవేప్రభుడవు. యెప్పుడెప్పుడు లోకమునకు కొంచము దుఃఖముగలుగుచుండునో నీవులోకమందుబుట్టి జగద్భారమునుహరింపుచుందువు. నీతోసమానుడు నీకంటెనధికుడు లేడు. శివపరాయణుడవైన యోహరీ! నీచేతధర్మములు

నన్ను, వేదములు నన్ను, శుభమార్గమును ప్రతిష్ఠింపఁజేసినది. ఏమందుకో ఈ నీయవతారమును ధరించితివో ఆకార్యమయ్యె. అనగా హిరణ్యకశిపుని సంహరించితివి. నీచే దాల్చిన యిప్పుడున్న మహాఘోరమైన యీ నరసింహావతారమును నాసన్నిధానమునను ఉపసంహరించుకొని చాలించుము. అనఁగా నరసింహాకారమును విడుమన్న అని పలికెను.

శ్లో. ౨౩. సూతః. ఇత్యుక్తో వీరభద్రేణ నృసింహశ్శాంతయాగిరా, తతోఽధికం మహాఘోరం కోపం ప్రజ్వాలయన్హరిః. ౨౪. శ్రీనృసింహః. ఆగతోసియతస్తత్ర గచ్ఛత్వంమాహితంవద, ఇదానీంసంహరిష్యామి జగదేతచ్చరాచరం. ౨౫. సంహర్తుర్నహిసంహారః స్వతోవాపరతోపివా, శాసితంమమసర్వత్ర శాస్తాకోపినవిద్యతే. ౨౬. మత్ప్రసాదేనసకలం సమర్యాదంప్రవర్తతే, అహంహి సర్వశక్తీనాం ప్రవర్తకనివర్తకః. ౨౭. యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా, తత్తద్విద్ధి గణాధ్యక్ష మమ తేజోవిజృంభితం. ౨౮. దేవతా పరమార్థజ్ఞా మమైవపరమాంశకాః, మదంశాశ్శక్తిసంపన్నా బ్రహ్మశక్రాదయస్సురాః. ౨౯. మన్నాభిపంకజాజ్జాతః పురాబ్రహ్మాచతుర్ముఖః, మల్లలాటసముత్పన్నో భగవాన్వృషభధ్వజః. ౩౦. రజసాధిష్ఠితస్స్రష్టా రుద్రస్తామస ఉచ్యతే, అహంనియన్తాసర్వస్య మత్పరంనాస్తిదైవతం. ౩౧. విశ్వాధికస్స్వతంత్రశ్చ కర్తాహర్తాఖిలేశ్వరః, ఇదంతుమత్పరంతేజః కఃపునశ్శ్రోతుమిచ్ఛతి. ౩౨. అతోమాం శరణంప్రాప్య గచ్ఛత్వం విగతజ్వరః, అవేహిపరమంభావ మిదంభూత మహేశ్వరః. ౩౩. కాలోస్మ్యహంకాలవినాశహేతు ర్లోకాన్సమాహర్తు మహంప్రవృత్తః, మృత్యోర్మృత్యుంవిద్ధిమాంవీరభద్ర జీవన్త్యేతేమత్ప్రసాదేనదేవాః.

తా. ఈప్రకారముగా వీరభద్రునిచే శాంతవాక్యముచే పలుకబడి విష్ణుమూర్తి మహాఘోరమైన కోపమును ప్రజ్వలింపజేసి వీరభద్రునితో నిట్లనియె. ఓయివీరభద్రా! నీవెక్కడనుండివచ్చితివో అక్కడికి వెళ్లుము. నాకు హితముగానిది యిచ్చట బలుకకుము. ఇప్పుడీసర్వలోకములను సంహరించగలను. నాయనుగ్రహముచే నీసమస్తలోకము ప్రవర్తింపుచున్నది. సర్వశక్తులకు ప్రవర్తక నివర్తకుడ నగుచున్నాను. ఏదేది ఐశ్వర్యకరమైనదో అదియంతయు నాసత్వగుణమని తెలియుము.

ఓగణాధ్యక్షుడవగు వీరభద్రా! పరమార్థమును గుర్తెరిగిన దేవతలు నన్ను పరతత్త్వమునుగా దెలియుచున్నారు. మదంశమైన శక్తితో గూడినవారలు బ్రహ్మేంద్రాది దేవతలు మన్నాభికమలంబున మొదట బ్రహ్మ బుట్టెను. మల్లలాటమందున భగవంతుడైన యీశ్వరుడు బుట్టెను. రజోగుణమును బ్రహ్మ అధిష్ఠించెను. రుద్రుడు తామసగుణియయ్యె. నేనే సర్వమునకు ప్రభుడను. నాకంటె మిగిలిన దేవుడు లేడు. సమస్త లోకంబుల నేనే బుట్టించి రక్షించి, నాశనమును బొందింపుచుందును. ఆహేతువువలన నన్ను శరణుబొంది విడువబడిన కోపముగలవాడై జనుము. నన్ను మృత్యువునకు మృత్యువుగా గుర్తెరుగుము. ఓ వీరభద్రా! దేవతలందరు నాఆజ్ఞచేత జీవింపుచున్నారు.

శ్లో. ౩౮. సూతః. సాహంకారమిదంశ్రుత్వా హరేరమితవిక్రమః, విహస్యోవాచ సావజ్ఞం తతో విస్ఫురితాధరః. ౩౯. వీరభద్ర. కింనజానాసి విశ్వేశం సంహర్తారం పినాకినం, అసద్వాదో వివాదశ్చ వినాశస్త్వయి కేవలః. ౩౬. తవానోన్యస్యవతారాశి కాని శేషాణిసాంప్రతం, కృతాని యేనకేనాపి కథాశేషోభవిష్యతి. ౩౭. దోషత్వం పశ్యప తత్త్వ మవస్థా మిాదృశీంగతః, తేనసంహారదక్షేణ క్షణాత్సం క్షయమేష్యసి. ౩౮. ప్రకృతిస్త్వంపుమాన్ రుద్ర స్త్వయివీర్యంసమాహితం, త్వన్నాభిపంకజాజ్జాతః పఞ్చవక్త్రపితామహః. ౩౯. సృష్ట్యర్థేన జగత్పూర్వం శంకరం నీలలోహితం, లలాటేచిన్తయామాస తపస్యుగ్రేవ్యవస్థితః. ౪౦. తల్లలాటాదభూచ్ఛంభో స్సృష్ట్యర్థంతన్నదూషణం, అంశోహం దేవదేవస్య మహాభైరవరూపిణః. ౪౧. త్వత్సంహారేనియుక్తోஉస్మి వినయేన బలేనచ, ఏవం రక్షో విదార్యైవ త్వంశక్తి కలయాయుతః. ౪౨. అహంకారావలేపేన గర్జసిత్వమతంద్రితః, ఉపకారోహ్యసాధూనామపకారాయ కేవలం. ౪౩. యదిసింహామహేశానం స్వపునర్భూతమన్యసే, నత్వంస్రష్టానసంహర్తా నస్వతంత్రోహి కుత్రచిత్.

తా. యీప్రకారముగా నహంకారముతో గూడిన విష్ణువాక్యములు విన్నవాడై అమితవిక్రముడైన వీరభద్రుడు నవ్వి పెదవినిగొరి

కినవాడవై నృసింహమూర్తిలో నిట్టనియె. ఓనారసింహా! విశ్వేశ్వరుడును లోకములను సంహరించువాడు నగు శంకరుని [illegible] బలుకుచు న్నాడవు. నీకు వినాశము సంభవించుకాలము వచ్చినది. దోషమని జూడక శివనిందాస్వరూపహాస్యము పల్కినావు. సంహారకర్తయైన శివు నిచే క్షణములో నాశనము బొందగలవు. ఓవిష్ణువా! నీవు ప్రకృతిస్వ రూపుండవు. శివుడు పురుషస్వరూపుడు. శక్తిస్వరూపుడవైన నీయందు పురుషస్వరూపుడైన శివుడు దనవీర్యమును ఉంచెను. అందువలన నీ నాభికమలమునందు, అయిదుముఖములుగల అనగా పంచముఖబ్రహ్మ పుట్టెను. పిదప పంచముఖబ్రహ్మ లోకములను సృష్టిచేసె టందుకొఱకు ఉగ్రమైన తపస్సుచేసి అతనియందు దనలాంఛనమున జ్యోతి ర్లింగస్వరూపుండై వెల్గు శివుని దలచెను. అప్పుడు శివుడు బ్రహ్మ లలా టోద్భవుడై బ్రహ్మకు సృష్టిని నేర్పెను. అందువలన శివుని నిందించ వలదు. నేను మహాభైరవస్వరూపుండైన శివునియొక్క అంశవలన బుట్టి నవాడను. ఓనృసింహమూర్తీ! నిన్ను సంహరించుటయం దీశ్వరుని ఆజ్ఞ చే నేను నియమింపబడితిని. బలముచేనైన, వినయముచేనైన నీరూపు బరి మార్చెదను. ఓనారసింహా! నీవు హిరణ్యకశిపుని సంహరించిన గర్వము చే శివునిదూరుచు నీనాశనమును నీవెఱుగవు. నేను వచియించెడు హితమును వినవైతివి. దుష్టులకు ఉపకారము జేయబోయినయెడల నప కారముసిద్ధించు ననుశాస్త్రము నిజంబయ్యె. ఓనృసింహా! నీవెప్పటికి లో కము సృష్టించువాడవుగావు. లోకముల నశింపజేయువాడవుగావు. శివు నిచే జగద్రక్షణయందు నియమింపబడినవాడవు.

శ్లో. ౪౫. కులాలచక్రవ చ్ఛక్త్యా భ్రామితోఽసి పినాకినా, అద్యాపి తవనిక్షిప్తం కపాలం కూర్మరూపిణః. ౪౬. హారహారలతామధ్యే ముగ్ధక స్మాన్నబుధ్యసే, విస్మృతం కింత దంశేన దంష్ట్రోత్పాటనపీడితః. ౪౭. వరా హవిగ్రహస్తేద్యసాక్రోశం తారకారిణా, దగ్ధోసియస్య శూలాగ్రే విష్వక్సే నఛలాద్భవాన్. ౪౮. దక్షయజ్ఞే శిరచ్ఛిన్నం మయా తే యజ్ఞరూపిణః, అద్యాపి తవపుత్రస్య బ్రహ్మణః పఞ్చమం శిరః. ౪౯. ఛిన్నం తమేనాభిసం స్థం తదంశం తస్య తద్బలం, నిర్జిత స్త్వం దధీచేన సంగ్రామే సమరుద్గణః.

౪౯. కండూయమానే శిరసి కథం తద్విస్మృతం మయా, చక్రం విక్రమ తేయస్య చక్రహాసే తవప్రియం.౫౦. కృతప్రాప్తం కృతం కేన త్వయాతదపి విస్మృతం, తేన మయాసకలాలోకాగృహీతా స్త్వం పయోనిధౌ.౫౧. నిద్రాపరవశశ్శేషే సకథం సాత్వికో భవాన్, త్వదాది స్తంభ పర్యంతం రుద్రశక్తివిజృంభితమ్.

తా. ఓనరసింహా! నీవు కుమ్మరివానిచక్రమువలె యీశ్వరునిచే ప్రేరేపింపబడినవాడవైతివి. ఇప్పటికి కూర్మస్వరూపుడవగు నీయొక్క కపాలము శివుని హారమధ్యంబున ధరియింపబడియున్నది. ఓవిష్వక్సేనా! నీయవతారమైన వరాహవిగ్రహము శివపుత్రుడగు కుమారస్వామిచే శూలాగ్రమందునిక్షిప్తమైయున్నది. దక్షయజ్ఞమందు యజ్ఞస్వరూపుడైన నీయొక్క కొమారుడగు బ్రహ్మయొక్క అయిదవ శిరస్సు నాచే ఖండింపబడినది. అది యిప్పటికి నా నాభిస్థానమందు హారముందున్నయది. నీవు శివభక్తుఁడగు దధీచిచేత యుద్ధమందు వోటువడి తలను గోకుకొన్నస్థితియంతయు మరచితివా. ఈశ్వరునిచే చక్రమును బొంది శత్రులగెల్చుచు నీశ్వరుని దూరెదవా. జేసినయుపకారమును మరచితివా. శక్తిరూపుడవైన నీవు మొదలుకొని ఆది స్తంభపర్యంతము రుద్రశక్తిచే ప్రకాశింపబడెనని యెఱుగవైతివి.

శ్లో. ౫౨. శక్తిమానభిత స్త్వంచ అనల స్త్వంచ మోహితః, తత్తేజసోపిమాహాత్మ్యం యువాంద్రష్టుం నచక్షమా. ౫౩. స్థూలాయేవాప్రపశ్యంతి తద్విష్ణోః పరమంపదం, ద్యావాపృథివ్యా ఇంద్రాగ్నే ర్యమస్య వరుణస్యచ.౫౪. ధ్వాన్తోదరే శశాంకస్య జనిత్వా పరమేశ్వరః, కాలోసిత్వం మహాకాలః కాలకాలోమహేశ్వరః.౫౫. అత స్త్వముగ్రకలయా మృత్యోర్మృత్యుర్భవిష్యతి, స్థిరధన్వాక్షయోవీరో వీరోవిశ్వాధికప్రభుః. ౫౬. ఉపహస్తాజ్వరంభీమో మృగపక్షీహిరణ్మయః, శాస్తాశేషస్యజగతః నత్వంచైవచతుర్ముఖః.౫౭ ఇత్థం సర్వంసమాలోక్య సంహారాత్మానమాత్మనా, నాచేత్తదాసీం క్రోధస్య మహాభైరవ రూపిణః. ౫౮. వభ్రాశనిరివస్థానో స్త్వేవం మృత్యుః పతిష్యతి.

మహాబాహు శ్చతుష్పాద్వహ్నిసంభవః. ౯౭. యుగాంతోద్యజీమూత భీమగంభీరనిస్వనః, సమంకుపితవృత్తాగ్ని వ్యావృత్తనయనత్రయః. ౯౮. స్పష్టదంష్ట్రోధరోష్ఠశ్చ హుంకారేణయుతోహరః, హరిస్తద్దర్శనాదేవ వినష్టబలవిక్రమః. ౯౯. బిభ్రదౌర్స్ఖ్యం సహస్రాంశో రథః ఖద్యోత విభ్రమం, అథవిభ్రమ్య పక్షాభ్యాం నాభిపాదేభ్యధారయేత్.

తా. ఈలాగున వీరభద్రునిచే బలుకబడి, నృసింహమూర్తి క్రోధముగలవాఁడై, సింహనాదమును జేసి, దేహవేగముచేత వీరభద్రునిప ట్టుకొనేకొరకు ప్రారంభించెను. అంతలో మహాఘోరమైనట్టువంటిన్ని, శత్రువులకు భయంకరమైనదియు, ఆకాశమును వరుచుకుంచున్న, రుద్ర తేజస్సాకటిబయలుదేరెను. వీరభద్రుడారూపమును జూచుచుండగానే లోకంబులెల్లను రుద్రతేజోమయంబయ్యెను. అప్పుడు పరమేశ్వరుడు జగత్సంహారకశరభసాళ్వేశ్వరరూపమును బొంది, తేజోమయుండై, యిరుప్రక్కల శరభమృగావృతదేహుండై, ఱెక్కలుముక్కులుచేతప్రకా శింపుచున్నవాఁడై, గొప్పదైన కోఱలు గలవాఁడై, వజ్రాయుధముతో సమానమైన గోళ్లుగలవాడై, కంఠమందు నలుపుగలిగి, ప్రళయకాలం బున ధ్వనిచేయుచున్నమేఘమువలె, గంభీరమైన ధ్వనిగలవాఁడై, అగ్ని కణంబుల రాల్చు నేత్రత్రయముగలవాఁడై, హుంకారములతో గూడు కుని శరభసాళ్వేశ్వరుడు ప్రకాశించెను.

శ్లో. అష్టాంఘ్రిశ్చ సహస్రబాహుర్వనల చ్ఛాయాశిరోయుగ్మభృ, ద్వితర్యక్షోతిజవో ద్విపుచ్ఛఉరగ స్సాక్షా నృసింహాసనః, అర్ధేనాపి మృ గాకృతిః పునరథాప్యర్ధేన పక్షాకృతిః, శ్రీవీరశ్శరభస్సపాతు రనిశంచిం త్యస్సదామేహృది.

తా. యెనిమిదిపాదములు గలిగినట్టియు, వేయుబాహువులు గలి గినట్టియు, అగ్నిహోత్రునివంటి చాయగల రెండుశిరస్సులును ధరించి

శివున కెదుట నిలచి ఏంచిన ముఖము గలవాడై దోసిలొగ్గి ముందు జెప్పబడబోవు నామంబులచేత నిట్లని స్తుతియించె.

శ్రీనృసింహకృతశరభేశ్వరాష్టోత్తర శతనామావళిస్తుతిః.

శ్లో. ౭౫. శ్రీనృసింహః. నమోరుద్రాయశర్వాయ మహాగ్రాసాయవిష్ణవే, నమోఉగ్రాయభీమాయ నమఃక్రోధాయమన్యవే. ౭౬. నమోభవాయశర్వాయ శంకరాయశివాయతే, కలికాలాయకాలాయ మహాకాలాయమృత్యవే. ౭౭. వీరాయవీరభద్రాయ క్షయద్వీరాయశూలినే, మహాదేవాయమహతే పశూనాంపతయేనమః. ౭౮. ఏకాయనీలకంఠాయ శ్రీకంఠాయపినాకినే, నమోనంతాయసూక్ష్మాయ నమస్తేమృత్యుమన్యవే. ౭౯. పరాయపరమేశాయ పరాత్పరతరాయతే, పరాత్పరాయవిశ్వాయ నమస్తేవిశ్వమూర్తయే. ౮౦. నమోవిష్ణుకళత్రాయ విష్ణుక్షేత్రాయభానవే, కైవర్తాయకిరాతాయ మహావ్యాధాయశాశ్వతే. ౮౧. భైరవాయశరణ్యాయ మహాభైరవరూపిణే, నమోనృసింహసంహర్త్రే కామకాలపురారయే. ౮౨. మహాపాశౌఘసంహర్త్రే విష్ణుమాయాన్తకారిణే, త్ర్యంబకాయత్ర్యక్షాయ శిపివిష్టాయమీఢుషే. ౮౩. మృత్యుంజయాయ శర్వాయ సర్వజ్ఞాయముఖారయే, మఖేశాయవరేణ్యాయ నమస్తేవహ్నిరూపిణే. ౮౪. మహాఘ్రాణాయ జిహ్వాయ ప్రాణాపానప్రవర్తినే, త్రిగుణాయత్రిశూలాయ గుణాతీతాయయోగినే. ౮౫. సంసారాయప్రవాహాయ మహాయన్త్రప్రవర్తినే, నమశ్చంద్రాగ్నిసూర్యాయ ముక్తివైచిత్ర్యహేతవే. ౮౬. కపాలినేకరాళాయ పతయే పుణ్యకీర్తయే, అమోఘాయాగ్నినేత్రాయ లకులీశాయశంభవే. ౮౭. భిషక్తమాయముండాయ దండినేయోగరూపిణే, మేఘవాహాయదేవాయ పార్వతీపతయేనమః. ౮౮. అవ్యక్తాయవిశోకాయస్థిరాయస్థిరధన్వినే, స్థాణవేకృత్తివాసాయ నమఃపఞ్చార్థహేతవే. ౮౯. వరదాయైకపాదాయ నమశ్చంద్రార్ధమౌళినే, నమస్తేధ్వరనాశాయ వయసాంపతయేనమః.

౯౦. యోగీశ్వరాయ నిత్యాయ సత్యాయ పరమేష్ఠినే, సర్వాత్మనే నమస్తుభ్యం నమస్తే ఈశ్వరాయ తే. ౯౧. నమస్త్రిపతత్రయాన్తాయ సర్వేశ్వరాయ తే నమోనమః, నమో నమస్త్రిశూలాయ నమస్తే నమోనమః, నమో నమో నమో భూయః పునర్భూయో నమోనమః.

తా. రుద్రాయనమః, శర్వాయనమః, మహాదేవాయనమః, విష్ణవేనమః, ఉగ్రాయనమః, భీమాయనమః, క్రోధాయనమః, మన్యవేనమః, భవాయనమః, శర్వాయనమః, శంకరాయనమః, శివాయనమః, కాలకాలాయనమః, కాలాయనమః, మహాకాలాయనమః, మృత్యవేనమః, వీరాయనమః, వీరభద్రాయనమః, క్షయద్వీరాయనమః, కపాలినేనమః, మహాదేవాయనమః, మహతేనమః, పశూనాంపతయేనమః, ఏకాయనమః, నీలకంఠాయనమః, శ్రీకంఠాయనమః, పినాకినేనమః, అనంతాయనమః, సూక్ష్మాయనమః, మృత్యుమన్యవేనమః, పరాయనమః, పరమేశాయనమః, పరాత్పరాయనమః, విశ్వాయనమః, విశ్వమూర్తయేనమః, విష్ణుకళత్రాయనమః, విష్ణుక్షేత్రాయనమః, భానవేనమః, కైవర్తాయనమః, కిరాతాయనమః, మహావ్యాధాయనమః, శాశ్వతేనమః, భైరవాయనమః, శరణ్యాయనమః, మహాభైరవరూపిణేనమః, నృసింహసంహర్త్రేనమః, కామకాలపురారయేనమః, మహాపాశౌఘసంహర్త్రేనమః, విష్ణుమాయాంతకారిణేనమః, త్ర్యంబకాయనమః, త్ర్యక్షాయనమః, శిపివిష్టాయనమః, మీఢుషేనమః, మృత్యుంజయాయనమః, శర్వాయనమః, సర్వజ్ఞాయనమః, మఖారయేనమః, మహేశాయనమః, కరేణ్యాయనమః, వహ్నిరూపిణేనమః, మహాఘోరిణాయనమః, జింహ్వాయనమః, ప్రాణాపానప్రవర్తినేనమః, త్రిగుణాయనమః, త్రిశూలాయనమః, గుణాతీతాయనమః, యోగినేనమః, సంసారాయనమః, ప్రవాహాయనమః, మహాయంత్రప్రవర్తినేనమః, చంద్రాగ్నిసూర్యాయనమః, ముక్తివైచిత్ర్యహేతవేనమః, కపాలినేనమః, కరాళాయనమః, పతయే

నమః, పుణ్యకీర్తయేనమః, మోఘాయనమః, అగ్నినేత్రాయనమః, లకుళీశాయనమః, శంభవేనమః, భిషక్తమాయనమః, ముండాయనమః, దండినేనమః, యోగరూపిణేనమః, మేఘవాహాయనమః, దేవాయనమః, పార్వతీపతయేనమః, అవ్యక్తాయనమః, విశోకాయనమః, స్థిరాయనమః, స్థిరధన్వినేనమః, స్థాణవేనమః, కృత్తివాసాయనమః, పంచార్ధహేతవే నమః, వరదాయనమః, ఏకపాదాయనమః, చంద్రార్ధమౌళినేనమః, అధ్వరరాజాయనమః, వయసాంపతయేనమః, యోగీశ్వరాయనమః, నిత్యాయనమః, సత్యాయనమః, పరమేష్ఠినేనమః, సర్వాత్మనేనమః, సర్వేశ్వరాయనమః, ఏకద్విత్రిశ్చతుఃపఞ్చకృత్వస్తే నమః, పరిమితకృత్వేనమః, అపరిమితకృత్వేనమః, నమస్కారము నమస్కారము తిరిగి నమస్కారము అనిశరభసాళ్వేశ్వరుని నృసింహమూర్తిస్తుతియించెను.

శ్లో. ౯౨. సూతః. నామ్నాష్టశతేనైవం స్తుత్వామృతమయేనతుః, పునస్త్రప్రార్థయామాస నృసింహశ్శరభేశ్వరం. ౯౩. యదాయదా మమాజ్ఞాన మత్స్వాహంకారదూషితం, తదాతదాపనేతవ్యం త్వమైవ పరమేశ్వర. ౯౪. ఏవం విజ్ఞాపయ న్ప్రీత శ్శంకరం నరకేసరీ, నన్వశక్తో భవాణ్ విష్ణో జీవితాన్తం పరాశితః. ౯౫. తద్వక్త్రశేషమాత్రాన్తం కృత్వాసర్వస్వ విగ్రహం, శుక్తిశిత్యంతదాత్వజ్ఞం వీరభద్రక్షణాత్తతః.

తా. ఈప్రకారముగా అష్టోత్తరశతనామములచేత నృసింహమూర్తిశరభసాళ్వేశ్వరునిస్తుతియించి తిరిగిప్రార్థించెను. ఓపరమేశ్వరా నేనెప్పుడెప్పుడు అజ్ఞానముచే నిన్ను దూషించెదనో అప్పుడప్పుడునాయందు దయగలవాడవై నాఅజ్ఞానమును గర్వమునుపోగొట్టుము. ఈప్రకారముగా విష్ణువు. అనగా నృసింహమూర్తి శివునితో విజ్ఞాపనము జేసికొని సంతోషపెట్టెను. వీరభద్రుడుతత్క్షణమందయ్యేవే విష్ణునిగాంచి ఓనృసింహా నీవశక్తుడవైతివి. పరమేశ్వరుని జయించజాలవు గాన నీవు శివభక్తుడవు గమ్మని పలికెను.

దేవాః. శ్లో. ౯౬. అథబ్రహ్మాదయస్సర్వే వీరభద్రత్వయాదృశా, జీవితాస్మోవయం దేవాః పర్జన్యేనేవపాదపాః. ౯౭. యస్యభీషాదహత్యగ్నిరుదేతిచరవిస్స్వయం, వాతోవాతిచసోసిత్వం మృత్యుర్ధావతిపంచమం. ౯౮. యదవ్యక్తంపరంవ్యోమ కలాతీతంసదాశివం, భగవన్నాత్మేవభవం వదంతిబ్రహ్మవాదినః. ౯౯. కేవయంఏవధాతుక్యే వేదనేపరమేశ్వరః, నవిద్ధిపరమంధామ రూపలావణ్యవర్జనే. ౧౦౦. ఉపసర్గేషుసర్వేషు త్రాయస్వాస్మాన్గణాధిప, ఏకాదశాత్మన్భగవా న్వర్తతేరూపవాన్హరః. ౧౦౧. ఈదృశాన్యేవతారాణి దృష్ట్వాశివబహూంతమః, కదాచిత్సందిహేనాస్మాన్ స్వచింతాస్తమయస్తదా. ౧౦౨. గుంజాగిరివరతటామితరూపాణిసర్వశః, అభ్యసంహారగమ్యంతే నసితవ్యంపరాపరా. ౧౦౩. ద్వేతనూతవరుద్రస్య వేదజ్ఞాబ్రాహ్మణావిదుః, ఘోరాన్యన్యాశివాఖ్యన్యా తేప్రత్యేకమనేకధా. ౧౦౪. ఇహాస్మాన్పాహిభగవ న్నిత్యాహతమహాబలః, భవతాహిభగత్సర్వంవ్యాప్తంస్వేనైవ తేజసా. ౧౦౫. బ్రహ్మవిష్ణ్వింద్రచంద్రాద్యా వయంచప్రముఖాస్సురాః, సురాసురాసంప్రసూతా స్త్వత్తస్సర్వేమహేశ్వరోః. ౧౦౬. బ్రహ్మాచఇంద్రోవిష్ణుశ్చయమాద్యాస్సురాసురాన్, తతోనిగృహ్యచహరిం సింహఇత్యుపచేతసం. ౧౦౭. యతోబిభర్షిసకలం విభజ్యతనుష్టదా, అతోస్మాన్పాహి భగవ న్తురాన్దానైరభీప్సితైః.

తా. అనంతరమందు బ్రహ్మాదిదేవతులిట్లనిరి. ఓ వీరభద్రా నీచేతమేము మేఘునిచేత వృక్షములవలె బ్రతికించబడితిమి. యేమహానుభావునియొక్క ఆజ్ఞవలన అగ్నిప్రజ్వరిల్లుచున్నదో, సూర్యుడుదయించుచున్నాడో, వాయువు విసరుచున్నదో, ఆమహానుభావుడగు పరమేశ్వరుడవేనీవు. యేది తెలియ నలవిగానిదో, యేది శ్రేష్ఠమైనదో, యేది కళాతీతమైనదో, యేది సదాశివస్వరూపమో ఆ పరతత్వమే నీవైతివి. ఏకాదశరుద్రస్వరూపుడై హరుడుప్రవర్తింపుచున్నాడు. ఇటు

వంటి నీయొక్క అవతారములను గాంచి, మానసంశయములు నశింపు చున్నవి. రుద్రస్వరూపుఁడను నీకు నెన్ని దేహములు గలవని వేదము లను గుర్తెరిగిన బ్రాహ్మణులు నుడ్వెరుగుచున్నారు. ఒక దేహము అఘోరరూపస్వరూపమనియును, యొక దేహము శివస్వరూపస్వరూపమనియును భగ సంతోషదన్నైన వో వీరభద్రా, మమ్మిప్పుడు రక్షించుము. నీచేత నీసంబం ధమైన తేజస్సుచేత సమస్తజగము వ్యాపింపఁబడినది. బ్రహ్మ విష్ణు ఇంద్రు డు చంద్రుఁడు మొదలగు మేమున్ను రాక్షసులున్ను అందఱు నీవలన బుట్టినటువంటివారలము. బ్రహ్మ విష్ణు యముఁడు ఇంద్రుఁడు మొదలగు దేవతలను రాక్షసులను, నిగ్రహించిన నృసింహమూర్తిని సంహరించి తివి. ఏ దేహమువలన అష్టమూర్తిగుండవని అనఁగా, 'భూమిర్జలంపనం వహ్ని వాయురాకాశమేవచ, సూర్యాచంద్రమసావాత్మా మహేశ స్యాష్టమూర్తయః' అను న్యాయంబున అష్టమూర్తిగుండవై, విభ జించి సర్వమును భరించితివో ఆ దేహమువలన రుద్రస్వరూపుఁడవగు ఓ వీరభద్రా, మమ్ము రక్షింపుము.

శ్లో. ౧౦౮. ఊచావ తాన్సురాన్ దేవో మహాత్మంచ పురాతనాన్, యథా జలేజలం క్షిప్తం క్షీరం క్షీరే ఘృతం ఘృతే. ౧౦౯. ఏకఏవ తదా విష్ణు శ్శివలీనో నచాన్యథా, ఏషఏవ నృసింహాత్మా సదర్పశ్చ మహాబలః. ౧౧౦. జగత్సంహారకారేణ ప్రవృత్తో నరకేసరీ, యాజనీయో మ్యాసతస్త స్త్రైత్ర మన్మూర్తిస్సిద్ధకాంక్షిభిః. ౧౧౧. ఏతావదుక్త్వా భగవాన్ వీరభద్రో మహాబలః, అపశ్యత్ సర్వభూతానాం త్ర్యక్షోత్రివాస్తునదీయహ. ౧౧౨. నృసింహకృత్తివసన స్తదాప్రభృతిశంకరః, వక్త్రం తస్యాంగమాలా యాం నాయకత్వేనకల్పితం. ౧౧౩. తతో దేవాసురాతంకాః స్తుత్వాయ స్తః కథామిమాం, విస్మయోత్ఫుల్లనయనా జగ్ముస్సర్వే యథాగతం.

తా. వీరభద్రుఁడు పురాతనులగు మహర్షులనుగూర్చి యిట్లని యె, ఓ ఋషులారా! యేప్రకారముగా జలముజలమందున్న పాలు

పాలయందున్ను, నెయ్యినెయ్యియందున్ను, కలసిపోవునో, ఆరీతిగానే నృసింహస్వరూపుఁడైనట్టియు మహాబలవంతుఁడైన శివభక్తుఁడైన యీ విష్ణుమూర్తి శివునియం దైక్యమయ్యెను. అందువలన శివరూపుడగును. అందువలన నృసింహమూర్తిని శివభక్తులందరు సేవింపదగుదురు. ఈ రీతిగా బలికి భగవంతుడగు వీరభద్రుఁడు యెవరికి కనుబడక నదృశ్యుడయ్యెను. అదిమొదలు శివుడు నృసింహచర్మమే వస్త్రముగాగలవాడయ్యె. ఆ నృసింహముఖము శివహారమందు నాయకమణిగాధరించబడియె. అప్పుడు దేవతలందరు భయములేనివారై శరభసాళ్వవిజయ కథను గొనియాడుచు, స్వస్థానములకు జనిరి.

శ్లో. ౧౧౪. యఇదంపరమాఖ్యానం పుణ్యం దేవైస్సమన్వితం, పఠితాశ్శృణు తేచైవ సర్వదుఃఖవినాశనం. ౧౧౫. ధన్యంయశస్యమాయుష్య మారోగ్యంపుష్టివర్ధనం, సర్వవిఘ్నప్రశమనం సర్వవ్యాధివినాశనం. ౧౧౬. అపమృత్యుప్రశమనీం మహాశాన్తికరంశుభం, అరిచక్రప్రశమనం సర్వాధి ప్రవినాశనం. ౧౧౭. తమోదుస్వప్నశమనం సర్వభూతనివారణమ్, విషగ్రహక్షయకరం పుత్రపౌత్రాదివర్ధనం. ౧౧౮. యోగసిద్ధిప్రదంసమ్య చ్ఛివజ్ఞానప్రకాశకం, శివలోకస్యసోపానం వాంఛితార్థైకసాధనం. ౧౧౯. విష్ణుమాయానిరసనం దేవతాపరమార్థదం, వాంఛాసిద్ధిప్రదంచైవ బుద్ధిప్రజ్ఞాదిసాధనం. ౧౨౦. ఇదంతు శరభాకారం పరం రూపంపినాకినః, ప్రకాశితత్వంభక్తేషు చరేషుద్యమితేషుచ. ౧౨౧. తైలేవపఠతవ్యంచ శ్రోతవ్యంచ శివాత్మభిః, శివోత్సవేషుసర్వేషు చతుర్దశ్యష్టమీషుచ. ౧౨౨. పఠేత్ప్రతిష్ఠాకాలేషు శివసన్నిధికారణం, సర్వభూతప్రశమనం సర్వసిద్ధిప్రదాయకం. ౧౨౩. చోరవ్యాఘ్రాహిసింహాస్త్ర కృతోరాజభయేషుచ, అన్యత్రానోఽత్పాతభూకంప దవాగ్నిపాంసువృష్టిషు. ౧౨౪. ఉల్కాపాతేమహాపాతే వినావృష్ట్యాతివృష్టిషు,

ఓం.

అస్యశ్రీ సర్వతోముఖవీరబడబానల శరభ మహామంత్రస్య, సమూలసమస్త మహాప్రళయసంహారకాలాగ్నిరుద్ర భగవాన్ ఋషిః. అనుష్టుప్ఛందః, సర్వతోముఖవీరబడబానల శరభేశ్వరో దేవతా ఓం బీజం, స్వాహాశక్తిః, రంకీలకం, అష్టముఖగండభేరుండ నృసింహ సంహారణార్థే జపే వినియోగః.

హ్రాం అంగుష్ఠాభ్యాంనమః, హ్రీం తర్జనీభ్యాంనమః, హ్రూం మధ్యమాభ్యాంనమః, హ్రైం అనామికాభ్యాంనమః, హ్రౌం కనిష్ఠికాభ్యాంనమః, హ్రః కరతలకరపృష్ఠాభ్యాంనమః.

హ్రాంహృదయాయనమః, హ్రీంశిరసేస్వాహా, హ్రూం శిఖాయై వౌషట్, హ్రైంకవచాయహుం, హ్రౌం నేత్రత్రయాయవౌషట్, హ్రఃఅస్త్రాయఫట్. భూర్భువస్సువరోమితిదిగ్బంధః. ధ్యానం.

మహాదంష్ట్రోమహాభీమో మహాభయవినాశనః, ధ్యేయశ్చిదాత్మకో దేవ స్సదానందకరప్రభుః.

లంపృథ్వీతత్వాత్మనే గంధతన్మాత్రప్రకృత్యానందాత్మనే సర్వతోముఖవీర బడబానలశరభేశ్వరాయగంధం పరికల్పయామి, అంఆకాశతత్వాత్మనే శబ్దతన్మాత్రప్రకృత్యానందాత్మనే సర్వతోముఖ వీర

నలశరభేశ్వరాయ పుష్పంసమర్పయామి, యంవాయుతత్వాత్మ స్పర్శతన్మాత్రప్రకృత్యానందాత్మనే సర్వతోముఖవీరబడబానల శరభేశ్వరాయ ధూపమాఘ్రాపయామి, రంవహ్నితత్వాత్మనే రూపతన్మాత్ర ప్రకృత్యానందాత్మనే సర్వతోముఖవీరబడబానలశరభేశ్వరాయ దీపందర్శయామి, వం అమృతతత్వాత్మనే రసతన్మాత్ర ప్రకృత్యానందాత్మనే సర్వతోముఖవీరబడబానలశరభేశ్వరాయ అమృతోపహార నైవేద్యంసమర్పయామి, సంసకలతత్వాత్మనే సర్వతన్మాత్రప్రకృత్యానందాత్మనే సర్వతోముఖవీర బడబానలశరభేశ్వరాయ సర్వోపచార పూజాంచ సమర్పయామి.

అథ మనుః.

ఆదౌప్రణవముచ్చార్య శ్రీబీజంచ తతోచ్చరేత్,
మాయాబీజం తతోచ్చార్య అగ్నిబీజద్వయంవదేత్.
సర్వతోముఖశబ్దశ్చ వీరశబ్దతతోచ్చరేత్,
బడబానలసాళ్వేతి పదేతిశరభాహ్వయం.
జ్వాలాశబ్దంతతోచ్చార్య జిహ్వాశబ్దం తతోచ్చరేత్,
గండభేరుండ ముచ్చార్య భక్షశబ్దద్వయం వదేత్.

హుం ఫట్ స్వాహాసమాయుక్తం ఏతన్మంత్రంమహామనుః.

అష్టకం.

స్తాలకంఠ మహాదేవ బడబానల సాళ్వక,
రక్షమాం సర్వశత్రుభ్యః కరుణాకర శత్రుహా.
దూరం గచ్ఛమహాబాహో మహాకుల వినాశనం,
రిపోర్బలం నిహం త్యాశు పశుపుత్రాంశ్చ నాశయ.

గండభేరుండ సంహర్తా బడబానల సంజ్ఞకః,
మాముద్ధర పరాంబోధే త్రిపురఘ్నాంతకాంతక.
అష్టాస్య గండభేరుండ సంహర్తా రుధిరాశనః,
పాతుమాం రోషశత్రుభ్యో లోకరక్షా ధురంధరః.
అష్టాస్య గండభేరుండ సంహర్తా రుధిరాశనః,
రక్షమాం క్షుద్ర రాజేభ్యో విశ్వరక్షో ధురంధరః.
అష్టాస్య గండభేరుండ భక్షణాం ప్రియలాలసా,
ఆగచ్ఛత్వం మిహ స్త్వం శత్రూణాం రుధిరం పిబ.
దంష్ట్రా కోటి మహావక్త్రి శత్రూణాం రుధిరాశన,
ఆగచ్ఛత్వం మహాఘోరవైరిణాం రుధిరం పిబ.
అష్టాస్య గండభేరుండ జ్వాలాకుల ముఖాంతక,
శత్రూన్ సంహార మాం రక్ష శ్రియం దాపయ మే ప్రభో.

## గద్యము.

శ్రీమదుపభృంగీశ్వరసిద్ధేశ్వరకాలారిద్వివక్త్రద్వ్యక్షరపఞ్చప్రామధిక ప్రవరాన్విత భృంగీశ్వర సగోత్రోద్భవస్య శ్రీమత్పరశివవామదేవముఖోద్భవదారుకాచార్యశాఖాసంజనితస్య శ్రీసిద్ధవటసిద్ధేశ్వర గర్భోదయ శ్రీమరుళ సిద్ధేశ్వర కరకమల సంజాత శ్రీమదనాది వీరశైవ మహాఘన మతస్థాపనాచార్యవర్య దీక్షామోక్షైక కారణావతారమరాచారదుర్మార్గ దుష్క్రియానిగ్రహ సదాచార సన్మార్గ సత్క్రియాపరిపాలనశీల శ్రీమత్పరమపావన శ్రీమదుజ్జయనీధర్మసింహాసనాసీన శిక్షాముద్రాధృతాభిరామ శ్రీమద్రాజాధిరాజమహారాజ పూజిత రాజరాజ శ్రీమహార్తికాసన వర్ష లాంఛన పరిశోభిత చరపట్టాద్యక్షశివానుభావమరుళసిద్ధరాజదేశికేంద్రమహాస్వామి శిష్యస్య శ్రీమద్వీరమాహేశ్వర గంగపట్టణ సుబ్రహ్మణ్యకవి మహాజంగమస్వామినః ప్రోత్సాహేన శ్రీమ

# వీరశరభసాళ్వవిజయము.

బశ్వేర సోమేశ్వర ముఖారి ఏకవక్త్రికాపురపఞ్చప్రామథిక ప్రవర్తిత నందీశ్వరసగోత్రోద్భవేన శ్రీమత్సోమేశ్వర సద్యోజాతముఖోద్భవ శ్రీమజ్జగద్గురు రేణుకాచార్యశాఖాసంజనితేన శ్రీమద్వేదాగమోపనిషద్ధర్మసూత్రగోత్రకాండ పురాణేతిహాససకలశాస్త్ర ప్రసిద్ధ శ్రీమద్వీరశైవఘనసమతస్థాపనాచార్యవర్య శ్రీమద్రంభాపురీ వీరసింహాసనాధీశ్వర శిఖాముద్రాభిరామ శ్రీమద్రాజాధిరాజ మహారాజ పూజిత సావర్ణపాదుకాయుగళ శ్రీమచ్చరి పట్టద్యషపఞ్చతుర దేశికేంద్ర మహాస్వామిశిష్యేణ శ్రీమద్వీరమాహేశ్వర పానుగంటి నాగామాంబా లింగయ మహాజంగమస్వామి పుత్రేణ కోటీశ్వరశాస్త్రిణా లిఖితాంధ్రతాత్పర్య సహితోయం శరభోపనిషత్ శ్రీమహాపురాణే వేదవ్యాసప్రోక్తే లింగే పూర్వభాగే శరభరూపకృత నృసింహగర్వభంగో నామ సప్తసప్తతితమోధ్యాయాంధ్రతాత్పర్యసహిత స్సమాప్తః.

శ్రీషట్స్థల బ్రహ్మార్పణమస్తు శ్రీశరభార్పణమస్తు.

మఱియు నీ గ్రంథంబున పీఠికను ఆఱవపుటను రెండవపంక్తిని "కాలాగ్నిబుద్రోపనిషత్తు" ను శబ్దమునకు ముందు "సిద్ధాంత శిఖామణి మొదలగు గ్రంథములను" అని యుండవలసినది ప్రమాద వశంబుగా భేదంబాయె నిట్టిదోషంబులున్నను క్షమింప గోరుచున్న వాడ.

తులారా!

శ్రీగౌరీపతికి పంచవింశతి లీలలు, శ్రీమన్నారాయణమూర్తికి దశావతారంబులు గలవని శైవవైష్ణవులెఱింగియుందురు. విశిష్టాద్వైతులుమాత్రము శ్రీహరి దశావతారంబులను విలసిల్లు నృసింహ రామకృష్ణావతారంబులకు దప్పక వైశాఖశుద్ధత్రయోదశిని నృసింహావిజయోత్సవంబున్ను చైత్రమాసాదిగా నవరాత్రములు రామోత్సవమున్ను, శ్రావణమాసంబున కృష్ణోత్సవంబును సల్పుచుందురు. వాతూలతంత్రాదిగ్రంథంబున గర్భితంబగు శివపంచవింశతిలీలలు సుప్రసిద్ధంబులై యుండ తల్లీల విషయంబులు వినుచు, నాలీలలలో జగత్పూజ్యులై వెలంగు వీరశరభ సాళ్వేశ్వరవిజయమహోత్సవంబులు శక్తివిశిష్టాద్వైతమతస్థులు సల్పనొల్లక వర్తించెదరు. మఱియు వైశాఖమాసబహుళ ఏకాదశి మొదలు త్రయోదశివరకు త్ర్యాహికముగా తచ్ఛక్తి విశిష్టాద్వైతమతస్థులీగ్రంథప్రమాణము వీరశరభసాళ్వజయంతి గావించిన శివసాయుజ్యంబు బొందగలరు.

శివాయ గురవే నమః

# శివమణిదర్పణమ్

రచయితా :— 'హారితకవి' మల్లంపల్లి వీరేశ్వరశర్మా

జయతు జయతు చిత్తే శంకర శ్చంద్రచూళిః
కలితలలితగౌరీకల్పవల్లీమతల్లిః
నిఖిలనిగమగాథానర్ఘక్షీరసింధుః
సుమితఫలితపుణ్యశ్రీమనఃపద్మబంధుః ॥ 1

ఫలించిన పుణ్యములుగల భక్తుల మనముల కానందమును గలిగించువాడును, సకలములైన వేదగాథలనెడి రత్నముల పుట్టుకకు పాల సముద్రమువంటివాడును, పార్వతియనెడి కల్పలతకు ఆలంబమును, చంద్రచూళియు నగు శంకరుడు నాచిత్తమున విజయము చేయుగాత.

ప్రకృతి రియ మనంతా దర్పణం యస్య మూర్తేః
సకలవిబుధచేతస్తర్పణం యస్య వృత్తం
అజర మమర మాద్యం తేజసాం యస్య రూపమ్
స జయతు మమ చిత్తే దేవతాసార్వభౌమః ॥ 2

అనంతమగు నీప్రకృతి యే పరమేశ్వరుని మూర్తిని జూపుటకు అద్దమువలె నున్నదో, ఎవని చరిత్రము సకలపండితుల కాహ్లాదమును గలిగించునో, జరామరణరహితమగు నెవనిరూపము సకల తేజస్సులకు మూలమై యున్నదో ఆ దేవతాసార్వభౌముడగు శివుడు నా హృదయమున విజయము చేయుగాత.

శివ! తవ వందికవిప్రభవకృతం
నవనవశబ్దమణీఘృణినిచితమ్
విఘటితమోహపటావృతిమహితం
జయతు చిరం మణిదర్పణ మహితమ్ ॥ 3

ఓ మంగళస్వరూపా! నీ స్తుతిపాఠకులగు కవుల వంశమున జనించిన నాచే నిర్మింపబడినదియు, నూతనములగు శబ్దము లనెడి మణుల కాంతులచే నిండినదియు, తొలగింపబడిన యజ్ఞాన మనెడి గవుసెన

కలిగినది యగు ఈ మణిదర్పణము చిరకాలము అప్రతిహతమై ప్రకాశించుగాత.

అభినవరూపసుదర్శనవిభవం
నిజనిజతత్త్వవిమర్శానుభవసహ
బహు[illegible]
జయతు [illegible] ॥ 4

చాల [illegible] [illegible]యు తమ తమ [illegible] [illegible]ముల [illegible]. అనేక గుణములను [illegible] [illegible] [illegible] [illegible], కళంక రహితమగు చంద్రబింబము నతిశయించుచు ఈ మణిదర్పణము విజయమందుగాత.

యేన స్వాత్మా ద్బహువిధజని గ్వల్లవీవస్త్రహారీ
పాతివ్రత్యం త్రిపురసుదృశాం యో జహార ప్రబుద్ధః
మృత్యోర్జేతా త్రిపురవిజయీ నైవ [illegible]
మందాక్రాంతైః కలియుగబుధా [illegible] లీనమ్॥ 5

గొల్లపడుచుల కట్టుబట్టల నపహరించినవాఁడును, బుద్ధావతారమునఁ త్రిపురాసురుల వనితల పాతివ్రత్యము నపహరించినవాఁ డెవరి కుమారుఁడో మృత్యువును జయించినవాఁడును త్రిపురదనుజులఁ జంపినవాఁడగు నీశ్వరుఁ డెవరి కుమారుఁడు కాఁడో శని పీడితులగు నట్టి కలియుగపండితు లీ యర్థమును మఱిచిపోకుందురుగాత.

బహుధా శూన్యసిద్ధాంతమృగతృష్ణాపిపాసవః
శివతత్త్వామృతం పీత్వా సుఖితాం యాంతు జంతవః ॥ 6

పెక్కులును శూన్యములు నగు సిద్ధాంతముల నెడి యెండమావులలో దప్పి దీర్చికొన నెంచు ప్రాణులు ఈ శివతత్త్వామృతమును గ్రోలి సుఖింతురుగాత.

(స శే ష ము

వేదా వదంతి సకలేశ్వర మద్వితీయం
విశ్వాధికం శివ మనంత మజం భవంతమ్
శంభో! భవన్మహదుపాసనతత్త్వరూపం
వక్ష్యంతి తా ఉపనిషద్గిర ఏకకంఠాః 7

సుఖములకు జన్మస్థానమగు నోయీశ్వరా సమస్తవేదములు నిన్నందఱకుఁ బ్రభు వనియు, నీకంటె నధికుఁడు లేఁడనియు, నీవు నాటి లేనివాఁడ వనియు, శుభాకారుఁడవు నాద్యంతరహితుఁడ వనియు ' ఏకో రుద్రో న ద్వితీయాయ తస్థే ' మున్నగు వాక్యములచే నేకకంఠముగాఁ బలుకుచున్నవి. ఉపనిషత్తులు నీయుపాసనాతత్త్వరూపమును జెప్పు చున్నవి.

కించిద్జ్ఞతాకలితజీవ ఇహాణుమాత్రః
సర్వజ్ఞతాం కలయతేఽన్వయమూలభేత్తా
కింవా సృజే జ్జగ దిదం? కిమువా ప్రరక్షేత్?
నోచే ద్ధరేన్ను? హతధీః కిము తస్య శక్యమ్ 8

జీవు డల్పజ్ఞుఁడు. అణుస్వరూపుఁడును. ఇట్టి తాను సర్వజ్ఞుఁడ నని యహంకరించుటచేత పరమార్థవిషయముల నన్వయించుటయందు వాని కపార్థములను గల్పించుచున్నాఁడు. నిజముగ నాతఁడు సర్వజ్ఞుఁడు సర్వశక్తిసంపన్నుఁడు నయ్యోనేని సృష్టిస్థితిసంహారము లతనిచేతిలోనివే గదా? కాని యం దాతఁడు దేనిని నిర్వహింపఁగలుగుచున్నాఁడు? సర్వజ్ఞుఁడ నను అహంకారముచేతను, భ్రాంతిచేతను ఆతనిమనస్సు వినష్టమైనది. అతఁడు దేనిని స్వయముగాఁ జేయ లేఁడు.

కించి త్ప్రసన్నీకృతభూతశక్తిః
సంసాధ్య చైకం ఖలమారణాస్త్రమ్
హా స్తస్థితా నీతి జగంతి మేనే
మోనా వహో మోహవిదగ్ధతాస్య 9

ఒకశాస్త్రజ్ఞుఁడు చిరకాలము పంచభూతముల నుపాసించినాఁడు. వానియనుగ్రహలేశ మతనియందుఁ బ్రవర్తించినది. ఆబలమున నాతఁ

ఘోర ప్రచండమగు మహాశాస్త్రమును సంపాదించినారు. అంతమాత్ర
మున జగత్తు లన్నియు దమయధీనేయనుచు గలవని యాతఁడు విఱ్ఱ
వీగుచున్నాఁడు. ఇతఁ డెంత మోహాంధుఁడు ?

నేఁటి శాస్త్రపరిశోధకులు ఆకాశసముద్రపర్వతగహనాదుల
యందు సాధించిన యంత్రబలసృష్టు లన్నియు పరిమితములు, అసంపూర్ణ
ములును. ఏలయన ఇం దేదేనిశక్తిమాత్రము ప్రకోపించినను వారియంత్ర
ములు పనిచేయవు. అవి ప్రకోపింపకుండఁ జేయుటకుగాని, ప్రకోపించి
నప్పుడు శాంతింపజేయుటకుగాని వారికి శక్యముగాదు. కాఁగా ఆసిద్ధులు
ఆత్మవిధ్వంసకములేగాని విశ్వసుఖదాయకములు గావు. కావున వీరిశక్తి
ప్రకృతిభౌతికసంపదను వినాశపఱచుటకుమాత్రము నుపయోగించును.

కించిత్ప్రసన్నాఖ్యపథా బుధా జగ
జ్జీవేశ్వరానిత్యవివాదనందితాః
ప్రచ్ఛన్నబౌద్ధా ఉత గూఢనాస్తికా
స్సంపాదయం త్యస్య కలేః కృతార్థతామ్ 10

అనంతమగు ప్రకృతిశక్తి నుపాసించి పరిమితములగు శక్తులను
సంపాదించిన శాస్త్రజ్ఞులు విశ్వము తమచేతియందున్నదని భావించి
నట్లుగా ననంతములగు వేదముల నుపాసించి పరిమితములగు నర్థముల
నెఱింగిన కొందఱు పండితులు తాము సర్వజ్ఞుల మనియు, తమకన్న
బ్రహ్మము లేదనియు నహంకారమున జగత్తు, జీవుఁడు, ఈశ్వరుఁడు
అనిత్యులను వాదమున భ్రాంతు లగుచున్నారు. మొదటివారివలన
భౌతికసంపదయే వినష్టమైనది. వీరివలన నాధ్యాత్మికసంపదకూడ నశించు
చున్నది. కావున కలి కృతార్థ మగుచున్నదని తలంపనగును.

భ్రాంతభ్రాంతాః ప్రౌఢతర్కాంధమగ్నాః
బ్రహ్మాస్మ్యన్యాహంకృతా స్స్వల్పవాచా
శబ్దబ్రహ్మద్రోహిణః స్వైరవృత్తాః
కర్మభ్రష్టా స్సర్వత స్సంపతన్తి 11

ఎవ రెన్ని శాస్త్రములఁ బఠించినను ననంతమగు శబ్దబ్రహ్మ మును లక్షించినపుడు వారిజ్ఞానమును, వాక్కులును అల్పములు కాక తప్పవు. కాని కొందఱు అతిప్రౌఢములు, సుదీర్ఘములునగు తర్కముల యందు మునిఁగి విభ్రాంతమనస్కులై తామే పరబ్రహ్మ మనుకొను చున్నారు. తుదకుఁ బరమార్థనిర్ణయమున శబ్దబ్రహ్మస్వరూపములగు నేవేదాదులను ప్రమాణముగ స్వీకరించిరో వానికే యసత్యత్వమును స్థాపించుచున్నారు. పుణ్యాపాపములు శబ్దార్థములయందుఁ గల్పితము లను నిశ్చయమున విశృంఖలవర్తనులు, కర్మవిదూరులు నగుచున్నారు.

సన్యస్త మాసీ న్నను కేశమాత్రం
న చిత్తసంగో నచ వార్థలోభః
తుర్యాశ్రమే గేహిన ఏవ కేచిత్
గార్హస్థ్యకే స్వామిన ఏవ కేచిత్ 12

భోగములనుండి మనస్సంబంధమును, ధనమున లోభమును, విడువకయే కేశమాత్రపరిత్యాగమున స్వాము లగుచున్నారు. కొందఱు సన్యాసాశ్రమమందుగూడ గృహస్థులవలె సంచరించుచున్నారు కొందఱు గృహస్థు లయ్యును స్వాములవలె నటించుచున్నారు.

నూనం స్వ మాస్మరతి బ్రహ్మవిదాం వరిష్ఠం
బ్రహ్మైవ కిన్ను బహునా స బుధాభిమానీ
సంకల్పతః కిము హరే న్న తమ స్సమస్తం
నేచ్ఛాస్తి శక్తి రపివాను ఘృణా ను బుద్ధిః 13

జీవుఁడు తన్ను బ్రహ్మవేత్తలలో గొప్పవానిఁగాఁ దలఁచుఁగాక! ఒకవేళఁ దాను నిజముగా వానితలఁచినట్లుగా నతనిని బ్రహ్మమే యని యందము. అగుచోఁ దనసంకల్పమాత్రమునఁ బ్రపంచమునందలి యజ్ఞా నమునెల్ల నొక్కమాఱుగా హరింపరాదా? అట్టి యిచ్ఛగాని, శక్తి గాని, దయగాని, బుద్ధిగాని సర్వగుణసంపన్నమగు నాబ్రహ్మమునకులేవా

రేపా మభూ న్నను విడంబనమాత్ర మేవ
న స్త్రీ పుమాన్, న జననీ, న పితా, కళత్రమ్

వచ స్తు దేవాత్ర పురా మతాని
స్థిరీకరోతి ప్రథితాని తాని
మతే ర్విలాసేన మతం భవే చ్చేత్
తతః ప్లవంగేంద్రతులాకథాః స్యుః 17

ప్రతిమతమునందును ద్వైత, విశిష్టాద్వైత, కేవలాద్వైతము లను మూఁడవస్థలు కలవను పయివాక్యము పురాతనములగు మతములు ప్రసిద్ధములు చాల కలవని నిరూపించుచున్నది. మఱియు, మతియొక్క విలాసమువలన మతములు పుట్టుచున్న వనుట ప్రమాణము గాదు. అయ్యో నేని మతికిఁ గోతితో సామ్యము కలదుగాన మతములన్నియుఁ గపిచేష్టితములవలె నసంబద్ధములు, నప్రమాణములు, ప్రమాదకరములుగూడా గావలసివచ్చును.

మిథ్యామయం జగ దిదం సకలం చ యేషాం
తేషాం గిరః కథ మహో న భవం త్యమిథ్యాః
ప్రశ్నోత్తరే భవతి ఏవ యతోను మిథ్యే
యేషాం మతే తదను తైః సహ కో వివాదః? 18

ప్రపంచ మంతయును మిథ్యయని కొంద అనుచున్నారు. అగుచో వారిపలుకులు సిద్ధాంతములా? ఏల మిథ్యలు కావు? వారిమతము ననుసరించి వా రిచ్చు ప్రశ్నములు. సమాధానములుగూడ మిథ్యలే యగుచున్నవి. కావున వారితో మన కెట్టి వివాదమును లేదు.

భిన్నత్వ మే వానువదంతి కేచిత్
జీవస్య దేవస్య పృథక్ప్రసిద్ధమ్
శివా త్పరం వస్తు న కించ నేతి
శ్రుతే ర్విరుద్ధం త దపాస్త మేవ 19

కొందఱు జీవేశ్వరులు కేవలము భిన్ను లని పలుకుచున్నారు. కాని శివునికంటె నన్యము లేదను శ్రుతివాక్యమున కది విరుద్ధముగాన యీమతము పరిగ్రాహ్యము కానేరదు. ముక్తిదశయందును జీవేశ్వరులు

శివుని పరివారములోనివారే కావున ఆయామతముల సారాంశమును శివ పరాత్పరత్వసిద్ధాంతమును నిరూపించుచున్నది.

ఏవం విదిత్వా పరమాత్మరూపం
శివం త్వదీయం న భజంతి ముగ్ధాః
కలేః కృతార్థత్వవిషాతిదిగ్ధాః
వితండవాదే ష్వధికం విదగ్ధాః 23

కలిప్రాబల్యమున మొండివాదములం దాఱితేఱిన కొందఱు బుద్ధిమంతులు ఇట్టి నీపరమశివస్వరూపము నెఱింగియు నిన్ను భజింపకున్నారు.

అద్వైతఘోరకలితాః కలితావిశిష్టాః
శైవే పురాణనిచయేఽన్యథ నైష్ణవేపి
తత్తత్ స్థలేషు కవనాని నిచిక్షిపుస్తే
స్వీయాని తాని విషమాణ్యతిగర్హితాని 24

కలిసంపన్నులగు కేవలాద్వయవాదులు కొందఱు శివపురాణములయందును, విష్ణుపురాణములయందును నాయాతావులందుఁ గల సందర్భవిరోధములను, ఔచితీభంగములను ( వారి కన్నియు మిధ్యలే కనుక కావలయు ) పాటింపక గర్హితములగు తమతమ కవనములను, గల్పనములను నందుఁ జేర్చిరి.

పితామహ స్తస్య పితా బభూవతుః
శిరఃపదం ద్రష్టు మహో న తేలమ్
ప్రకల్పితం తత్ర నచేత్కి-మేతత్
భస్మాసురః శ్రేష్ఠతమో ను తాభ్యామ్ 25

విష్ణుబ్రహ్మలు తమతమ యధికతలకొఱకు వివదించుచుండఁగా వారినడుమ పరమశివుఁడు జ్యోతిర్లింగస్వరూపమున నావిర్భవించి ' నా శిరఃపదములను జూచివచ్చినవారు మీయిరువురిలో గొప్ప ' యగునని పలికెను. విధి గర్వమున హంసయై శిరస్సు గాంచ నేఁగి తెలిసికొనలేక మొగలిపూవును, గామధేనువు నన్నృత మాడించి తనతోబాటు వానికిని

గీతాసు గీతాస్వపి భారతే పురా
వేదాంతచర్చా న కృతాఽత్ర చేతి
వ్యాసః పున ర్భాగవతం సమబ్రవీ
దితి ధ్రువం వృత్త మిదం భవే త్కిమ్ 26

అయిదవవేదమగు భారతసంహితను రచియించిన వ్యాసభట్టారకు లందు సకలోపనిషత్తులకు సారమగు గీతాశాస్త్రమును నిబంధించిరి. ప్రసిద్ధులగు మతాచార్యులు ఉపనిషత్తులకు బ్రహ్మసూత్రములకుంబలె నీగీతలకును భాష్యములను రచించిరి. మఱియు మహాభారతమున సనత్కుమారసంహితాది వేదాంతనిబోధకగ్రంధములును వానికి నాచార్యపురుషుల వ్యాఖ్యలును వెలసియున్నవి.

ఇట్టిచోఁ ద్రికాలములయందును సర్వజగత్పరి పూజ్యములగు గీతలను మహాభారతమున నిబంధించియును, మహాభారతమున వేదాంతవిషయములను జెప్పలేదను విచారమున వ్యాసభగవానుఁడు భాగవతమును రచింపఁబూనెనని తదవతారికయందుఁ గనిపించుట కొంత వింతగాఁ దోఁపకతప్పదు. కాని అయ్యది భాగవతప్రశస్తిని నిరూపించునదిగాఁ దలంచి సమాధానపడవచ్చును.

కాని భారతభాగవతములను బరికించుచోఁదత్కర్తలు భిన్నులను విషయమే యంతటను గోచరించును. ఇందులకుఁ బెక్కు నిదర్శనములు గలవు. పెక్కు భారతకథాఘట్టములు భాగవతమున మిక్కిలి వికృతముగాఁ జిత్రింపఁబడినవి. దేవీభాగవతము వ్యాసకృత మనియు, నిది కాదనియుఁ బండితలోకమున నొక యభిప్రాయము నిరూఢమైయున్నది. క్రీ. వె. 12, 13 శతాబ్దులలో దేవగిరిని బాలించిన యాదవప్రభువుల యాస్థానకవియగు బోపదేవుఁ డను మహారాష్ట్రకవి భాగవతమును రచించెనను కింవదంతి కలదనియు, నించుమించుగా నా కాలముననే జైమినిముని రచించినట్లుగా శ్రీకృష్ణ ప్రాధాన్యమును నిరూపించుచు దక్షిణాపథరాజన్యుల పరాక్రమమును బ్రకటింప జైమినిభారతము

నానాటిరాజన్యుల యాదరము నందిన విద్వత్కవి యెవ్వరేనొకఁడు రచించి యుండునని యుఁ బరిశోధకులు తలంచుచున్నారు. (చూడుఁడు. జీర్ణవిజయనగర వాఙ్మయచరిత్రము, మొదటిభాగము– శ్రీమాన్ శ్రీ అచ్యుతరావుగారు.)

తదేవ సత్యం యదివా భవేచ్చేత్
విశిష్ట మద్వైత మతః ప్రసిద్ధమ్
తదద్వయం కేవల మంధ్రవాఙ్మయే
చకార స శ్రీకవి పోతరాజః 27

ఒకవేళ నిజముగా నట్టివిధానముగానే వ్యాసులు భాగవతమును రచించిరన్నను అందు విశిష్టాద్వైతసిద్ధాంతమే ప్రతిపాదింపఁబడినదనియుఁ, దెనుఁగునఁ బోతనామాత్యుఁడు దానిని కేవలాద్వైతపరముగా ననువదించె ననియుఁ గొందఱు పండితులు తలంచుచున్నారు. కేవలము తలంచుటయె కాదు, బహువిధప్రమాణములతో భాగవతమును విశిష్టాద్వైత సిద్ధాంతపరముగా ననువదించియున్నారు. మఱియు విశిష్టాద్వైతసిద్ధాంత నిరూపకమగు శ్రీమద్రామాయణమును గొందఱు కేవలాద్వైత సిద్ధాంతపరముగా ననువదించుటయుఁ గలదు.

పురా పురాణప్రథితా స్సురాఽసురాః
అపక్షపాతం హర ! శిక్షితాః ఖలు
ప్రభూతతద్భ్రాంతికశక్తి జృంభణాః
నిరీశ్వరా ఈశ్వరమానిన స్తథా 28

మనము ప్రత్యక్షముగాఁ జూచు వృత్తాంతములే కొంత ప్రాఁతపడినచోఁ జరిత్రములనియుఁ, గథ లనియు, గాథ లనియు వాడఁబడుచు నింకను బ్రాఁతపడినవి ఇతిహాసములు, పురాణములు నని పేర్కొనఁబడుచున్నవి.

పురాఽపి నవ్యమ్ – పురాణమ్ మిక్కిలి ప్రాచీనమయ్యును నూతనమైనది పురాణము. చరిత్ర మనఁగా జరిగిన విషయములను

తెలిసికొనుటకు సాధనమైనది. చరధాతువునకు ఇత్రచ్ ప్రత్యయము చేరి "చరిత్రమ్" అను రూప మేర్పడినది. సంస్కృతమున గమనార్థక ధాతువులకు జ్ఞానార్థకతకూడఁ గలదు ఇతి + ఇహ + ఆస = ఇతీహాసము, లేక ఇతి + హ + ఆస = ఇతిహాసము ఇది ఇటు లుండె డివి అను నర్థములు పురాణచరిత్రేతిహాసపదముల కభియుక్తులు వచింతురు. కాఁగా నప్పటికి గ్రంథస్థములు గాక పెద్దలవలనఁ బరంపరగాఁ జెప్పఁబడెడి విషయములే కథలు గాథలు నని తలంపనగును.

ఇట్టి పురాణాదులందు భౌతికసంపదచేగాని, జ్ఞానసంపదచేగాని గర్వించి యున్మత్తచరిత్రులగు దేవతలుగాని, రాక్షసులుగాని నిష్పక్షపాతముగా శివునిచే శిక్షింపఁబడి రని స్పష్టమగుచున్నది. ఇందులకుఁ త్రిపురాసురసంహారము, దారుకావనవిహారము మున్నగు నుదాహరణములు పెక్కులు గలవు. మఱియు విష్ణుని దశావతారములలో నైదింటిని శివుఁ డనుగ్రహించె ననియు, నైదింటిని నిగ్రహించి యనుగ్రహించె ననియు నందుఁ గన్పించును.

రాక్షసులందఱు దుర్మార్గులు, దేవతల్లెల్లను సన్మార్గులు నని చెప్పుటకు వలనుపడను. ధర్మస్వరూపుఁడు మహాదాతయు నగు బలి చక్రవర్తి యైశ్వర్యమును గపటవామనరూపమున నేల హరింపవలసివచ్చినది? గయాసురుని స్మరింపనిదే పితృదేవతల కూర్ధ్వగతి లేదుగదా ?

సముద్రమునఁ బుట్టిన సురను (మద్యమును) విసర్జించుటచే రాక్షసులు "అసురు" లైరనియు, దానిని స్వీకరించి దేవతలు సురలైరనియు రామాయణమునఁ గలదు. కాని అసురు లనఁగా ప్రాణములను దీయువారను వ్యుత్పత్తి నేఁడు రూఢమైనది. దుర్మార్గవర్తను లెవ్వరైనను శిక్షార్హులే యగుదురు. కావున నట్టి దనుజులతో పాటుగా దేవతలును శివునిచే శిక్షితులైనట్లు శివపురాణములందుఁ గలదు.

ఇందలి పరమార్థమును గ్రహింపక కొందఱు స్వమతాభిమాన దుర్విదగ్ధులు శివపురాణములను తామసము లనిరి. కొందఱు శివాప

తన మహాత్మ్యాతిశయమును [illegible] వర్ణించి మహేశ్వ
రుడును లేక యున్న త్రిమూర్తులు [illegible] నయుక్తమగు
నన్ను సేవించుటవలన వారికి సిద్ధులు [illegible] వశమగును వారి
[illegible] జగత్ప్రసిద్ధముగా తెలిసి యున్నారు, [illegible] కర్తృత్వకరణములు
ధరించి సులభముక్తిఁ [illegible] సంపాదించుచు
స్థావరజంగమస్వభావములు సర్వైశ్వర్యమును [illegible] వలన
హాయిఁ దను సార్థకనామమును వహించు మహేశ్వరుని నమస్కరించు
చున్నాను.

అణిమాదిభూతిమహిమాశిఖాంకితా
మహేశా వసంతి భువనే హి కోటిశః
హర ఏక ఈశో మహితా వదంతి తే
హర మేవ యామి శరణం కృపాకరమ్

అణిమము, మహిమము, గరిమము, లఘిమము, ప్రాప్తి, ప్రాకా
మ్యము, ఈశత్వము వశిత్వ మనెడి యష్టసిద్ధులను గాంచిన మహితులు
భువనములందుఁ గోట్లకొలఁది కలరు. పదిమందిలో సిద్ధిమంతు డొక
డున్న వానిని గౌరవింతురు. కాని యాపదుగురును సిద్ధిమంతు లగుచో
నాగౌరవము సామాన్యమే యగును. ఇట్టిచో నట్టి సిద్ధులవలన సమ
రత్వమును గాంచిన దేవత లెల్ల హరు నొక్కనినే యీశుఁ డని కీర్తిం
చుచున్నారు. ఏల యన హరప్రసాదముననే వారి కాకీర్తులు లభించు
టయే మూలము. హరత్వమును, ఈశత్వమును శివునియందే సిద్ధించినవి
'ఈశ ఐశ్వర్యే' అను ధాతువువలన నీశపద మేర్పడినది. అట్టి యైశ్వ
ర్యము ననుగ్రహించుట శివునకు స్వభావము. కావున నీశ్వరపద మతని
యందు రూఢ మైనది.

మహేశ్వర స్త్ర్యంబక ఏవ నాపరః

అనుచోఁ గాళిదాసమహాకవి యీయర్థమును సూచించినాఁడు. కావున
నట్టి కృపానిలయుఁడగు పరమశివుని నేను శరణు చొచ్చెదను.

అణిమా విభాతి మహిమా విరాజతే
లఘిమా తథైవ గరిమా విభాసతే
హ్రియమాణజీవసరిమా న రక్ష్యతే
ప్రాణిమాదిభి శ్చ తృణమాత్రశక్తిభిః

అణిమాదిశక్తు లెన్ని యున్నను మరణసమయము సమీపించి నప్పు డవి గడ్డిపరకలవలె దుర్బలములై యగుచున్నవి. కాని పోవుచున్న ప్రాణవాయువులను రక్షింపలేవు. అనగా దేవత లమరపదవాచ్యు లైనను ప్రళయకాలమున బ్రహ్మాదులకును మరణము కలదు. కాగా వారి యమరత్వము ప్రధానవాద్యపేక్షచే సిద్ధించినదిగాని నిత్యమైనది గాదు నిత్యమగు నమరత్వము పరమశివునందే కలదు. కావున నితర దేవత లొసంగు ఫలములు వారివలెనే యనిత్యములు. ఈయర్థమునే యాది శంకరులు శివానందలహరిలో నిట్లు చెప్పిరి.

సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదా
న మన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృతఫలమ్
హరిబ్రహ్మాదీనా మపి నికటభాజా మసులభం
చిరం యాచే శంభో! శివ! తవ పదాంభోజభజనమ్

క్షుద్రఫలము లొసంగు వేల్పులు వేలకొలందిగఁ గలరు. కలయుం డైనను వారి ననుసరించుటనుగాని, వా రిచ్చు ఫలములనుగాని నేను కోరను. హరి, బ్రహ్మ మున్నగువారికిఁగూడ నందరాని నీపాదభజనమునే నేను యాచింతును.

భరిమా నితాంతభర మాదధాతి తే
ద్రఢిమా ప్రయాతి సకలేంద్రియే ష్వపి
లగుడం బిభర్తి చ వపు శ్చ కంపతే
శరణం ప్రజస్వ హర మీశ్వరం పరమ్

ఓజీవుఁడా! ఈసంసారము నీకు మిక్కిలి భారమును గలిగించుచున్నది. అవయవము లన్నియు బలము సడలి శిథిలము లగుచున్నవి.

శివునివలననే సంసారబంధము తొలఁగుచున్నది. కావున నట్టి యర్థమును బోధించుచు అభవపదమును హరునకు విఖ్యాతమును, సార్థకమును నగుచున్నదని భావము.

భవుఁ డయినవాఁ డభవుఁడు కాఁడు. అభవుఁడు భవుఁడు కాఁడు కాని యీరెండు పదములు నీశ్వరునియందు వర్తించుచున్నవి. ఇందు విరోధాభాసమను నలంకారము ధ్వనించుచున్నది. నిరుక్తి యను నలంకారమును గలదు.

'భూ సత్తాయామ్' అనుదానివలన భూధాతువు సత్తార్థమున వర్తించునని వైయాకరణులు చెప్పిరి. 'సత్తా' యన నేమి? సతో భావః సత్తా. సత్ అను పదము మంచిని, జ్ఞానమును, ఆత్మను, ఉనికిని, ఈశ్వరుని బోధించుచున్నది. అనఁగా భూధాతు వీయర్థములం దెల్లఁ బ్రవర్తించునని స్పష్ట మగుచున్నది.

సమస్త శబ్దములును ధాతువులనుండి పుట్టినవే యని కొందఱి మతము. ఒకే ధాతువునకుఁ బ్రయోగానుభవములఁబట్టి యనేకార్థముల నంగీకరింపక తప్పలేదు. ఉపసర్గల బలమున, వివిధార్థకములగు ప్రత్యయముల సంబంధమున నాయా ధాతువుల కాయా యర్థవిశేషములు ప్రకటితము లగుచున్నవి.

ఉదాహరణము :— హృఞ్ హరణే అనుదానివలన హృఞ్ అను ధాతువు హరించుట అను నర్థమునఁ బ్రవర్తించును. ఈధాతువు నుండి హరః, హారః, హృతిః, హరణమ్ మున్నగు కృదంతరూపము లేర్పడుచున్నవి. ఒకేధాతువునుండి పుట్టినను ఇవి భిన్నార్థములయందు వ్యవహృతము లగుచున్నవి. ఇందు హార అనుదానికి ఉప మున్నగు నుపసర్గములను చేర్చినచో ఉపహారము, వ్యవహారము, సంహారము, విహారము, ప్రతిహారము, ఆహా పరిహారము,రము, ప్రహారము ఆహారము మొదలగు వివిధార్థములను బోధించు వివిధశబ్దము లేర్పడుచున్నవి

ఇటులనే ఇణ్ గతౌ అను ధాతువునుండి ప్రత్యయము, వ్యత్య యము, ఉపాయము, అపాయము, అన్వయము. ఉపాయనము మున్నగు పెక్కురూపము లేర్పడుచున్నవి

ఇట్లు ధాతువు [illegible] విశేషార్థముల బోధించు టకే యుపసర్గములు, ప్రత్యయము లను [illegible] విశే షము [illegible]. సర్గ [illegible] సృష్టియే గదా! [illegible] నివి ధాత్వర్థమును దానిననుసరించి జేసి సృష్టించుచున్నవి [illegible] మూల ధాతువున లేనియర్థము నివి సృష్టింపనేరవుగదా! ధాతువునకు ప్రత్య యములు చేరినప్పు డీయుపసర్గము లేమియుం జేయనేరవుగదా! ప్రత్యయము వానంగా నమిక లేక బోధము కాంగా మూలధాతువునందు నిగూఢమగు నర్థమును స్వతంత్రప్రయోగము లేని ప్రత్యయము దాని యంతమునం జేరి యర్థావగతిని గలిగించుచున్నది ప్రత్యయమువలెం బ్రకృతియు స్వతంత్రప్రయోగము లేనిదే. అయినను బ్రకృతికి మూల ధాతువునకుం బ్రత్యయము విధింపంబడుచున్నదిగాని ప్రత్యయమునకుం బ్రకృతి విధింపంబడుటలేదు. కావునం బ్రకృతికిం బ్రత్యయముకంటెం బ్రాధాన్యము గలదు. నిజమున కీప్రత్యయము లనంబడు అచ్ ఘఞ్, క్తిన్, ల్యుట్, అను వానిలోని అకారాదులుగూడ ధాతునిష్పన్న ములే. కాని విశ్వమెల్లం గ్రియాత్మక మను భావనాబలమున సర్వ శబ్దములును గ్రియలనుండి పుట్టినవే యను పండితులునయిత మీప్రత్య యముల వ్యుత్పత్తిని నిరూపింపనేరక వానికిం బ్రత్యయము లనియే సంకేత మిడిరి, అటులనే వ్యవహరించిరి. అంతకంటె మార్గమును లేదు. ప్రకృతి (మూలధాతువు) శివస్వరూపము. ప్రత్యయము శక్తిస్వరూపము. ప్రత్యములందుంగూడ నిగూఢము నత్యంతావిభాజ్య మునై ప్రకృతిస్వరూప మున్నది. ఇవి రెండు నవిభాజ్యములు, నిత్య ములు. కావుననే కాళిదాసమహాకవి

వాగార్థా వివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ.

అని శివస్తుతి చేసినాఁడు. సీతారాముల దాంపత్యమును "ప్రకృతి ప్రత్యయయోగసన్నిభమ్" అని నిర్వచించినాఁడు. ఏయి శ్లోకమున సంపృక్తపదము గమనార్హము, అపృథక్సంబద్ధములగు ప్రకృతి ప్రత్యయముల యోగమున సిద్ధించిన శబ్దము బ్రహ్మస్వరూపము. కావుననే భవభూతి "శబ్ద బ్రహ్మవిదః కవేః పరిణత ప్రజ్ఞస్య వాణీ మిమామ్" అనినాఁడు.

ప్రకృతినుండి ప్రత్యయమును విడదీయరానియట్లు పరబ్రహ్మమగు శివునినుండి శక్తిని విడఁదీయరాదు. ప్రకృతిసంబంధమునఁ బ్రత్యయము నిత్యమయినట్లు పరబ్రహ్మ సంబంధమున శక్తియు నిత్యురాలు.

ప్రత్యయవ్యుత్పత్తి దుర్నిరూప మగుటచేఁ గొందఱు ప్రత్యయస్వరూపయగు శక్తి ననంతమూర్తిగా నుపాసించి శాక్తేయు లగుచున్నారు. శక్తిస్వరూపమే జగత్తు. ఆశక్తియందు శివుఁడు గలఁడు గావున జగత్తు శివశక్త్యాత్మకమైనది. కావున జగదారాధనమే శివారాధన మగుచున్నది. ఇట్టి జగమునకు మిథ్యాత్వము నారోపించుట బ్రహ్మమునకు మిథ్యాత్వము నారోపించుటయే యగుచున్నది. ఈ యారోపించునది యుపసర్గస్వరూపుఁడగు జీవుఁడు. ఈయుపసర్గము గూడఁ బ్రత్యయమువలెఁ వ్యుత్పత్తిని నిరూపింపరానిదే. ఇందును నిగూఢములై ప్రకృతి ప్రత్యయములు దుర్నిరూపములై యున్నవి. కావున జీవుఁడును నిత్యుఁడే యనక తప్పదు.

ఏమయి మిట్లుండ జగత్తును మిథ్య యనుట శివశక్తులను మిథ్య యనుటయే. ఇంతకన్న సర్వశూన్యవాదమునఁగల విశేష మేమి? కాఁగా "అహం బ్రహ్మాస్మి" మున్నగు శ్రుతివాక్యములు జీవుఁ డుపసర్గమువలె నస్వతంత్రుఁ డనియు, నట్లయ్యు నది దుర్నిరూపములై యవిభాజ్యములై తనయందున్న ప్రకృతిప్రత్యయముల సంబంధమువలన గతిసంజ్ఞ నంది క్రియాదులగు పదములతో వ్యవహరింపఁబడుచున్నట్లుగా నితఁడును శివశక్తిక్రియారూపమగు జగత్సంబంధమున నన్వర్థమగు జీవసంజ్ఞ నంది

ప్రవర్తించుచున్నాఁ డని తెలుపుచున్న వేదాని జగదాధారుని పరమాత్మత్వమును బోధించుట లేదని యెఱుంగునది.

న భవ తీతి అభవః అనఁగా పుట్టుక లేనివాఁడు శంకరుఁడు. శివునకు అభవుఁ డని పేరు ప్రసిద్ధమైనది. ఆ భవుఁడు పుట్టుక లేకుండుటకు అనఁగా మోక్షము లభించుటకుఁ బరమశివునే సేవింపవలయును. జననమరణాదులతోఁ గూడిన యితర దేవతలు ముక్తి నొసఁగజాలరు. ఈ విషయమునే శంకరాచార్యులవారు శివానందలహరిలో

> జననమృతియుతానాం సేవయా దేవతానాం
> న భవతి సుఖలేశ స్సంశయో నాస్తి తత్ర
> అజర మమర రూపం సాంబ మీశం భజన్తే
> య ఇహ పరమసౌఖ్యా స్తే హి ధన్యా లభన్తే
>
> సహస్రం వర్తన్తే జగతి విబుధాః క్షుద్రఫలదా
> న మన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృతఫలమ్
> హరిబ్రహ్మాదీనా మపి నికటభాజా మసులభం
> చిరం యాచే శంభో శివ తవ పదాంభోజభజనమ్.

అనఁగాఁ జావుపుట్టుకలతో మునిఁగి తేలుచున్న యీ దేవతలను సేవించుటవలన లేశమును ఫలము లేదు. జరామరణాదులు లేనివాఁడై సమస్తమును రక్షించుటకు శిక్షించుటకు ప్రభువై పార్వతీసహితుఁడై సాటిలేని పరమశివుని సేవించు ధన్యాత్ములే మోక్షఫలము నందఁ గలుగుచున్నారు.

క్షుద్రములగు ఫలముల నిచ్చు వేల్పులు వేలకొలఁదిగఁ గలరు. కలలోఁగూడ నాకు వారిసేవ యక్కఱలేదు. వారిచ్చు ఫలములును వలదు. ఏమి కావలె నన్నచో — విష్ణువు బ్రహ్మ మున్నగు సమస్త దేవతలును నీసన్నిధియం దుండియును పొందలేకపోవుచున్న నీపాదాంభోజసేవనమునే నేను యాచింతును. దానినే ఆ శివభక్తినే నా కనుగ్రహింపుము అని భక్తిరసగద్గదకంఠమున నాక్రోశించినారు.

భవ మనఁగా సంసారము, దానిబంధమును. అవి యే దేవుని వలన నశించుచున్నవో యతఁడు అభవుఁడు. "న భవతి యస్మాత్ ఇత్యభవః" అనఁగా శివసంసేవనమున భవబంధములు నశించును, ముక్తియును గలుగును.

కష్టములు నశించుట, సుఖములు కలుగుట రెండును రెండు ఫలములు. కష్టము పోవుటకూడ యొకసుఖమే యైనను అది పోయినంతమాత్రముననే సుఖము కలుగదు. అటులనే సంసారబంధము పోయినంతమాత్రమున ముక్తి లభింపదు.

పరమశివుని భజించుటవలన సంసారబంధములు పోవుట, ముక్తి కలుగుట రెండును సిద్ధించును.

స్వపాషండత్వదౌర్భాగ్య మజానన్ శివసేవకాన్
బ్రూతే సుధీర్బ్రువః కశ్చిత్ పాషండాన్ సర్వలింగినః

తనయందుఁగల పాషండత్వ మనెడి దౌర్భాగ్యమును గుర్తింపక నేనే పండితుఁడ నను నహంకారముచే నొకఁడు శివభక్తులనుగూర్చి లింగధారు లందఱును పాషండు లని పలుకుచున్నాఁడు.

పాషండు లనఁగా వేదబాహ్యులు బౌద్ధులు, కాపాలికులు మున్నగువారు. అనఁగా వైదికమతమును విసర్జించి ప్రవర్తించువారు. కాని కొందఱు నామలింగానుశాసనమందలి "పాషండా స్సర్వలింగినః" అను దాని నాధారము చేసికొని లింగధారులందఱు పాషండు లని యధిక్షేపించుచున్నారు.

కొందఱు సర్వమును లింగమయముగా జూచువారు పాషండు లని యనుచున్నారు. కాని యమరమునందు "సర్వలింగినః" అనుదానికి "బౌద్ధులు, కాపాలికులు" అనియే వ్రాసియున్నది.

పరిశీలింపఁగా "సర్వలింగినః" అనుపదమునకు అనేక చిహ్నములు గలవారు అనఁగా "ఎవనినో యొకనినే దేవునిగా నమ్మి భజింపక పెక్కురు దేవతల చిహ్నములను ధరించువారు" అను నర్థము ప్రస్ఫుటమగుచున్నది.

అనఁగా శివభక్తులు శివచిహ్నములను, విష్ణుభక్తులు విష్ణుచిహ్నములను ధరింతురు. ఏల యన నిం కొకరికి శివుఁడే పరాత్పరుఁడనియు మరొకరికి విష్ణువే పరాత్పరుఁ డనియు నమ్మిక కలదు. ఇతరచిహ్నములందు ద్వేషము లేకున్నను వానిని ధరింపరు. అట్లు ధరించుట మనశ్చాంచల్యమును సూచించును. దృఢవ్రతు లట్లు పెక్కు చిహ్నములు ధరింపరు. కాని స్వేతరములను ద్వేషింపరు. అట్టి నిశ్చయజ్ఞానము లేని వారు, శివ, శక్తి, విష్ణు సూర్యాది చిహ్నములనెల్ల ధరించి మనస్సు నేమను నిలుపలేక భ్రమింతురు. అట్టివారే పాషండు లనఁబడుదురు.

ఎవ్వరును దమమతచిహ్నములను విసర్జింపరాదు. ఇతరమతచిహ్నములను ద్వేషింపరాదు. వానియం దెంత సమాదర మున్నను వానిని ధరించుట దోషమే యగును. కావుననే 'స్వధర్మే నిధనం శ్రేయః' అని పెద్దలు చెప్పిరి.

పేరులుగూడ చిహ్నములే. ఒకరిపేరు నింకొకరు పెట్టుకొనరాదు. తొలుతఁ దనపెద్దలు తనకుఁ బెట్టినపేరు విడువరాదు. ఒకవేళ మార్చికొనవలసివచ్చుచో నందు మొదటిపేరును జేర్చుకొనరాదు. లౌకికధర్మమునుబట్టి రెండుపేరులతో వ్యవహరించువారివలనఁ జాల ప్రమాదములు సంభవించును. కావున వాఁడే వీఁడు అను దృఢజ్ఞానము కొఱకు అనఁగా నాతఁడు లోకమును వంచింపకుండుటకొఱకు రెండు పేరులతోఁ గలిపియే వ్యవహరింపఁబడును. ఇత్యాది లౌకికవిషయము. అందునను ప్రభుత్వసమక్షమునఁ దన మొదటిపేరు చూపుమాపుకొని రెండవపేరును దగినన్ని యుపపత్తులతో ధ్రువపఱచుకొనుటయే ఉత్తమ మార్గము.

సన్న్యాసమును స్వీకరించినవారు తమపూర్వాశ్రమమునుగాని, యప్పటిపేరునుగాని తలంపరాదు. అట్లు తలంచినవారు పతితు లగుదురు. సనాతను లగువారు దీనిని పాటింతురు. వారు మర్యాదోల్లంఘనము చేయరు. ఎక్కడనైనను సంసారులు సన్న్యాసాశ్రమము స్వీకరించినవారిపేరును, సన్న్యాసులు సంసారుల పేరులును ధరింపరు. అట్టిచో

రెండుపేరులను గలిపి యొక్కరే పెట్టికొన్నచో వారు హాస్యాస్పదు లగుదురు. వారిని వెఱ్ఱివాఁ డందురు.

సన్న్యాసమునకుఁ బూర్వ మొకజన్మము, తరువాత నింకొక జన్మము. తాను దత్తపుత్త్రుఁ డయ్యును బూర్వనామమును ధరించుట వానికిఁ బూర్వాశ్రమమందలి పేరును విడుచుటకుఁగూడ వైరాగ్యము పుట్టలేదని సూచించును. ఇట్టివా రుత్తమయోగీంద్రులపేరులను బూర్వ నామములతోఁ గలిపి వ్యవహరించుటతో నాపదమునకుఁ గళంకము వచ్చును. అనఁగా వీరు రెండు దోషములు చేసినవారును, రెంటికిఁ జెడినవారును ననియే స్పష్ట మగును.

ఇట్టి యాచారము పూర్వగురువులందుఁ గానరాదు. కావునఁ బూర్వగురుమార్గమును బరిత్యజించిన మహాపుణ్యముగూడ వీరికి లభించును. కావున వీరుగూడఁ బాపండులే యగుదురు.

పంచు పేరులవలన, బాహ్యచిహ్నములవలన నెట్టిలాభహానులును లే వనవచ్చును. కాని యది యనుభవసిద్ధము గాదు. పవిత్రములగు శబ్దముల నజ్ఞానముచే నవమానింపరాదు.

బాహ్యవేష మంతర్విషయమును సూచించును. అంతస్తత్త్వము నుబట్టియే బాహ్యవేషమేర్పడును. ఇదిసామాన్యము. బాహ్యవేషమును పరిసరమును నంతఃపరిణతికిఁ గారణములు, ప్రబోధకములు నగుచున్నవి కనుక సనూచానములగు బాహ్యవేషముల నుజ్జగించుట వివేకకృత్యము కాఁజాలదు.

ఏపేరైన నేమి? ఏవేష మైన నేమి? అన్నవారు శోలుతటిని అనఁగా నంతకుము న్నున్నవి మార్చుకొన నేల? అట్లు మార్చుకొనుటయే వారియపరిణతత్వమునకు సూచక మగుచున్నదిగాదా?

> సర్వాణి బాహ్యచిహ్నాని వ్యర్థా నీతి బ్రువన్ సదా
> స చాప్యాత్మైక్యవిజ్ఞానీ న తు త్యజతి విగ్రహమ్

శిఖాయజ్ఞోపవీతములు, లింగము మున్నగున వన్నియు బాహ్య

చిహ్నము లనియు, నాత్మజ్ఞానముకలవాని కివి యున్నియును నిరుపయోగము లనిచెప్పెడి విద్వాంసుడునయిత మాత్మరూఢుడగు తనకు బాహ్యరూపమగు తనశరీరమును దాను విడువలేకున్నాఁడు.

విగ్రహ మనఁగా శరీరము, విరోధము నని యర్థము. కావున సర్వాత్మసిద్ధి నందితిననుకొన్న యాతఁడుగూడ నొకటి వేఱొకటి యను భావమున బద్ధుఁడై యందొకటి తనమతమని యాదరమును, వేఱొకటి విమతమని యందు విరోధమును పాటించుటవలన, నట్టివానికి నిజమగు జ్ఞానసిద్ధి కలుగలేదని భావము.

కతిపయాక్షరవిజ్ఞానచాపల్యవశత్వాగతః
కురుతే నాన్నిష్ఠ వికారేణి యథాశక్త్యధివిగ్రహమ్

"శరీరమాద్యంఖలు ధర్మసాధన" మ్మనునటుల సకల ధర్మప్రథమ సాధనమగు శరీరము తనకు విడువరానిదగుటచేతఁ దనపాండిత్యబలము ననుసరించి, యథాశక్తిగాఁదనకు గలిగిన బ్రహ్మనబోధమునకు సూచకములుగాఁ దన పేరునందును శరీరమునందుమాత్రము కొన్నివికృతులను గల్పించుకొనుచున్నాఁడు.

శ్రుతిస్మృతిప్రసిద్ధాని ధృతాని చ పురాబుధైః
అనూచానాని కిం త్వస్య న ప్రమాణాని తాని హి

వేదములందు స్మృతులయందుఁ బ్రసిద్ధములై - ప్రాచీనులగు పండితులచేఁ జిరకాలముగా ధరింపబడుచున్న యట్టి చిహ్నములు పెక్కులు గలవు. కానియవి యీహ్యయంప్రతిభావిశేషశాలికి నప్రమాణములగుటచే వానిని విసర్జించి క్రొంగొత్త నామముల, వేషములఁ జిహ్నముల ధరించుచున్నాఁడు

నతు వ్యర్థం చిహ్నమేతత్ జ్ఞానినోఽపి కదాచన
అంధహస్తస్థితో దీపః స్వపరార్థకరో న కిమ్

ఎట్టి జ్ఞానికిని బాహ్యచిహ్నము వ్యర్థము కానేరదు. గ్రుడ్డివాని చేతనున్న దీపము ధరించినవానికి, నితరులకును రక్షక మగుటలేదా?

గ్రుడ్డివానిచేతనున్నను, దీప మితరులకు మార్గము చూపించును.

చీకటిలో వచ్చువా రీదీపమునుబట్టి యాతనిని గుర్తించి వానికి హాని కలుగకుండఁ బ్రవర్తింతురు. కావున గ్రుడ్డివానికి దీపము నిరుప యోగమునలెఁ గన్పించియు, పరమార్థమునఁ బరమోపయోగకరమగు చున్నది.

అటులనే యెవ్వరైనఁ దెలియఁగక యొకప్పుడు పరమేశ్వర చిహ్నముల ధరించుట వ్యర్థముగాదు. తప్పక ధరించియే తీరవలయును. ఏల యన

నిత్యం చిత్ప్రథవిజ్ఞానప్రబోధక మిదం యతః
తన్మో హానాదరే త్వస్మిన్ దీపోఽంధ మివ నిర్దహేత్॥

ఈపరమేశ్వరచిహ్న మెల్లప్పుడును జ్ఞానమార్గమును బ్రబోధించు చుండును. కావున దీనియెడల ననాదరము చూపినచో అజాగ్రత్తగా దీపమును ధరించిన యంధునే యాదీపము దహించినట్లు ననాద రము చూపినవారి కపకారకారి యగును.

కాలేఽస్మిన్ సులభా జాతా సర్వ స్యేయం చతుష్టయీ
కవిత్వగానవేదాంతరాజకీయేషు విజ్ఞతా

ఈకాలమునందు బ్రతివానికిని కవిత్వము, సంగీతము, రాజ కీయపరిజ్ఞానము, అధ్యాత్మ విచారణము నను నీనాలుగును మిక్కిలి సులభముల యినవి.

శబ్దబ్రహ్మద్రుమహాః కేచిత్ రసబ్రహ్మచ్ఛిదః పరే
శయ్యాభిదో వృత్తిరీతిభంక్తారః కవయోఽధునా

శబ్దశాస్త్ర సమభ్యాసముగాని, మహాకావ్య సంసేవనముగాని ప్రాక్తన సంస్కార విశేషముగాని లేనికారణమున నపశబ్ద ప్రయోగ ములఁ జేయుచు శబ్దబ్రహ్మద్రోహులగువారును, అపరిణతహృదయావేగ వశంవదులయి "వాక్యం రసాత్మకం కావ్యమ్ రమణీయార్థ ప్రతిపాదక శ్శబ్దః కావ్య" మ్మనుమహా వాక్యముల యభిప్రాయము ననుభవింపకయే

యనను రూపకథాకల్పనాదికముల రసప్రబంధములను విచ్ఛేదము కలి
గించువారును, విషయపదసంఘటనముల కావ్యాంగణమును శయ్యను
చెదరుపడఁ జేయువారును, రసవిరుద్ధపదసంఘటనమును, కావ్యగు
ణానుచితశబ్దకల్పనమును వృత్తిని, రీతిని భంగించువారును నేఁడు కవు
లగుచున్నారు.

రసవిభంజకరాగపరాయణాః
కృతిపదార్థవిదూషకవాచనాః
మధురభావవిరోధిగళస్వనాః
ప్రవిచలం త్యక్షితౌ కిల గాయనాః 46

రసవిరుద్ధములగు రాగముల నాలాపించువారును, పాటలందలి
పదములకు దోషములు కలుగునట్లుగా విఱిచి పాడెడివారును, మధుర
ములగు భావములకు నతివిరుద్ధములగు కంఠస్వరము కలవారును నేఁడు
గాయకు లగుచున్నారు.

న మేధా న శ్రుతం శీలం రాజ్యనీతివిశారదః
స వై య ముపబృంహంతి జనా యే కేచ నాపి వా 47

తెలివిగాని, విశుద్ధస్వభావముగాని యక్కఱలేక యే ప్రజ లెవని
బరివేష్టింతురో యతఁడు రాజ్యనీతివిశారదుఁ డగుచున్నాఁడు.

శ్రియః శ్రేయో గరీయ శ్చ ప్రతిభాయా అపి ధ్రువమ్
క్రియా దాక్ష్యం విశుద్ధత్వం సర్వత్ర సమదర్శనమ్ 48

ప్రతిభకంటె కార్యనిర్వహణదక్షత, పవిత్రత, యన్నింట సమ
భావము ననునవి శ్రేయస్కరములు, ఇష్టములు, గొప్పవియు ననుట
నిశ్చయము.

ఏల యనఁ బ్రతిభ కార్యవిశేషములను సత్వరముగా సాధించి
నను దానివలన నొకానొకప్పుడు సత్వరముగా సర్వప్రళయముగూడ
సంభవింపఁగలదు. ఈప్రతిభ దయాసమన్వితమును, హృదయవిశుద్ధితో
గూడినదియుఁ గాదేని దాని ఫలితములు నేఁటి పాశ్చాత్యుల దారుణా

స్త్రపరిశోధనములవలె నశాంతికరములును, సర్వమానవనాశకములును నగును.

కావున నాలస్యముగాఁ గార్యము సిద్ధించినను బయి మూఁడు గుణములవలనఁ గలిగిన ఫలితమే శాశ్వతమును, సుఖకరమును, శాంతిదాయియు నగుచున్నది.

గుడం మధుర మి త్యుక్తే ర్యథా నానుభవస్థితిః
తథైవ జ్ఞానమాత్రేణ ముక్తి ర్నాచరణం వినా 49

బెల్లము తియ్యగా నుండు ననుకొన్నంతమాత్రమున దానిని దినుటవలనఁ గలిగెడి మధురానుభవము రానేరదు. అటులే ముక్తి కివి సాధనములు, మోక్ష మిట్టిది యనుకొన్నంతమాత్రమున ముక్తిసాధకములగు క్రియల నాచరింపక ముక్తి లభింపనేరదు.

సోహం బ్రహ్మేతి సంలాపో జ్ఞానకంచుకధారిణామ్
కిం ఛిన త్త్యంహసాం బంధం బహుజన్మసు సాధితమ్ 50

యథార్థాచరణము లేక జ్ఞాన మనెడి తొడుగును ధరించినవారు విలాసముగా వాఙ్మాత్రమున 'సోహం బ్రహ్మ' యనెడి మహావాక్యముల నుచ్చరించినంతమాత్రమున వారి బహుజన్మసంపాదితమైన యంహోబంధజ్ఞాపకములగు జననక్రియాదులు నశించి ముక్తి లభియించునా? ఆసంలాపమాత్రమున దుష్కృతకర్మబంధము పోవునా? దాని కట్టిబలము కలదా యని భావము.

యది శబ్దబ్రహ్మణ స్తచ్ఛక్తి రస్తీతి చే త్తథా
శక్తిః కిమివ నాస్త్యత్ర తల్లింగస్య సంభృతేః 51

ఆలాపమాత్రముననే కర్మబంధచ్ఛేదము చేయు శక్తి శబ్దబ్రహ్మమునకుఁ గలదేని పరబ్రహ్మమునకుఁ జిహ్నమగు లింగమును ధరించుటకుఁగూడ నట్టిశక్తి యేల లేదు?

శబ్దోపి లింగ మేవ స్యాత్ తత్పరబ్రహ్మణ స్తతః
భవతో న కదా వ్యర్థే తయోః స్మరణధారణే 52

లింగమువలె శబ్దముకూడ బ్రహ్మమునకు సూచకమాత్రమే గాని సమగ్రముగఁ దత్స్వరూపమును నిరూపింపఁగలది గాదు. కావున నారెంటియొక్క స్మరణధారణములు వ్యర్థము లెన్నటికిని గావు.

ఈశావాస్య మిదం సర్వ మితి సిద్ధాంతసంగతేః
న బ్రహ్మ లింగ మి త్యుక్తిః ప్రమాణపథమాగా 53

ఈసర్వప్రపంచము పరమేశ్వరున కావాసమై ప్రకాశించుచున్నది అను నుపనిషత్సిద్ధాంతము ననుసరించి లింగము బ్రహ్మము కా దను మాట ప్రమాణరహిత మైనది. ' సర్వం ఖ ల్విదం బ్రహ్మ ' అనునది యిట ననుసంధేయము.

జాగ్రతః స్మరత శ్శైవ ఫలదా బ్రహ్మణః స్థితిః
లింగస్య ధారణా కింతు సర్వకాలఫలప్రదా 54

బ్రహ్మస్మరణము జాగరూకుఁడై యప్పుడైనను దాని నాచరించిననే ఫలితము నొసంగును. లింగధారణమో సర్వకాలములందును, సర్వదశలయందును ఫలవంతము. కావున బ్రహ్మస్మరణముకన్న లింగధారణమే గొప్పది.

బహి ర్దంభపరాః కేచి దంత ర్దంభపరాః పరే
ఉభయై రపి హీయంతే లోకాః పుణ్యతమా భృశమ్ 55

కొందఱకు దంభము బాహ్యమునను, కొందర కాంతరమునను నుండును. వీ రిరువురకును బుణ్యలోకములు గలుగవు.

బహిరంతస్స్ఫురద్దంభా యేమిూ పండితమానినః
వ్యత్యస్తాఖిలధర్మాణః సాక్షరా రాక్షసాః ఖలు 56

కొందఱు బాహ్యాభ్యంతరముల రెంటను దంభము కలవారయి పండితుల మను భావమున సర్వధర్మములను తాఱుమాఱు చేయుచుందురు. కావున వీరు రాక్షసు లనఁదగుదురు. సాక్షరా అను పదమును త్రిప్పి చదివిన రాక్షసా అని యగును.

సాక్షా చ్ఛివం మన్యమానా యే కేచన దిగంబరాః
కృష్ణంమన్యా గోకులేనిా చరం త్యక్త్వైతవంచకాః 57

కొందఱు తాము సాక్షాత్తుగా పరశివుల మని భావించుచు దిగంబరులయి గోకులమందలి శ్రీకృష్ణుల మని సంచరించుచు పవిత్రమగు నద్వైతభావమును వంచించి దానికిఁ గళంకము నాపాదించుచున్నారు.

ధారణం ద్వివిధం రూఢం తనునా మనసాపి చ
తదన్యతరపరిహారే ద్వితీయం నిష్ఫలం భవేత్ 58

బాహ్యమున లింగరూపమున నాంతరమున నుపాసనారూపమునఁ బరబ్రహ్మధారణము రెండువిధములఁ బ్రసిద్ధ మయియున్నది. ఇందు ఏదొకదానిని విడచినను రెండును నిష్ఫలములే యగును.

శిష్టాచారో హి బలవాన్ శాస్త్రేభ్య ఇతి నిశ్చితమ్
త దనూచానసంసిద్ధ మహార్యం లింగధారణమ్ 59

శాస్త్రములకంటె శిష్టాచారము బలమైనది. కావునఁ దరతరములనుండి శిష్టపరంపరాయాతమైన లింగధారణ మపరిహార్య మగుచున్నది.

యదభావే మనో నాస్తి నాత్మనః పరివేదనమ్
తాదృక్‌శరీరశుద్ధ్యర్థం సమ్మతం లింగధారణమ్ 60

ఏశరీరము లేనియెడల మనస్సుగాని, యాత్మజ్ఞానముగాని లేదో యట్టిశరీరసంశోధనమునకు లింగధారణము సమ్మత మగుచున్నది.

మంత్రపిండం విధా హ్యేతత్ శరీరం త్రివిధం పునః
ఆచార్యేణ స్వయం దత్తే లింగే కిం నాస్తి వాంఛితమ్ 61

స్థూలసూక్ష్మకారణము లనెడి మూఁడు శరీరములను మంత్రపిండములనుగా నొనర్చి గురువు స్వయముగా నొసంగిన లింగమునందు జతుర్వర్గఫలములు గలవని భావము.

భక్తి రేకా హి సుదృఢా గమయ త్యమృతం పదమ్
య దేవ పరమం స్థానం రసబ్రహ్మనివాసితమ్ 62

అట్టిపరమేశ్వరచిహ్నమగు లింగమునందు సుదృఢమగు భక్తి యొక్కటియే రసబ్రహ్మనివాసమును, సర్వోత్తమమునగు నమృతపదమును జేర్చును.

తీర్త్వా నదీం తతో నావం దహ త్యేవ హి పండితః
శబ్దప్రమాణ మ ప్యేవం యేషాం తేభ్యో నమో నమః 63

నదిని దాటి దానిని దాటుటకు సాధనమగు నావను దగులఁ బెట్టినవాఁడు పండితుఁ డగుచున్నాఁడు. అటులనే భవసంతరణమున శబ్దప్రమాణముగూడ నావవలె నెవరిచేతఁ బరిహరింపఁబడుచున్నదో యట్టివారికి నమస్కారములు.

అనిత్యా యది వా వేదా స్తథా తాసాం శిఖా అపి
కథ మేతే సమర్థంతి నిత్యబ్రహ్మప్రదర్శనే 64

వేదములును, నుపనిషత్తులును ననిత్యములే యగునెడల నవి నిత్యమగు బ్రహ్మను జూపుట కెట్లు సమర్థము లగుచున్నవి?

శివ! శంభో! మహాదేవ! కి మేవం ప్రాణినో మనః
బహుతర్కపయోరాశివీచీపాళిం నయ స్యహో! 65

దేవదేవుఁడవును, సుఖస్థానమును, మంగళస్వరూపుఁడవుననగు నోపరమేశ్వరా! ప్రాణియొక్క మనస్సును నీ వేల యిట్టి తర్కములనెడి సముద్రతరంగములను జేర్చెదవు?

ఇతి ప్రస్తావనా

# శివమహిదర్పణమ్

రచయితా : **మల్లింపల్లి వీరేశ్వరశర్మా**

శంభో! త్వన్మహిమానువర్ణనవిధౌ యత్తం మనో మే ముహుః
రాకావృద్ధపయోనిధి ర్భవతు తే వీక్షాకలారాకయా
జిహ్వా మే తదనంతవైభవరుచిద్యుత్స్ఫూర్తితరంగాకృతి
ర్భావా స్తత్ర చిరత్నరత్నవిభవాకారా భవం త్యేవ హి         1

శంభూ! నీమహిమమును వర్ణింప సన్నద్ధమయిన నామనస్సు నీకటాక్షకళ యనెడి పూర్ణిమచేత పున్నమనాటి పాలసముద్ర మగుఁగాక! నానాలుక యనంతవైభవరుచిరమై మిన్నంచెడి యా సముద్రతరంగాకారమును భజించుఁగాక! అప్పుడు శ్రేష్ఠములగు రత్నములనంటి భావము లందు జనించునుగదా!

‘ అనంత ’అనుచో శేషుఁ డనియును గ్రహింపవలయును.

జ్వలనప్రభవం జలం యథా
  జనయ త్యగ్ని మబింధనం తథా
భవదుత్ప్రభవం పదం భవత్
  పద మన్విష్యతి సర్వతోముఖమ్         2

‘అగ్నే రాపః’ అను శ్రుతివలన నగ్నినుండి జలము పుట్టుచున్నదని తెలియుచున్నది. ఆజలమునుండి విద్యుత్తు ప్రభవించుచున్నది. తేజోరూపుఁడవగు నీవలన జడమయుఁడ నగు ( లడయో రభేదః ) నేను జనించితిని. కాని నాయందు జలములయందు విద్యుత్తువలె నార్పరాని నీతేజము ప్రకాశించుచున్నది.

సమస్తపదములును నీయం దావిర్భవించినవి. కావున నవి సర్వతోముఖములై భావము లనెడి విద్యుత్తులను ప్రసవించి జనకుఁడ వగు

నిన్నే వెదకి పొందుచున్నవి. అటులనే విద్యుత్కిరణములవంటి నా మానసికభావములును వాగూపములై నాతండ్రి వగు నిన్నే వెదకి పొందుచున్నవి.

రసోద్భవా భూమి రసా రసాభిధా
యథా రసం కూపముఖా త్ప్రసూతే
భవత్పదధ్యానసముద్భవా వాక్
మధు ప్రసూతే కవివాంఛితం తథా 3

'అద్భ్యః' పృథివీ అను శ్రుతివలన జలములనుండి భూమి పుట్టినదని తెలియుచున్నది. భూమికి రసా యనియుఁ బేరు గలదు. ఈభూమి కూపములు, బుడగలు మున్నగువానివలన మఱల రసమును బ్రసవించుచున్నది.

అటులనే రసస్వరూపుఁడవగు నీవలన నేను భూస్వరూపుడనై జనించితిని. నీపదధ్యానమువలన నాయందు జనించిన వాక్కు సకల కవివాంఛితమును, మధురూపమునగు రసము నావిష్కరించి నిన్ను జెంది చరితార్థ మగుచున్నది.

భవత్పదధ్యానపయోధిసంభవా
వాచ స్త్వదీయామలవీచిరేఖాః
లీయంత ఏ వాత్ర సమం నదీభిః
త్వదర్చనాసంభృతకౌతుకాయతాః 4

నీపాదధ్యాన మనెడి సముద్రమునందు దానితరంగములవలె నావిర్భవించిన నావాక్కులు సముద్రమునందే జనించి మఱల నందే లీనమగుచున్న నదులవలె నిన్ను సేవింప విజృంభించిన నాకౌతుకములయి సముద్రరూపుఁడవగు నీయందే లీన మగుచున్నవి.

వాక్, నదీ శబ్దములు స్త్రీలింగము లగుటవలన స్త్రీలింగస్వారస్యమున నాడువారికిఁ బుట్టినింటికిఁ బోవుటయందలి కౌతుకాతిశయమును 'జననీ జన్మభూమిశ్చ స్వర్గా దపి గరీయసీ' అనుసూక్తియు నిట ననుసంధేయములు.

న మాతాపితరౌ యస్య మహస స్తదుపాస్మహే।
యచ్చ సర్వజగన్మాతృపితృభావమహోజ్జ్వలమ్ 69

ఏ తేజము సర్వజగత్తులకుఁ దల్లియుఁ, దండ్రియు నై యున్నదో తలిదండ్రులులేని యామహస్సును మే ముపాసించుచున్నారము.

ఒక తేజమును కొందఱు తల్లి యనియుఁ, కొందఱు తండ్రి యనియు ననిరి. ఆమహస్సునే మేము సేవించుచున్నార మని భావము.

ప్రథమా స్తవ శివభక్తాః
సృష్టే స్తదపి చ పృషోదరగణస్థాః
ఉత తే ప్రమథా ఆసన్
ఖలప్రమథనస్వభావపరిపూర్ణాః 70

ఈశ్వరుని సృష్టియందు ప్రమథగణములు మొదటివారు. కాన వారికిఁ బ్రమథు లనుటకుమారుగాఁ బ్రథము లనుపే రుండవలసినది. అది యిటుఁ జమత్కరింపఁబడుచున్నది.

వారు గణములలోనివారుగావున శబ్దశాస్త్రమందలి పృషోదరాదిగణమునందు గణశబ్దసామ్యమునఁ జేరి వర్ణవ్యత్యయాదివికారముల మూలమునఁ బ్రమథు లనిపించుకొనిరా? ఖలులగువారిని మథించుట వారిస్వభావముకావున మొదట బ్రథము లనుపే రున్నను వారివిధులను బట్టి ప్రమథు లని వ్యవహరింపఁబడుచున్నారా? రెండును సంపన్నము లని భావము.

వా రివ సృష్టేః ప్రథమా
స్తవ ద్వితీయాః శ్రుతౌ శ్శివ శ్రుతివచనాత్
తుర్యాక్షరపదకలితా
జయంతి తే సర్వతోముఖప్రసరాః 71

'అప ఏవ ససర్జాదౌ' 'యా సృష్టిః స్రష్టు రాద్యా' మున్నగువానివలన జలము సృష్టిలో మొదటి దని తెలియుచున్నది. అటులనే అనఁగా జలమువలెనే ప్రమథులును మొదటివారు. శివుని

తరువాత శివునంతవారును. వయిసృష్టిక్రమమునుబట్టి శివునకు రెండవ వారును ప్రమథులు కావున తవర్గమందలి రెండవయక్షరమగు థకార మే వారిపేరునందుఁ గలదు.

కాని వారు జలమువలె సృష్టికి మొదట నుద్భవించి సర్వతో ముఖప్రసారము కలవారైనను జలము 'ఆకాశా ద్వాయుః వాయో రగ్నిః అగ్నే రాపః' అను శ్రుతివచనమువలన జలము సృష్టిక్రమ మునఁ బంచభూతములలో నాల్గవది యగుచున్నది. కావున సర్వతో ముఖసామ్యమునుబట్టి వీరిపేరునందు తవర్గమందలి నాల్గవయక్షరమగు ధకారము వచ్చినదని భావము.

భేదాభేదవదావదా బహువిధా వాచ శ్శ్రుతీనాం పునః
విద్వాంసః పరిగృహ్య కేచి దవదన్ భేదం త్వభేదం పరే
భేదాభేద మథాపరేత్రి హీ ముహు ర్జీసన్య దేవస్య తత్
వాదత్రియ్యపవాదకం శివవిశిష్టాద్వైత మస్మన్మతమ్ 72

పలువిధములగు వేదసూక్తులు కొన్ని జీవేశ్వరులకు భేదమును, గొన్ని యభేదమును జెప్పుచున్నవి. కొందఱు పండితులు వాని నాధా రముగా గ్రహించి జీవేశ్వరులకుఁ గేవలభేదమును, గేవలాభేదమును, భేదాభేదమును వచించిరి. కాని వయిమూడువాదముల నపవాదించి సకలశ్రుతిభావసమ్మతమగు శివవిశిష్టాద్వైతమే మామతము.

వాగర్థసంబధవ దత్రి సిద్ధం దాంపత్య మ త్రీశ్వరయో ర్హి నిత్యమ్
నిత్యేతరత్వం ప్రవదంతి కేచి త్ప్రోథా స్తదేకస్య కథం మతేర్వా

పార్వతీపరమేశ్వరుల దాంపత్యము వాగర్థముల సంబంధమువలె నిత్యము సిద్ధమైనది. కాని యది యెట్టిబుద్ధివిశేషమువలననో కొందఱు ప్రౌఢులు ఆదంపతులలో నొకరి కనిత్యత్వము చెప్పుచున్నారు.

ఇటఁ బార్వతీపరమేశ్వరు లనఁగాఁ బ్రకృతిపురుషులు. ఈప్రకృతి పురుషుల సంబంధము నిత్యము. వీరు నిత్యులు. కొందఱు బుద్ధిమంతులు ప్రకృతి కనిత్యత నాపాదించుచున్నారు. ఇది యనుచిత మని భావము.

దేవీమయం జగ దిదం యదిచేన్న మిథ్యా
ధాత్రీం వినా తదను జాత ఇహైవ పుత్రః
వంధ్యాసుతస్య కిము తస్య వచః ప్రమాణం
వ్యోమారవిందమృదుగంథదృఢోపమానమ్ 74

దేవీస్వరూపమగు నీజగత్తు మిథ్యయే యగుచేని నిజముగా నట్టి సిద్ధాంతము నొనర్చిన బుద్ధిమంతుఁడు తనకుఁ దల్లి లేకుండఁగనే దాను జన్మించితి నని చెప్పవలయును. ఆతఁడు గగనారవిందసదృశుఁడు. అతని పలుకు ఆయాకాశతామరసముపరిమళమువలెనే ప్రమాణమగుచున్నది. అనఁగా జగన్మిథ్యావాదము సరికా దని భావము.

లీలామయీ త్రిజగతీ భవతో ధ్రువేయాం
మిథ్యాం వదంతి శివ! కేచన మూర్ఖదగ్ధాః
జానీయు రత్ర కిము తేఖిలశూన్యవాదా
స్సత్యం శివం పరమసుందర మీశతత్త్వమ్ 75

ఓవరమశివా! ఈత్రిలోకియు నీలీలాస్వరూపము. నీవు నిత్యుఁడవు. కావున నీలీలయగు నీత్రిజగతియు నిత్యమే. ఇట్టిదీనిని గొందఱు అధికబుద్ధిమంతులు మిథ్యగా సిద్ధాంతీకరించుచున్నారు.

ఓవరమేశ్వరా! సత్యమును, శివమును, పరమును, మహాసుందరమునగు నీతత్త్వము నఖిలశూన్యవాదులగువారే మెఱుంగుదురు!

మన ఇదం మమ నాథ ముమాధవం
రతిపతే రపి పితు స్స్మరణీయమ్
ప్రతిపదం త్వభిసర్తు మి వాకులం
యువతిరూపవరదానసమర్థమ్ 76

నాయీమనస్సు త్రిలోకసుందరుఁడగురతిపతితండ్రికిఁగూడ స్మరణీయుఁడును, నావిష్ణునకు యువతిరూపమగు ననఁగా జగన్మోహినీరూపమగు వరము నను్గ్రహించుటయందు సమర్థుఁడును, నానాథుఁడు నగు నుమాధవుని నడుగడుగునందు నభిసరించుట కాకులమైనదివలె నున్నది.

ఒకస్త్రీ యొకపురుషుని బ్రేమించుటకుఁగాని, యొకపురుషుఁ డొకస్త్రీని బ్రేమించుటకుఁగాని వారిసౌందర్యమే ప్రధానము గాదు. అట్టియెడ వారిసౌందర్యముకంటెవారియందుఁగల స్త్రీత్వపురుషత్వము లకే ప్రాధాన్యము గలదు.

కావుననే యొకస్త్రీ వేఱొకస్త్రీసౌందర్యమునుగాని, యొకపురుషుఁడు వేఱొకపురుషుని సౌందర్యమునుగాని చూచి యానందించి పరవశత నందుట సామాన్యముగా నుండదు. ఏస్త్రీసౌందర్యము స్త్రీలకును ఏపురుషుని సౌందర్యము పురుషులకును మోహమును గలిగించునో యదియే యథార్థసౌందర్య మనిపించుకొనును. గోపికాజనరంజకమగు శ్రీకృష్ణుని సౌందర్యముకన్న సర్వసత్వమనోభిరామమగు శ్రీరామచంద్రుని సౌందర్యము మిన్నయని ప్రాజ్ఞులు వచింతురు.

ఇట్టియెడ శ్రీరామకృష్ణాద్యవతారములు లీలావిభూతులుగాఁ బురుషోత్తముఁడగు శ్రీమన్నారాయణునకుసైతము మోహినీరూపధారణ సంకల్పమును దత్సిద్ధి ననుగ్రహించిన పరశివునిసౌందర్య మద్వితీయము. కావుననే సుందరేశ్వరనామ మీశ్వరునియందు రూఢమును, సార్థకము నగుచున్నది.

దాంపత్య మెంత సుందరము నెంతయనురూప మయ్యును సంతానరహిత మగుచో నది సార్థకము కాదుగదా? మాతృత్వముచేతనే స్త్రీత్వము సార్థక మగుచున్నది. మోహినియవతారమున భైరవస్వామి యుదయించుటవలన నయ్యవతారము సార్థకమై యమ్మహావిష్ణునకు సుందరేశ్వరుఁడు స్మరణీయుఁ డగుచున్నాఁడు.

జీవేశ్వరుల సంబంధము భార్యాభర్తల సంబంధమువంటిది. ఇందలి మనశ్శబ్దము నపుంసకలింగము. కావున నిది పరమేశ్వరుఁడు పురుషోత్తమునకుఁ దరుణీత్వము ననుగ్రహించినను నపుంసకమగు తనకు ననుగ్రహించునా యని పర్యాకుల మైనదివలె నున్నదని తాత్పర్యము.

నిజస్థితికిఁ బర్యాకులము కాలేదు. ఏల నన దాంపత్యార్థమునకు యథార్థలక్ష్యమగు పరమేశ్వరుని యర్ధనారీశ్వరావతారమును లక్షించి ప్రతిపదము నందును స్వామి నభిసరించుచునే యున్నదని భావము.

గిరిజాతా మమ కవితా
    క మన్య మిష్యతి వినేశ్వరం నాథమ్
గిరిజామాతృపదాంకిత
    పదవీ న పవీయసీ భవతు చాస్యాః 77

గిరిజాతయగు నాకవిత సర్వజగన్నాథుడగు నీశ్వరుని విడిచి యితరు నెవనిని బొందును? అనఁగా నీశ్వరునినే పొందునని భావము. ఈనాకవిత విశ్వనాథు నన్వేషించుచున్నది. కావున నిది గిరిజాత. కావున గిరిజాతయగు పార్వతివలెనే యీశ్వరాన్వేషణమందు సిద్ధి కలుగవలయును. కావున గిరిజయగు జగన్మాత తననాథు నన్వేషింపఁ జను నెడల మృదుమధురములగు నామెపదములచే గుర్తింపఁబడిన మార్గము శివదర్శనసిద్ధి నొసంగునది యయినది పార్వతీదేవి నడచినది నాకవితకు సమీపస్థ మగుఁగాక!

ఆపార్వతి నడచిన మార్గ మీకవితాపార్వతికి లభించినను పరమేశ్వరుఁడు నడచినమార్గము లభింపవలదా యనవచ్చును. కాని పరమేశ్వరుఁ డామెకు నిత్యాభిగమ్యుఁడు. ఆమార్గమామెకే తెలియును. కావున నీకవితకు నాదారి నడచునెడలఁ బరమేశ్వరదర్శనసిద్ధి కలిగితీరు నని గ్రహింపనగును.

కాని యిందే వేఱొక యన్వయము గలదు. గిరి జామాత యనగా హిమాలయమునల్లుఁడగు శివుఁడు. కావున నాపరశివునిపదాంకితమగు మార్గము దీనికిని లభించుఁగాక యని భావము.

లేక పార్వతీపరమేశ్వరపదచిహ్నితమగు పదవి సిద్ధించుఁగాక యనియును దలంపనగును.

అద్వైతం గిరిజాతయా మమ మతేర్ ద్వైతం భవన్నందినా
ద్వైతాద్వైతకథా తవైవ నుతయో ర్మే చాత్మన స్స్యా ద్యది
అర్చాయాం వహనే తవాంఘ్రిభజనే మాహాత్మ్యసంకీర్తనే
శక్తః కింతు భజేయ మీశ్వర! కథం తత్తన్మహత్త్వం పునః 78

నీసన్నిధిప్రదానమునందు సోమనాథేశ్వరా! నామనమునకు నీభార్యయైన పార్వతితో నద్వైతము సిద్ధించిన నిన్ను బూజింపఁగలను నీవాహన మగు నందీశ్వరునితో ద్వైతము సిద్ధించిన నిన్ను వహింపఁగలుగుదును. నాయాత్మకు నీకుమారులతో ద్వైతముగాని యద్వైతముగాని లభించిన నీపాదములు భజించుటకు, నీమహిమను గీర్తించుటకు సమర్థుఁడ నగుదును. కాని యట్టి భాగ్యమహిమను నే నెట్లు పొందఁగలను? నిన్ను భజించుట కట్టిశక్తి ననుగ్రహింపుమని భావము.

దారుకావనమానీంద్రగృహిణీవరదైవతమ్
మోహినీరమణం వందే సుందరం శ్రితమందరమ్ 79

దారుకామునిధర్మపత్నులకుఁ బరమదైవమును, మోహినీదేవికి నాథుఁడును, శ్రితభక్తజనమందారమును, పరమసుందరుఁడునగు పరమశివుని నమస్కరించుచున్నాను.

ఇట దారుకావనమునిపత్నులు కవితాభావనలు. మోహిని మతి. కేవలసౌందర్యోపాసకములగు వీనివాంఛితముల ననుగ్రహింప శ్రితమందరుఁడగు సుందరేశ్వరుని గవియుఁ జూచుచున్నాఁడని భావము.

న బ్రహ్మాస్మాత్పర మితివదన్మౌనిగర్వాంధకార
ధ్వంసిబ్రధ్నప్రభవ మభవం శాంభవం వైభవం నః
సాక్షాత్కుర్యా ద్రమణరమణం దారుకామౌనిపత్నీ
చేతశ్చేతప్రభవవిభవం చంద్రచూడావతంసమ్ 80

మాకంటెఁ బరబ్రహ్మము లేదని గర్వించు మునుల గర్వాంధకారమును బోఁగొట్టునట్టి సూర్యోదయమును, పుట్టుక లేనిదియును, అనఁగా నాశము లేనిదియును, రమ్యమగువానన్నిల్ల రమ్యమును, దారుకామునికాంతల మనస్సులందు మన్మథోద్దీపనమును గలిగించునదియుఁ, జంద్రుఁడు శిరోభూషణముగాఁగల పరమేశ్వరవైభవము మాకు సాక్షాత్కరించుఁగాక!

కరకలితకురంగం కామినీభాగితాంగం
శిరసి విధృతగంగం చిత్తజాతప్రభంగమ్

దురంతసంసారణాశకం దృష్టగోరాష్ట్రరంగం
చరణాశరణదం సన్మంగళం సంభజామః 81

చేతియందు లేడిని ధరించినట్టియుc, పార్వతిచే సగము పంచుకొనcబడిన శరీరము గలట్టియు, శరీరమున గంగను దాల్చినట్టియు, మన్మథుని బరిభవించినట్టియు, పాపముల బరిహరించునట్టియు, మదించినవృషభేంద్రు నధిష్ఠించినట్టియు, నిజపాదపద్మముల ననుగ్రహమునc బ్రకాశించుచున్న సకలశుభములుగల పరమేశ్వరుని సేవించుచున్నారము.

యః సౌందర్యపరమావధి స్త్రిజగతీలావణ్యవారాంనిధిః
యో మాధుర్యమహోనిధి స్త్రిభువనీమాంగళ్యలీలావిధిః
యః సంతర్పితదివ్యసంయమిసుధీః పారమ్యరేఖానిధి
ర్మజ్జన్మాంతరపుణ్యసంపత్తినిధిః పాయా త్కృపాసేవధిః 82

ఎవcడు సౌందర్యలక్ష్మికిc బరమావధియో, యెవcడు మూcడు లోకముల లావణ్యమునకు సముద్రమువంటివాcడో, యెవcడు మాధుర్యమునకును దేజమునకును గనియో, యెవcడు మూcడు జగములకు మాంగళ్యమును గలిగించు విలాసనిధానమో, యెవcడు దేవమునిపండితులను దృప్తి నొందించెనో, యెవcడు సర్వాధికుcడో, యెవcడు నాజన్మాంతరపుణ్యములకుc బ్రతినిధియో దయానిధియగు నట్టి పరమేశ్వరుcడు రక్షించుcగాక!

య న్మందస్మితమంజరీమధుఝరీమాంగళ్యలీలావనం
య న్మాధుర్యధురానిరీక్షణకృతత్రైలోక్యభద్రావనమ్
య న్నృత్యన్మృదుపాదనూపురరవవ్యంగ్యజ్జగజ్జాలకం
త న్న శ్చేతసి జృంభతాం శివకలాసర్వస్వ మైశం మహః 83

ఏది చిఱునగవుగుత్తుల వెడలిన మధుప్రవాహములగు మాంగళ్యములకు విహారస్థానమో, యేది మధురతాభరములగు చూపులచేతనే మూcడులోకములకు భద్రములను సంతరించినదో, యేది నటించుచున్న పాదనూపురముల సవ్వడిచేతనే సకలజగద్వ్యవహారమును ధ్వనిం

చుచున్నదో శివకళాసర్వస్వమగు నట్టి పరమశివము హాస్సు మామనస్సు నందు విజృంభించుఁగాక!

పాదత్రియీామూల మనంతఖేలం
స్వాదు శ్రితాలోల మఖండహేలమ్
వేదత్రయీామూల మహాస్త్రకాలం
నాథం భజే కంధరనీలనీలమ్ 84

ద్వైతాద్వైతవిశిష్టాద్వైతములను మూఁడు వాదములకు మూల మగువాఁడును, అనంతములగు క్రీడలు గలవాఁడును, మధురస్వరూపుఁడును, ఆశ్రితులను విడువనివాఁడును, అఖండమగు విలాసము కలవాఁడును, మూఁడు వేదములకు మూలమగువాఁడును, మృత్యువును జయించినవాఁడును, నల్లనల్లని కంఠము గలవాఁడునునగు జగన్నాథుని సేవింతును.

దారుకాటవీచారుసుందరీవారహృద్వియచ్చారుకౌముదీ
సారమంజులాకారమంగళశ్రీరమాకరః పాతు శంకరః 85

దారుకావనమునిపత్నుల హృదయ మనెడి యాకాశమునఁ జక్కని వెన్నెలలసొగసుగల మంజులాకారమంగళలక్ష్ములకు నిధియగు శంకరుఁడు రక్షించుఁగాత!

పాదద్వంద్వం పరమజలజం పల్లవౌపమ్యభాజం
గౌరీహస్తమ్రదిమవిదురం కారణం కారణానామ్
దారుస్త్రీహృత్తరళతరళద్దర్పకందర్పభావం
వేదాంతార్థప్రకటితకథం ప్రాదురాస్తాం మమాక్ష్ణోః 86

శ్రేష్ఠమగు పుండరీకమయి చిగురుటాకుల సామ్యము నంది పార్వతీదేవిచేతిమెత్తఁదనము నెఱింగినదై, కారణములకెల్లఁ గారణమై; దారుకావనవనితల హృదయముల మన్మథోద్దీపనము గలిగించునదై, యుపనిషదర్థములచేఁ బ్రకటితమైన చరిత్రముగల పరమేశ్వరుని చరణయుగళము నాకన్నులకు సాక్షాత్కరించుఁగాత!

ప్రభాత మేత త్స్మరమోహపీక్షితం
విభాతు నిత్యం మమ మానసాంబరే
ప్రబుద్ధకల్యాణపరంపరాంబుజం
నిబద్ధదోషం నిహతాంధకారమ్ 87

వికసించిన శుభపరంపర లనెడి తామరలుగలదియు, నరికట్టిన దోషము కలదియుఁ, బోఁగొట్టిన చీఁకటి గలదియు నగు నీ యుదయ మనెడి పరమేశ్వరునిచూపు నామన మనెడి యాకసమున నిత్యము ప్రకాశించుఁగాత !

మధ్యాహ్న మేత త్స్మదనారిపీక్షణం
మధ్నాతు దుష్కర్మ కుముద్వతీవనమ్
బధ్నాతు కామం తమ ఏవ మహ్యాత్
బధ్నాతుకామం కవితాసుమస్రజమ్ 88

పరమేశ్వరుని కటాక్షమనెడి యీ మధ్యాహ్నము నా దుష్కర్మలను కలువలగుంపును మధించుఁగాత, అజ్ఞానమును బంధించుఁగాత! కవిత యనెడి పూలమాలికను గ్రుచ్చి నీనన్ను రక్షించుఁగాత !

సాయంతనం జయతు శంకరదర్శనం మే
సంతాపహారి సకలేంద్రియతృప్తికారి
గౌరీమనోంబరవిభాసురసాంధ్యరాగం
మద్భావచంద్రసదుపాస్యవిహారరంగమ్ 89

తాపములను బోఁగొట్టునదియు, సకలేంద్రియములకుఁ దృప్తిని గూర్చునదియు, గౌరీదేవిచిత్త మనెడి యాకసమున సంజయెఱుపుల నిండించునదియు, నాభావ మనెడి చంద్రునకు సదుపాస్యమగు విహార రంగమునగు పరమేశ్వరుని చూపనెడి సాయంతనము విజయ మందుఁగాత !

నక్షత్రాణి జయంతు శేషఫణిరాడ్రత్నస్వ గ్రహాణి స్ఫుర
ద్గంగానిర్ఝరబుద్బుదాని శశభృద్భాసాంకురాణి ధ్రువమ్

గౌరీమంజులవీక్షితాని విలసత్పుష్పాక్షతాని ప్రభో!
మద్భావాంబరభాసురాణి మధురోక్తేః స్థిరంగాని చ 90

నిగ్రహానుగ్రహసమర్థుఁడవగు నో పరమేశ్వరా ! నీ శిరమునందలి శేషుని పడగలయందలి రత్నములయి, గంగాప్రవాహముల బుడగలయి, చంద్రుని కాంతుల మొలకలయి, పార్వతీదేవి మనోహరములగు చూపులయి, భక్తు లర్పించిన పుష్పాక్షతములయి, మధురములగు నుత్పత్తులకు స్థానములయిన నక్షత్రములు నాహృదయాకాశభాసురము లగుచు విజయ మందుఁగాత !

బహు న్యలంకారవిభాసురాణి
దదామి పద్యాని మధుస్ప్రహాణి
తథాపి రక్తి ర్మయి తే భవే ద్వా
న వేద్మి, య ద్భక్తిరత స్త్వ మాసీః 91

ఓ శంకరా! తేనెవలె నాస్వాదనీయములయి, చక్కని యలంకారములతోఁ బ్రకాశించు పెక్కు పద్యములు నీ కిచ్చెదను. కాని నాయందు నీ కనురాగము కలుగునో, కలుగదో! ఏలన, నీవు కేవలము భక్తియందే క్రీడింతువుగదా ?

మద్భక్తిభక్తి ర్మధురీకృతాకృతీ
రనన్యభాజః, సుమనోమృదుస్రజః
వాచ స్సతీమంగళవిగ్రహాకృతీ
రంగీకరిష్య స్యథవేతి మే మతిః 92

అయినను, నాభక్తివిభాగములయి, స్వభావరమ్యాకృతులయి, వేఱొకరిని బొందనివై, పూలమాలికలవలె మెత్తనివై, సతీస్వరూపము వలె మంగళములయిన నా వాక్కులను నీ వంగీకరింతు వనియే నా నిశ్చయము.

ధీరమానినో వీరమానిన
స్సైన్వైరచారిణో దారుమానినః

క్రీరమూపతే స్త్రీత్వనాయి య
చ్చారిమాస్తి తే, తేన వంచితాః 93

'మేము పండితులము. మేము పేరుల' మని తలంచుచు స్వేచ్ఛగా సంచరించు దారుకావనమునులు లక్ష్మీశ్వరునకు స్త్రీత్వము ననుగ్రహించిన నీ సౌందర్యముచేత వంచితు లయిరి.

సదాశివ స్సుందరసుందరాకృతి
ర్యదావిరాసీ త్స్వరతో మృగీదృశామ్
తదా తథా మోహితదారుయోషితాం
హృదంత రేజృంభత మన్మథః పునః 94

చక్కనగువానిలో కెల్లఁ జక్కనగు రూపముతో సదాశివుఁడు దారుకావనస్త్రీలయెదుట సాక్షాత్కరించినవెంటనే మోహితలగు వారల హృదయములందు మన్మథుఁడు మిగుల విజృంభించెను. దారుయోషిత్తు లనుటచే వారిహృదయములు కొయ్యబాఱియున్న వనియు గ్రహింపనగును.

పరం విచిత్రం సకలా అపి స్త్రియః
పరస్పరం భావితసుందరేశ్వరాః
నిరంతరాలీఢమనోజభావా
శ్చిరం విజహ్రుః పతిదేవతా స్తాః 95

ఆ పతిదేవతలు పరమకోటికెక్కిన నుదనభావముకలవారలయి, తామందఱు స్త్రీలయ్యు నొండొరులను సుందరేశ్వరునిగా భావించి చిరకాలము విహరించిరి. ఇది యెంత చిత్రము!

(వివరమును నారచించిన కాంచీఖండమునఁ జూడఁగోరెదను.)

అభూతతద్భావనిబోధకం ను యత్
చ్చిత్రపత్యయార్థం సకలం త మశ్నువన్
పతీభవంత్యః పతిదేవతా మిథ
స్సతీభవంతః పతయో యథా తథా 96

"అడ కానివాఁడు దానివలె నగుట" అను నర్థమున "చ్వి" అను ప్రత్యయము వచ్చును. దీనినే సంపద్యమానసమాస మని వ్యవహరింతురు. అకృష్ణః కృష్ణ స్సంపద్యమానః భవతి కృష్ణీభవతి. కృష్ణుఁడు కానివాఁడు కృష్ణునివలె నగుచున్నాఁ డని భావము.

ఇఁట నా పతివ్రతలు పరస్పరము మోహావశమున మోహిని యని భావించి విహరించిన తమభర్తలవలెఁ దామును భ్రాంతినంది విహరించుటయుఁ బయియభూతతద్భావమును సమగ్రముగా ననుభవించి రని భావము. భర్త లాచరించినటులే తామును జేసి రనుటచే వారిపాతివ్రత్యము సూచిత మగుచున్నది.

అల్పజ్ఞుఁడు నల్పశక్తిమంతుఁడునగు పరమేశ్వరుఁడ నేనే నయితి ననుటగూడ నిట్టిదే యనుట యిట ననుసంధేయము

అమాన్మథం సుందరసుందరం చ తే
సమీక్ష్య సౌందర్య మవిక్రియేంద్రియమ్
అమీ మునీంద్రా స్సహధర్మపత్న్యయో
విమూఢభావా విపినాంత రేచరన్ 97

శివా! మదనరహితమై, సుందరసుందరమై, యింద్రియముల కందరాని నీ సౌందర్యమును, భార్యలతోఁగూడఁ జూచిన యీ మునీశ్వరులు మూఢులయి యరణ్యములందుఁ గ్రుమ్మరిరి. శివసౌందర్యము చూపుల కందరాని దగుటచే దానిని సరిగాఁ జూడనేరక మునులు విపరీతదర్శనమున భ్రష్టు లయిరని భావము.

స్వకీయ దుస్సంస్కృతివాసనాబలా
ద్వికృష్టచిత్తా అథ చర్మచక్షుషః
వికారమూఢే మునినాథయూథే
న కోఽప్యపి వేత్తా తవ సుందరాకృతేః 98

తమతమ చెడుసంస్కారములబలమునఁ జర్మచక్షువులగు నా మునులు చెడుదారినే లాగఁబడిన మనస్సుగలవా రయిరి. అట్లు మూఢమగు మునిసమూహమున నీ యథార్థసౌందర్య మెఱింగినవాఁ డొక్కఁడును లేఁడు;

ఒకఁ డొకసుందరవస్తువును దర్శించినప్పుడు దానిసౌందర్యమందలి మహత్త్వమును గుర్తించి దాని నుపాసించి తుద కాసౌందర్యసముద్రము నందుఁ దా నొకబిందువో కెరటమో యగును. వేఱొకఁడు దానిని తన దానినిగాఁ జేసికొని స్వత్వానుభూతి నందఁగోరి వికారవంతుఁడై భ్రష్టుఁ డగును. ఇట మునులు రెండవవానిదారి పట్టిరి.

వాచో యథా భావవిశేషబోధే
శబ్దో యథా తత్పరమార్థబోధే
తథాసమర్థా అభవంశ్చ తాశ్చ తే
త్వదీయసౌందర్యరమావబోధే 99

వాక్కులు భావవిశేషమును దెలుపుటయందును, శబ్దములు పరమార్థమును దెలుపుటయందును నసమర్థము లయినయట్లు నీసౌందర్యలక్ష్మీవిశేషము నెఱుఁగుటయం దావనితలును, పురుషులును నసమర్థులయిరి.

పరిణతిదూరకవీంద్ర
న్యరచితస్వబ్రహ్మచారిమునివారమ్
దూరే యథార్థసౌంద
ర్యరమాపరమార్థబోధనస్యాసీత్ 100

అనుభవము పరిపక్వము గాక మేమును గవీంద్రులమే యని తలంచువారి రచనములవలెనే యామునులు యథార్థసౌందర్యతత్త్వము నెఱుంగుటకు దూరమందే యుండిరి.

సౌందర్యసర్వస్వగృహైకదర్పణే
సర్వస్య సర్గస్య మనఃప్రతర్పణే
రూపే త్వదీయే వికృతాత్మదర్శనా
ముగ్ధా శ్చరంతి స్మ ముధావిమర్శనాః 101

సౌందర్యసర్వస్వలక్ష్మీకిఁ బ్రధానదర్పణమై సమస్తసృష్టికిని మనఃసంతర్పణమైన నీరూపమునం దామునులు వికృతములగు నాత్మ

దర్శనములు, వ్యర్థములగు విమర్శనములు కలవారయి మూఢులయి చరియించిరి.

అనంగసౌందర్యరసైకబోధ
మనంగ మవ్యక్త మఖండబోధమ్
అనంగరూపం పరిభావయంతో
హ్యాత్రిప్రసంగా మునయో బభూవుః 102

అవయవములం దిముడని సౌందర్యమునకుఁ బరమరూపమై, యవయవవిభాగరహితమై యవ్యక్తమై, యఖండమై, విజ్ఞానమయమగు నీస్వరూపమును వారు మన్మథసంబంధిగా భావించి బహువిధములగు నతిప్రసంగములను ( పరస్పరము మదనసంబంధులగు ప్రసంగములను ) గావించిరి.

కామితార్థదస్వామిదర్శన
ప్రేమభావనిస్సీమజృంభి తత్
వామలోచనాకామనీయక
శ్రీమహాఃకలా సా ముహు ర్బభౌ 103

వాంఛితార్థముల ననుగ్రహించు పరమేశ్వరుని దర్శనమందలి ప్రేమచేత హద్దుమీఱి చరించిన యా కామినులసౌందర్యరేఖ మిక్కిలిగాఁ బ్రకాశించెను.

అతికామవికారవంచితా
హతకామా నిభృతక్రుధాకులాః
యతయః పతితాః పునః పున
ర్యతనం చక్రు రహంత యాదృతాః 104

అధికమగు కామవికారముచే వంచితులయి, వ్యర్థమైన కామము గలవారయి నిండిన కోపముచేఁ జెదరినవారయి పతితులైనయాయతులు మాటిమాటికి నహంకారచోదితులై పరమేశ్వరు నిగ్రహింప యత్నించిరి

ఘోరాభిచారక్రియ యోపపన్నాన్
స్వైరప్రచారాన్ మునిష్ఠాఘచారాన్

దీపిద్వీపాహీన్ పరిగృహ్యా విగ్రహే
విభూషయంతం త మజం స్మరామి 105

ఆమునులు చేసిన భయంకరములగు నాభిచారిక క్రియలయందు పుట్టి వారిపాపములవలెనే స్వేచ్ఛాప్రచారములగు పులిని, ఏనుఁగును, పాములను శరీరమున కలంకారములుగా ధరించిన జనిరహితుఁడవగు నిన్ను స్మరింతును. విగ్రహపదమునకు విరోధ మనికూడ నర్థము కలదు. కావున మునులు వైరమున నొసంగినవానినిగూడ నలంకరించుకొనుటలో బరమవిభుని వాత్సల్యవిశేషము ప్రకటిత మగుచున్నది.

అవిగ్రహే తే మధురే స్వరూపే
సువిగ్రహత్వం కథ మత్ర జాతమ్
అవిక్రియే కిం ను విభూషణే తే
నవేత్ర శార్దూలగజాజినే చ 106

ఓశంకరా! విగ్రహరహితమై సహజసుందరమగు నీరూపమునం దియాకార మెట్లు బుట్టినది? దుష్టులయినను నీకు దయనీయులగువా రొసంగినవానిని ధరించుటకా యని భావము. వికారదూరమగు నీశరీర మునకు నెత్తురుతడియాఱని యీశార్దూలగజచర్మములుగూడ నొక యలంకారములా యేమి?

నిరీశ్వరాణాం నిగమజ్ఞమానినాం
దురాగతా నీశ! తథా కృతాని చ
వినా భవంతం క ఇహ క్షమేద్వా
సుతాపరాధాని పితు ర్వినా కః 107

మేమే యాగములనెల్ల యెఱిఁగినవార మని విఱ్ఱవీఁగుచుఁ దమకంటె దైవము లేఁడని గర్వించి యట్లుగా నంతటి దుండగముల నాచరించిన యాదేసమాలినవారిని నీకన్న క్షమియించువాఁ డెవఁడు? కొడుకుతప్పులను దండ్రికంటె మన్నించువాఁ డుండఁడుగదా!

గృహ్ణాన్ రవిః క్షార మపీహ నీరం
యథా ప్రవర్ష త్యమృతం తథా శి[illegible]

మునీంద్రదుష్కర్మకులం నిగృహ్ణన్
వవర్ష తే ష్వప్యమృతం కృపామయమ్ 108

సూర్యుఁ డుప్పునీటిని గ్రహించి తీయని జలమును వర్షించినట్లు పరమశివుఁ డామునుల పాపకృత్యముల నిగ్రహించి వారియందుఁగూడ కృపామయమగు నమృతమును వర్షించెను.

రవి సముద్రజలములను ద్రావి వర్షించి జగతిని సస్యశ్యామలము నొనరించుచున్నాడు. సముద్రపతితములగు నాబిందువులు ముత్తెపుఁ జిప్పలయందుఁ జేరి ముత్యము లగుచున్నవి. ఇట మునులు శుక్తులవంటి వారని గ్రహింపనగును. మఱియు నిట్టివారిని నిగ్రహించుట మిగిలినవారిని బ్రబోధించుట యనియు నెఱుంగనగును.

బహువిధప్రవిణష్టనిజాగసాం
బహుముఖాల్పనిరూఢనిజౌజసామ్
ముహు రనుస్మృతశంకరతేజసాం
మహ దభూ న్మధురం శివదర్శనమ్ 109

బహువిధములగు తమపాపములు నశించి సర్వథా తా మల్పజ్ఞులము, నశక్తులము నని గుర్తించి మాటిమాటికి శివతేజమును స్మరించు నామునులకు గొప్పదియు, మధురమునగు శివదర్శన మాయెను.

సుందరసుందరమంగళమంగళ
చందిరచంద్రిర మమలం విమలమ్
చందనచందనశంకరశంకర
మిందతి విందతి మధురం మధురమ్ 110

ఆశివదర్శనము సుందరసుందరము, మంగళమంగళము, చంద్రిచంద్రిము, నమలము, విమలము, చందనచందనము శంకరశంకరము, మధురమధురమై పరమైశ్వర్యరూపమై విహరించుచున్నది.

అస్త్రీపుమాంసం న్వనపుంసకం మహా
శ్చికేల చికీర్డ ననంద సంబభౌ
వనాంతరే దారుమునీన్మనోంతరే
భగాచరాత్మ న్యఖిలాంతరాంతరే 111

విజయవాడ శైవమహాపీఠమందు జరుపబడిన రుద్రయాగ మహోత్స

వమునందు సమర్పింపబడిన

# ప్ర శం సా ప త్ర ము లు



మూలంపల్లి రాజశేఖరశాస్త్రిగారు

రచయిత:_కవిభూషణ శతావధాని జ్యోతిర్విద్యావిశారద ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారు (శ్రీ శైవమహాపీఠ పండితమండలాధ్యక్షులు)

ఘనభూమీధ్రగుహాంతరంబున క్షుధాక్రాంతంబు సుప్తోత్థితం
బును నౌ సింగము ముందు దంతినికరంబుం గాంచి పైకొన్నరీ
తిని ద్వైతాదిమతప్రసిద్ధబుధవిద్వత్కోటిపై నొక్కఁ గం
తున వాదించెడు రాజశేఖరసుధీతుల్యుఁ గన న్నేర్తుమే!

ఇన తేజుండగు నాగలింగశివయోగీంద్రుండు తత్ప్రోక్తమా
ఘనసిద్ధాంతములన్ బ్రచారణముగా [illegible]శింప నే శిష్యుడో
పునొ యంచున్ దివినుండి యరుదెంచె [illegible]ప్పు ల్నిల్పి యీనాడు తృ
ప్తిని గాంచెన్ ఋణ విముక్తుడై ఘన ప్రసిద్ధిన్ గాంచెటన్ పద్వ్యధుల్.

అద్వైతం బని ద్వైత మంచును విశిష్టాద్వైత మౌనంచు ద్వై
తాద్వైతం బగునంచు వ్యాసపథమున్ దర్కింతు రే బ్రహ్మవి
ద్వద్వర్యుల్ దగ వారిసంశయము దీర్పంజాలు యుష్మద్వచ
స్సద్వైదుష్యము చాలు నందురు సుధీసంస్తూయమానంబుగన్.

అద్వైతంబును ద్రోసిపుచ్చి శ్రుతివాక్యస్ఫూర్తి లేదంచు లే
దే ద్వైతంబును సూత్రపంక్తి నని నిర్దేశించి యాపైన ద్వై
తాద్వైతంబును ద్రోసి చెప్పుచు శివాద్వైతంబె వ్యాసోదితం
బౌ ద్వేధాపథనిశ్చితంబగు మహాప్రస్థానమున్ దెల్పితే.

చిన్నతనంబు గావున వచింపకు గాని భవద్వివేకసం
పన్నత నింత గొప్ప దని పాపము చాటునమాటునన్ నిజం
బున్నది యున్నరీతి మనసొప్పగఁ జెప్పఁగ మెచ్చకొందు రీ
పున్నె మదేమొకో విబుధపుంగవు లేమతమందుఁ బుట్టినన్.

వేములవాడదుష్పథమలీమసచిత్తసుధీనతంను లే
మేమొ తలంచి వచ్చి భవదీయవచోమహిమావిభూతికిన్
బ్రేమమయాత్ములై తొలగి భీతిఁ జనన్ గనియు న్మతస్థు లే
మేమొ వచించినారట సహింపఁగరాని స్వజాతివైరమా?

ఔఁగా కయ్యది నీకు లోప మగునయ్యా వేదవేదాంతవి
ద్యాగంథస్థగితాష్టదిగ్విదితతత్త్వజ్ఞానమూర్తీభవ
త్సౌగంధ్యంబున నీను చెందు పరనిందల్ లెక్కయే దిగ్గజం
బేగ న్వీధిని గుక్క లర్చినటు లిస్సీ యజ్ఞతావృత్తముల్.

సంతోషింతురు పాండితీఘనతకున్ సంకోచముం జెంది లోఁ
జింతం జేయుదు రస్మదీయమతహృత్సిద్ధాంతముం జేసె నం
చంతంతం జని వాదము న్సలుపరా దంచెంతు రీకుజ్ఞవాఁ
డెంతో పుణ్యు మొనర్చె జ్ఞాననిధి వేరే యొందుచోఁ గల్గునే!

శ్రీ

# శైవతత్త్వప్రకాశిక

( బహుళవ్యాప్తిగల ఆధ్యాత్మికమాసపత్రిక )

సంపుటం 4 | హేవళంబి ఆశ్వయుజము 1957 నవంబరు | సంచిక 8



క ద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే వోచేమ
శంతమగ్ం హృదే

సంపాదకులు :

శ్రీ. పం. శరభారాధ్యుడు, విజయవాడ

మల్లంపల్లి వీరేశ్వరశర్మ, చిట్టిగూడూరు



శైవతత్త్వప్రకాశికాకార్యాలయము

సింహాలమేడ – గవర్నరుపేట

బకింగ్‌హాంపేట పోస్టు, విజయవాడ-

ఓమ్

# శైవతత్త్వప్రకాశిక

( బహుళవ్యాప్తిగల ఆధ్యాత్మికమాసపత్రిక )

సంపుటము 4 | హేవలంబి ఆశ్వయుజము 1957 నవంబరు | సంచిక 8

## పశుపాశపతివివేకము

రచయిత : శ్రీ. వం. శరభారాధ్యుడు

శైవతత్త్వప్రకాశికాసంపాదకుడు

ప్రశ్న : జన్మరాహిత్యమునకై యేమి చేయవలయును?

సమాధానము : జన్మరాహిత్యముకొరకు పాశుపతవ్రత మాచరింపవలయును.

ప్ర : పాశుపతవ్రత మనగా నేమి?

స : పాశుపతవ్రత మనగా పశుపతి నుపాసించుట. పశుపతి శివుడు. కాన శివు నారాధించుట యని యర్థము.

ప్ర : శివునకు పశుపతి యనుపే రెట్లు గలిగినది?

స : సోऽబ్రవీ ద్వరం వృణా అహ మేవ పశూనా మధిపతి రసాని

అని వేదమునందు గలదు. నేనే పశువుల కధిపతి నగుదును. ఈవరము నేను కోరుచున్నాను అని యతడు అనగా రుద్రుడు పలికె నని యీమంత్రమున కర్థము.

ప్ర : దీనివలన పశుపతిత్వ మాగంతుక మని తేలుటలేదా?

స : ఆపాతతః ప్రతీయమానమగు నర్థ మంతియే. కాని వాస్తవ మంతకన్న భిన్నముగా నున్నది. ఈవాక్యమునందు భూతార్థసూచక

మైన లజ్ఞప్రత్యయ మందుటచే నీవరవరణము సృష్టి కాద్యకాలమున గావింపబడిన దని చెప్పవలయును. ప్రతిపూర్వకల్పముననని నీశ్రుతియే యావిధముగ బోధించుచు నీవరవరణము ప్రతిపూర్వకల్పమునందును నున్నదని జ్ఞాపకము చేయుచున్నది. ఈవిధముగ పూర్వకల్పమునను, నంతకు పూర్వకల్పమునను నని వివరించుటచేత నీవరవరణ మనాదియని తేలుచున్నది. కావున నీవరవరణము నిత్యసిద్ధమగు పరమేశ్వరుని పశుపతిభావమును ప్రఖ్యాపనము చేయుటద్వారా కర్మప్రశంసార్థమగు నర్థవాద మని తేలుచున్నది.

స్వతస్సిద్ధం పాశుపత్యం యుష్మాకం పశుతాపి చ
త దత్ర దర్శయా మ్యద్య

నాకుగల స్వతస్సిద్ధమగు పాశుపత్యమును, మీకుగల పశుత్వమును నిట జూపుచున్నాను అను లింగపురాణవచనమువలన పాశుపత్య మాగంతుకము కా దనియును, సహజమును స్వతస్సిద్ధము ననియును తేలుచున్నది.

ఇంకొక విషయము. పశుత్వము తొలగుటద్వారా నమృతత్వప్రాప్తి యనగా పునర్భవరాహిత్యము పాశుపతవ్రతాచరణమువలన గాని లభింప దని

వ్రత మేత త్పాశుపతం ల త్సమాచరే న్ముముక్షు రపున
ర్భవాయ

అను శ్రుతి ప్రతిపాదించుచున్నది. పాశుపతవ్రతాచరణము పశుపాశపతిజ్ఞానమువలనగాని కలుగజాలదు. అట్టిజ్ఞానము లేనిచో మోక్షమసంభవ మని యెంచియే సకలలోకానుగ్రాహకుడగు పరమేశ్వరుడు వరవరణవ్యాజమున తనస్వతస్సిద్ధమగు పాశుపత్యమును సర్వలోకములకు స్పష్టీకరించినాడు. ఈవిషయమునే పైశ్రుతివాక్యమును లింగపురాణవచనమును ప్రతిపాదించుచున్నవి.

ప్ర: అయిన పాశుపత్యవరణమునకు ప్రయోజన మేమి?

స : సకలలోకానుగ్రహమే ప్రయోజన మని చెప్పియున్నాము వాస్తవము విచారించిన పాశుపతజ్ఞానమునకే పశుపత్వ మని చెప్ప వలయును. ఒకవేళ పశుపత్వ మనాగంతుకమైనను జీవుల కనగా దేవ మనుష్యాదులకు స్వపశుత్వమును, పరమేశ్వరపతిత్వమును తెలియజే యుట కనియే చెప్పవలయును. మరియును పాశుపత్యకారణము సృష్టి, స్థితి, సంహారకృత్యములవలె ప్రయోజనరహిత మనియే చెప్పవలెను. అటుల గాక పాశుపత్య మనాగంతుక మని చెప్పిన నొకబాధ గలదు.

> ఆత్మానః పశవః ప్రోక్తాః సర్వే సంసారవర్తినః
> తేషాం పతిత్వాద్దేవేశః శివః పశుపతిః స్మృతః

సంసారవశవర్తులగు సర్వజీవులును పశువులు. అట్టి పశువులకు పతిగావున పరమేశ్వరుడు పశుపతి యని చెప్పబడుచున్నాడను లింగ పురాణవచనమువలన జీవులయొక్క పశుత్వ మనాదిసిద్ధమని తెలుటచే పరమేశ్వరుని పతిత్వమును ననాదిసిద్ధమనియే చెప్పవలయును. ఈవిష యమే శివపురాణమునందుగూడ

> బ్రహ్మాద్యాః స్తంబపర్యంతాః స్థావరా జంగమా అపి
> పశవః పరికీర్త్యంతే సంసారవశవర్తినః
> తేషాం పతిత్వాద్దేవేశః శివః పశుపతిః స్మృతః
> మలమాయాదిభిః పాశైః స బధ్నాతి పశూన్ పతిః
> స ఏవ మోచక స్తేషాం భక్త్యా సమ్యగుపాసితః

బ్రహ్మాదిస్తంబపర్యంతము జీవులందరును పశువులుగా వ్యవహ రింపబడుచున్నారు దేవదేవుడగు శివుడు పతి గావున పశుపతి యని చెప్పబడుచున్నాడు పశుపతియగు పరమేశ్వరుడు మలమాయాదులగు పాశములచే పశువులను బంధించుచున్నాడు భక్తిచే దన నుపాసించిన వారి నాపశుపతియే ముక్తులను గావించుచున్నాడు.

ఇంతియే గాదు. పశుపతిత్వ మనాగంతుక మని చెప్పుట వేదప్ర సిద్ధముగూడ.

త మీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దేవతానాం
పరమం చ దైవతమ్ పతిం పతీనాం ప్రథమం పరస్తా ద్విదామ
దేవం భువనేశ మీడ్యమ్ శ్వేతాశ్వతరోపనిషత్తు

సర్వలోకాధిపతియు, స్తుత్యుడునగు పరమేశ్వరుని ఈశ్వరులకు పరముడగు పరమేశ్వరునిగాను, దైవతములకు పరదైవమునుగాను, పతులకు పరమపతిగాను నుపాసింత మని యీమంత్రార్థము.

కావున నిట్టియీపరమేశ్వరుడు, దేవాదిదేవుడునగు శివుడు వరము కోరుటయు, నితరులు వర మిచ్చుటయు సర్వథా అసంగతములు

ఈపర్యాలోచనచే వరవరణ మర్థవాద మని చెప్పక తప్పదు. ఇయ్యది పశువులగు జీవుల ననుగ్రహించు తలంపుతో నొనర్పబడిన సృష్ట్యాదులవంటి యనుగ్రహకృత్య మనియే చెప్పవలయును.

ఇక పాశుపతవ్రతమునుగూర్చి విచారింతము.

ఏవ్రతమైనను నొకప్రయోజనము నుద్దేశించి యాచరింపబడును

ఐహికము లని, ఆముష్మికము లని ప్రయోజనములు రెండువిధములు. ఐహికములు పలురకములుగా నున్నవి. ధర్మమునకు సంబంధించినవి కొన్ని, అర్థమునకు సంబంధించినవి కొన్ని, కామమునకు సంబంధించి నవి కొన్ని. ఇవియును స్వార్థపరార్థోద్దేశముచే మరల రెండువిధములు గా నున్నవి.

ఇక నాముష్మికవిషయము గాంతము. ఆముష్మికములు స్వర్గా ద్యుద్దేశముచేతను, మోక్షోద్దేశముచేతను రెండురకములుగా నున్నవి. ఇందు స్వర్గాదిప్రయోజనము పునరావృత్తిసహితము. మోక్షప్రాప్తి పునరావృత్తిరహితము. అట్టిపునరావృత్తిరహితమగు మోక్షము నుద్దే శించి యాచరింపబడు వ్రతములలో పాశుపతవ్రత మగ్రగణ్యము. మిగిలిన వ్రతములు పరంపరయా మోక్షప్రాప్తిసాధనములు. పాశు పతవ్రత మన్ననో స్వయముగ మోక్షసాధనము.

ప్ర: ఈవిషయ మెట్లు నిర్ణయింపవచ్చును?

స : ఏవిషయము నిర్ణయింపవలసివచ్చినను భారతీయసంప్రదాయమున వేదములే పరమప్రమాణము.

వ్రత మేత త్పాశుపతం త త్సమాచరే న్ముముక్షు రపున
ర్భవాయ

సంసారబంధమోక్షము గోరువాడు అపునర్భవముకొర కనగా జన్మరాహిత్యముకొరకు పాశుపతవ్రత మాచరింపవలయు నని యీ మంత్రము ప్రతిపాదించుచున్నది.

ప్ర : వ్రత మేత చ్ఛాంభవం త త్సమాచరే న్ముముక్షు
రపునర్భవాయ

అనుమంత్రము జన్మరాహిత్యముకొరకు శాంభవవ్రత మాచరింపవలె నని ప్రతిపాదించుచున్నదిగదా?

స : పాశుపతవ్రత మన్నను, శాంభవవ్రత మన్నను నొకటియే

శంభు రీశః పశుపతిః శివః శూలీ మహేశ్వరః

అను నమరనిఘంటువాక్యమువలన పశుపతిశంభుశబ్దములు సమానార్థకము లని తేలుచున్నది. కావున శాంభవ మన్నను, పాశుపతమన్నను నొకటియే యని తేలుచున్నది.

పాశుపతవ్రతప్రయోజనము పునర్భవరాహిత్యము. ఇక పునర్భవరాహిత్య మనగా నేమో విచారింతము. పునర్భవ మనగా మరల జన్మించుట. అది లేకుండుట పునర్భవరాహిత్యము. జననశబ్దము సాపేక్షము గాన మరణశబ్దమును సూచింపబడుచున్నది.

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ

అను గీతావాక్యమువలన జన్మించినవారికి మృత్యువును, మరణించిన వారికి జన్మయును తప్ప వని తెలియుచున్నది. కావున ప్రతిప్రాణికిని జననమరణము లపరిహార్యము లనియే సిద్ధాంతము. ఇట్టి జననమరణ పరంపరనుండి తొలగుటకే పాశుపతవ్రత మాచరింపవలయును.

ఇక జననమరణము లనగా నేమియో విమర్శింతము. జనన మనగా జీవునకు శరీరసంబంధము కలుగుటయు, మరణ మనగా శరీర సంబంధము తొలగుటయు ననునది లోకానుభవమునందలి విషయమే

ఇక జీవునకు శరీరసంబంధ తద్రాహిత్యము లెట్లు కలుగుచున్నవో విమర్శింతము. క్రిందటి సంవత్సరపు పంట యీసంవత్సరపు పంట కాధార మైనట్లు క్రిందటిజన్మ యందలి కర్మ యీజన్మకు కారణ మగుచున్నది. ఈవిషయము

మహతా పుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌ స్త్వయా
పారం దుఃఖోదధే ర్గంతుం త్వర యావ న్న భిద్యతే

దుఃఖోదధిపారగమనమునకై క్రిందటి సంచితమునందలి కొంతభాగము వ్యయించి యీశరీరము సంపాదింపబడినది. కావున మరణమునకు పూర్వమే శరీరప్రయోజనమును సాధించు మను నీవాక్యమువలన శరీరము సంచితమువలన వచ్చిన దని తెలియుచున్నది.

సంచిత మనగా క్రిందటిజన్మయందు చేయబడి స్వర్గనరకములందనుభవింపబడగా మిగిలిన కర్మ. ఈకర్మయే యుత్తరజన్మకు కారణ మగుచున్నది. ఈసంచిత మున్నంతవరకును జననమును, దానివెంటనే మరణమును తప్పవు. ఈజననమరణపరంపర తొలగవలయునన్న దీనికి కారణమగు సంచితము నశింపవలయును.

ఇక సంచిత మెట్లు నశించునో గాంతము. ఏజన్మయందైనను ఆ జన్మయందు చేయబడిన కర్మ ఆజన్మయందే నిశ్శేషముగ ననుభవింపబడుట కవకాశము లేదు ఆజన్మయందు గాకున్నను ఉత్తరజన్మకు పూర్వము స్వర్గనరకములయందును నిశ్శేషముగ ననుభవింపబడుట కవకాశము లేదు. కావున ప్రతిజన్మయందును సంచితము పెరుగుచునే యుండును.

సంచితము, ప్రారబ్ధము, ఆగామి యని కర్మలు మూడు విధములు. ఇప్పటివరకును సంచితవిషయము వివరించినాము. ఇక ప్రారబ్ధ

మనగా నేమియో విచారింతము. ప్రారబ్ధ మనగా ప్రారంభింపబడిన దని శబ్దార్థము. ఎట్లు ఏవిధముగా ప్రారంభింపబడినది? సంచితము నందలి కర్మయందు కొంతభాగము వ్యయించినందువలన నీజన్మవచ్చిన దని చెప్పియున్నాము క్రిందటిజన్మయందు చేయబడిన కర్మయందు కొంత సంచితములో చేరును కొంత ఈజన్మయం దనుభవింపబడవల యును. దీనికే ప్రారబ్ధ మని పేరు. ఇయ్యది భోగమువలనగాని నశింప దని ' ప్రారబ్ధం భోగతో నశ్యేత్ ' అను వాక్యమువలన తెలియు చున్నది.

ఇక నాగామివిషయము విచారింతము. ఆగామి యనగా రా బోవునది యని శబ్దార్థము. ఎప్పటినుండి రాబోవునది? జీవుడు ఉపాసన నారంభించి తన్మయుడై పరమేశ్వరు నారాధించుచు నభ్యాసాతిశయము వలన ప్రపంచవిషయభోగములనుండి విడివడి మనస్సునకు పనిచెప్పుట మాని హార్దబ్రహ్మయందు లీనమగుటకు జీవన్ముక్తి యని వ్యవహారము గలదు. ప్రారబ్ధాంతమునగాని శరీరసంబంధము వదలదు. శరీరసంబంధ మున్నంతవరకు శరీరపోషణ తప్పదు. ముక్తస్థితికి తనువాత్రనూపి శరీర సంబంధమును తద్ద్వారా శారీరకకర్మయును తప్పవుగాన నాకాలమున గూడ పుణ్యపాపకర్మల నాచరింపక తప్పదు. ఈవిధముగ నాచరింప బడిన కర్మకే ఆగామి యని పేరు. ఈయాగామికర్మఫలమునందు పుణ్య ఫలమును భూషించినవారును, పాపఫలమును దూషించినవారును నై కొందు రని

ఆగామి భజ్యతే కర్మ తద్ద్వేషిప్రియవాదిభిః

అను వాక్యమువలన తెలియుచున్నది.

( సంచితప్రారబ్ధాగామివివరణవిషయమునను, తన్నాశవివరణ విషయమునను విశేషములు చూడగోరువారు జీవసూత్రములు - విచా రాధ్యాయమునందు చూడనగును )

సంచితప్రారబ్ధాగాములందు ప్రారబ్ధ మనుభవించుటవలనను, ఆగామి దూషకభూషకులు పంచుకొనినందువలనను నశించును. ఇక

మిగిలినది సంచితము. సంచితము జ్ఞానకర్మవలన నశించు నని ' సంచితం జ్ఞానకర్మణా ' అను వాక్యమునవలన తెలియుచున్నది.

ఇక జ్ఞానకర్మ యనగా నేమో విమర్శింతము. జ్ఞా అవబోధనే అను ధాతువువలన నిష్పన్నమైన జ్ఞానశబ్దమునకు అవబోధన మర్థము. అవబోధన మనగా తెలిసికొనుట. వస్తుతత్త్వము నిది యిత్థ మని తెలిసికొనుటకు జ్ఞాన మని లోకమున వ్యవహారము. తెలిసికొనుటవలన సంచితము నశించ దని పైవాక్యమునకు సామాన్యముగా స్ఫురించు నర్థము. వస్తుజ్ఞానమువలన వస్తువు నశించనట్లు సంచితజ్ఞానమువలన సంచితము నశించదు. కాన జ్ఞానశబ్దమునకు కేవలావగతి యర్థము కాదనియే నిర్ణయ మగుచున్నది.

ప్ర : ఈశం తం జ్ఞాత్వా అమృతా స్తే భవంతి

జ్ఞాత్వా శివం శాంతి మత్యంత మేతి

యదా చర్మవ దాకాశం వేష్టయిష్యంతి మానవాః

తదా శివ మవిజ్ఞాయ దుఃఖ స్యాంతో భవిష్యతి

ఇత్యాదివాక్యములు అమృతత్వమునకును, ఆత్యంతికశాంతికిని, దుఃఖాంతమునకును జ్ఞానము కారణ మని ప్రతిపాదించుటలేదా? కాదేని ఈ వాక్యములందలి జ్ఞానశబ్దము వ్యర్థము గాదా?

స : కాని జ్ఞానశబ్దమునకు కేవలావగతి యర్థమైన

నుమ ఏతాం భగవో దేవతాం శాధి యాం దేవతా

ముపాస్సే

త్రియంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్

ఉర్వారుక మివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ మామృతాత్

ఆ వో రాజాన మధ్వరస్య రుద్రిగ్ం హోతారగ్ం సత్య

యజగ్ం రోదస్యోః అగ్నిం పురా తనయిత్నో రచిత్తా ద్ధిరణ్య

రూప మవసే కృణుధ్వమ్

తము ష్టుహి యః స్విషుః సుధన్వా యో విశ్వస్య క్షయతి
భేషజస్య యక్ష్వామహే సౌమనసాయ రుద్రం నమోభి ర్దేవ
మసురం దువస్య

ఇత్యాదివాక్యములయం దుపాసనా యజనాదిశబ్దములు ప్రయోగింప బడినవి. ఉపాసనాయజనాదిశబ్దములు పరమేశ్వరారాధనను బోధించు చున్నవి. కావున సామాన్యవాచియగు జ్ఞానశబ్దమును విశేషవాచి యగు నుపాసనయం దన్వయింపవలయును. కానిచో పరస్పరవిరుద్ధార్థ ప్రతిపాదకత్వమువలన నప్రామాణ్యాపత్తి దుర్వార మగును.

ప్ర : వేదాంతములయందు జ్ఞానశబ్దమునకు వస్తుతత్త్వావగతి రూపమగు కేవలావగతి యర్థము గాదు. అకర్త్రాత్మప్రతిపత్తి జ్ఞానమని యద్వైతులు ప్రతిపాదించుచున్నారు.

స : మంచిది విచారింతము. ఈవాక్యమునందలి యాత్మశబ్దము నకు అర్థ మేమి? ఆత్మ యనగా జీవాత్మ యనియా? పరమాత్మ యనియా? ఇదియును గాక నీజ్ఞానము కలుగవలసిన దెవరికి?

పరమాత్మ కందమా వాస్తమున కర్తగాని పరమాత్మ నే నకర్త నని తెలిసికొనుట వ్యర్థము కర్తయైనచో తా నకర్త యని తలం చుట విరుద్ధము.

ఇక నద్వైతులు ప్రతిపాదించు నకర్తృత్వవాద మెంతవరకు సమంజసమో విచారింతము. 'స హి సర్వస్య కర్తా' ఇత్యాదిశ్రుతులు పరమేశ్వరుడు సర్వమునకును కర్త యని ప్రతిపాదించుచున్నవి. ఇంతియే గాదు.

ద్యావా భూమీ జనయన్ దేవ ఏకః

యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యా మో
షధయః సంభవంతి యథా సతః పురుషా త్కేశలోమాని త
థాక్షరా త్సంభవ తీహ విశ్వమ్

తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః ఆకాశా
ద్వాయుః వాయో రగ్నిః అగ్నే రాపః అద్భ్యః పృథివీ పృథి
వ్యా ఓషధయః ఓషధీ భ్యోన్నమ్ అన్నా త్పురుషః

ఇత్యాది శ్రుతు లీశ్వరునకు సృష్టికర్తృత్వమును ప్రతిపాదించుచున్నవి. ఈవిషయమే సూత్రకారుడగు వ్యాసునిచేతను బ్రహ్మమీమాంస యందు లీలాకైవల్యాధికరణమున ననువదింపబడినది.

న ప్రయోజనవత్త్వాత్ 2 - 1 - 32

'ఆనందో బ్రహ్మ' 'విభుం చిదానంద మరూప మద్భుతమ్' ఇత్యాదిశ్రుతులయందు నిరతిశయానందస్వరూపుడుగను, నిత్యతృప్తుడు గను ప్రతిపాదింపబడిన యీశ్వరునియందు ప్రయోజననిరపేక్షమగు సృష్టి యనుపపన్న మగుచు. సృష్టి సప్రయోజన మనిన నిత్యతృప్త తకు భంగము వాటిల్లు నని పూర్వపక్షము ప్రతిపాదించి

లోకవ త్తు లీలాకైవల్యమ్ 2 - 1 - 33

లోకమందు ప్రయోజనము లేకున్నను కందుకతాడనాదులయందు ప్రవృత్తి యున్నట్లు అవాప్తసకలకాముడగు పరమేశ్వరునియందు సృష్టి కర్తృత్వము విరుద్ధము కాదని సిద్ధాంతీకరింపబడినది.

ఇంతియే గాదు. 'స్వాభావికీ జ్ఞానబలక్రియా చ' అను శ్రుతి యును సృష్టికర్తృత్వము జ్ఞానబలములవలె స్వాభావిక మని ప్రతిపాదించుచున్నది. ఈవిషయము

క్రీడార్థం సృష్టి రిత్యన్యే భోగార్థ మితి చాపరే
దేవ స్యైష స్వభా వోయ మాప్తకామస్య కా స్పృహా

అని పురాణములయందు దుపబృంహణము గావింపబడినది.

ఇంకొక విషయము. పరమేశ్వరునిసృష్టి నిష్ప్రయోజన మెన్న టికిని గాదు. సృష్టి యున్నగాని చరమపురుషార్థమగు మోక్షమున కవ

కాశమే లేదు. మోక్ష మనగా జననమరణరూపసంసరణబంధమునుండి విడివడుట యని యర్థము. ఈవిషయము 'సంసారమోక్షస్థితిబంధహేతుః' అను శ్రుతివలన నిర్ణయ మగుచున్నది. ఇట్టిసంసారమోక్షము జీవునకు శరీర మున్నగాని సంభవింపదు. శరీర మున్నగదా జీవునకు కర్తృత్వముగలిగి తద్ద్వారా శివారాధనము గావించి తరించుట. కావున జీవులకు శరీరనిర్మాణము గావించి తద్ద్వారా మోక్షమున కవకాశము కలిగించుటయే సృష్టియొక్క పరమోద్దేశము

సృష్టికర్తృత్వము పరమేశ్వరునకు స్వాభావిక మనియు, సప్రయోజన మనియు తెలుపుచున్నది. కావున పరమేశ్వరునికి సంబంధించినంతవరకు అద్వైతులు ప్రతిపాదించు అకర్తృత్వవాదము శ్రుతిసూత్రవిరుద్ధ మనియే తెలుపుచున్నది. ఇక జీవవిషయమును విచారింతము.

ప్ర : అసంగో హ్యయం పురుషః

హంతా చే న్మన్యతే హంతుం హత శ్చే న్మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే

ఈమంత్రములు పురుషు డసంగు డనియు. అహంత యనియు ప్రతిపాదించుచున్నవి. ఈవిషయమే గీతయందును

య ఏవం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే

అని యనువదింపబడినది. కావున జీవు డకర్త యనుట శ్రుతిసూత్రప్రతిపాదితమగు సిద్ధాంతమేగదా?

స : ఇందు మొదటివాక్యము ముక్తస్థితియందు జీవునకు ప్రాపంచికసంగరాహిత్యమును ప్రతిపాదించుచున్నది. కాని సార్వదికకర్తృత్వాభావమును ప్రతిపాదించుటలేదు. ఈవిషయము తరువాత విమర్శింపబడును.

ఇక రెండవ మంత్రవిషయమును కాంతము. హత్య గావించుచున్నా నని తలంచుటయును, హత్య గావింపబడినా నని తలంచుటయును

వెట్టితనము. హత్య గావించుటయును, గావింపబడుటయును సనుపప న్నములు అని యీమంత్రమున కర్థము. ఇందు హననకర్తృత్వము నిషేధింపబడుటచే జీవునకు కర్తృత్వము సర్వథా నిషేధింపబడిన దని సామాన్యముగా స్ఫురించు నర్థము. కాని యియ్యది యుక్తియుక్తమును శ్రుతిసూత్రసమ్మతమును గాదు.

ఈమంత్రము హననకర్తృత్వము నిషేధించుచు తద్ద్వారా అక ర్తృత్వమును ప్రతిపాదించుట కేర్పడినది గాదు. ఇది జీవనిత్యత్వమును ప్రతిపాదించు ప్రకరణములోనిది.

> న జాయతే మ్రియతే వా విపశ్చి న్నాయం భూత్వా భవితా
> వా న భూయః అజో నిత్యః శాశ్వ తోయం పురాణో న
> హన్యతే హన్యమానే శరీరే

శరీరము హత్య గావింపబడినను నిత్యుడగు జీవుడు హత్య గావింపబడ డని ప్రతిపాదించుచు నీమంత్రము జీవనిత్యత్వమును ప్రతిపాదించు చున్నది. కాని యకర్తృత్వమును ప్రతిపాదించుట కేర్పడినది కాదు.

> విజ్ఞానం యజ్ఞం తనుతే
> ఏవ మే వైష ఏతాన్ ప్రాణాన్ గృహీత్వా స్వే శరీరే
> యథా కామం ప్రవర్తతే

ఇందు మొదటిమంత్రముచే జీవునకు యాజకర్తృత్వము ప్రతిపా దింపబడినది. రెండవమంత్రమున స్వప్నవిహారము ప్రతిపాదింపబడినది.

> స యథా మహారాజో జానపదాన్ గృహీత్వా స్వే జన
> పదే యథాకామం ప్రవర్తతే

మహారాజు సేవకులను వెంట గొని తన దేశమున విహరించు నట్లు జీవు డింద్రియములను గొని తనశరీరమున విహరించుచున్నా డని దృష్టాంతదార్ష్టాంతికసమన్వయము గావించుటవలన జీవకర్తృత్వము సిద్ధాంతిత మగుచున్నది. కావున జీవు డకర్త యనుట శ్రుతివిరుద్ధ మని చెప్పకతప్పదు.

ఇక బ్రహ్మమీమాంసాసంప్రదాయమును గాంతము.

కర్తా శాస్త్రార్థవత్త్వాత్ 2 - 3 - 33

పూర్వాధికరణములయందు జీవునకు స్వాభావికజ్ఞానవత్త్వమును అణుత్వమును సిద్ధాంతీకరింపబడినవి. ఈయధికరణమందు జీవునకు కర్తృత్వ మున్నదా లేదా యను సంశయమును నివారించుటకై విధినిషేధరూపశాస్త్రసార్థక్యమునకై జీవుడు కర్త యని సిద్ధాంతీకరింపబడినది.

'విజ్ఞానం యజ్ఞం తనుతే' అను వాక్యమందలి విజ్ఞానశబ్దమున కర్థము బుద్ధి కాని జీవుడు గాదని సంశయము కలుగుటచే నా సంశయమును నివారించుటకై

వ్యపదేశాచ్చ క్రియాయాం న చేన్నిర్దేశవిపర్యయః 2-3-35

తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ

ప్రాణశబ్దవాచ్యములగు చక్షురాదీంద్రియములయొక్క విజ్ఞాన మనగా గ్రహణశక్తిని విజ్ఞానముచేత ననగా బుద్ధిచేత గ్రహించి యని మంత్రమునందు ప్రతిపాదింపబడుటచేత బుద్ధి కరణముగాని కర్త గా దని సిద్ధాంతీకరింపబడినది.

తరువాత ప్రకృతియందలి కర్తృత్వమును తనయం దారోపించుకొని జీవుడు కర్త ననుకొనుచున్నాడు. కాని వాస్తవస్థితిని విచారించి చూచిన జీవు డకర్తయే యను పూర్వపక్షమును ప్రతిపాదించి

శక్తివిపర్యయాత్ 2 - 3 - 37

కర్తయే భోక్త గావలయు నను నియమముచే జీవుని భోక్తృత్వశక్తికి లోపము సంభవించును. కావున జీవుడే కర్త యని ప్రతిపాదించి ప్రకృతికి కర్తృత్వమంగీకరించినకర్తృత్వమునకు కాలనియమము లోపించునని

సమాధ్యభావాచ్చ 2 - 3 - 38

అను సూత్రముచే ప్రతిపాదించి చేయవలయు నను సంకల్పము కలిగి నపుడు చేయుటయు సంకల్పము లేనపుడు మానుటయు నను వ్యవస్థ నుద్దేశించి

యథా చ తక్షోభయధా 2 - 3 - 39

తక్షోదాహరణ మీయబడినది. వడ్రంగి ఉలిమొదలగు సాధనము లున్నను చెక్కవలయు నను సంకల్ప మున్నపుడు చెక్కునట్లు వాగాదీంద్రియము లున్నను సంకల్ప మున్నచో నాచరించును. లేనిచో మాను నను వ్యవస్థ ప్రతిపాదింపబడుటచే జీవుడు కర్త యనియే తేలుచున్నది కానిచో చేతనధర్మమగు ఇచ్ఛ బుద్ధిప్రకృతులయం దనుపపన్న మగును. ఇంతియే గాదు. బుద్ధిప్రకృతులకు భోగమునుఇచ్ఛయు నంగీకరించిన జీవాపేక్షకతయే లేకపోవును. కావున నీవాదము ఉపనిషద్విరుద్ధ మనియే చెప్పవలయును.

ఇప్పటివరకును గావింపబడిన విమర్శయొక్క సింహావలోకనము వలన స్రష్టృకర్తృత్వమును, తద్ద్వారా పంచకృత్యపరాయణత్వమును, జీవుని పురుషార్థకర్తృత్వమును సిద్ధాంతితము లగుచున్నవి. కావున సకర్త్రాత్మప్రతిపత్తి జ్ఞానమను వాద మవైదిక మనియే తేలుచున్నది

ఇక నద్వైతులు ప్రతిపాదించు ఔపాధికకర్తృత్వవిషయము విచారింతము, కర్త్రధికరణమున బుద్ధికర్తృత్వము నిషేధింపబడి జీవకర్తృత్వము సిద్ధాంతీకరింపబడినది. కాని యీకర్తృత్వ మధ్యస్తమా కాని స్వాభావికము కాదని నిరూపింపబడినది. 'యథా చ తక్షోభయధా' అను సూత్రముచే ప్రతిపాదింపబడిన యర్థమును వివరించుచు లోకమునందు వడ్రంగి ఉలిమొదలగు సాధనముల నపేక్షించి కర్తయై దుఃఖియును, అపేక్షింపక అకర్తయగుచు సుఖియును నగుచున్నాడో యావిధముగనే ఆత్మయును బుద్ధ్యాదికరణముల నపేక్షించి కర్తయై సంసరణవశుడును, అపేక్షింపక అకర్తయై పరమానందఘనుడును నగుచున్నాడని ప్రతిపాదింపబడినది.

ఽక విషయవిమర్శ గావింతము. జీవకర్తృత్వమును సిద్ధాంతీకరించుటయే కర్త్రధికరణ ప్రధానాశయము. ఈకర్తృత్వము స్వాభావిక మని విశిష్టాద్వైతసిద్ధాంతము. ఆధ్యాసికము లేక ఔపాధిక మని అద్వైతసిద్ధాంతము. ఇందెయ్యది శ్రుతిసూత్రసమ్మతమో గాంతము.

కర్త్రధికరణము ద్వితీయాధ్యాయము తృతీయపాదములోనిది. ఈపాదమునందు ప్రథమమున ఆకాశాదుల యుత్పత్తివిషయమువగల సందేహములు తొలగింపబడి యాకాశాదిపంచభూతోత్పత్తి సిద్ధాంతీకరింపబడినది. తదుపరి ఆకాశాదులకువలె జీవునకును ఉత్పత్తి కలదా యని శంకించి జీవున కుత్పత్తి లేదని సిద్ధాంతీకరింపబడినది జీవప్రకరణముగాన జ్ఞత్వ, అణుత్వములు సిద్ధాంతింపబడినవి. తదుపరి కర్తృత్వసిద్ధాంతమునకై కర్త్రధికరణము నిబంధింపబడినది.

ఆత్మాధికరణమున జీవనిత్యత్వమును సిద్ధాంతీకరించి జ్ఞాధికరణమున స్వాభావికజ్ఞానవిశిష్టు డని ప్రతిపాదించి ఉత్క్రాంత్యధికరణమున జీవు డణుస్వరూపు డని నిర్ణయించి తరువాత కర్త్రధికరణ మారంభింపబడినది. ఈయధికరణమున శాస్త్రసార్థక్యమునకై జీవుడు కర్త యని ప్రతిపాదింపబడినది. జీవుడు కర్త గానిచో యాతని మోక్షప్రాప్తి నుద్దేశించి నిబంధింపబడిన శాస్త్రము లన్నియు వ్యర్థము లగును.

జీవుడు జ్ఞత్వాణుత్వవిశిష్టుడు గావచ్చును. కాని కర్తృత్వమున్నదా లేదా యని శంకించి కూటస్థుడగు నాత్మయందు కర్తృత్వ మనుపపన్నము. కావున బుద్ధికిగాని, ప్రకృతికిగాని కర్తృత్వ ముపపన్న మని పూర్వపక్షము గావింపబడి శాస్త్రసార్థక్యము నుపసంహరించుటకొరకు జీవకర్తృత్వము సిద్ధాంతీకరింపబడినది.

తద్దేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ

జీవుడు స్వప్నసంచారమున ప్రాణశబ్దవాచ్యములగు చక్షురాదీంద్రియములయొక్క గ్రహణశక్తిని బుద్ధిచేత గ్రహించియని చెప్పుటచేత బుద్ధి కరణ మని ప్రతిపాదింపబడినది. కావున బుద్ధికి కర్తృత్వము లేదని సిద్ధాంతీకరింపబడినది.

తరువాత ప్రకృతికర్తృత్వపక్షమును నిరసించుటకై కర్తయే భోక్త గావలయు ననునియమమువలన సమాధ్యధికరణమునందును ప్రకృతియే కర్త గావలయును. ప్రకృతి తనకన్న భిన్నముగా ధ్యానించుటకు సమర్థము కాజాలదు. అచేతనమగు ప్రకృతియందు ధ్యానకర్తృత్వము సర్వథా యనుపపన్న మని సిద్ధాంతీకరింపబడినది

పిమ్మట బుద్ధిప్రకృతులకు కర్తృత్వ మంగీకరించిన కాలనియమ మనుపపన్న మగునని ప్రతిపాదించుటకై తక్షోదాహరణ వివరింపబడినది వడ్రంగి ఉలిమొదలగు సాధనము లున్నను ఇచ్ఛ యున్నప్పుడు చేయుటయు, లేనప్పుడు మానుటయు నెట్లో యట్లే వాగాదికరణసంపన్నుడైనను భోగేచ్ఛ యున్నపుడు చేయుటయు లేనపుడు మానుటయు సంభవించుచున్నది. బుద్ధిప్రకృతులకు కర్తృత్వ మంగీకరించిన నవి యచేతనములుగాన నానావిధమగు వ్యవస్థ యనుపపన్న మగును.

ఇప్పటివరకును భాష్యకర్తలలో నతిప్రాచీనుడగు నీలకంఠశివాచార్యసంప్రదాయము వివరింపబడినది. ఇక శాంకరసమన్వయపద్ధతిని గాంతము.

ఆచార్యస్వామి కర్త్రధికరణమున ‘ కర్తా శాస్త్రార్థవత్త్వాత్ ’ అను సూత్రవివరణసందర్భమున బుద్ధికర్తృత్వమును నిరసించి జీవకర్తృత్వమును సిద్ధాంతీకరించినారు. తరువాతి సూత్రముల యర్థమును వివరించుచు కర్తృత్వమునే నిర్ధారించినారు.

ఇక తక్షాధికరణమున ఇష్టసాధనబోధకవిధివాక్యము లుండుటచేత ‘ అసంగో హ్యాయం పురుషః ’ అను శ్రుతివాక్య మనుపపన్న మగునుగదా యను సంశయమును ప్రతిపాదించి శాస్త్రార్థవత్త్వాది హేతువులచే కర్తృత్వము స్వాభావిక మగుటవలన విధిశాస్త్రమునకు వైయర్థ్య మేర్పడు నని పూర్వపక్షమును ప్రతిపాదించి జీవకర్తృత్వ మౌపాధికము గాని స్వాభావికము గా దని సిద్ధాంతీకరించినారు. ఈసందర్భమునసే తక్షోదాహరణసమన్వయము గావింపబడినది.

— సశేషము